# స్వవిషయం

## రెండవ భాగం




లింగం వీరభద్రయ్యచౌదరి

బి. ఏ. (ఆక్స్‌ఫర్డ్) బార్-ఎట్-లా

# విషయ సూచిక

# అంకితం

ధీరచిత్తుడు, సాహసోపేతుడు,

కార్యదీక్షాపరుడు, కార్యాచరణదక్షుడు,

అనునయ వక్తసుడు,

నా పెనతాత కుమారుడు

శ్రీ లింగం నాగభూషణం బాబాయిగారి స్మృతికి

గౌరవపూర్వకముగా

—లింగం వీరభద్రయ్య చౌదరి

రెండవ భాగం

# ౧

## ఉద్యోగ నిర్వహణ

---

నేను 8-4-1929 తారీఖున ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంటులో చేరి 12-6-1929 తారీఖున ప్రొబేషనరి ఆఫీసరయినాననియు, ప్రథమం మొదటి సర్కిల్‌లోను, తరువాత మూడవ సర్కిల్‌లోను పనిచేసినాననియు నా "స్వవిషయం" ప్రథమ భాగంలో "ఇంటికి తిరుగు ప్రయాణం" శీర్షిక క్రింద వ్రాశాను.

కమిషనర్ సెనెక్‌గారు తిరిగి వచ్చునప్పటికే నేను మొదటి సర్కిల్‌నుండి మూడవ సర్కిల్‌కు మార్చబడియుంటిని. అప్పుడు మూడవ సర్కిల్ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు, పి. డి. శివరామ అయ్యర్‌గారు. వారు తెలివితేటలుగలవారే కాని, బద్ధకస్థుడు. తానుచేయునది కొద్ది, తన అసిస్టెంట్ ఆఫీసర్లతోను, గుమాస్తాలతోను చేయించుకునేది హెచ్చు. నేను చేసిన పనిలో ఏదో తప్పున్నదని వారభిప్రాయపడ్డారు. నేను కాదని చెప్పాను. వారందుమీదట కోపగించుకొని, "మీరు మిమ్ములనుగురించి ఎక్కువ గొప్పగా అనుకొనుచున్నా"రన్నాడు. దానిమీదట నాకు చిర్రెత్తి "నేను గొప్పవాడననుకొంటే, ఈ చిన్న ఉద్యోగములో ప్రవేశించేవాడనేకాను. నేను ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్‌ను, బారిష్టరును అయినా, దురహంకారినికాను" అని అంటిని. శివరామ అయ్యర్‌గారు క్రొత్తవాడనని నాకు తగిన విధముగా

పని నేర్పుటకు, నేర్పించుటకు ఏమాత్రం ప్రయత్నించలేదు. ఏదో ఫైలు నాకిచ్చి, ఆపాటిని నన్ను వదిలివేసేవారు. పై సంఘటన జరిగిన 2, 3 రోజులకు కమిషనర్ సెనెక్ గారివద్దనుండి రమ్మని కబురు వచ్చింది. వారు నన్ను చూచి "మీరు సరిగా పనిచేయుట లేదని, ఎదిరిస్తున్నారని మీ ఆఫీసరు శివరామ అయ్యర్ గారు ఫిర్యాదు చేశాడు" అని అన్నారు. నేను సమాధానముగా, "శివ రామ అయ్యర్ గారు నాకు సరియైన తర్ఫీదు ఇవ్వటంలేదు. ప్రతి చిన్నవిషయం నేర్చుకొనుటలో అంగుళం అంగుళానికి నేను పోట్లాడ వలసి వస్తున్నది" అని అంటిని. దానికి వారు "తమకుతాము సహా యము చేసుకొన్నవాళ్లకే భగవంతుడు సాయపడతాడు" అన్నారు. దానికి సమాధానంగా "అది చివరి ఆశ్రయంకదా!" అంటిని. వారు నవ్వి నాకు సెలవిచ్చిరి.

నేను గంజాం జిల్లాలోని బరంపురానికి ఉరియాభాషను నేర్చుకొనటానికి వెళ్లవలసివస్తుందని, అప్పుడు యాక్టింగు కమిషనర్ గా ఉండిన క్లార్క్ గారు చెప్పారు. ఒకనాడు నేను ఏదో పనిచూసుకొనుచుండగా, నా ఎదుట ఒకవ్యక్తి నిలుచుండి నట్లు తోచింది. నేను తలపైకెత్తిచూడగా, కమిషనర్ క్లార్క్ గారు నిలుచుని వుండినారు. వారు నాతో "నీవు కొద్ది రోజుల్లో ఉరియా నేర్చుకొనటానికి బరంపురం వెళ్లవలసివస్తుం"దని చెప్పారు. "నాకు భాషలు చప్పునరావు. నా మాతృభాష తెలుగుకు దగ్గరగా ఉన్న కన్నడం నేర్చుకొంటా"నని అన్నాను. వారు "అట్లుకాదు, ఉత్కళభాషలో డిపార్టుమెంటు పరీక్ష ప్యాసైనవారు లేరు. అసలు ఉత్కళభాష తెలిసిన ఆఫీసరు ఒక్కరైనా ఉన్నారో లేదో, కాబట్టి నీవు వెళ్ళవలసి ఉంటుంది. గంజాం జిల్లాలో మిక్కిలి రమణీయ ప్రదేశము లున్నవి. క్యాంపులు వెళ్లటం మిక్కిలి సుఖప్రదముగా ఉంటుంది" అని చెప్పారు. అది ఆజ్ఞకదా!

నేను 1930 జూలై 10-వ తారీఖున మద్రాసును విడిచి, బరంపురానికి వెళ్ళకముందు జరిగిన కొన్ని అనుభవాలు భోగం జాతికిచెందిన ఒక గాయకురాలు, పేరు వసుంధర (బెంగుళూరు) అని గుర్తు. తన పన్ను విచారణకు రాగా ఆమె ఫైలు తనిఖీకి



మద్రాసు 3-వ ఇన్‌కమ్‌టాక్సు సర్కిల్‌లో 1930 గ్రంథకర్త, ప్రొబేషనరు. శ్రీ ఒ. పి. శివరామయ్యరుగారు, ఆఫీసరు

కూర్చున్నవారు : 2 గ్రంథకర్త, 4. శ్రీ శివరామయ్యర్, 6. శ్రీ భాష్యం అయ్యంగార్, 7. శ్రీ ఆకెళ్ళ వెంకటేశ్వర్లు



మద్రాసు ఇన్‌కమ్‌టాక్సు 1-వ సర్కిల్ 1929 - ప్రొబేషనరు - ఆఫీసరు శ్రీ యస్. ముత్తుకృష్ణ అయ్యర్

కూర్చున్నవారు : 1. శ్రీ రామస్వామిఅయ్యా, 3. శ్రీ కేలు నాయరు, 5. శ్రీ యస్. ముత్తుకృష్ణ అయ్యర్, 6. గ్రంథకర్త, 8. శ్రీ కృష్ణమాచారి, 9. శ్రీ వి. డి. యస్. దొరైస్వామి నాడారు — నిలుచున్నవారు : 1. శ్రీ గోవింద మీనన్

నావద్దకు పంపబడింది. ఆమె అందగత్తెయే. వయస్సు 35 లేక 40 సంవత్సరము లుండవచ్చును. ఆమె చూపిన ఆదాయం తన గానకచ్చేరీలనుండి వచ్చినది మాత్రమే. ఏదో స్వల్పఆదాయం స్వగృహ సంబంధంగాను, వడ్డీ రూపంలోనూ చూపించియుండ వచ్చును. కాని ఆమె కులభోగవృత్తినుండి ఏ ఆదాయాన్ని చూపించలేదు. ఇన్‌కమ్‌టాక్సు లా ప్రకారం పడుపువృత్తినుండి వచ్చినా, దొంగతనంవల్ల వచ్చినా, మరి ఏ ఇతర మార్గమునుండి వచ్చినా ఆదాయానికి పన్ను విధించాలి. అందువల్ల నా మనస్సులో ఈమె భోగం కులస్థురాలుగదా, ఏ రసికుడైనా ఆమెతోటి అనుభవానికి డబ్బు ఇవ్వకుండి వుండునా అను సందేహము కలిగింది. దానిని సూటిగా అడగలేకపోయాను. కాని పదే పదే ఇంకా ఏ ఇతర ఆదాయంలేదా అని, భోగవృత్తివలన నీవు ఏమియు సంపాదించుటలేదా అను ధ్వని వచ్చునట్లు ప్రశ్నించాను. ఆమె తల త్రిప్పుచు "లేదు లేదు" అన్నది. నా ప్రక్కనున్న అసిస్టెంటు ఆఫీసర్లు, గుమాస్తాలు చాలా ఉత్సుకతతో, మా సంభాషణ విన్నారు.

అప్పుడు చిన్నస్థితిలోనుండి తర్వాత పెద్దస్థితికి వచ్చిన ఒక గడియారాల వ్యాపారస్థుని (శ్రీ జలాలుద్దీన్) ఆదాయం పన్ను విచారణకు వచ్చింది. ఆ ఫైలుకూడా నాకు పంపబడింది. నేను ఆ పన్నుదారుని కఠినంగా ప్రశ్నించి కొన్ని వివరాలు, కాగితాలు తెమ్మని మరునాటికి వాయిదా వేశాను. మరునాడు ఆ వివరాలను, కాగితాలను చూచి సరళముగా ప్రశ్నలు వేశాను. ఇది నా ప్రక్కనే పనిచేస్తున్న ఒక గుమాస్తా నా సరళాన్ని గమనించి, చప్పునలేచి నా ఎడమచేయి పట్టుకొని కోటు పైకి త్రోసి, నా గడియారం చూసి వెళ్లిపోయాడు. దొంగబుద్ధిగల ఆ గుమాస్తా నేను క్రిందటి రోజువలె కఠినంగా ప్రశ్నించకపోవటంవల్ల నా కే చేతిగడియారమో ఆ వర్తకుడు బహూకరించి ఉండవచ్చునని తలంచియుంటాడు. నేను ఎప్పటి గడియారాన్నే పెట్టుకొని యుండటంవల్ల అతడు కిక్కురుమనకుండా వెళ్ళి తన స్థానంలో కూర్చొన్నాడు. ఇన్‌కమ్‌టాక్సుఉద్యోగం దురాశలు కల్పించే ఉద్యోగం. గుమాస్తాలు, చిన్నఉద్యోగులు, ఆఫీసర్లు కూడా,

ఇప్పటంత హెచ్చుగా కాదుగాని, ఆ రోజుల్లోకూడా (1930) బహుమతులు స్వీకరించటం కద్దు.

ఇంకొకటి—నేను ఆరోగ్యవిషయంలో మిక్కిలి జాగ్రత్తగా వుంటాను. ఏ కొద్ది శరీరబాధ కలిగినా వెంటనే దాని ఉపశమనానికి ప్రయత్నిస్తాను. నా కంతకు పూర్వం 4, 5 రోజుల నుండి మూలశంకవ్యాధి చిహ్నమైన బాధ కల్గుచుండింది. నేను కాపురం ఉండుచుండిన యింటికి సమీపాన రాయపేట హైరోడ్డులో డాక్టర్ సి. ఆర్. పిళ్లెగారి క్లినిక్ ఉండేది. నేను రాయపురంలో నున్న మా ఆఫీసునుండి బస్సుమీద పై (క్రాఫ్ట్సుజంక్షన్)లో దిగి, జంక్షన్ నానుకొని ఉన్న పిళ్లె గారి క్లినిక్‌కు వెళ్లి వారిచేత తనిఖీచేయించుకోగా, అది పైభాగంలోవున్న మొలక అని, ఒక చిటికిలో తీసివేయవచ్చునని చెప్పారు. వెంటనే చేయండని చెప్పి అప్పటికప్పుడే తీసివేయించుకొంటిని. వారి నౌకరు కుర్రవానిచేత ఇంటికి కబురు పంపి, ఆ రాత్రి అక్కడే గడపాను. మరునాడు ఉదయం లేచి ఇంటికి వెళ్ళిపోయాను. సహజంగా, నా భార్య "చెప్పకుండా, పెట్టకుండా, ఇంత తొందరగా చేయించుకొనటమేమి, రాత్రికి అక్కడుండటమేమి" అని కోపగించుకొన్నది.

నేను భార్య, పిల్లల సమేతముగా 1930 జులై 10-వ తారీఖున బయలుదేరి గంజాం జిల్లాలోని బరంపురం చేరుకొని, అప్పుడక్కడ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్‌గా వుండిన శ్రీ టేకుమళ్ల దుర్గాప్రసాదరావుగారు ఏర్పరచిన వసతిలో ప్రవేశించాము. మే ముండిన యిల్లు రైల్వేస్టేషను రోడ్డులో, స్టేషనుకు అనతి దూరములో వుండింది. ఇంటి పైపూత తేలిక ఎరుపురంగు అవటంవల్ల ప్రస్ఫుటంగా కనపడుచుండేది. ఇల్లు విశాలమైన డాబా భవంతి. ఇంటి యజమానుడు పల్లె కులస్థుడు. నాయుడుగారని పిలిచేవారు. నాయుడుగారు అచ్చమైన బెస్త కులస్థుడో కాదోగాని, ఆయన భార్య బెస్తకులస్థురాలే. నిజానికి ఆ ఆస్తి ఆమెదే.

ఆమె (శ్రీ) నాయుడుకంటె పెద్ద వయస్సు కలదైనను, ధనమును కాశించి పెళ్లి చేసుకొన్నాడనుకొనేవారు. వారి కొక్క కుమార్తె మాత్రం ఉండేది. ఆమె కప్పటికి 22 సంవత్సరములు పైబిల్కుండినను, వివాహం కాలేదు. (శ్రీ) నాయుడు చురుకైన వాడు, మాటకారి. భార్య చాలా సౌమ్యురాలు. కుమార్తె బుద్ధిమంతురాలు. ఈ కుటుంబం ఒక భాగములో ఉండి, రెండవ భాగం మాకు అద్దె కిచ్చారు. నాయుడుగారి మాటలు తరచు వినబడుచుండేవి. భార్య, కుమార్తెల మాటల ధ్వని మేము వినలేదు, ఎప్పుడైనా కొంచెం తప్ప. ఇంటి నేలఅంతయు ఎర్ర గచ్చు చేయబడినది. గోడలు మొదలైనవి తెల్లగచ్చు చేయ బడినవి. ఇల్లు బయటికే గాక, లోపలకూడా అందంగా, శుభ్రంగా ఉండేది. మేము మొత్తం నలుగురమే కాబట్టిన్నీ, అందులో నా కుమార్తె తరుచు మాతామహి వద్ద పెడసనగల్లులో ఉండటం వల్లను, మా కా భాగం తగినంత విశాలంగా ఉండేది.

నాయుడుగారు తన ఎదిగిన కుమార్తెకు, తగిన సంబంధం చూచుకోవాలని తహ తహ పడేవాడు. జ్యోతిష్కుని సహాయం కూడా తీసుకొన్నారు. ఆ జ్యోతిష్కుడు ఏదో చక్రం, ఏవో లెక్కలు వేసి, అప్పటికి 23, 24 సంవత్సరాలకు తక్కువ వయస్సు కాని పిల్లను ఏ 16, 17 సంవత్సరముల వయస్సో ఉండినట్లుగాను, ఆమె జాతకం చాల శుభప్రదమైనదిగాను వ్రాసి ఇచ్చారు. నేను అక్కడున్నంతకాలం ఆ పిల్లకు వివాహం కాలేదు.

(శ్రీ) నాయుడు హార్మోనియం మీద చాలా బాగా పాడే వారట. నాటకాల్లో కూడా ప్రావీణ్యంగా వేషాలు వేసేవారట. సంగీతం, నాటకాలమీద ప్రీతి వున్న జమీందా ర్లొక రిద్దరు, ఆయనను అప్పుడప్పుడు పిలిపించుకొని, ఆనందించేవారట. సహజ ప్రవృత్తిచేత (శ్రీ) నాయుడు ఠీవిగా, దర్పంగా నడచుకొనేవాడు. అక్కడి క్లబ్బు ప్రముఖ సభ్యులలో నొకరు. లోప లేమనుకొను చున్నా ఆయనను గౌరవముగానే చూసేవారు. నేను తిరిగి 1932 అక్టోబరులో ఆఫీసరుగా వెళ్లేటప్పటికి వా రిల్లమ్ముకొని, ఊరు విడిచి వెళ్లిపోయారు.

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు ప్రసాదరావుగారు మంచి హృదయం కలవారు. స్నేహశీలురు గౌరవప్రపత్తులు కలవారు. రీవి, దర్పం కలవారు. సూటు వేసుకొని, తెల్లని తలపాగ ధరించి దర్జాగా వుండేవారు. వారి ఆఫీసరుహోదా యందు వారికి మిక్కిలి గౌరవం. తన ఉద్యోగనిర్వహణను మిక్కిలి దర్పంగా నడుపు కొనేవారు. వారికి మోటారుకారు లేదు. ఆఫీసుకు జట్కాలో వెళ్లేవారు. ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు చాలావరకు కాలినడకనే వచ్చేవారు. జట్కాలో వెళ్లినా, యింటికి తిరిగివచ్చినా డవాలు వేసుకొని, జవాను దగ్గర వుండవలసిందే. ఆఫీసు డిస్పాచ్ బాక్సు సహజముగనే వారి వెంట వుండేది. కాలినడకను తిరిగివస్తు న్నప్పుడు డవాలు ధరించిన ఒకజవాను డిస్పాచ్ పెట్టెను భుజం మీద పెట్టుకొని ముందు నడుస్తుండగా, వీరు వెనుక రీవిగా చేతి కర్రతో నడిచివెళ్లేవారు వీరి రీవి, దర్జాను చూచినవారు కొందరు, వీరికి ముందునడచే జవానొకడేకాదు, వెనుకకూడ డవాలు వేసుకొని ఇంకొక జవాను నడచేవాడని అనేవారు.

చిన్నపని అయినను (శ్రీ) ప్రసాదరావుగారు తు. చా. తప్పకుండా మిక్కిలి జాగ్రత్తగా పరిశీలించేవారు. ప్రతి చిన్న విషయం కాగితంమీద ఎక్కవలసిందే. పన్నుయిచ్చేవారు, తమ వ్యాపార వివరాలన్నిటిని జాబితాలుగావ్రాసి దాఖలుచేసినగాని వీరు ఆఫైలును చూసేవారేకాదు. వడ్డీ విషయములో, పాకు బాకీల విషయములోను మిక్కిలి శ్రద్ధవహించేవారు. కొన్ని పద్దులు అణాపైసాలవి అయినా వానిని రుజువు చేసుకొనటానికొక అరగంటపట్టినా, ఓపిక పెట్టి వుండేవారు. ఈ అతి జాగ్రత్తవల్ల, ఆ రోజుకు విచారించవలసిన కేసులలో కొన్ని మరునాటికి వాయిదా పడేవి. క్యాంపుకు వెళ్లినప్పుడు మొదటిరోజున 8 కేసులు విచారణకు వేసుకొంటే, చివరి రోజున (వారాంతాన) ఏ 20 కేసులో మిగిలిపోయేవి. వారు మిక్కిలి న్యాయబుద్ధికలవారు. ఇటు గవర్నమెంటుకుగాని, అటు పన్నుదారుకుగాని అన్యాయము జరుగకూడదని దృఢవిశ్వాసం కలవారు. ఉభయులలో ఎవరికి ఎట్టి అన్యాయం జరుగునో అని అతి జాగరూకులై వుండేవారు. వారి



ఒరిస్సా గంజాం బరంపురం ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్ - 1931 — కూర్చున్నవారు : 1. శ్రీ పి. కామేశ్వరరావు, 2. గ్రంథకర్త, 3. శ్రీ చేకుమళ్ళ దుర్గాప్రసాదరావు, 4. శ్రీ తురగా రామచంద్రరావుగారు, 5. శ్రీ పెయ్యేటి కనకరాజుపంతులు

నిలుచున్నవారు : ( మొదటి పంక్తి ) 1. శ్రీ మహాపాత్రో, 2. శ్రీ మద్దూరి వెంకటరావు, 3. శ్రీ శర్మ

( రెండవ పంక్తి ) 2. వెంకటప్ప, 3. అక్కయ్య, 4. మోహన బెహరా, 5. రంజాన్ ఆలీ, 6. నరహరి బెహరా

వద్ద తర్ఫీదును పొందుచుండిన నేను కూడ చిన్నచిన్న విషయాల్లో కూడ, అతి జాగ్రత్త వహించేవాడిని. అందువలన నా పని కూడ చురుకుగా సాగేదికాదు.

బరంపురంలో మార్వాడీ, గుజరాతీ వర్తకులున్నారు. వారి లెక్కపుస్తకాలు గుజరాతీభాషలో వ్రాయబడి వుంటాయి. కొన్ని నావద్దకు తనిఖీకి వచ్చాయి. నేను ఆ లెక్కలను పరిశీలించి ఆదాయాన్ని తేల్చి, నోట్సు వ్రాసి వారికి పంపించేవాడను. భాష రానందున బాధపడేవాడిని. ఒక్కొక్క పంక్తి చదివించి అర్థము చెప్పించుకొనుచు వుండేవాడను. కొంతకాలానికి అక్షరాల పోలిక, అంకెల నమూనా కొంతవరకు బోధపడింది.

వీరి తరువాత వచ్చిన తురగా రామచంద్రరావుగారు మిక్కిలి చురుకైన మెదడుకలవారు. వారుకూడా శ్రద్ధాభక్తులతో పని చేసేవారేకాని, ప్రసాదరావుగారివలె అంతగా సునిశిత పరీక్ష చేసేవారుకాదు.

ప్రసాదరావుగారిది స్నేహపూరితహృదయం. కపటము లేని మనస్సు. రామచంద్రరావుగారు స్నేహం నటించినా స్వభావ సిద్ధంగా అంత మైత్రిని చూపలేనివారు. పైకి సాధువుగా కన్పడినా, గడుసుతనంకల్గి, గుంభనగా, యోచనా పూర్వకంగా వర్తించే వారు. ప్రసాదరావుగారు మాధ్వులు. రామచంద్రరావుగారు నియోగి. ప్రసాదరావుగారు బి. ఎ. డిగ్రీని పొంది, సరాసరి రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా, రెవెన్యూ డిపార్టుమెంటులో చేరినారు. ఆరోజులలో సరాసరి రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా నియమింపబడటం విశేషం. వారట్లు చేరగలుగుటకు ఒకగాథ చెప్తారు. ప్రసాదరావుగారి తాతో, ముత్తాతో 1857 మ్యూటినీలో ఒక శ్వేతజాతీయుని తన యింటిలో దాచి వానిప్రాణం కాపాడినారట. ఈవిషయం తెలిసి కొని జిల్లాకలెక్టరు వారికి రెవెన్యూ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం సరాసరి యిచ్చినారట. రామచంద్రరావుగారు స్కూల్‌ఫైనల్ ప్యాసై గుమాస్తాగా ఏ తాలూకా ఆఫీసులోనో చేరారు. 1922-వ సంవత్సరంలో సవరింపబడిన ఇన్‌కమ్‌టాక్స్ యాక్ట్ మన ప్రాంతాల్లో 1925-వ సంవత్సరంలో అమలులోకి వచ్చింది.

అప్పుడు డెప్యూటీ తహసీల్‌దారుగా పనిచేయుచున్న ప్రసాద రావుగారిని ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో ఆఫీసరుగా నసుకొం దును, తీసుకొన్నారు. రామచంద్రరావుగారు యకౌంటెంటుగానో, ఇన్‌స్పెక్టరుగానో చేరారు. ఈ భిన్నవిద్య, ఉద్యోగానుభవాలు ఆ యిద్దరి వ్యక్తిత్వాన్ని కొంతవరకు వేరు వేర రూపొందించినవి. ఆ రోజుల్లో రెవెన్యూ ఇన్‌స్పెక్టరు అంత తక్కువవాడు కాదు. డెప్యూటీ తహసిల్దారు పదవి కొంత హోదా కలది. తాలూకా భాగానికి ఆఫీసరు కాబట్టి, అధికారం ఉండేది. అధికారం చెలా యించిన ప్రసాదరావుగారు రీవిగా, దర్జాగా, కొంత విశాల హృదయంతో వుండేవారు. గుమాస్తాగా చేరి తిరిగి క్రొత్త డిపార్టు మెంటులో తక్కువస్థాయిలో పనిచేసిన రామచంద్రరావుగారి నడక అదోవిధంగా ఉండేది.

ఎంత స్నేహశీలిగా, విశాలహృదయుడుగా వుండినా, ప్రసాదరావుగారు ఆచారపరాయణుడు. మధ్వశాఖానుచిత పూజా పునస్కారములు గట్టిగా చేసేవారు. అంటు, చంటు, మైల మొదలైనవి వారికి జాస్తిగానే వుండేవి. అయినా పట్టు, విడుపుగల మనస్తత్వం. వీలునుబట్టి సర్దుకొనిపోయే స్వభావం వారిది. వైదిక బ్రాహ్మణులవలెగాక, నియోగులు పూజా పునస్కారాలలో అంత ఆసక్తి సామాన్యంగా చూపరు. అయినా, రామచంద్రరావుగారు ఆర్షసంప్రదాయం అనుపేరుతో ప్రచారంచేసే గ్రంధాలను చదువుచు, నిష్ఠతో నడచుకొనేవారు.

నేను ఆఫీసులో ఉపాహారం తీసుకొనేవాడిని కాదు. ఇంగ్లండునుండి 1927-వ సంవత్సరంలో స్వగృహానికి తిరిగివచ్చిన కొద్దిరోజులకే, నేను కాఫీ గానీ, టీ గానీ పుచ్చుకోవటం మాని వేశాను అందువలన, మధ్యాహ్నం ఆఫీసులో ఉపాహారం గానీ, కాఫీ, టీ గాని తీసుకొనేవాడను కాదు. ప్రసాదరావు, రామ చంద్రరావు గార్లు ఏ రెండు గంటలకో టిఫిన్ తీసికొనే అలవాటు కలవారు. ప్రసాదరావుగారు ఒకనాడు "పైన ఉపాహారమున్నది తీసుకొం" డన్నారు. పెద్దమనిషి ఉపాహారం యిస్తానంటే వద్దనటం బాగుండదని మేడపైకి వెళ్లి తీసుకొన్నాను. ఆ విధంగా రెండు, మూడు సార్లైనా తీసుకొని వుందును. వారు వెళ్లిపోయిన తర్వాత

రామచంద్రరావుగారుకూడ పైవిధంగా చెప్పారు. కాని ఒకనాడు నాకు చప్పున స్ఫురించింది. నేను వారికంటె మిక్కిలి విద్యాధికుడను. ప్రొబేషనర్ నయినా, గజెటెడ్ ఆఫీసరును. వారు నాకంటె సీనియర్లైనా, నా హోదా వారి హోదాతో సమానమైనదే. వారు తమకు వచ్చిన ఉపహారములో భాగం నా కివ్వ తలంచినట్లయితే, వారితోపాటు నన్ను పైకి తీసుకొని వెళ్ళి వారితో సమానునివలె చూడవలసినది. అంతేగాక వారు తినివచ్చిన తర్వాత నన్ను వెళ్ళి మిగిలిపోయింది తినం డనటం అమర్యాదగా ఉన్నదని చెప్పివేశాను. వారు, మేము బ్రాహ్మణులం, అగ్రజాతి వారం, ఇతడు విద్యావంతుడైనా శూద్రుడు, కాబట్టి మన సహపంక్తిని భుజించకూడదు అనే భావంతో అట్లు వర్తించినారో లేక మేము ఆ సర్కిల్ పాలనాధ్యక్షులం, ఇతడు పనినేర్చుకొనే వాడు అనే భావంతోనో, లేక ఏదో పనిచేస్తుండిన నన్ను కదిలించుట ఎందుకని, తాము పని పూర్తిచేసుకొని, నన్ను నా పని పూర్తి అయినప్పుడు సావకాశంగా తీసుకొనండని అభిప్రాయ పడినారో చెప్పలేను.

ప్రసాదరావుగారి విషయంలో తక్కువచూపుతో కావాలని అట్లుచేశారని తలంచటం కష్టం. వారు బందరులో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా వున్నప్పుడు 1946 సంవత్సరాంతమునకు, అనగా 31 మార్చి 1946 నకు, వారి కొన్ని కేసులు మిగిలిపోయేటట్లుండగా, కాకినాడలో నా కేసులన్నీ పూర్తిఅయినందున, బందరు కేసులు సుమారు 70, 80 కేసులు నాకు బదిలీచేశారు. వానిని విచారించుటకు నేను బందరు వెళ్లాను. అప్పుడు ప్రసాదరావు గారు నన్ను ఎంతో గౌరవంగా ఆహ్వానించి, తన యింటిలోనే బసచేయుండని కోరారు. నా కిష్టంలేక నేను ఆఫీసులోనే దిగాను. వారింట్లో భోజనముచేయుండని కూడ వారు కోరారు. అది వీలుపడదని, ఉన్న పదిరోజులలో ఒకటి, రెండుసార్లు భోజనానికి వారింటికి వెళ్లాను. నన్ను ఎంతో మర్యాదతో వారు లోపలి భోజనశాలలో వారి ప్రక్కనే కూర్చుండబెట్టుకొని, ఆప్యాయతతో

భోజనం చేయించారు. కూర్చుండుటకు పీటయేగాక, ఆనుకొనుటకు ఇంకొక పీట అమర్చారు. నాకది క్రొత్త అనుభవం. ఏ భేషజం లేక స్వకులస్థుడైన దగ్గరబంధువునివలె భోజనం వడ్డింపించారు. వారి వంటకత్తెతోబాటు, వారి భార్యకూడ అతిథి సత్కారం చేసింది. మరిన్ని 1949 లో నేను మద్రాసులో వున్నప్పుడు, మాయింటికి శ్రీ ప్రసాదరావుగారు అతిథిగా వచ్చి, మా యింటిలో రెండు, మూడురోజులు భోజనము చేశారు. వారు మాంసాదులు భుజింపరు కాబట్టి, కాయగూరలే పచనము చేయబడినను, వంట చేసింది మా వంటనాయరే. దీనినిబట్టి కాలానుసారంగా, పరిస్థితులనుబట్టి వర్ణవివక్షత పాటించనివారని, స్నేహశీలురని, కించపరచ దలచనివారని విశదమగుచున్నది.

ఈ సందర్భమున ఇంకొకవిషయం జ్ఞప్తికివస్తున్నది. వీరి సోదరుడు వెంకాజీగారు ఇంగ్లండుకు వెళ్లి, కాగితాలు తయారు చేసే విద్య నభ్యసించారు. వారు కొంతకాలం బర్మాలో ఉద్యోగం చేసి, తర్వాత అక్కడక్కడ కార్యభారం వహించారు. వారెక్కడో ఉద్యోగంచేస్తూ వుండేవారు. కాని, వారి కుటుంబం మద్రాసులో తిరువళిక్కేన్‌లో వుండేది. ఆ కుటుంబాన్ని చూడాలని ప్రసాదరావుగారనగా, నాకారులో, మే మాయింటికి వెళ్లాము. వెంకాజీగారికి కుమారుడున్నట్లు గుర్తులేదు. కాని, ఇప్పుడు సినిమారంగములో పేరు, కీర్తులు పొందుచున్న షావుకార్ జానకి, కృష్ణకుమారి వారి కుమార్తెలు. అప్పటికి జానకి షావుకార్ చిత్రములో అభినయించి, పేరు పొంది వుండింది. వెంకాజీగారి భార్య తన యిద్దరి కుమార్తెలను చూపి, రెండవపిల్ల కృష్ణకుమారి అక్కవలె సినిమారంగంలోకి పోవాలని అంటున్నదని చెప్పింది. శ్రీ ప్రసాదరావుగారికి, తన కుటుంబీకులు సినిమాలోకి పోవటం మనస్కరించలేదు. కాని, మర్యాదలెరిగినవారగుటవల్ల, నవ్వి వూరుకొన్నారు.

నేను బరంపురం వెళ్లింది ముఖ్యంగా ఉరియాభాష నేర్చుకొనటానికేకదా. ప్రత్యేకించి ఒక ఉపాధ్యాయుణ్ణి ఆ భాష నేర్చుకొనటానికి పెట్టుకొన్నట్లు లేదు. బహుశా పెట్టుకొన్నానేమో

గాని ఆ వ్యక్తి పేరు గుర్తుకురావటంలేదు. ఆ ఆఫీసులో మహా పాత్రో అనే ఉరియా గుమాస్తా వుండేవాడు. అతని సహాకారము నాకు లభించేది. కొద్దికొద్దిగా ఉరియా లెక్కలను చూచుట, ఉరియాభాషలో వచ్చీరాని విధముగా మాట్లాడుట మొదలు పెట్టి కొంతకాలానికి ఆ భాషా పరిచయాన్ని కొంత గడించాను. ఆ భాషలో పరీక్ష కూడా పొందవలసి యుండింది. అందులో విజయాన్ని సాధించిన గాని, నా ప్రొబేషనరి కోర్సు పూర్తి కాదు. పరీక్ష చేవ్రాతను చదవటం, సంభాషించటం, తర్జుమాచేయుటమే గాక, ఉరియాలో వ్రాసిన లెక్క పుస్తకాలను తనిఖీ చేసి ట్రైల్ బాలెన్సు, బాలెన్సు షీటులను వేసి, లాభనష్టాలను తేల్చి, పన్ను విధించు ఆర్డరును వ్రాయాలి. ఈపరీక్ష నిర్వహించుటకు అప్పుడు విజయవాడలో అసిస్టెంటు కమిషనర్ గా వుండిన వెంకటేశ్వర్లుపంతులుగారు 1931 ఆరంభంలో వచ్చారు. వారికి ఉరియాభాష బొత్తిగా రాదు. అందువల్ల ఆ ప్రాంతంలో తహసిల్ దారుగా వుండిన శ్రీ బి. పట్నాయక్ అనే వారిని తనకు సహాయంగా రప్పించుకొన్నారు. పరీక్ష ప్రారంభానికి పూర్వం నేను పట్నాయక్ గారిని సమీపించి, "అయ్యా, నాకు ఉరియా అంతగా అబ్బలేదు. మీరు కనికరించి, చూచి చూడ నట్లుండకపోతే, నేను తప్పుతాను. ఇంగ్లండుకు వెళ్ళి పెద్ద పట్టాలను పుచ్చుకొన్న నేను తప్పితే, పెద్దగా మానసిక బాధ ననుభవించుటయేగాక, నా ప్రొబేషనరి పీరియడ్ పొడిగింప బడటమో, నాఉద్యోగం ఊడటమో జరుగుతుంది. ప్రొబేషనరి కాలం పొడిగింపబడితే, నేను ఆ అవమానాన్ని సహించలేక ఉద్యోగాన్ని వదలుకోవలసి వస్తుంది" అని చెప్పుకొన్నాను. ఉద్యోగవిషయమైన పరీక్షల సంగతి ఎరిగిన వారగుటచేతను, ఈ పరీక్షలు చాలావరకు అసంగతాలని తెలిసినవా రగుటవల్లను శ్రీ పట్నాయక్ గారు సమ్మతించినట్లుగా, చిరునవ్వు నవ్వి ఊరు కొన్నారు. పరీక్షసమయాన అసిస్టెంటు కమిషనరుగా రొక ప్రక్క, శ్రీ పట్నాయక్ గా రింకొక ప్రక్క కూర్చొని, చేతి వ్రాత కాగితాల నిచ్చి చదువు మని చెప్పారు. తప్పులో ఒప్పులో

చదివాను. పట్నాయక్ గారు పట్టెత్తలేదు. తరువాత సంభాషణ జరిగింది. అప్పుడు కూడ పట్నాయక్ గారు కాదన లేదు. ఉరియా భాష నెరుగని వెంకటేశ్వర్లు పంతులుగారు నేను వడిగా, ధారాళంగా మాట్లాడటం, జవాబులు చెప్పటం చూచి "మీకు ఉరియాభాష మిక్కిలి బాగా అబ్బింది. ఇంతబాగా మాట్లాడుతారని అనుకోలేదు" అని అన్నారు. శ్రీపట్నాయక్ గారు చిరునవ్వు నవ్వుచూ వూరుకున్నారు. తర్వాత ఉరియా గుమాస్తా మహాపాత్రోను పిలిచి అడిగాను. ఘోరంగా వున్నదండి, అన్నీ తప్పులే అన్నాడు. కొంత వ్యవధి అయిన తర్వాత, ఉరియా లెక్క పుస్తకాలను నా కిచ్చారు. అప్పుడు చాటుగా మహాపాత్రోను పిలిచి, ఎక్కడెక్కడ ఏ యే అంశాలు వున్నవో అడిగి తెలుసుకున్నాను. చాలా సులువైన లెక్క పుస్తకాల నిచ్చారు. బహుశా మహాపాత్రోయే వానిని ఎన్నిక చేసి వుండ వచ్చును. మహాపాత్రో చూపిన త్రోవనుబట్టి సులభంగా అర్థం చేసుకొన్నాను. ఇంగ్లీషులో వ్రాయవలసిన స్టేటుమెంట్లు, ఆదాయనిర్ణయ ఆర్డరును సమర్పించాను. ఆదాయ నిర్ణయం ఇంచుమించుగా సరిగానే చేశాను. ఎలాఅయితేనేమి, అసిస్టెంటు కమిషనరుగారు, నేను ఉరియా భాషలో అన్ని అంశముల్లోనూ ప్యాసైనట్లు ప్రకటించారు. అంతటితో నా ప్రొబేషనరి అవస్థ పూర్తి అయింది.

తరువాత కొలదికాలానికే, నన్ను చిత్తూరు సర్కిల్ ఆఫీసరుగా నిర్దేసిస్తూ, చిత్తూరుకు వెళ్లేముందు, గుంటూరు 2–వ సర్కిల్ ఆఫీసరుగారు సెలవుమీద వెళ్లియుండినందున, వారు తిరిగి వచ్చేవరకు, ఆ ఖాళీస్థానంలో పనిచేయవలసిందని ఆర్డరు వచ్చింది. గుంటూరులో రెండవ ఇన్కమ్టాక్సు సర్కిల్ వుండింది. మొదటి సర్కిల్ ఆఫీసరు బరంపురంలో వుండిన శ్రీ టేకుమళ్ల దుర్గా ప్రసాదరావుగారే. రెండవ సర్కిల్ ఆఫీసరు శ్రీ ఆర్. ఎ. నారాయణ అయ్యంగారు. వారు సెలవుమీద వెళ్లియుండిరి. నేను 1931 మే నెలారంభంలో గుంటూరుకు వెళ్లి, 4–వ తారీఖున వారిస్థానాన్ని అధిష్టించాను. 1918 లో నేను గుంటూరులోని

ఎ. ఇ. యల్. యమ్. కాలేజిలో ఇంటర్మీడియేట్ కోర్సులో చేరి యుండినాను. అందువల్ల గుంటూరు నాకపరిచితంకాదు. కాని, 13 సంవత్సరములు గడచినందున, గుంటూరులో క్రొత్తవీధులు, భవనాలు ఏర్పడినందున, కొంత క్రొత్తగనే వుండినది. నా అధికారంలో 5 మెట్ట తాలూకాలు వుండేవి. గుంటూరు, వినుకొండ, సత్తెనపల్లి, నర్సరావుపేట, మాచెర్ల, గుంటూరుటౌను, జిల్లాలోని ఇతర ప్రదేశాలు మొదటి సర్కిల్ ఆఫీసరుక్రింద వుండేవి. నా మొతటి క్యాంపు గుంటూరు తాలూకాలోని అమరావతి. అమరావతి ఆంధ్ర దేశములోనేగాక, యావద్భారతములోను మిక్కిలిప్రసిద్ధి కెక్కిన క్షేత్రం. అక్కడొక గొప్ప బౌద్ధస్థూపం, ప్రాచీనకాలంలో నిర్మింపబడింది ఉన్నది. వందలకొలది సంవత్సరాలు మరుగుపడిపోయిన ఆస్థూపాన్ని త్రవ్వి బయలుపరచినప్పుడు, అనన్యసామాన్య శిల్ప కళాఖండా లనేకములు బయటపడ్డాయి. వానిలో మిక్కిలి నైపుణ్యముతో చెక్కబడిన బుద్ధుని గాథలు, జాతకాలుగల చంద్రకాంత శిలాఫలకాలున్నవి. వానిలో ముఖ్యమైనవానిని బ్రిటిష్‌వారు తీసుకొనిపోయి, తమ లండన్ లోని బ్రిటిషు మ్యూజియమ్‌లో వుంచుకొన్నారు పోయినవిపోగా, ఇంకా కొన్ని చిన్నరకం ఫలకాలు 1931లో నేను చూచినప్పుడు అక్కడనే వున్నవి. వాని నిప్పుడు ఏ మ్యూజియమ్‌లోనో పెట్టి యుండవచ్చును. అమరావతిలో చూడదగిన రెండోది అమరేశ్వరాలయం. దానిలోని అమరేశ్వరుడు శ్వేతలింగ రూపుడు. ఆ శ్వేతలింగం మిక్కిలి ఎత్తైనది. అమరావతిని పాలించిన శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారి కంచువిగ్రహము, స్వామివారి కభిముఖముగా ప్రతిష్ఠింపబడి వున్నది. ఈ దేవాలయం అతిప్రాచీనమైనది. శ్రీ వెంకటాద్రి నాయుడు దానిని పునరుద్ధరించి, విస్తృతంచేసి, దానిపోషణకొరకు, నిత్యధూప, దీప నైవేద్యాదులకు, గాన, నృత్య, వాయిద్యాలకు కొన్నిగ్రామాలను సమర్పించాడు. ఆయనకాలంలో పూజా పునస్కారాలతోనేగాక, సంస్కృత గోష్ఠులతో, వేదపఠనా ఘోషలతోకూడా అమరేశ్వరాలయం మిక్కిలి భోగము ననుభవించినది. ఉదయాన, సాయంత్రాన, రెండుప్రొద్దులు భోగము మేళాలు, . గాననృత్యాలు,

మంగళవాయిద్యాలు జరుగుచుండేవట. పూజాదులకేగాక, ఈ కళాకారులకు, ఇతర సేవకులకు ప్రత్యేకించి సర్వీసు ఈనాము లీయ బడినవట. 1931 లో నేను దేవాలయాన్ని దర్శించినప్పుడుకూడ కొద్దిమాత్రంగానైనా ఈసేవలుండినవి.

శ్రీ వెంకటాద్రినాయుడు ఇంచుమించుగా స్వతంత్రరాజు వలె వ్యవహరింపగల్గాడు. ఆయన పరిపాలనక్రింద ఇంచుమించు వెయ్యి గ్రామాలు, 5, 6 వందల శివార్లు వుండేవట. బ్రాహ్మణులకు మూడువందలకుపైగా గ్రామాలను, అగ్రహారాలను దాన మిచ్చారట. ఆయన యుద్ధనిపుణుడు, పరిపాలనాదక్షుడేగాక చండప్రచండుడట. ఈ విషయంలో ఒక కథ చెప్పుచున్నారు. ఆకాలములో దారిదోపిడీలు, బందిపోటు దొంగతనాలు ప్రబలి యుండినవట. ఈ ఘాతుకకృత్యాల్లో ఒక చెంచులమురా పేరు గన్నదట. గట్టి ప్రయత్నాలుచేసి ఈగుంపును నాయుడుగారు పట్టించిరట. వారి కాళ్లకు బేడీలువేయించి, చేతులు వెనుకకువిరిచి కట్టించి, మెడలకు పశువులమందలను కట్టినట్లుగా, పెద్దదాయ మోకు కట్టించారట. తర్వాత తాను ఖడ్గాన్నితీసుకొని, వరుసగా తలలను నరికివేశారట. ఇట్టి కఠినచర్య తీసుకొనుటచేతనే వారు బందిపోటులను, దారిదోపిడీలను ఆపగలిగినారట.

నా రెండవక్యాంపు సత్తెనపల్లి. ఈమెట్ట గ్రామాల్లో ఆ రోజుల్లో ఆచారం, ప్రభుత్వఉద్యోగి ఎవరైన క్యాంపు చేసి నప్పుడు గ్రామమునసబు, కరణం వారికి అన్నివసతులను కల్గిస్తూ, గ్రామసేవకుల్ని వారిపనులను చేయటానికి నియోగించేవారు. ఇది ముఖ్యంగా రెవెన్యూ ఆఫీసర్ల విషయమేఅయినా, ఇతర ప్రభుత్వాధికారులుకూడ కొంతకు గొంత సౌకర్యాలను, గౌర వాన్ని పొందుచుండేవారు. నిజానికి ఇట్టి సపర్యలు చేయటానికి వారికి కొంతభరణం, అనగా సర్వీస్ ఈనాములవంటివి, ఏర్పరచ బడియుండినవట.

సత్తెనపల్లి, తాలూకా హెడ్ క్వార్టర్సు అయినా, ఒక గ్రామంవంటిదే. మెట్ట గ్రామాల్లో స్థానికఉద్యోగుల సాయం లేనిదే పదార్థాలు, మనిషితోడు దొరకదు. పైవిషయాలు

తెలియనివాడను కాబట్టి, నేను గ్రామాధికారుల సహాయాన్ని ఏ మాత్రం పొందలేదు. పొందవలసిన అవసరం కల్గలేదు. వసతికి రహదారి బంగళాయున్నది. నేను భోజనానికి అవసరమైన, సమస్త పదార్థాలను, వంటవానితోసహా తీసుకొని వెళ్లియుంటిని. నేను క్యాంపు ప్రదేశంలో సేకరించవలసినవి కట్టెపుల్లలు, పాలు, కూరగాయలు. నావెంట క్యాంపు గుమాస్తాయేగాక, ఇద్దరు బంట్రోతులు వచ్చియుండిరి. ఆఫీసర్లు మారుదురు గాని, బంట్రోతులు మారరు. ఇప్పుడిప్పుడు, అక్కడక్కడ, క్వాచిత్కుగా జమానులనుకూడ బదిలీ చేయటానికారంభించారు. కాని, ఆ రోజుల్లో అట్టి ప్రశ్నయేలేదు అందువల్ల బంట్రోతులకు, పాలు, కూరగాయలు, కట్టెపుల్లలు మొదలగునవి ఎక్కడ దొరుకునో తెలియును.

మొదటిరోజున మర్యాదకుగాను గ్రామమునసబు, అతని అసిస్టెంటు వచ్చి చూచిపోయాడు. వారంరోజుల క్యాంపు తర్వాత నేను బయలుదేరి వెళ్లేటప్పుడు, గ్రామమునిసిఫ్ సెలవు తీసుకొనుచు. 'అయ్యా, మీరువచ్చారు, బావిలో త్రాడువేసి నీళ్లు తోడుకొన్నారు. అంతే' అన్నాడు. అతని భావం, వారికెట్టి ఇబ్బందినికాని, ధనవ్యయమునుగాని కలుగచేయలేదని, ఎట్టి సరఫరా పొందలేదని.

తర్వాత క్యాంపు మాచెర్ల. ఒకప్పుడు ప్రసిద్ధికెక్కిన మాచెర్ల 1931 సంవత్సరంలో ఒక పెద్దగ్రామంగా మాత్రమే ఉండింది. ఈనాడది విస్తరించి పెద్ద సిమెంటు ఫ్యాక్టరీతోను, ఇతర పరిశ్రమలతోను, ఒక కాలేజితోను, వైద్యసదుపాయములతోను వ్యాపారం వృద్ధిఅయి, అభివృద్ధిని పొందుచున్నది. 11-వ శతాబ్దంలో, పల్నాటి వీరుడైన బ్రహ్మనాయుడు స్థాపించిన చెన్నకేశ్వరస్వామి దేవాలయం, ఆయన కాలంలో మిక్కిలి ప్రసిద్ధికెక్కియుండినది. ఆ దేవాలయ ప్రాంగణములోనే కుల, మత భేదములు పాటించని బ్రహ్మజ్ఞాని, బ్రహ్మనాయుడు, అన్ని కులాలవారిని సహపంక్తి భోజనము చేయించేవాడట. దానికి చాపకూడు అను పేరువచ్చింది. పేరుపొందిన వీరభద్రస్వామి దేవాలయం ఆ ప్రక్కనే యున్నది.

నేను అక్కడవుండిన వారంరోజులు పనిలో నిమగ్నుడనై యుంటిని. కాని, శనివారముతో పనిముగించిన తర్వాత, ఆదివారంనాడుదయం బయలుదేరి, సమీపములోవున్న కొండల మీదికి పోయాము. చంద్రవంక పైభాగమునుండి క్రిందికిపడు 'ఎత్తిపోతలు' అనే జలపాతంలో స్నానం చేశాను. బంట్రోతుతో పాటు వంటవానిని, సామాగ్రిని తీసుకొని వెళ్లినందున, అక్కడే వంటచేయించి, భోజనం చేశాము.

నేను మాచెర్లలో క్యాంపు చేయుచుండగా, బంధువు, మిత్రుడు శ్రీ పర్వతనేని వెంకటరత్నం, ఇంకొకరు నన్ను చూచుటకు వచ్చారు. నేను కేసు విచారించుచున్నప్పుడు వారు ప్రక్కగదిలోకివెళ్లి విశ్రమించారు. నేను ఒక కేసులో పన్నుదారుని గట్టిగా మందలించాను. దానికి ఆ ఆగంతకులు ఆశ్చర్యపడినారట. నా పెదతండ్రి అల్లుడు గనుక శ్రీ వెంకటరత్నం, బావవరుసను నన్ను కొంత హేళనచేశాడు. ఇప్పటికిని ఆ సందర్భం జ్ఞప్తికితెచ్చుచు నవ్వుచుంటాడు.

ఆ కేసులన్నియు ఇంచుమించుగా చిన్న వ్యాపారస్తులకు సంబంధించినవి. ఈ చిన్న వ్యాపారస్తులు సరిగా లెక్కలు పెట్టేవారుకాదు. పైగా మరుపువల్లనో కావలెననో, అసంబద్ధ సమాధానాలిచ్చేవారు. తప్పుడు లెక్కలుకూడ వుండేవి. పాశ్చాత్యదేశంలో, అందులో సుశిక్షణగల ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో, చదువుకొన్నవాడను కాబట్టి, పదిమంది నౌకర్లను అదుపు ఆజ్ఞల్లోపెట్టి పనిచేయించుకొనే కుటుంబంలో పుట్టినవాడనైనందున, సహజముగా ముక్కోపము, ఓర్పులేనితనము కలవాడనగుటచేత, తప్పుడు మాటలకు, తప్పుడు లెక్కలకు చప్పున కోపం పొందేవాడను. అసహనంతో పన్నుదారులను గట్టిగా మందలించేవాడను. ఒక్కొక్కప్పుడు విరుచుకుపడేవాడను. ముక్కుకు సూటిగా పోయేవాడనగుటచేతను, తప్పును తీవ్రంగా నిరసించు స్వభావము కలవాడనగుటచేతను పన్నుదారుల తప్పుడు లెక్కలు, తప్పుడు మాటలు నన్ను సూదులతో పొడిచినట్లుండేవి. అందువలన కొన్ని సంవత్సరాలవరకు, నిజానికి చాలా సంవత్సరాలవరకు, నాకా ముక్కోపం, అసహనం

తీవ్రముగానే వుండేవి. ఉద్యోగంచేసి ఎరుగని రైతుకుటుంబములో పుట్టుటచేత, పారంపర్యముగా వచ్చేవారి పాలనాదక్షత నాకు సంక్రమించలేదు. కాబట్టి ఎంత చదువుకొన్నా, స్వతహా సహృదయుడనైనా, ఎన్నడు ఎవరిని కడుపుమీద కొట్టనివాడనైనా, ముక్కోపం, అసహనం దుర్గుణాలనుండి తప్పించుకొనలేకపోయాను. నా కిప్పటికి వయస్సు 75 సంవత్సరములు నిండినవి. ఇప్పటికి కూడ నా కా మనస్తత్వం మిగిలియే యున్నది. మహాత్ముడు, బ్రహ్మజ్ఞాని, కరుణామూర్తి గాంధీజీ కూడ అక్రమ, అనుచిత, అసత్య విషయములలోనూ, తలపెట్టిన కార్యం సరియైన కాలంలో జరుగక ఆలస్యమైనా చిరాకును, అసహనాన్ని చూపేవారందురు. మహాత్మునికి కోటి కొకపాలైనను చాలనివాడనైనా రుజువర్తనములేక, వక్రపద్ధతుల నవలంబించువారిమీద నాకు సహజంగా కల్గు చిరాకే నా అసహనానికి, చటుక్కున కల్గు కోపానికి కారణమని చెప్పుకొనటానికి సందేహించను.

మూడు నెలల సెలవు గడచిన తరువాత, శ్రీ నారాయణ అయ్యంగారు తిరిగివచ్చి నావద్దనుండి 27-7-1931 తారీఖున అధికారాన్ని తిరిగి తీసుకొన్నారు. గుంటూరు ఉద్యోగరీత్యా ఒక విషయం గుర్తుకు వస్తున్నది. క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగడన్నట్లు అనుభవజ్ఞుడైన శ్రీ నారాయణ అయ్యంగారు పన్ను విధించిన రెండు, మూడు చిన్న కేసుల్లో ఏవో కొద్దిపాటి పొరపాట్లు జరిగినవని నేను ముందు, వెనుక చూడక, ఆ పన్ను విధింపులను మార్చి పెంచాను. బరంపురం ప్రొబేషనరి కాలంలో నే నలవాటుపడిన చిన్న విషయాల్లో కూడా స్తనశల్య పరీక్ష చేసే పద్ధతి, ఇక్కడ కూడ కొనసాగింది. అంతేకాదు స్వభావంకూడ దానికి దోహద మిచ్చింది. అనుభవజ్ఞుడగు శ్రీ నారాయణ అయ్యంగారు చిన్న కేసుల్లో అంత శ్రద్ధచూపకపోవటం తప్పు కాదు. 'దమ్మిడీలు దమ్మిడీలు లెక్కపెట్టిన రూపాయలు పోవచ్చును' అనే సామెత ప్రకారం పరక, పాతిక హెచ్చు పన్నుకోసం, ఈ చిన్న చిన్న కేసుల్లో కాలాన్ని ఖర్చుపెట్టితే వందలు, వేలు వచ్చే పెద్ద కేసులను పూర్తిగా తనిఖీ చేయటానికి కాలం చాలదు. కాలం చాలనందున, పెద్ద కేసులలో పూర్తిగా తనిఖీచేయనందున

తక్కువ పన్ను పడునేమో అనే జ్ఞానం అల్పులైన చిన్న వర్తకులను బాధించుట అనుచితమనే బుద్ధి నా కప్పు డుండలేదు. అయితే బీదలను బాధించాలని, పెద్ద వర్తకులను చౌకగా విడిచి పెట్టాలని నా ఉద్దేశ్యం ఎన్నటికిని కాదు.

సహజంగా శ్రీ నారాయణ అయ్యంగారు నా ప్రవర్తన హర్షించలేకపోయారు. అందువలన ఆఫీసునుండి తెలుసుకొని కాబోలు, నేను మరుసటిదినం ఉదయం ఆఫీసులో కలుసుకొన్నప్పుడు సంప్రదాయ విరుద్ధంగా, ట్రాన్స్ఫర్ యివ్వక మునుపే, వారు ఆఫీసరు సీటులో కూర్చుని వుండినారు. నేను వెళ్లినప్పుడు తగిన మర్యాద, మన్నన చూపలేకపోయారు. శ్రీ నారాయణ అయ్యంగారు సహజంగా పెద్దమనిషి. వారిని తరువాత మద్రాసులో ఉద్యోగరీత్యా, నా ఉద్యోగ విరమణానంతరం చాలాసార్లు కలసికొన్నాను. వారు ఇన్కమ్టాక్సు కమిషనర్గా కూడా ఒరిస్సాలో పనిచేశారు.

మా ఆఫీసు బంట్రోతుల నడవడి మిక్కిలి బాధాకరంగా పరిణమించింది. నేను అనుభవంలేని క్రొత్త ఆఫీసరును. పైగా అక్కడ వుండేది తాత్కాలికమే. కొలదికాలములో అసలు ఆఫీసరుగారు వచ్చివేస్తారు. ఇవి జవానుల అలక్ష్యానికి, క్రమశిక్షణారాహిత్యానికి కారకములయ్యాయి. పెద్దబంట్రోతు చాకలి కులస్థుడు. రాముడు అనేవాడు. ఆఫీసు డిస్పాచ్ బాక్సు తీసుకొని వచ్చుటకుకూడ వెనుకాడెడివాడు. ఆ రోజుల్లో ధాన్యం ధర బస్తా 1 కి రు. 3-00 లకు తగ్గిపోయింది. ఒకటోరకం మొలకొలకులు బియ్యం 246 పౌనుల బస్తా ధర రు. 10-00 లు మాత్రమే ఉండేది. జీతము తక్కువైనా, పన్నుదారుల వద్దనుండి జవాన్లు మామూళ్లు జాస్తిగా వసూలు చేసుకొనేవాళ్లు. పైగా దొంగపిటీషన్లు సృష్టించి, దానిమీద చాటుగా ఆఫీసు ముద్రవేసి, వానిని ఫిర్యాదు పిటీషన్లో వున్నవారివద్దకు తీసుకొనిపోయి "ఇదుగో, మీమీద పిటీషను వచ్చింది. దీనిని ఆఫీసరుగారు చూస్తే మీమీద క్రొత్తగా పన్ను వేస్తారు, లేదా హెచ్చుపన్ను వేస్తారు. దీనిని ఆఫీసరుగారికి చూపకుండా తీసుకువచ్చాం, మీ ముందర

చింపివేస్తాం'' అని భయపెట్టి, బెల్లించి డబ్బు గుంజుకొనేవాళ్లు. తాహాతుకు మించిన డబ్బు కనబడగానే, వాళ్లు విర్రవీగటం ఆరంభించారు. ఇస్త్రీ బట్టలతోనూ, సిల్కు తలగుడ్డలతోనూ, మంచి చేతి గడియారాలతోను, శ్రేష్టమైన సైకిళ్లతోను దర్జాగా వుండేవాళ్లు. నలుగురు జవానుల్లో ఇద్దరు చాకలి కులస్తులు. రాముడుగాక రెండోవాడు పుల్లయ్య. ఒకడు మహమ్మదీయుడు, బడేసాహెబ్. నాల్గోవాడు కోటయ్య అనే బలిజ కులస్తుడు. తతిమ్మా ముగ్గురు కంటె దురహంకారంలో, అవిధేయతలో రాముడు ముందంజవేశాడు. నిజానికి కడమ ముగ్గురు కొంతవరకు అనుకూలురే. అందరికంటే రాముడు మిక్కిలి తెలివితేటలు కలవాడు. పుల్లయ్య సర్దుకు పోయేవాడు. కోటయ్య ఉల్లాసీదా మనిషి. బడేసాహెబ్ ఫరవాలేదు. నా అనుభవంలో మహమ్మదీయ జవాన్లు ఎక్కువ భక్తి విశ్వాసాలతో, వినయ విధేయతలతో వుంటారు. రాముడు ప్రవర్తన గౌరవహీనంగా, క్రమశిక్షణకు వ్యతిరేకంగా తయారవటంవల్ల, వానిమీద ఛార్జీలుపెట్టి, సంజాయిషీ అడిగాను. వాడు చివరకు కాళ్లవద్దకువచ్చి క్షమాపణ కోరుకొన్నాడు. ఛార్జిషీటు చించివేసి, వాని ముఖానకొట్టి పంపివేశాను.

నేనక్కడున్న కొద్దికాలంలో వకీళ్లు పత్రి శ్రీనివాసరావు, తమ్మారెడ్డి రంగారెడ్డిగార్లు, రైతుపెద్ద లావు సీతారామయ్యగారు పరిచితులయ్యారు. పత్రి శ్రీనివాసరావుగారు మిక్కిలి స్నేహశీలి. సరసులు. మాట మంచి గలవారు. వారు, నేను అప్పుడప్పుడు కలసికొనేవారం. వారితో కలసి ఒకరోజున ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించి, కొనసాగించుచుండిన శారదా నికేతన మను బాలికల పాఠశాలకు వెళ్లినాను. సదాశయముల తోను, వర్ణవివక్షత లేకుండా అన్ని తరగతులకు, అన్ని కులాల వారిని చేర్చుకొని ఆ స్కూలు నడుపబడుచుండినా, కొంత కుల పక్షపాత ముండినదా అనిపించింది. వకీలు రంగారెడ్డిగారు పెదనందిపాడు సమీపం పామర్రు వాస్తవ్యులు. గుంటూరులో న్యాయవాదిగా స్థిరపడిపోయారు. వారు మిక్కిలి స్నేహభావంతో ఉండేవారు. స్వకులస్తుడగు పాటిబండ్ల (లాం గ్రామస్తులు)

సీతారామయ్యగారు బంధువువలె చనువుగా వుండేవారు. ఆ పట్టణములోని క్లబ్బుకు 2, 3 సార్లు వెళ్లాను. అదిప్పుడు విస్తరింపబడి బహుజనాదరణ పొందుచున్నట్లు తెలిసింది. ఒక ఉదయం, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు మా ఇంటికివచ్చి, కొన్ని నిమిషాలు గడపి వెళ్లిపోయారు. నా మాతామహి త్రిపురనేని లక్ష్మమ్మగారి సోదరుడు, అక్కినేని పుల్లయ్యగారి కుమారుడు బలరామకృష్ణయ్యతో కలసి వారు మా ఇంటికి వచ్చారు. శ్రీ రామస్వామి చౌదరిగారు, మా తల్లి పున్నమ్మగారి పెదతండ్రి చలమయ్యగారి కుమారుడు. అందువలన నాకు వారితో చనువుండినట్లు, ఇదివరకే ప్రథమ భాగంలో చెప్పియున్నాను. వారు గొప్ప కవులేగాక, మహా విజ్ఞులు. వారు హేతువాది, మానవతావాది. హిందూసంఘంలో కులతత్వం, వర్ణవివక్షత ద్వారా ఏర్పడిన అవకతవకలను సరిదిద్దుటకు వారు కంకణం కట్టుకొని యుండినారు. మరిన్ని హిందూమతమను పేరుతో పురాణాదులలో చేర్చబడిన మూఢనమ్మకాలను తొలగించటానికి దీక్షవహించి యుండినారు. ఇతరులు హేళనచేయుచున్నారని గాని, దూషించు చున్నారని గాని, ఎదిరించుచున్నారని గాని కించిత్తైనా లెక్కపెట్టని మహాధీరుడు. ప్రపంచము తలక్రిందులైనను, ఆకాశ మూడి పడినను, తాను నమ్మిన పంథాలను విడనాడని వారు. వారు ఐర్లండులో విద్య నభ్యసించినప్పుడుకూడా, భారతీయ సూచకమైన తలపాగను ధరించుట మానని జాతీయవాది. స్వరాజ్య సమరమును హృదయపూర్వకముగా సమర్థించి, "వీరగంధము దెచ్చినారము, వీరు డెవ్వడో దెల్పుడీ. పూసి పోదుము, మెడను వైతుము పూలదండలు భక్తితో" వగైరా ఉద్వేగ, ఉజ్జ్వల గేయాలను ఉద్బోధించిన దేశభక్తి పరాయణుడు. వారు మా ఇంటికి వచ్చినప్పుడు నేను భారతిలో, సమదర్శిని సంచికలలో వ్రాసిన తెలుగు వ్యాసాలు బాగున్నవని సెలవిచ్చి, నన్ను సంతోషపరచారు. ఈ మహాభాగునకు మేనల్లుడనని చెప్పుకొను భాగ్యము కలిగినందులకు నేను మిక్కిలి గర్వించుచున్నాను.

నా గుంటూరు మూడు మాసాల ఉద్యోగాన్ని ఎట్లో గడుపుకొని 27-7-1931 తారీఖున గుంటూరు విడిచి, 5-8-1932 న చిత్తూరు సర్కిల్ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా పదవి స్వీకరించాను. అక్కడి ఆఫీసరుగారు సెలవుమీద వెళ్లియుండినందువల్ల, అసిస్టెంటు ఆఫీసరు శ్రీ భాష్యం అయ్యంగార్ తాత్కాలికంగా ఆఫీసరుగా పనిచేస్తుండినారు. నేను చిత్తూరు చేరునప్పటికి ఏదో కారణంవల్ల, శ్రీ భాష్యం అయ్యంగార్ అక్కడ లేరు. టెలిగ్రాం ద్వారా ఛార్జిని అప్పగించుకొన్నాను. శ్రీ భాష్యం అయ్యంగార్, మద్రాసు 3-వ సర్కిల్‌లో నేను ప్రొబేషనరి ఆఫీసరుగా, వారు అసిస్టెంటు ఆఫీసరుగా పనిచేశాము. అందువల్ల వారి నదివరకే ఎరిగియుంటిని.

ఏ స్కూల్ ఫైనల్ పరీక్షో ప్యాసై, చిన్న గుమాస్తానుండి పైకివచ్చిన శ్రీ భాష్యం అయ్యంగారికి నా విషయాన, తాను తక్కువ వాడననే భావం (ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు) వుండి వుండవచ్చును. నేను ఛార్జి తీసుకొనటానికి వస్తున్నానని తెలిసిన మీదట క్రింది చూపులు చూస్తూ "దొరై వస్తున్నాడు, ఎట్లా వుంటుందో" అనే భావాన్ని వెలిబుచ్చాడట.

మా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసు, శ్రీ పాపుదేశు వెంకటస్వామి నాయుడు గారి మేరీ బిల్డింగ్సులోని ఒకభాగంలో వుండేది. ఈ బిల్డింగ్స్ మిక్కిలి విస్తృతమైన ఒకే కట్టడం. అనేక భాగాలుగా వుండును. డచ్చి మిషనరీలు తమ కార్యకలాపాలకు కట్టుకొన్నారట. ఈ బిల్డింగు మిక్కిలి పెద్దదేగాక, చాల విస్తీర్ణంగల స్థలంలో కట్టబడి, చుట్టూ ప్రహరీ కల్గివున్నది. ఏకారణం వల్లనో ఆ విస్తృతావరణముతోగూడిన ఆ పెద్ద బిల్డింగును అమ్మేటకు డచ్చి మిషనరీవారు బేరంపెట్టగా, 15 వేల రూపాయలకు శ్రీనాయుడుగారు కొన్నారట. అది నేను 1931లో అక్కడికి వెళ్లినప్పటికే 1, 2 లక్షల విలువ కలిగి వుండింది. ఇప్పటికి దాని విలువ మరికొన్ని లక్షలుండును.

శ్రీ వెంకటస్వామినాయుడుగారు చిత్తూరు పట్టణానికి 11 మైళ్ల దూరంలోవున్న నలగాంపల్లె అనే గ్రామంలోని కమ్మరైతు

కుటుంబములోనివారు. వారి కుటుంబ మంత సంపన్నమైనదికాదు. కాని వెంకటస్వామినాయుడుగారు తన శక్తి సామర్థ్యములచేత ఆస్తిపాస్తులను గడించి పేరెన్నికగన్నారు. వారు సూక్ష్మబుద్ధి కలవారు. చాకచక్యము గలవారు. విషయములను చప్పున, చక్కగా గ్రహింపగల శక్తిగలవారు. ఎప్పుడు, ఏవిధముగ వ్యవహరించాలో బాగుగా తెలిసి యుండినవారు. మంచి నైపుణ్యంతో చక్కగా మాట్లాడటం, అవసరము వచ్చినప్పుడు నిర్మొగమాటంగా, ఖచ్చితంగా చెప్పివేయటం నేర్చినవారు. అన్నింటిని మించి కార్యశూరులు, దక్షులు. గుండె నిబ్బరముతో కష్టమైన పనిని గూడ, చేపట్టి సాధించేవారు. అసాధ్యమైనదని ఇతరులు భయపడిన దానిని గూడ సాహసించి చేపట్టేవారు. వీరు నాయందు మిక్కిలి స్నేహభావంతో, అభిమానంతో వర్తించి ఆదరించేవారు. వారి కప్పటికే వయస్సు మళ్లి యుండినది. వారి ధీర లక్షణాలకు, నాయందు చూపే అనురాగ, ఆదరణాలకు నేను ముగ్ధుడనై వారిని "నాన్న" అని పిలిచేవాడను.

వారి ఇద్దరి కుమారులు వెంకట కృష్ణయ్యనాయుడు, చెంగల్వరాయనాయుడు అప్పటికి పిన్నవయస్కులు. అందువల్ల వారితో నాకు సహజంగా, అప్పటికి తక్కువ పరిచయమే. వెంకటస్వామినాయుడుగారిని నేను తండ్రిగా భావించినందున, ఈ యువకు లిద్దరు నా తమ్ముళ్లు వంటివారు. ఈ అనుబంధం క్రమేపి వృద్ధిచెంది ఆ కుటుంబానికి, నా కుటుంబానికి సన్నిహితత్వం ఏర్పడింది.

నేను చిత్తూరులో 14 మాసములే, 20-10-1932 వరకుండి, బరంపురానికి ఈదఫా సర్కిల్ ఆఫీసరుగా వెళ్లవలసివచ్చింది. ఈ తరలింపు అక్టోబరు మాసములో జరిగింది కాబట్టి, 13 ఏండ్ల వయస్సుమాత్రమే నిండియుండిన నా మొదటి కుమారుడు పూర్ణచంద్రరావు చదువుకు విఘ్నం కలిగేటట్లు కన్పించింది. వాడప్పుడు రెండో ఫారం చదువుచుండినాడు. విద్యాసంవత్సరం ఏప్రియల్‌లో గాని ముగియదు. కుర్రవాని విద్యకు భంగము కలుగుతుందని, బరంపురం దూరప్రదేశం, గంజాం జిల్లాలోనిది, ఉరియా

సంప్రదాయం, మద్రాసుకు సమీపంలో వున్న చిత్తూరు విద్యా పద్ధతులకు, పఠన పుస్తకాలకు బరంపురం వానికి భేదం వుంటుంది అని ఆందోళన పడ్డాను. ఈ ఆందోళన గ్రహించి శ్రీ నాయుడు గారు "పిల్లవానిని ఇక్కడ విడిచిపెట్టి వెళ్లండి. మాకుర్రవాళ్లతో కలిసి చదువుకొనుచు మా యింటిలోనే వుంటాడు"అని నన్ను సమాధానపరచి, కుర్రవానిని వారింటివద్దనే వుంచుకొన్నారు. ఇది మా అనుబంధాన్ని మిక్కిలి హెచ్చించి, మా కుటుంబములను ఎక్కువ దగ్గరగా చేర్చింది. దగ్గర బంధువులకంటె ఎక్కువ ఆప్యాయతతో, మా కుటుంబాలు రెండును, ఇప్పటికిని వ్యవహరించుచున్నవి. వారింట పెళ్లిళ్లకు మేము వెళ్లటం, మా యింటి పెళ్లిళ్లకు వారు రావటం జరుగుచున్నది. శ్రీ వెంకటస్వామి నాయుడుగారి ఇద్దరు కుమారులు అభివృద్ధికివచ్చి ప్రముఖ పౌరులైనారు. పెద్ద కుమారుడు శ్రీ వెంకట కృష్ణయ్యనాయుడు స్వతంత్రపార్టీ రాజకీయాలలో ప్రముఖపాత్ర వహిస్తూ, ఆచార్య రంగాగారికి చిత్తూరు జిల్లాలో కుడిభుజముగా వుండినారు. వారు చాలా కాలమునుండి సహకార పరపతి ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తూ, కేంద్ర సహకార బ్యాంకుకు అధ్యక్షులుగా వుండినారు. మరిన్ని సహకార పంచదారమిల్లును స్థాపించుటలో ముఖ్యులై వుండి, దాని కధ్యక్షులుగా కూడా పనిచేశారు. మిక్కిలి నిజాయితీ గల వ్యక్తి. మిత, మృదుభాషి. సజ్జనుడు. విశాల హృదయుడు. నమ్మకస్తుడు. స్నేహశీలి. చిత్తశుద్ధిగల కార్యాచరణుడు. దీక్షా పరుడు. దురదృష్టవశాత్తు 1970 అక్టోబరులో దివంగతులైనారు. రెండవ కుమారుడు శ్రీ చెంగల్వరాయనాయుడు కాంగ్రెసు రాజకీయాల్లో ప్రముఖుడై జిల్లాబోర్డు అధిపతిగా పరిపాలనచేసి, 1967 లో జరిగిన సర్వసామాన్య ఎలెక్షన్‌లో చిత్తూరు జిల్లాలోని పలమనేరు పార్లమెంటు నియోజకవర్గానికి ఎన్నికై లోక్‌సభ సభ్యునిగా వుండినారు. పెద్దగా చదువుకొనకపోయినా, తన చురుకుదనము. ఆకాంక్షల వల్ల లోక్‌సభ ప్రశ్నలలోనూ, వాగ్వివాదాలలోనూ, చర్చలలోనూ పాల్గొంటూ, వార్తా పత్రికలలో పేరు పడునట్లుగా ప్రముఖ పాత్రను వహించినాడు.

చిత్తూరు జిల్లాలో నేను ఉద్యోగము స్వీకరించినది ఆగష్టు మాసమని పైన చెప్పియున్నాను. నా ఆఫీసులో అప్పుడు కె. పి. రంగాచార్యులు హెడ్ క్లార్కు, యన్. కె. స్వామినాథ అయ్యర్ పర్సనల్ క్లార్కు, ఒక మహమ్మదీయ యువకుడు షేక్ దావూద్ టైపిస్టు, ఇంకా ఒకరిద్దరు గుమాస్తా లుండేవారు. నా మొదటి క్యాంపు మదనపల్లిలో. అది సెప్టెంబరు మాసంలో జరిగింది. క్యాంపుకు ఇద్దరు బంట్రోతులతోపాటు, పర్సనల్ క్లార్కు తప్పని విధిగా వెంట వుంటాడు. ఈ గుమాస్తానే క్యాంపు క్లార్కు అని కూడ అంటారు. మదనపల్లి దూరం 57 మైళ్లు. అప్పుడు నాకు మోటారుకారు లేనందున బస్సులోనే పోవలసి వచ్చేది. మధ్యాహ్నం ఏ రెండు గంటలకో మదనపల్లికి బస్సు బయలుదేరవలసి ఉండినది. నేను నివసించుచుండిన "కానర్" బంగళా ఊరి బయట, మదనపల్లికి వెళ్లే రహదారిమీదనే ఉన్నది. కాబట్టి యితర ప్యాసింజర్లను ఎక్కించుకొని, బస్సు నా బంగళా వద్ద ఆగి నన్ను, నా సామానులను ఎక్కించుకొని పోవలసివున్నది. బస్సులో స్థానం ఏర్పాటుచేసి, ఆఫీసరును ఎక్కించుకొని వెళ్లే బాధ్యత ముఖ్యంగా క్యాంపు క్లార్కుది. ఆ రోజుల్లో మామూలుగా బస్సు ఆఫీసరుగారి నివాసగృహానికిగాని, ఆఫీసుకుగాని వెళ్లి రికార్డులతోబాటు ఆఫీసరుగారిని ఎక్కించుకొని వెళ్లే ఆచారం. ఈ క్యాంపుకు బస్సు త్రోవతప్పి వెళ్లవలసిన అవసరం కూడా లేదు. అయినా, నిర్ణయకాలం దాటి గంట, గంటన్నర అయినా బస్సురాలేదుకదా, వచ్చు జాడైనను కనబడలేదు. క్యాంపుకు వెళ్లే ఇద్దరు జవానుల్లో ఒకడు ముందుగానే, బస్సు స్టాండుకు వెళ్లాడు. క్యాంప్ క్లార్కు గూడా అక్కడే వుండాలి. ఎంతసేపటికి బస్సు రానందున, నేను ఆందోళనపడి రెండవ జవానుని తీసుకొని బస్సు స్టాండుకు నడచి వెళ్లాను. బస్సులో ప్రయాణీకులు కూర్చుండియుండినారు. బంట్రోతు బస్సుదగ్గర తచ్చర్లాడుచున్నాడు. క్యాంప్ క్లార్కు డ్రైవరు ప్రక్క సీటులో దర్జాగా ఆసీనుడై వుండినాడు. "బస్సు చెడిపోయినదని, దానిని బాగుచేయటానికి ఆలస్యమైనదని, బస్సు బయలుదేరబోవు

చున్న'' దని జవాను చెప్పాడు. పర్సనల్ క్లార్కు స్వామినాథ అయ్యర్ కూర్చుండే, నన్ను ''రండి సార్'' అంటూ తన ప్రక్క సీటును తట్టి నన్ను పిలిచాడు. సర్వసామాన్యంగా, డ్రైవరు ప్రక్క సీటు సుఖప్రదమైంది. ఆఫీసరుకు ఆ సీటు అట్టిపెట్తారు. ఇంకొక ఆఫీసరు వస్తేతప్ప, ఒక ఆఫీసరే కూర్చుంటాడు. దానికి బదులు, ఆఫీసర్‌కు తా నేర్పాటుచేయవలసిన సీటులో తానే కూర్చుండి, క్యాంపు క్లార్కు తనప్రక్కన కూర్చోమనండని తన ఆఫీసరుకు చెప్పటం అవిధేయతకు పరాకాష్ఠ. క్రమశిక్షణకు గొడ్డలిపెట్టు. అమర్యాదకు మూలం. అందువల్ల నేను కోపపడి, ''నీ స్థాన మది కాదు, వెనుకప్రక్క'' అని గద్దించి చెప్పాను. కిక్కురు మనకుండా లేచి వెళ్లి బస్సులోపల కూర్చొన్నాడు.

స్వామినాథ అయ్యర్ రెవెన్యూ డిపార్టుమెంటులో చాలా సంవత్సరాలు పనిచేసినాడట. అప్పుడు నక్కజిత్తులు నేర్చుకొని యుండినాడు. ఆ రోజుల్లో రెవెన్యూ డిపార్టుమెంటులోని ప్రతి చిన్న ఉద్యోగి అధికారం చెలాయించేవాడు. పైగా చీటికీ, మాటికీ మామూళ్లని చేయి చాపేవాడు. ఎక్కువ లాభదాయకరముగా ఉంటుందని స్వామినాథ అయ్యర్ ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటులో చేరాడు. ఎక్కువ అనుభవం కలిగినవాడు. ప్రత్యేకించి లబ్బె తోళ్లవర్తకులు ప్రాత అరవంలో వ్రాసిన లెక్కలను తనిఖీచేయుటలో నేర్పరి. నేను సమర్థుడను, ముఖ్యముగా క్రొత్త ఆఫీసర్లకు నేను తప్పనిసరి అనే అహంభావం కల్గియుండినాడు. పైగా నా ముందువున్న ఆఫీసర్లు ఇట్టి గుమాస్తాను తగిన క్రమశిక్షణలో పెట్టలేనివారై, ఇతని చురుకైన బుర్రకు, అనుభవానికి, నేర్పుకు లొంగిపోయినారనునట్లుగా ఇతనికి కొంత స్వేచ్ఛ ఇచ్చారు. అందువల్ల అంత నిర్లక్ష్యంగా, తన ఆఫీసరనే గుర్తు లేకుండా ఆ గుమాస్తా నడచాడు. కొన్ని వేళల్లో ఎదుర్కోవలసి వచ్చు దుస్సంఘటనల ప్రథమానుభవాన్ని నేనప్పుడు చవి చూచాను.

మదనపల్లి క్యాంపు రెండోరోజున బి. కృష్ణయ్యనాయుడనే వ్యక్తి నన్ను ఒంటరిగా కలసికొని ''స్వామినాథ అయ్యర్ పన్ను

దారులను పీడించుచున్నాడని, మిక్కిలి లంచగొండి అని, కేసును బట్టి రూ. 5, 10, 25 లు తనచేతిలో ముందుగా పెట్టిందే ఫైళ్లను ఆఫీసరువద్దకు పంప''డని ఫిర్యాదు చేశాడు. డబ్బు ఇవ్వనివానిని గొంతుకోస్తానని బెదిరించేవాడట. ఇప్పుడెట్లున్నదో గాని ఆ రోజుల్లో, పన్నుదారులనుండి స్టేట్‌మెంట్లు తీసుకొని, ఆ పన్ను దారుల ఫైళ్లను ఆఫీసరువద్దకు పంపేది క్యాంపు క్లార్కే. అతను పంపంది, ఏ ఫైలు ఆఫీసరు చూచే పద్ధతిలేదు. ఈ అవకాశాన్ని స్వామినాథ అయ్యర్ పూర్తిగా వినియోగించుకొని చిన్న పన్నుదారులనేగాక, పెద్ద పన్నుదారులను గూడా అది లేదు, ఇది లేదు అని పీడించి, డబ్బు తీసుకొనేవాడు. (శ్రీ) కృష్ణయ్య నాయుడువద్ద నుండి ఈ ఫిర్యాదును విని, తర్వాత ఇద్దరు ముగ్గురుతో ఏకాంతంగా చర్చించి ఈ ఫిర్యాదు నిజమని నమ్మి, స్వామినాథ అయ్యర్‌ను పిలిచి చివాట్లు పెట్టాను. అతడు నామీద పాము పగ పట్టి దొంగ పేర్లతో, దొంగ సంతకాలతో నామీద అసిస్టెంటు కమిషనర్ గారికి పిటీషన్లు పంపించట మారంభించాడు. నేను పన్నుదారులను అమర్యాదగా చూచి తిట్టుతానని, వేళాపాళా లేక ప్రొద్దుపోయేవరకు కేసులను విచారిస్తూ, పన్నుదారులను, గుమాస్తాలను బాధిస్తున్నానని నామీద ఫిర్యాదు. అనుభవంగల ఆఫీసరైనను రోజుకు ఏడు, ఎనిమిది కేసులను తనిఖీచేయటం కష్టం. ఇన్‌స్పెక్టరు (అప్పుడు అసిస్టెంటు ఆఫీసరు) చిత్తూరు సర్కిల్‌లో ప్రథమంలో లేడు. అందువలన, హెడ్ క్వార్టర్సులో హెడ్ క్లార్క్, పర్సనల్ క్లార్క్, చివరకు రొటీన్ క్లార్క్‌లను గూడా స్టేటుమెంటులను, అంకెల వగైరాను సరిచూడండని ఇచ్చేవాళ్లము. మిక్కిలి పెద్ద కేసులయితే హెడ్ క్లార్క్‌నో, పర్సనల్ క్లార్క్‌నో తనిఖీచేసి నోట్సు వ్రాయండనేవాళ్లం. క్యాంపులో ఈపనికి క్యాంపు క్లార్కే దిక్కు. సాధారణంగా చిన్న కేసులలో లెక్కపుస్తకాలను తిరిగి పరిశోధించకుండానే, ఈ నోట్సు ఆధారంగా పన్ను విధింప బడుతుంది. అందువల్ల, తక్కువ ఆదాయం వచ్చిందని నోట్సులో చూపి కొందరిని తనకు అనుకూలురుగా స్వామినాథ అయ్యర్

చేసుకొన్నాడు. అట్టి వారిలో ఒకడు పలమనేరు గ్రామపంచాయితీ అధ్యక్షుడు.

ఈ ఆసామి ఒకసారి నేను ఏదో పనిలో నిమగ్నుడనై వుండగా ముందు కబురు పంపకుండా, ఆఫీసరు వద్దకు వెళ్లుటకు సముచితమైన దుస్తులు ధరించకుండా చప్పున చిత్తూరు హెడ్ క్వార్టర్స్ ఆఫీసులోపలికి వచ్చాడు. రావటమే కాకుండా వాగ్వివాదాలకు దిగాడు. "నేను ఇప్పుడు ఒక కేసులో మునిగివున్నాను. పనివుంటే తర్వాత కనపడండి" అని చెప్పినా వినక మొండికేశాడు. అందుమీద నాకు కోపంవచ్చి "బుద్ధిహీనుడా, బయటకుపో"మ్మని కేకలువేశాను. ఆయన అట్లు వర్తించటానికి కారణం స్వామినాథ అయ్యర్. ఈ గుమాస్తా ప్రోత్సాహంవల్ల నేను తనను తిట్టానని కమిషనర్‌కు పిటీషన్ పెట్టుకున్నాడు.

ఈ పిటీషన్‌ను మామూలు క్యాంపుకు వచ్చిన అసిస్టెంటు కమీషనరుగారు ఇ. డబ్లియు. క్లార్కుగారు విచారించారు. వారిముందు కూడా అపసవ్యంగా, అసంగతంగా ఆ వ్యక్తి వ్యవహరించాడు. క్లార్కుగారికి చిరాకు కలుగుటయే గాకుండా కోపం ముంచుకు వచ్చింది. ఆయన చప్పున "నోరు మూసుకో, బుద్ధిహీనుడా" అని గద్దించారు. ఏ ఆరోపణను విచారించటానికి వారు తలపెట్టారో, ఆ నేరాన్నే వారు చేశారు. చటుక్కున జ్ఞాపకం రాగా నన్నుచూచి తలవంచుకొని, "ఆఫీసరు నీమీద కోపపడటం నా కాశ్చర్యాన్ని కలిగించటంలేదు" అని ఫిర్యాదును కొట్టివేశారు.

ఈ వ్యక్తి అసంగతంగా చెప్పకుండా లోనికి ప్రవేశించిన తర్వాత "పర్మిషన్ లేనిదే లోనికి రాకూడదు" అని వ్రాయించిన అట్టను నా ఆఫీసు ముఖద్వారాన తగిలించాను. దీనిని అసిస్టెంటు కమిషనరుగారు లోపలికివస్తూ చూచి "ఎప్పుడు పెట్టా"రని అడిగారు. "ఈ వ్యక్తి చెప్పకుండా, అపసవ్యముగా ప్రవేశించిన తరువాత, జాగ్రత్తకొరకు తగిలించా"నని చెప్పాను. విని, వూరుకొన్నారు.

స్వామినాథ అయ్యర్ పంపించిన పిటీషను విషయాన్ని గురించి కోయంబత్తూరు రేంజి అసిస్టెంటు కమిషనరు ఎ. శౌరి నాథపిళ్లెగారు ప్రశ్నించగా, స్వామినాథ అయ్యర్ మీద నేరా రోపణలు చేయుచు జవాబు పంపాను. స్వామినాథ అయ్యర్‌తో పాటు రుద్ర కుమారస్వామిపిళ్లై అను గుమాస్తా కూడా నాకు శ్రమ కలిగించాడు. అతనిమీద కూడ నేను ఫిర్యాదు చేశాను. రుద్ర కుమారస్వామిపిళ్లై ఆఫీసుకు ఆలస్యంగావచ్చి, వచ్చినవెంటనే కోటు వగైరా తీసివేసి వంకెకు తగిలించి, బయలుదొడ్డికి వెళ్లి, ఆపని పూర్తిఅయిన తర్వాత కాళ్లుచేతులు కడుక్కొని, చాప పరచుకొని విశ్రమించేవాడు. తరువాత నెమ్మదిగా లేచి, సావకాశంగా, చేయవలసినదానికంటె చాలా తక్కువగా పనిచేసేవాడు. పార్టీలు డబ్బుకట్టే చలాన్లు మొదలైన ముఖ్య మైన కాగితాలను సకాలములో పూర్తిచేయకపోవటమేగాక, వాటిని తన డ్రాయరు సొరుగుల్లో క్రుక్కి, వారాల తరబడి వుంచే వాడు. ఎంత మందలించినా సరకుచేసేవాడే కాదు. పోనుపోను నిర్లక్ష్యభావంకూడా చూపేవాడు నే నొకసారి అకస్మాత్తుగా వెళ్లి, డ్రాయరు సొరుగును తీసి లోపల క్రుక్కి వున్న కాగితాలను తీసి, అతనిని గట్టిగా చివాట్లుపెట్టాను. అతడు స్వామినాథ అయ్యర్‌తో కలసి అగ్నికి ఆజ్యం తోడుపడినట్లుగా, నా మీద దండయాత్ర సాగించాడు.

తర్వాత అసిస్టెంటు కమిషనరు శౌరినాథపిళ్లెగారు పూర్తి విచారణ జరిపారు. నేను తిరుపతి ఛైర్మన్ సుబ్బరామరెడ్డిగారిని, మరిద్దరు, ముగ్గురు ఘరానా మనుష్యులను హాజరు పరపించి, వారినుండి స్వామినాథ అయ్యర్ లంచగొండితనాన్ని నిరూపించు సాక్ష్యాన్ని ప్రవేశపెట్టించాను. సాక్ష్యబలముతో నామీది ఆరోపణలను త్రోసివేసి, స్వామినాథ అయ్యర్‌ను డిస్‌మిస్ చేసి, రుద్ర కుమారస్వామిపిళ్లెను సస్పెండ్ చేశారు. స్వామినాథ అయ్యర్ అప్పీలును కమిషనరు త్రోసిపుచ్చారు. రుద్ర కుమారస్వామిపిళ్లై సస్పెన్షనును ఖాయంచేశారు. కాని, అతనితప్పిదం చిన్నదనే భావంతో అతడు తిరిగి ఉద్యోగంలో చేరుటకు అనుమతిచ్చారు.

అతడు సెలవుమీద వెళ్లి, తర్వాత ఎక్కడికో ట్రాన్స్ఫర్ అయి వెళ్లిపోయాడు స్వామినాథ అయ్యర్ నన్నుతిట్టుచూ ఆ వూళ్లోనే వుండిపోయాడు.

నేను బరంపురములో ప్రొబేషనర్గా నున్నప్పుడు తీవ్ర వాతమువలన నడుము పట్టి కొన్నాళ్లు బాధించింది. తరువాత చిత్తూరులో పై వ్యథ సాగుచున్నప్పుడు నా ఎడమ తొడ పెద్ద నరము బిగబట్టి సయాటికా అనే వ్యాధిగా పరిణమించింది. దాని వలన నేను పదిహేనురోజులైనను బాధపడ్డాను. కూర్చొన టానికి, పడుకోటానికి కూడా బాధపడేవాడను. ఆ బాధతోనే ఆఫీసుకు వెళ్లి, ఆఫీసు బల్లమీద ఒక క్రేను నిలబెట్టి, దాని ఆధారంగా నిల్చుండి పనిని చేసుకొన్నాను. ఎవరో సలహా యివ్వగా వాలాజ అను పేరుగల చిన్న పట్టణంనుండి అక్కడి నేత నేర్పు స్కూలులో నేయుట నేర్పించేవారి నౌకరిని ( పేరు ధర్మరాజని గుర్తు ) పిలిపించాను. ఆయన మా యింట్లోనే భోజనంచేస్తూ, నరాన్ని ప్రొద్దున సాయంత్రం తోమేవాడు. క్రమేపి బాధ తగ్గిపోయింది. ఆయన చివరకిచ్చిన మందు స్వల్పం. తెల్ల తుమ్మబెరడుతో ఒక కోడిగ్రుడ్డును ఉడికించి, దానిలో సమపాళ్లతో ఆవు నెయ్యి, తేనె మిశ్రంచేసి కొద్ది రజిత భస్మం కలిపి ఇచ్చాడు. దీనిని సేవించింది 4, 5 రోజులు మాత్రమే. అంతటితో ఆ సయాటికా బాధ తగ్గింది. కాని నడుమునొప్పి అప్పుడప్పుడు వస్తూ వుండటం కద్దు. ఏ తైలమో మర్దించటం పరిపాటి.

నేను తిరుపతి క్యాంపుకు వెళ్లి నేను, నా భార్య మొదటి సారి తిరుమల వెంకటేశ్వరస్వామిని దర్శించాము. మాతో నాకుమారుడు పూర్ణచంద్రరావుతోబాటు, అప్పుడు మాతో చిత్తూరులో నుండుచుండిన వదినె కుమారుడు పూర్ణచంద్రరావు కూడా ఉండినాడు. మేము ఉదయం బైలుదేరి, కాలినడకన్న ఏడుకొండలు ఎక్కి స్వామివారి దర్శనము చేసుకొని, సాయంత్రం కాలినడకనే ఏడుకొండలు దిగి తిరుపతి ట్రావెలర్సు బంగళాకు చేరుకొన్నాము. ఆకాలంలో కొండమీదికి రోడ్డులేదు. కాలి

నడక లేక డోలీలు. నేను, నాభార్య వయస్సులో ఉండినందున ఏడుకొండ లెక్కి సాయంత్రానికి తిరిగి రాగలిగితిమి. అయితే బలిష్ఠురాలైనా, నాభార్య లేచూలు దెబ్బతిన్నది. నాకు కాళ్లు ఒకటి రెండు రోజులు పట్టాయి. ఇక పిల్లలు ఆటలాడునట్లుగా పరుగులిడుచు, మాకంటె ఎంతోదూరం పై కెగప్రాకిపోయారు.

నా మదనపల్లి మొదటి క్యాంపులో నేను ఇన్‌స్పెక్షన్ బంగళాకు చేరుకొన్న కొంతసేపటికి ఇద్దరు పోలీసులు వచ్చి "మా ఇన్‌స్పెక్టర్‌జనరల్‌గారు వస్తున్నారు. వారికి రెండు గదులు కావాలి. మీరు మీ గది ఖాళీచేయండి" అని కోరారు. "పోలీసు ఇన్‌స్పెక్టర్‌జనరలేకాదు, గవర్నరు వచ్చినా నేను ఖాళీచేయను. నేను వారంరోజులు ఇక్కడుండుటకు కలెక్టరు పర్మిషన్ ఇచ్చాడు. అధిక ప్రసంగంచేయక వెళ్లిపొం"డని చెప్పాను. చేసేదిలేక వారు వెళ్లిపోయారు. తర్వాత ఆ పోలీసు ఆఫీసరువచ్చి, రెండో గదిలో తన కార్యకలాపాలు జరుపుకొన్నాడు. ఆయన ఇంగ్లీషు వాడు. మర్యాదస్తుడుగానే తోచాడు. మేము ఒకరినొకరం చూచుకొన్నాము కాని, మాట్లాడుకొనలేదు. సాయంత్రం బయట పడకకుర్చీలో కూర్చొన్నప్పుడు, ఒకరి కొకరికి యిబ్బంది కలుగకుండా మసలుకొన్నాము. ఇట్టి ఆర్భాటాలు క్రింది ఉద్యోగస్తులు చేసే మొహార్భాని ఆర్భాటాలే గాని పెద్దవారు పట్టించుకోరేమో అనుకొన్నాను.

మదనపల్లి క్యాంపులో జరిగిన విశేష మింకొకటి. కమ్మ కులస్తుడు నాయుడని పిలిపించుకొనుట, నాయుడని చేవ్రాలు చేయుట అనాదినుండి వచ్చుచున్నది. చౌదరి అన్నది ఈ మధ్యవచ్చిన ఆచారం. అంతకుముందు వున్నా, అది క్వచిత్. కాని నేను రంగారెడ్డి అను పన్నుదారుని లెక్కలు తనిఖీ చేయు చున్నప్పుడు, వారు అప్పుయిచ్చియుండిన మొత్తంమీద ఎంత వడ్డీవచ్చినదో తెలిసికొనటానికి ఆ దస్తావేజును చదువుచుండగా ఆయన కమ్మకులస్తుడని వుండినది. రంగారెడ్డిగారిని అడుగగా, ఇక్కడ కొందరు కమ్మవారు రెడ్డిపదాన్ని పేరు చివర వాడుచున్నా రని, దానికి కారణం గ్రామ మునిసిఫ్ హోదాను పొందియుండటం

వల్ల జరిగిందని చెప్పారు. నిజానికి రెడ్డి, రాజు, రావు, నాయుడు, చౌదరి, నాయక్, పటేలు మొదలైనవి పెత్తందారీ తనాన్ని. నాయకత్వాన్ని సూచిస్తాయి. ఆ ప్రాంతాల్లో గ్రామ మునిసిఫ్‌గాగాని, ఇంకొక విధంగాకాని పెత్తనంచేసిన కమ్మ వారుకూడా రెడ్డి అనే హోదాపేరుతో ఇప్పటికిని వ్యవహరించు చున్నారు.

ఈక్యాంపులో నేను ఒకపొరపాటు చేశానని తర్వాత తలంచాను. కులతత్వం ఆరోజుల్లో మిక్కిలి ఘాటుగానే వుండేది. పాశ్చాత్యదేశాల్లో విద్యాభ్యాసంచేసి విశాలహృదయుడనైనా నని అనుకొనుచున్నా, జాతీయభావం కలవాడనైనా సంపన్న మైనది, తన పరిధిలో అధికారం చెలాయించినది అయిన కుటుంబంలో పుట్టి వర్ధిల్లాను. అందువల్ల నాకు కూడా స్వకులాభి మానం జాస్తిగానే యుండేది. ఏ భావంతో అయినా, నేను మదనపల్లిలోని కొందరు కమ్మపెద్దలను భోజనానికి ఆహ్వా నించాను. ఒక గజెటెడ్ ఆఫీసరు, అందులో ఆదాయంపన్ను వేసే ఆఫీసరు, క్రొత్తగా పరిచయమైన తమను భోజనానికి పిల్చా డంటే వారు సహజంగా ఆశ్చర్యపడినా సంతోషంతో వచ్చారు. తాము తిరిగి విందు చేయకపోతే బాగుండదని, పదిమంది నన్నా హ్వానించి భోజనంపెట్టి గౌరవించారు. ఈ నా చర్య అనాలోచిత మనే నాకు తోస్తున్నది. ఎవరైనా ఆప్యాయంగా భోజనానికి పిలిస్తే అంగీకరించటం తప్పని ఎంచను. కాని, ఆఫీసరుగా క్యాంపుకువెళ్లి, క్యాంపులో ఇతరులను విందుకు పిలవటం తప్పే. నిజానికి వచ్చినవారు పెద్దరికమున్నా, ధనవంతులుకాదు. వ్యాపా రస్తులుకాదు. వారినుండి ఆదాయంపన్ను నష్టపడేది లేదు. ఈ కారణంవల్లకాబోలు ఆ క్యాంపులో నన్నెదిరించి, నామీద పిటీషన్లు పంపిన నా క్యాంపు క్లార్కు ఈ విషయాన్ని తన పిటీషన్లో చేర్చలేదు.

మదనపల్లిలో నాకు పరిచయమైనవారు కమ్మ కులస్తులు జి. పెద్దపరెడ్డి, రాటుకొండ వెంకటస్వామినాయుడు (సెకండ్ గ్రేడ్ ప్లీడరు), నాయుడుగారి కుటుంబీకులు (శ్రీ) సుబ్బానాయుడు

శ్రీ రామస్వామినాయుడు వగైరా, శ్రీ పెద్దపరెడ్డి తమ్ముడు శ్రీ చౌదరి మొదలైనవారు గాక, రెడ్డి కులస్థుడు శ్రీ సి. రామి రెడ్డి అనే వకీలుగారు. వీరు సరసులు, గౌరవనీయులు. తన పనేమో తాను చూచుకొనే పద్ధతి కలవారు. సమీపంలో తంబళ్లపల్లె అనే ప్రసిద్ధ గ్రామం ఉన్నది. ఆ గ్రామనివాసులు, అన్నదమ్ములు శ్రీ తంబళ్లపల్లి రామచంద్రారెడ్డి, శ్రీ రామ కృష్ణారెడ్డి (పుట్టు రెడ్లు) పెద్ద భూస్వాములు, పలుకుబడి గలవారు. రామచంద్రారెడ్డిగారు వ్యవసాయం వగైరా చూచుకొంటూ వుండేవారు. రామకృష్ణారెడ్డిగారు కొన్ని సంవత్సరాలపాటు కేంద్ర విధాన సభలో సభ్యులుగా ఉండేవారు. వీరికప్పుడు వైస్‌రాయ్‌గా వున్న లార్డ్ వెల్లింగ్‌డన్‌తో కొంత పరిచయమున్నట్లు వినికిడి. రామచంద్రారెడ్డిగారి ఆహ్వానంపై ఒక క్యాంపులో తంబళ్లపల్లెకు వారింటికి భోజనానికి వెళ్లాను. ఆ గృహం చిన్న కోటవంటిది. అందులో నన్ను ఎక్కువగా ఆకర్షించింది టిప్పుసుల్తాన్ బొమ్మ. అది చిన్నదైనా టిప్పుసుల్తాన్ స్పష్టంగా, గంభీరమూర్తితో గోచరించాడు. ఆ సుల్తానుకు ఈ కుటుంబీకులు పోలియాగార్ వలె వుండేవారట. సైనికులను, పదార్థాలను సరఫరా చేసేవారట.

మదనపల్లి వాతావరణం తక్కువ వేడి కలది. మొత్తం మీద, ముఖ్యంగా సెప్టెంబరు నుండి హాయిగా ఉంటుంది. పరిసర ప్రాంతాలు రమణీయం. దగ్గరలో క్షయనివారణ ఆస్పత్రి (శానిటోరియమ్) ఉన్నది. మరిన్ని ఋషివాలి అనే పిల్లల విద్యాబోధక సంస్థ వున్నది. నేను రెంటిని చూచి, ఆ సంస్థల సేవకు సంతోషించాను.

మదనపల్లి గాక వాయిలపాడు, పుంగనూరు, పలమనేరు, తిరుత్తణి, కుప్పం మొదలైన కొన్నిచోట్ల క్యాంపుచేశాను. నాకు ముందువున్న ఆఫీసరు శ్రీ భాష్యం అయ్యంగారు తాను వెళ్లిపోతూ వీలైనన్ని క్యాంపులు వేసుకొని ఉండటంవల్ల, నేను చిత్తూరులో వుండింది అక్టోబరువరకే అవటంవల్ల, కాళహస్తి వంటి

కొన్ని ముఖ్యప్రదేశాలకు వెళ్లలేకపోయాను. చిత్తూరు జిల్లా పుణ్యక్షేత్రాలకు ప్రసిద్ధికదా!

చిత్తూరు—మదనపల్లి రూటులో ప్రథమం పలమనేరు. తరువాత పుంగనూరు, వాయిలపాడు. తర్వాత మదనపల్లి వస్తుంది. ఈ రూటంతా సమశీతోష్ణ వాతావరణం కలది (టెంపరేట్ క్లైమేట్). కుప్పం కూడా ఇటువంటిదే. పలమనేరులో విశేషాలు గుర్తులేవు. పుంగనూరు, వాయిలపాడు, తిరుత్తణి క్యాంపులలో విశేషం సర్పదర్శనం. పుంగనూరు జమీందారీ గ్రామం. జమీందారులు పూర్వం రెడ్డి కులస్థులట. శైవమతం పుచ్చుకొన్నారట. నా క్యాంపు వూరికి మైలుదూరంలోవున్న రాణీగారి తోటలోనివారిభవనంలో. ఒకసాయంత్రం చీకటిపడినతర్వాత వాహ్యాళికని విశాలమైన ఆ తోటలో తిరుగ నారంభించాను. నలుముఖముల్లో వేయబడివున్న బాటల్లో తిరుగుచు, ఒకబాట వెంట వెళ్లుచుండగా త్రాచుపా మొకటి కన్పించింది. వెనుకకు తిరిగి ఇంకొక బాటన వెళ్లుచుండగా ఇంకొక త్రాచుపాము కన్పించింది. ఇంకొక బాటకు తిరగగా ఇంకొక త్రాచుపాము ఎదురైంది. ఇక లాభంలేదని బంగళాకు చేరుకున్నాను.

వాయిలపాడు క్యాంపుకు సాయంత్రం $4\frac{1}{2}$ గంటలకు చేరుకొన్నాను. నేను చెప్పులు రహదారి బంగళా గది ముందు విడిచి, లోపలికి వెళ్లి ఒకనిమిషం కలయజూచి బైటకు వచ్చుచుండగా నా చెప్పులు మీదుగా ఒక త్రాచుపాము ప్రాకి సమీపములోనున్న కంచెలోనికి పోసాగింది. బంట్రోతులను కేకలువేయగా, వారు వచ్చేలోపల కంచెలో దూరిపోయింది. ఇతరచోట్లవలె ఆ బంగళా కూడా ఊరి వెలుపల వున్నది. చుట్టూ ఏదో కంచెవున్నా, బహిరంగప్రదేశం వంటిదే.

తర్వాత తిరుత్తణిలో క్యాంపులో ఒకనాడు చీకటి పడే వరకు పనిచేసి, విసుగుచెందాను. కాళ్లబిగువు సడలించుకొనుటకు, స్వచ్ఛందవాయువును పీల్చుకొనుటకు కొంతసేపైన తర్వాత బయలుదేరి ఒక ఫర్లాంగుదూరం రోడ్డువెంట నడచిపోయాను. నాకు కొద్దిదూరంలో ఒక పెద్ద సర్పం ఎదురయింది.

వెన్నెల వచ్చియుండింది గాని, అంత స్ఫుటముగా ఏజాతి సర్పమో గుర్తు తెలియలేదు. నేను నిలబడి "నీవు వెళ్లిపో" అంటిని. అది జరాజరా ప్రాకి అవతల ప్రక్కకు వెళ్లిపోయింది.

త్రాచులను చూడటం నాకు పరిపాటైంది. బరంపురంలో నేను ఆఫీసరుగా వున్నప్పుడు, మే మున్న యింటి నానుకొని ధాన్యం కొట్లుండినవి. అవి రెండడుగులకు మించిన ఎత్తైన స్తంభములమీద బల్ల కూర్పుతో కట్టబడ్డవి. వానిక్రింద త్రాచు పాములు కాపురం పెట్టుకొన్నట్లున్నవి. నా ఉద్యోగం మొదటి కొన్ని సంవత్సరాలలో ఆచరించిన విధానం ప్రకారం, దీపావళి పండుగకు నా ఆఫీసు బంట్రోతులకు భోజనంపెట్టాను. వాళ్లు భోజనంచేయుచుండగా, ఒక త్రాచుపాము నెమ్మదిగా ప్రాకి, వాళ్లు భోజనంచేసే వరండాలోకి వచ్చింది. అది పక్కానికి వచ్చిన కూసంతో, కప్పను మ్రింగివుండినందున మందకొడిగా ప్రాకుచూ వచ్చింది. "దానిని చంపు"డని బంట్రోతులకు చెప్పగా, హిందూ బంట్రోతులు నాగుపామును చంపటం పాపమని తలంచారు. మహమ్మదీయ బంట్రోతుకు చెప్పగా అతను ప్రక్క నుండిన కర్రను తీసుకొని బిస్మిల్లా వగైరా అంటూ దాన్ని చంపివేశాడు. హిందూ బంట్రోతులు దానిని తీసుకొని వెళ్లి, దహనంచేశారు. మరునాడు పాలు తీసుకొని వెళ్లి చల్లారు. ఈ సంస్కారంవల్ల నాగుపామును చంపిన పాపం పోతుందట.

పుంగనూరు తోట బంగళాలో ఎవరో ఆత్మహత్య చేసుకొని దయ్యమైనారట. ఆ దయ్యం ఆ బంగళాలో కాపురం పెట్టిందట. కాని నన్నే దయ్యం బాధపెట్టలేదు. క్యాంపు విడిచికెట్టిన తరువాతకాని నా కాసంగతి తెలియలేదు. జవాన్లకు తెలిసి యుండినా నాకు చెప్పలేదు. తరువాత నేను కలగుండి కుప్పంలో క్యాంపుచేసినప్పుడు, కుప్పం ఔనుకు 1 మైలు దూరంలో వున్న కుప్పం రాజాగారి అందమైన భవంతిలో క్యాంపువేశాను. అది మూడంతస్తులమేడ. నేను ఆఫీసు క్రింద పెట్టుకొన్నా నా ఉనికి, పడక మొదటి అంతస్తులో. జవాన్లు నాతో నిజంచెప్పటానికి

భయపడి, "పైన వద్దండి. క్రింద మంచి గదులు చాలా వున్నవి కదా" అన్నారు. నేను కాదు కూడదని పైనే నిద్రించాను. ఆ మేడలో దయ్యం వున్నదని పుకారు. నా కెట్టి ఇబ్బందిగాని, నిద్రాభంగంకాని కలగలేదు. తోడు పడుకుంటామని చెప్పినా వద్దన్నాను. క్షేమముగానే ఇంటికి తిరిగి వెళ్లాను.

కలగుండి కుప్పం ఒక చిన్న పట్టణం వంటిది. ఇక్కడ చందనం కొయ్యనుండి చమురును తీసే ఫ్యాక్టరీలు రెండుండినవి. ఒక ఫ్యాక్టరీవారికి బట్టలనేయు కర్మాగారముకూడా ఉండింది. తమ వస్త్రాలనేగాక ఇతర వస్త్రాలను కూడ విక్రయించుశాలను కూడ నడుపుచుండినారు. నేను కుప్పం క్యాంపుకు వెళ్లినప్పుడు, ఆ రెండు ఫ్యాక్టరీలకు వెళ్లాను. పెద్ద ప్యాక్టరీవారు అర్పించిన చిన్న శాంపుల్ చందనం బుడ్డిని తిరస్కరించలేకపోయాను. నేను చిత్తూరునుండి బదిలీ అయి బరంపూర్‌కు వెళ్లినతరువాత, పెద్ద ఫ్యాక్టరీ తాలూకు యువకు డొకటి, రెండు చిన్న శాంపుల్ బుడ్లను, పోస్టులో పంపించాడు. దీనికి నేను ఆశ్చర్యపడ్డా, స్నేహపూర్వకంగా పంపించినాడని తలంచానుగాని అనుచిత మనుకోలేదు. అయితే తా నిట్లు బహూకరించానని, నాకు ఏదో లంచమిచ్చినట్లు ధ్వనించే స్వరంతో ఒక ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుకు చెప్పినాడని విని మిక్కిలి బాధపడ్డాను. శాంపుల్స్ ఉచితముగా వ్యాపారాభివృద్ధికి పంచిపెట్టబడేవి. కాని, విక్రయానికుద్దేశింపబడ్డవి కావు. ఇది సర్వసామాన్యధర్మం. తాను ఇంకొక ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుతో నే నిట్లిచ్చానని చెప్పటంలో ఉద్దేశ్యం ఆ ఆఫీసరును సుముఖునిగా చేసుకొనటానికేమో యని నాకు తోస్తున్నది. ఆ ఆఫీసరు తాను క్యాంపుకు వెళ్లినప్పుడు, ఆ క్యాంపులోనే బియ్యం, పప్పు మొదలైనవి సేకరించుకొనుచుండేవాడట. తాను అట్లు చేయుడని చెప్పకపోయినా, బంట్రోతులు ఉచితముగానే సేకరించేవారట. ఈ విషయం విని, నాకంటె జూనియర్ అయిన ఆ ఆఫీసరుతో "ఇట్లు చేయుట మంచిదికా"దని చెప్పాను. దానికి ప్రత్యుత్తరంగా వారు పైవిధముగా జవాబు చెప్పారు. ఉద్యోగధర్మ నిర్వహణం కత్తిమీద సాము వంటిది.

అందువలన నే నాదిలో అతి జాగ్రత్తగా వుండి చివరకు ఒక పండయినా స్వీకరించేవాడను కాదు. కొన్ని సంవత్సరాలు గడచిన తర్వాత, ఈ కఠిన దీక్షను క్రిస్‌మస్, నూతన వర్షం వంటి సందర్భాలలో కొంత మార్చుకొన్నాను.

ఈ సందర్భంలో బరంపురంలో జరిగిన విషయ మొకటి జ్ఞాపకానికి వస్తున్నది. దీపావళిపండుగను ముఖ్యాతిముఖ్యంగా ఎంచుకొని, పూజా పునస్కారాదులేగాక బంధు మిత్రులకు, పెద్దలకు మిఠాయిలను పంచిపెట్టే మార్వాడీలలో ఒకరు మాయింటి గృహాంగణం మొదటి దర్వాజవద్ద నిలబడి అక్కడవున్న జవానుతో, "ఈరోజు దీపావళికదా! గౌరవసూచకంగా, అయ్యగారికి కొంత మిఠాయి పట్టుకొని వచ్చాను" అని కబురు పంపాడు. నేను లోపలినుండి "వద్దు. తీసుకుపో" మ్మని జవానుతో చెప్పి పంపాను. "దీనిని తప్పుగా ఎంచుకోకూడదు. మా ఆచారప్రకారం పట్టణంలోని ఉద్యోగులందరికీ, జిల్లా కలెక్టరుగారితో సహా ఇస్తాము. వారు తీసుకుంటా"రని చెప్పాడని తిరిగి కబురు. "అయినాసరే, నేను తీసుకోను" అని ఖండితముగా చెప్పివేశాను. నేను చెప్పదలంచింది, కొంతమంది వర్తకులు తాము చేసిన లాంఛన పూర్వకమైన మర్యాదను లంచమిచ్చినట్లుగా చెప్పుకొని మోసముచేయ ప్రయత్నింతు రని.

తిరుత్తణి క్యాంపుకు వెళ్లియుండినప్పుడు, అక్కడ కొండమీదవున్న సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిని దర్శించాను. కొండ చిన్నది. దేవాలయం అంత పెద్దదికాదు. కాని స్వామి విగ్రహం అలంకరణంవల్ల, రాత్రి దీపకాంతుల్లో కాబోలు మిక్కిలి జాజ్వల్యమానంగా ఉండింది. అంత తేజోవంతమైన విగ్రహాన్ని నే నదివరకు చూచియుండలేదు. కొన్నిసంవత్సరాల తర్వాత, నేను మద్రాసులో అసిస్టెంటు కమిషనర్‌గా వున్నప్పుడు కంచిలో కామాక్షీఅమ్మవారి విగ్రహాన్ని చూచినప్పుడు అట్టి అనుభవమే కలిగింది. నేను తిరుపతి క్యాంపుకు వెళ్లుట, అక్కడ నుండి కొండకు వెళ్లి, శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనం చేసు

కొనటం పైన చెప్పే వున్నాను. శ్రీ వెంకటేశ్వరస్వామివారి విగ్రహం నిండుతనంతో, మహోత్తమ వేషధారణతో మిక్కిలి ఆకర్షణీయంగా ఉండును. కాని నా కెందువల్లనో, తిరుత్తణి సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి విగ్రహమువంటి దీప్తకాంతులు, తేజోవంతము నాకు గోచరించలేదు. అయితే శ్రీ వెంకటేశ్వర స్వామివారికి ప్రతి శుక్రవారం ఉదయం జరుగు అభిషేకం (సంప్రోక్షణ) లో ఒకసారి వారి నగ్నరూపాన్ని చూచాను. అది మిక్కిలి నైపుణ్యంతో, సరియైన అంగప్రమాణాలతో అందంగా చెక్కబడిన విగ్రహం. శిలా విగ్రహమైనా యోగి పుంగవులు, భాగవతోత్తములు, భక్తశ్రేష్ఠులు, మహాపండితులు తమ ఆత్మ, మనస్సు, బుద్ధిజనిత ప్రభావం, తేజస్సులతో విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ చేశారు. భక్తకోటులు తమ భక్త్యావేశం, సాంద్ర విశ్వాసం, పుణ్యపురుషులు తమ మనోబలం, ధ్యాన ఏకాగ్రత ఆ విగ్రహమందు కేంద్రీకరించి, చొప్పించి, మహిమాసమన్విత దేవునిగా చేశారు. అందువల్లనే భక్తులులేనిచోట భగవంతుడు లేడందురు. భగవంతుడు తన భక్తుల కధీను డందురు.

వాయిలపాడు క్యాంపులో శ్రీ సి. కృష్ణారెడ్డి అను వారి పరిచయం కలిగింది. కృష్ణారెడ్డిగారు మాటచెలాయింపుగల ప్రముఖుడు. ఐ. సి. యస్. ఆఫీసరుగా, జయపూర్ దివానుగా, మైసూరు మంత్రివర్గములో ఒకరుగా, మద్రాసు గవర్నమెంటు హోం సెక్రటరీగా, ఆంధ్ర గవర్నమెంటు చీఫ్ సెక్రటరీగా, కేంద్ర రక్షణశాఖ సెక్రటరీగా పనిచేసి, ఈమధ్య వరకు ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయాధిపతిగా వుండిన శ్రీ ఒ. పుల్లారెడ్డిగారు వాయిలపాడు సమీపానగల ఒక కుగ్రామంలో, ఒక సామాన్యకుటుంబములో జన్మించినారట. చిన్నప్పటినుండి విద్యాభిలాషకలవాడై, కష్టపడి చదువుకొనేవాడట. ఉత్తమ విద్యను మద్రాసు క్రిస్టియన్ కాలేజిలో పూర్తిచేసి, ఇండియాలో అప్పుడు జరుపబడే ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షలో నెగ్గి, ఇంగ్లండులో తర్ఫీదుపొందినారు. సంపన్నకుటుంబములో పుట్టి, పెద్దల సహాయ సంపత్తితో పైకివచ్చుటకంటె, సామాన్య కుటుంబములో పుట్టి, శ్రమించి తన స్వంత కాళ్లమీద నిలబడి

అభివృద్ధిలోకి రావటం మిక్కిలి విశేషంకదా! వాయిలపాడు క్యాంపులో కృష్ణారెడ్డిగారు నాతో పుల్లారెడ్డిగారి విషయం తెచ్చి, మిక్కిలి సంతోషించి, గర్వముతో "మావాడే" అని చెప్పారు.

చిత్తూరు పట్టణంలో మిక్కిలి ప్రముఖ న్యాయవాదు లుండేవారు. శ్రీ పి. పార్థసారథి అయ్యంగార్, సి. కె. కృష్ణ అయ్యర్ గారు, యన్. కె. వరదాచారిగారు, శ్రీ సి. దొరస్వామి అయ్యంగారు మొదలైనవారు. కొన్ని విషయాల్లో శ్రీ దొరస్వామి అయ్యంగారిది పైచేయి. వా రప్పుడు ఢిల్లీలోని కేంద్ర విధాన సభలో సభ్యుడుగా వుండినారు. వారికి పన్ను విధింపుకు వారి లెక్కలు తనిఖీ చేయునప్పుడు కొన్ని అవకతవకలు కనబడినవి. ఆ లెక్కలు తీసుకొనివచ్చిన వారి గుమాస్తాతో ఈవిషయం చెప్పి, "వారి నొకసారి రమ్మని చెప్పండి" అని చెప్పాను. శ్రీ దొరస్వామి అయ్యంగార్ వచ్చి పొరపాటు జరిగినదని ఒప్పుకొన్నారు. ఇన్‌కమ్‌టాక్స్ విషయాలు వారికి తెలియవని తెలుసుకొని, ఆశ్చర్యపడ్డాను. "మీరు గొప్ప న్యాయవాదులు, రాజకీయ దురంధరులుకదా, మీరు ఈ విషయంలో కూడా శ్రద్ధతీసుకోండి" అని మందలించినట్లు అంటిని. వారు కించిత్తైన చలించక, చిరునవ్వు నవ్వి, తలయూపి పనిపూర్తి చేయించుకొని వెళ్ళిపోయారు.

చిత్తూరులో నా కొక అనుభవం గుర్తుకువస్తున్నది. గవర్నరు స్టాన్లేగారు తమ పర్యటనమీద చిత్తూరుకు వచ్చారు. వారి గౌరవార్థం బంగారుపాళయమ్ జమీందారుగారు కలెక్టరుగారి భవన ప్రాంగణంలో తేనీరు విందు చేశారు. ఆవిందుకు హాజరై అటు యిటు తిరుగుచున్నప్పుడు, ఒకచోట ఒక యువకుని కలసికొనుట తటస్థించింది. అతనితో ఏదో మాట్లాడి, "మీరు ఏ కాలేజిలో చదువుచున్నా"రని అడిగాను. ఆయన చిరునవ్వునవ్వి, "నే నిక్కడి సబ్ కలెక్టరును" అన్నాడు. నే నాశ్చర్యపడ్డాను. వారు వి. వి. సుబ్రహ్మణ్యం అనే ఐ. సి. యస్ ఆఫీసరు. అరవవారు. చిన్నగా, బక్కగా కుర్రవానివలె ఉండినారు. నిజానికి చిన్న

వయస్సే గాని, నే ననుకొన్నంత పిన్నవాడు కాదు. తరువాత వారిని వేరేచోట్ల మద్రాసులో, రెండు మూడుసార్లు కలసికొనటం తటస్థించింది. స్నేహపూర్వకముగా మాట్లాడుకొనేవారము. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, ఐ. సి. యస్. ఆఫీసర్లకిచ్చిన వీలు నుపయోగించుకొని ఇంకను పిన్నవయస్సులోనే రిటైరయ్యారు.

నే నక్కడున్నప్పుడు ఇంకొక సన్నివేశం జరిగింది. మేధావంతుడును, ప్రజ్ఞావంతుడును, శాస్త్రవిశారదుడును, వక్తయు, కవియు, ముసలమ్మ మరణం మొదలైన గ్రంథాలను, కవిత్వతత్త్వ విచారమనే మహోత్కృష్ట మౌలిక కవితా విమర్శన గ్రంథమును, అర్థశాస్త్రమును రచించిన మనీషియు, ఆంధ్ర విశ్వవిద్యాలయము మును పుట్టిన నాటినుండి పసిపిల్లను సాకినట్లు అతి జాగ్రత్తతో, మెలుకువతో సాకి, సర్వ సుగుణ సౌందర్యరాశియగు యువతిని చేసిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ఆదరణకు పాత్రుడనైనాను. నేను ఇంగ్లండునుంచి వచ్చిన క్రొత్తలో ఆంధ్ర విశ్వవిద్యాలయ అధినేతగా విజయవాడలో వా రుండినప్పుడు, ఒకసారి వారిని దర్శించి కొన్ని నిమిషాలు వారితో గడిపి యుంటిని. వారు బెజవాడలో వుండినప్పుడు బెజవాడ ఎండలను చూచి, "ఇది బెజవాడ కాదు, బ్లేజ్ వాడ" అనిరట. అట్టి మౌలిక ప్రవచనాలను సృష్టించుట వారికి వెన్నతోబెట్టిన విద్య. నేను వారిని 1932 లో చూచినప్పుడు విశ్రాంతిగా వుండి, చిత్తూరు కనతిదూరం తమ స్వగ్రామము మగు కట్టమంచి సమీపములో తమ సుందరభవనంలో నివసిస్తూండినారు. రసాస్వాదితులును, సౌందర్యోపాసకులు నగు శ్రీ రెడ్డిగారి భవనం, దానిని పరివేష్టించిన పూలవనమును చూచి ఆనందించాను. వారు నాతో కొంతసేపు ఆ యా విషయాలు మాట్లాడి, "మీరు పార్శ్వ తేయులగు (దక్కన్ ప్లేటో) కవులనుగురించి ఎందుకు పరిశోధనలు చేయకూడదు?" అని ప్రోత్సాహ వాక్యాలు పలికారు. తరువాత తేనీరు, బిస్కట్టులు మొదలైన వానితో ఆతిథ్యమిచ్చి సాగనంపారు. చిత్తూరులో నున్నప్పుడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి తమ్ముడు వీరరాఘవరెడ్డి

(ఆయన నెల్లప్పుడు పిత్ లేక సన్ టోపీ ధరించేవారు. అందువల్ల టోపీరెడ్డి అనేవారు) గారు, వారి జ్ఞాతులు సుబ్బారెడ్డి, శంకర రెడ్డి, కృష్ణారెడ్డి అన్నదమ్ములు పరిచయులైనారు. శ్రీ రామ లింగారెడ్డిగారి పెదతండ్రి మనుమడు ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరుగా ప్రవేశించి ఉన్నతపదవుల నందుకొన్న రామలింగారెడ్డిగారి తండ్రిగారిని చూచి వారింటికి వెళ్ళివచ్చాను. టోపీరెడ్డిగా రప్పు డప్పుడు మాయింటికి వచ్చి క్షేమ సమాచారాలు తెలుసుకొని వెళ్ళుచుండేవారు. సుబ్బారెడ్డిగారు ఇంకా కొంచెం దగ్గరగా వచ్చారు. వారు కట్టమంచి నానుకొనియున్న తమ మామిడి తోటలో నివసిస్తూండేవారు. వారు భోజనప్రియులు. పులావ్ వంటి వంటకాలలో బాగా తెలిసినవారు. వారు నన్ను పులావ్ భోజనానికి పిల్చేవారు. మా వంటవాడు రామన్ నాయరు పులావ్ బాగా చేసేవాడు. నేను సుబ్బారెడ్డిగారికి బదులు పులావ్ భోజన మర్యాద చేసేవాడను. ఈ మర్యాదలలో టోపీరెడ్డిగా రుండినట్లు గుర్తులేదు. కాని, సుబ్బారెడ్డిగారి తమ్ములు శంకరరెడ్డి, కృష్ణారెడ్డిగార్లు వగైరా ఉండేవారు. సుబ్బారెడ్డిగారు మిక్కిలి సరసులు. వారి తమ్ములు కూడా స్నేహశీలురు. వీరు ప్రఖ్యాత కోళందరెడ్డిగారి అనుజులు. కోళందరెడ్డిగారు పోలీసు ఇన్‌స్పెక్టరుగా ఉద్యోగం చేస్తున్నప్పుడు, ఆయనున్నచోటికి క్యాంపుకు వచ్చిన ఆయన పై ఉద్యోగి శ్వేతజాతీయుడు అవమానకరంగా ప్రవర్తించగా ఎదురుతిరిగి నిరసించి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, ఫస్టుగ్రేడ్ ప్లీడరుపరీక్ష ప్యాసై క్రిమినల్ లాయర్‌గా రాణించి, కొంత కాలానికి గుడివాడ తాలూకా కౌతరంలో తన ప్రోత్సాహంవల్ల స్థాపించబడిన రైసుమిల్లును తన అజమాయిషీక్రింద నడిపించి, ఆ గ్రామములో హైస్కూలు వగైరా విద్యాసంస్థల ఏర్పాటుకు తోడుపడిన ఘనుడు. ఆయన మిక్కిలి బలశాలి. స్నానం చేయు నప్పుడు నిండు కడవల రెంటిని రెండు చేతులతో యెత్తి తలమీద పోసుకొనేవారట. మిక్కిలి స్ఫురద్రూపి. గంభీర వదనంతో, విశాల ఫాలంతో, చక్కని మీసకట్టుతో తేజోవంతంగా శాండో వలె నుండేవారు. తన కుమార్తెలను మునగాల జమీందారుగారి కుమాళ్ళ కిచ్చి వారి వియ్యంకులైనారు.

అక్కడ డింకోకరితో పరిచయమైనది. వారు బలిజకులస్థుడ నని చెప్పుకొన్న పి. పి. హేరాంబగారు. వీరు మద్రాసు గవర్నమెంటు స్కాలరుగా మెటలర్జీని వేల్సులోని కాన్‌బోరన్ స్కూల్ ఆఫ్ మైన్స్‌లో తర్ఫీదు నొంది వచ్చారు. కట్టమంచిలో ఉంటూ ఉండేవారు. ఉద్యోగంకొరకు ప్రయత్నించుచున్నానని, మనకు వైస్‌రాయ్‌గానుండిన లార్డు వెల్లింగ్‌డన్, ఆయన సతీమణి తనకు పరిచయులని, ఒకసారి వారి రాజభవనంలో రెండు మూడు రోజులు గడిపానని, వారి సాయంకొరకెదురు చూచుచున్నానని చెప్పేవాడు. నిజ మెంతవరకో ? గవర్నమెంటువారి వేగువాడు (రహస్య ఏజంటు) కాదుగదా అని తర్వాత అనుకొంటిని.

చిత్తూరు పట్టణంలో కాపురమున్న కమ్మవారు చాలా కొద్ది మంది. నలగాంపల్లె పాపుదేశు వెంకటస్వామినాయుడుగారి కుటుంబంతప్ప నే నప్పు డెరిగిన కమ్మవారు మా బాబుకు ప్రైవేటు చెప్పే రంగయ్యనాయుడుగారొక్కడే. వా రప్పటి కింకను పిన్నవయస్సువారే. సాధు స్వభావం, కలుపుగోలుతనం, చిరునవ్వుతో మాట్లాడే స్వభావం, స్వజనాభిమానంగల పెద్దమనిషి. శ్రద్ధగా చదువుచెప్పే అధ్యాపకులు. తరువాత వారి నెక్కడో ఒకసారి కలుసుకొనగా ఎంతో సంతోషించి, ఆదరించారు.

ఇం కొకటి, రెండు చిన్నవిషయాలు చెప్పదలచుకున్నాను. కమిషనర్ సెనెక్‌గారు నా ఆఫీసు తనిఖీకి వచ్చినప్పుడు వారికి బస రహదారి బంగళాలో ఏర్పాటుచేశాను. ఆ బంగళా ముఖం ఆవరణగేటు కటు తిరిగి వున్నది. నేను వారిని బంగళాలోనికి తీసుకొనివెళ్లినప్పుడు ఎదురుగావున్న ప్రదేశానికి వారు దారి తీశారు. అది వెనుకప్రక్క భాగం. ముందుకు సాగి "ఇదేమి "ట న్నారు చిరాకుగా. "ఇటు దయచేయం" డని ముఖద్వారానికి తీసుకొనివెళ్లాను. లోపల, ఒక వైశ్య ధనికుని నుండి అరువు తెచ్చిన చక్కని రత్నకంబళి వగైరాలతో నలంకరింపబడి శోభాయమానంగా నుండిన గదిని చూచిన మీదట వారి చిరాకు పోయింది. వారికి ఆవరణగేటు దగ్గరనో, గది ముఖద్వారము వద్దనో ఒక పూలతోట యజమాని నుండి ప్రత్యేకశ్రద్ధతో

తయారుచేయించబడిన పెద్ద తాజా గులాబి దండను వారి యిష్టా యిష్టములను గమనించక వారి మెడలో వేశాను. వారు సంతసించియేయుందురుగాని పైకి కనబడనిచ్చే స్వభావంకలవారు కాదు.

వారప్పటి తనిఖీ నా భవిష్యత్తును నిర్ణయించేది. తనిఖీ అయినతర్వాత కేసులమీద వ్యాఖ్య గాక ఆఫీసరు చౌదరి సమర్థుడని వ్రాశారు. ఇక పదవి వెంటనే ఖాయమవుతుందని వచ్చి చెప్పి, కమిషనర్‌గారితో వచ్చిన దఫేదారు ఎక్కువ బహుమానాన్ని గుంజుకుపోయాడు.

పూలదండలు విషయంలో—స్వాగతం దండ శుభమట. బదిలీమీద వెళ్లేటప్పుడు వేసిన దండ శుభమే. కాని ఆఫీసరు క్యాంపుకు వచ్చి తిరిగి వెళ్లేటప్పుడువేస్తే అది అశుభమట. ఇక వారికి గుడ్‌బై (సెలవు పుచ్చుకోవటం) చెప్పినట్లేనట. ఇది నాకు తెలియక, మాకు అసిస్టెంటు కమిషనర్‌గా వచ్చిన శ్రీ శౌరినాథపిళ్లేగారికి వెళ్లేటప్పుడు దండ వేయబోతే వద్దని అడ్డగింపబోయారు. అయినా ఆ పెద్ద తాజా దండను బలవంతంగాఅన్నట్లు వారి మెడలో వేశాను. తర్వాత కొద్దికాలానికే వారి జ్యూరిస్‌డిక్షన్‌నుండి చిత్తూరు సర్కిల్ మార్చబడింది.

శ్రీ శౌరినాథపిళ్లేగారితో సంప్రదించటానికి కోయంబత్తూరు వెళ్లి వారింటికి వెళ్లాను. వారితో మాట్లాడుచుండగా, "చౌదరీ, ఇటు ప్రక్క కూర్చోం"డని ద్వార ముఖానికి నా వెన్ను వుండునట్లు కుర్చీని నిర్దేశించారు. కారణం వారి భార్య, కూతుళ్లు బైటికి వెళ్లుచున్నారట. నేను వారిని చూడకుండా ఉండాలని వారి అభిప్రాయం. ఇంగ్లండులో చదువుకొని వచ్చినవారు పోకిరీలుగా వుంటారనే భావం వారికి కూడా వుండిందనుకోవాలి. మర్యాద, మన్ననల నధికంగా చేసేవారేకాని, ప్రాతకాలం మనిషి కాబట్టి ఇట్టి అనుమానాలు జాస్తిగానే ఉండిన వనుకొందును.

చిత్తూరు సర్కిల్ విషయాలు ముగించే ముందు ఆఫీసు ఉద్యోగులను గురించి ప్రస్తావించటం అసమంజసంకాదు. నేను

వెళ్లినప్పుడు ఇన్‌స్పెక్టరు (అసిస్టెంటు ఆఫీసరు) లేడు. కొంత కాలానికి మద్రాసునుండి పద్మనాభనాయుడు అనే వారిని పంపారు. నన్నేదో తీసివేస్తారని, నా స్థానాన్ని తనకిస్తారని ఎవరో మద్రాసులో ఆయనకు చెప్పారట. అందువల్ల వచ్చీరావటంతోనే తానే ఆఫీసరయినట్లు ప్రవర్తించాడట. గుమాస్తాలను, టైపిస్టును పిలిచి దబాయింపు మొదలుపెట్టాడట. ఆయన వచ్చినప్పుడు నేను క్యాంపులో వుంటిని. నేను తిరిగి రాగానే, ఆయన అదురుపాటును టైపిస్టు వగైరా చెప్పారు. మరునాడుదయం నే నాఫీసుకు వెళ్లిన కొలది నిమిషాల కాయన టకటకమనే బూట్సుచప్పుడుతో దర్జాగా నా గదిలోకి వచ్చి, కుర్చీ లాక్కొని నా ఎదురుగుండా కూర్చొన్నాడు. నేను ఎగాదిగా చూచి, "లేచి నుంచో. మీ రెవరనుకొనుచున్నారు? మీరు నా క్రిందివారు. నా పర్మిషన్ లేనిదే కూర్చోకూడదు. ఆమాత్రం తెలియదా?" అని మందలించాను. చప్పున లేచి ఏదో మాట్లాడి, లోపలికి వెళ్లిపోయాడు. నన్నేదో తొలగించి, తానే ఆఫీసరు నవుతానన్న దురాశతో వచ్చిన శ్రీ పద్మనాభనాయుడు పట్టుమని పదినెల్లైనా డిపార్టుమెంటులో వుండలేదు. పని వదులుకొని ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీసు పెట్టుకొన్నాడట ఇది నేను చిత్తూరు విడిచిన కొద్దికాలానికే. తరువాత మిక్కిలి పిన్నవయస్సులోనే మృతిచెందాడని విన్నాను.

ఆఫీసు హెడ్ క్లార్కు కె. పి. రంగాచార్యులు తెలివితేటలు కలవాడే, కొంతవరకు కార్యదక్షుడే. కాని నక్కజిత్తులమారి, నాకు అనుకూలంగానే ఉండేవాడు. సమయోచితంగా నడచుకొనేవాడు. కమిషనర్ సెనెక్ గారు నాపని తనిఖీకి వచ్చి, గుమాస్తాలు పనిచేసే హాలులోకి వెళ్లారు. కోటు, తలపాగాతో దర్జాగావున్న శ్రీ రంగాచారిని "మీ పేరేమి?"టని అడిగినారట. తత్తరబడి కాబోలు "మిస్టర్ రంగాచారి" అన్నాడు. కమిషనర్ గారు తనకు తానే మిస్టర్ అన్నాడని కాబోలు కనుబొమలు పైకెత్తి, హో అన్నారు. ఎర్రగా, పొట్టిగా, లావుగా వుండేవాడు.

హెడ్ క్లార్కు తర్వాత పర్సనల్ క్లార్కు ముఖ్యం. స్వామినాథ అయ్యరు సంగతి పైన చెప్పాను. అతడు డిస్మిస్ అయిన తర్వాత యమ్. యస్. కృష్ణమాచారి అనే యువకుడు క్రొత్తగా వచ్చాడు. బక్కపల్చగా, మధ్యరకం ఎత్తులో పచ్చగా, అందంగా వుండేవాడు. అలంకరణాభిలాషి. అత డేదో పనిమీద నాతో మాట్లాడటానికి నా బంగళాకు రాగా, అక్కడున్న బంధువులు అతని వేషం చూచి చకితులైనారు ఆయన ఆఫీసరుగా కాంచీపురంలోనో, కడలూరులోనో వున్నప్పుడు నేను అప్పీల్సు విసే అసిస్టెంటు కమిషనర్‌గా వెళ్లటం తటస్థించింది. మద్రాసులో కూడ ఆఫీసరుగా ఉండినాడు నాడీ గ్రంథంనుండి నా జాతకం అరవంలోవ్రాయించి, దాని కింగ్లీషు అనువాదంకూడా కావించాడు. నెమ్మదిగా, వినయ విధేయతలతో నడచే వ్యక్తి. స్నేహభావంకూడా కలిగియుండేవా డనుకుంటాను. మద్రాసు ప్రభుత్వం సెక్రటేరియట్‌లో పనిచేసి, తర్వాత ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటుకు మారి, నేను 1929లో డిపార్టుమెంటు ఉద్యోగానికి ప్రయత్నించు సమయంలో మద్రాసులో ఆఫీసరుగావుంటూ, తరువాత కమిషనర్‌గా అంతకంటె పెద్ద హోదాలో పనిజేసిన శ్రీ ఆర్. వరదాచారిగారికి కృష్ణమాచారి బావమరది. శ్రీ వెలగపూడి రామకృష్ణగారు నాకు ఉత్తరం ఇచ్చి, మొదట వరదాచారి వద్దకు పంపారు. అందువల్ల డిపార్టుమెంటులో చేరకముందే వారిని కలసికొన్నాను. తరువాత వారిని దర్శించు భాగ్యం కలగలేదు. వారు చాలా స్నేహభావంగా మాట్లాడినట్లు గుర్తు.

ఇప్పటివలె అప్పుడు అప్పర్ డివిజన్, లోయర్ డివిజన్ తరగతులు లేవు. అందరిని రొటీన్ క్లార్కులు అనేవారు. రొటీన్ క్లార్కులలో రుద్ర కుమారస్వామిపిళ్లైను గురించి ఇదివరకే చెప్పాను. కడమ గుమాస్తాల సంగతి గుర్తులేదు. టైపిస్టు షేక్‌దావూదు. ఈయన నాతో మిక్కిలి అనుకూలంగా ఉండేవాడు. తెలివితేటలు సామాన్యంకాని, కొంతవరకైనా భక్తి విశ్వాసాలుండేవి. తరువాత హెడ్ క్లార్కువరకు పైకెక్కాడు.

స్వామినాధ అయ్యరు నా తగాదాలో, నన్ను పూర్తిగా సమర్థించి, నాకు మద్దతు ఇచ్చాడు.

జవాన్లు అనుకూలురే. ముగ్గురు హిందువులు, ఒకరు మహమ్మదీయుడు. నారాయణస్వామి, నారాయణ, గోవింద రాజులు. మహమ్మదీయుని పేరు గుర్తుకు రావటంలేదు. వీరాస్వామి అనే మషాల్చి వుండేవాడు. ఇతడు మిక్కిలి తెలివితేటలు కలవాడు కాని, వట్టి ఖిలాడి. నారాయణకూడా కపట మనిషే. మహమ్మదీయ జవాను ఎక్కువ అంటకాగి వుండేవాడు.

ఇక నే నుండిన బంగళానుగురించి. కానర్ అనే ఆంగ్లో ఇండియన్ పలమనేరు—పుంగనూరు—మదనపల్లి రోడ్డుమీద ఒక చిన్న బంగళా, దాని కట్టుప్రక్క లోపలిగా కొంతదూరంలో ఇంకొక పెద్ద బంగళా కట్టించియున్నాడు. పెద్ద బంగళాలో జిల్లా జడ్జి వుండేవారు. రోడ్డుమీద వున్న బంగళాలో నే నుండే వాడను. నే నుండిన బంగళాను 'కానర్' బంగళా అనేవారు. వేసవిలో, ఒకనాటి మధ్యాహ్నం నే నాఫీసులో నుండగా నా భార్య విశ్రమించుచుండినది. ఒకడు ఇంట్లోకి వచ్చి, అక్కడున్న వెండి పళ్లాల్ని తన చొక్కాలోపల దాచి వెళ్లుచుండినాడట. అత డెంత నెమ్మదిగా నడచినా 3, 4 పళ్లాలు కాబట్టి ధ్వని అయిందట. నాభార్యకు మెలకువ వచ్చి వాని నడ్డగించి, తొడుక్కున్న చొక్కాను ఊడదీయించగా, పళ్లాలు బైట పడ్డాయట. వానిని తిట్టి పంపించివేసిందట. మామూలుగా వుండే జవాను ఎక్కడికో పోయి యుండినాడట. సాయానికి మగవా డెవ్వడు లేకపోయినా, ఆ దొంగ మగవానిని ధైర్యంగా ఎదిరించకపోతే ఆ సొమ్ము పోయేది. ఆ బంగళా ఊరికి దూరం. దాని కొకప్రక్క కొబ్బరితోట, వెనుకప్రక్క తుప్పలు. ఈత లక్క డక్కడుండిన మైదానం.

రెండోది. రాత్రి వర్షం కురిసిన మరునా డుదయం, నేను స్నానాలగదిలోకి వెళ్లి వెనుక తలుపు తీయగా మెట్లమీద గొంగళి పురుగుల్లాగ మండ్రగబ్బలు ఒకదానినొకటి వారుసుకొని

చిక్కగా పడివున్నాయి. జవానును, వంటవానిని పిలిచి వానిని చంపించాను. అన్ని మండ్రగబ్బలను ఒకేచోట చూడటం అదే మొదటిసారి, చివరిసారి కూడా. మేమక్కడ సంవత్సరందాటి వున్నా ఏనాడూ చివరకు తేలుకూడా కుట్టలేదు. ఇంట్లోకి ఏ మండ్రగబ్బ వచ్చినట్లు గుర్తులేదు.

నేను బరంపురం బయలుదేరే రోజు వచ్చింది. మా బాబు పూర్ణచంద్రరావును శ్రీ వెంకటస్వామినాయుడుగారికి, వాని క్లాసు ప్రైవేటు టీచరు శ్రీ రంగయ్యనాయుడుగారికి వప్పగించి, శ్రీ నాయుడుగారినుండి, వారి కుటుంబమునుండి, వారి ఉపపత్ని అచ్చమ్మనుండి సెలవు తీసుకొని వారి పూజాగృహంలోకి వెళ్లి దేవుళ్లకు మొక్కేటప్పుడు నాకు ఆపరాని దుఃఖం వెల్లుబికి వచ్చింది. కుర్రవానిని విడిచి వెళ్లవలసివచ్చిందని, మధ్యలో స్వల్పకాలం తరువాత బదిలీ అయిందని, పైగా పదవి ఖాయం మాట వినకుండా వెళ్లవలసి వచ్చిందని మనస్సు కల్లోలమైంది. అది పైకెగతన్నింది. శ్రీ నాయుడుగారు నన్ను కౌగలించుకొని ఓదార్చారు. వారు తండ్రివలె నన్ను బుజ్జగించారు.

ఒక చోటు నుండి మరొక చోటుకు బదిలీ అయినప్పుడు, క్రొత్తప్రదేశం దూరాన్నిబట్టి వారం రోజులకు తక్కువ కాకుండా వ్యవధి వుండును. అందువలన నేను స్వగ్రామం చేరుకొని నా భార్యనక్కడ విడిచి, వంటమనిషి రామన్ నాయర్‌తో, వంటసామానుతో బైలుదేరాను. బరంపురానికి 1932 అక్టోబరు 30-వ తారీఖు రాత్రికి చేరుకొన్నాను. స్టేషనులో ఆఫీసు సిబ్బంది, ఎరిగియుండిన ఆడిటర్ ఉన్నవ అప్పారావుగారు, నాకు స్వాగత మిచ్చారు. కలకత్తా ఆఫీసులో తన భాగస్థుడు శ్రీ పాగ (వేణు గోపాలని గుర్తు) గారిని శ్రీ అప్పారావు పరిచయ పరచాడు. నాకు ఛార్జి వప్పగించవలసిన శ్రీ తురగా రామచంద్రరావు నన్ను స్టేషనులో కలసికొనలేదు. ఆఫీసు వారి నుండి. నాకింకా నివాసగృహం ఏర్పాటు కాలేదని, ప్రస్తుతానికి ఆఫీసు నానుకొనియున్న ఒక భాగంలో నే నుండటానికి



చిత్తూరు సర్కిల్ - వీడ్కోలు — కూర్చున్నవారు: 1. శ్రీ యం. యస్. కృష్ణమాచారి, 2. శ్రీ కె. పి. రంగాచారి, 3. గ్రంథకర్త, 4. శ్రీ జి. వెంకటస్వామినాయుడు, 5. శ్రీ పద్మనాభరావు

నిలుచున్నవారు: ( రెండవ పంక్తి ) 1. గోవిందరాజులు, 2. వీరాస్వామి, 3. మహమ్మదీయ జవాను, 4. బాలాజీరావు, 5. నారాయణస్వామి



చిత్తూరు శ్రీ పాపుదేశు వెంకటస్వామినాయుడుగారి కుటుంబంతో — కూర్చున్నవారు : 1. శ్రీ గుజ్జుం వెంకటప్పనాయుడు, 2. శ్రీమతి వెంకటస్వామినాయుడు, 3. గ్రంథకర్త, 4. శ్రీ పాపుదేశు వెంకటస్వామినాయుడుగారు, 5. బాబు అనే పూర్ణచంద్రరావు, 6. శ్రీమతి గుజ్జుం అమ్మణియమ్మ — నిలుచున్నవారు : 1. యస్. పి. చంగల్‌రాయనాయుడు, 2. శ్రీ రామయ్య, 3. శ్రీ పి. వెంకట కృష్ణయ్య, 5. శ్రీ జగన్నాథరావు, 6. శ్రీమతి అచ్చమ్మ

ఏర్పాటు చేయబడ్డదని తెలిసింది. గుర్రంబండ్లలో ఆచోటికి చేరి విశ్రమించాను.

మరునా డుదయం టపాలో, నన్ను ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా, 5-4-1932 నుండి ఖాయంచేసినట్లు కమిషనర్‌గారి నుండి ఆర్డరు వచ్చింది. తరువాత రామచంద్రరావుగారినుండి ఛార్జి తీసుకొన్నాను. కాబట్టి నా బరంపురం సర్కిల్ ఆఫీసరు ఉద్యోగం 1932 సంవత్సరం అక్టోబరు 31-వ తారీఖున ప్రారంభమైంది. ఈ ఉద్యోగాన్ని 1936 మార్చి 31 వరకు నిర్వహించాను.

బరంపురం సర్కిల్ పెద్దవానిలో నొకటిగా ఎంచవచ్చును. పన్నువేయవలసిన కేసులు 1300 తక్కువ కాకుండా ఉండినవి. కాని, చాలావరకు వడ్డీవ్యాపారస్తులవి, చిన్నచిన్న వర్తకులవి. ఆస్కా పంచదారమిల్లు, పర్లాకిమిడిరాజావారి కేసులవంటి పెద్దకేసులు స్వల్పము. అయితే, కేసులు క్లిష్టమైనవి కాదు గాని, పన్నుదారులలో చాలామంది పితలాటం పెట్టేవారు. సాఫీగా లెక్కలు చెప్పేవారు కాదు. సాధ్యమైనంతవరకు మోసగించి పన్ను ఎగకొట్టాలని ప్రయత్నించేవారే. ఈ దుర్బుద్ధి కాకుండా, ఆడిటర్ల దురాశవల్ల కాబోలు, సంవత్సరానికి 450 కేసులు అప్పీలుకు వెళ్లేవి. ఆడిటర్లు పన్నువిచారణకు, అప్పీలుకు ఏక కాలమందే ఫీజు మాట్లాడుకొనేవారట. ఎక్కువభాగం చిన్న కేసులుగల ఈ సర్కిల్‌నుండి ఇన్ని అప్పీళ్లు దాఖలుకావటం ఆశ్చర్యకరమైనవిషయం. ఈ ఆశ్చర్యాన్ని కమిషనర్ సెనెక్ గారు నాకు వ్రాసిన ఉత్తరంలో కన్పరచి, కారణ మేమిటో తెలుసుకొండని వ్రాశారు.

లెక్కలలో నేను నిపుణుడనుకాను. స్కూల్ ఫైనల్ పరీక్షలో నాకు 35 మార్కులు మాత్రమే వచ్చాయి. దీనికితోడు నాపని ఆలస్యం. పైగా, ప్రతి చిన్నవిషయాన్ని స్తనశల్యపరీక్ష చేసే బుద్ధివుండింది. దీనికితోడు ఆఫీసు పనిని ఉదయం ఆలస్యముగా మొదలుపెట్టేవాడను. అందువలన మిక్కిలి శ్రమించి రాత్రి 7, 8 గంటలు అయ్యేవరకు పనిచేస్తూనే వుండేవాడను. ఇప్పటివలె గాక, అప్పటి గుమాస్తాలు ఆఫీసరుగారు తనస్థానంనుండి లేచిన

గాని వారు తమ పనిని చాలించేవారుకాదు. పనిని చేసినా, చేయకపోయినా తమ స్థానములలోనే వుండిపోయేవారు. కొంత కాలానికి ఆఫీసు నానుకొనియున్న ఇంటిని విడిచిపెట్టి ఒకమైలు దూరములోవున్న కోర్టుపేటలో చేరాను. అప్పటినుండి ఉదయం ఆఫీసుకు జట్కాలోవెళ్లి సాయంత్రమో, రాత్రో నడచి వచ్చి యింటికి చేరేవాడను. చీకటైతే బంట్రోతు హరికేన్ లాంతరుతో ముందు నడిచేవాడు. నావలెనే చీకటిపడేవరకు, ఒక్కొక్క ప్పుడు కొంత ప్రొద్దుపోయేవరకు కోర్టులో కేసులు విచారించు చుండిన సబ్ జడ్జిగారు అప్పుడప్పుడు నాకు దారిలో తటస్థపడే వారు. కాని ఒకరితో ఒకరు మాట్లాడుకొని ఎరుగం. నేను రైతు కుటుంబంలో, ప్రభుత్వోద్యోగ మెన్నడు చేయని వంశములో పుట్టాను. అందువలన ఉద్యోగంచేసే వంశపారంపర్యరక్తం నాలో లేదు. సబ్ జడ్జి నరసింహంపంతులుగారు, వైస్రాయి కార్యనిర్వాహకవర్గంలో సభ్యుడుగా వుండి, పేరుప్రతిష్ఠలు పొందిన బ్రాహ్మణుడు సర్ బయ్యా నరసింహేశ్వరశర్మగారి అల్లుడు. అందువలన వారు సకాలంలో పని పూర్తిచేయలేక పోవటం ఆశ్చర్యకరమే. మరిన్ని న్యాయాధిపతిగాన, వారిముందు హాజరయ్యేవారు పార్టీలుగాక, ఉత్తమవిద్యావంతులైన న్యాయ వాదులుకదా. వారిని కూడా ప్రొద్దుపోయేవరకు ఉంచడం, చిత్రంగానే ఉండేది.

నా ఆఫీసు బిల్డింగు, దాని నానుకొనియున్న భవనాలు విస్తీర్ణమైనవి. ఆవరణ మిక్కిలి విశాలమైనది. ఈ సువిశాల కట్టడాలను, ప్రదేశాన్ని, ఆస్కాలోవున్న పంచదార మిల్లును కొనియుండిన మించెన్ గారినుండి శ్రీ పరమానందసాహుగారు కొన్ని సంవత్సరాలక్రితం దీనిని కొనియుండినారు. కట్టడాలు పురాతన మైనవి. మద్రాసు, బొంబాయి, కలకత్తా బ్యాంకులు, ఇంపీరి యల్ బ్యాంకుగా రూపొందకముందు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసు ఆక్రమించుకొన్న భాగంలో, మద్రాసు బ్యాంకి బరంపురం బ్రాంచి వుండేదట. ఆ రోజుల్లో బ్యాంకి ఏజంట్లు అందరూ తెల్లవారే. వారికి సరంజామా ఎక్కువ, సిబ్బంది జాస్తి. వారి సిబ్బందికి, వారు స్వారీచేసే గుర్రాలకు అక్కడనే కట్టడాలుండినవి,

మొత్తంమీద ఆ బిల్డింగులు, ఆ ఆవరణ వారి స్వాధీనంలో వుండేవి. పరమానందసాహుగారు కొన్నతర్వాత కొంతభాగంలో వారు, వారి తాలూకువా రుండేవారు. నేను వెళ్ళినప్పుడు ఒక భాగంలో సాహుగారి కుమారుడు శ్రీ దామోదర సాహు, వారి అనుచరులు, స్నేహితులు వుండేవారు. మొదటిభాగం పైన చెప్పినట్లు ఇదివరలో మద్రాసు బ్యాంకు బ్రాంచి వుండేది, ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసుగా వుండింది. నా ఆఫీసు గదిలో నేను కూర్చున్న బల్ల కెదురుగా, ఇనుప చువ్వలతో దృఢంగా తయారు చేయబడ్డ తలుపులుగల కొట్టం వుండింది. బ్యాంకు ధనాన్ని వుంచే ఇనుప బీరువాలు ఆ కొట్టంలో వుండేవట. మేము కొట్టాన్ని ఖాళీ పెట్టెలు, పనికిరాని రికార్డులు వగైరా వుంచటానికి ఉపయోగించే వాళ్ళం. ఒకప్పుడు క్యాంపుకు వచ్చి ఆ కొట్టాన్ని చూచిన వాల్ అనే కమిషనర్‌గారు, తాము బదిలీఅయి వెళ్ళిపోయే సందర్భంలో మద్రాసులో వారి కొసంగబడిన విందులో మాట్లా డుచూ, ఒక ఛలోక్తిని విసిరారు. విందుకు హాజరైన నన్ను చూస్తూ, "వ్యతిరేక భావాలు సహించని ఆఫీసరు యల్. వి. బి. చౌదరి మంకుతనంతో వర్తించే పన్నుదారులను తన కెదురుగా వున్న కొట్టంలో బంధించేవారట" అని అన్నారు. నేనాశ్చర్య చకితుణ్ణి కాగా, శ్రోతలందరు గొల్లుమని నవ్వారు. నిజానికి నే నా కొట్టును గురించి ఎప్పుడూ పట్టించుకోలేదు. పైనచెప్పినట్లు, అందులో పనికిమాలిన పెట్టెలు మొదలగువానిని వేసియుంచే వాళ్ళం.

ఈ ఆఫీసు బిల్డింగు ప్రస్తావన ముగించే ముందు ఒక వింతను తెల్పుతాను. మా ఆఫీసు బిల్డింగు పట్టణానికి వెలుపల, స్టేషన్ రోడ్డుమీ దుండేది. బిల్డింగు, ఆవరణ ముందు గేటుకు కొంతదూరం. ఇక్కడ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసు ఉన్నదని తెలియటానికి గేటు దిమ్మమీద బోర్డును తగిలించారు. దానిలో ఇంగ్లీషులో మామూలుగా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసు అని వ్రాయబడింది. అంతవరకు సరే. కాని, తెలుగులో వ్రాసేటప్పుడు ఇన్‌కమ్‌టేక్స్ ఆఫీసు అని వ్రాశారు. దారిని పోయే చతురులు, ఇది ఆదాయం

పన్ను వసూలుచేసే ఆఫీసుకాదు, ఆదాయాన్నంతా సంగ్రహించే ఆఫీసురా అని చెప్పకొనటానికి అవకాశం కల్గింది. ఇది "ట" కు తెలుగులో వున్న ఇబ్బంది.

ఇంకొక వింత (తెలుగువాడికి). ఆ బిల్డింగుల యజమాని కుటుంబం అక్కడే వుంటుండేది అని పైన చెప్పాను. స్త్రీలున్నట్లు గుర్తులేదు. వంటవాడుండేవాడు. మా వంట కూడా వారి వంటిల్లు నానుకొనే. మా వంటవాడొకసారి ప్రస్తావనలో చెప్పాడు. ఉడుకుచున్న అన్నంకుండలో బెల్లం వేయటమే గాకుండా, చేపలను తోమీ తోమనట్లుగా తోమి, తల త్రుంపకుండా తోక, ఈకలు సగం ఉండగానే అందులో విడిచేవారట. ఉరియా వారికి చేప లిష్టమని తెలిసినా, ఇంచుమించుగా బ్రతికివున్న చేపలను (చిన్నవనుకొండి) ఉడికే అన్నంలో పడవేయటం నాకు నిజంగా ఆశ్చర్యాన్నే కలిగించింది.

గంజాం జిల్లాలో మేలైన బియ్యం దొరుకుతవి. మర పట్టినవి కాక, ఒకవిధమైన దంపుడు బియ్యం వాడుక. డింకి అనే ఏతాం వంటి దానితో దంపుడు. అప్పుడప్పుడు మంచిరకం రత్నచుడి బియ్యం కొనినా, సామాన్యంగా ఇంటివద్దనుండి ఒకొక్కదఫా 3, 4 నిండు బియ్యం బస్తాలు తెప్పించుకొనే వాడిని. నేనక్కడికి చేరిన కొద్దిరోజులకే మావాళ్లు మూడు బస్తాలు సన్నబియ్యం రైల్లో పంపారు. అవి వంటవాని స్వాధీనంలో వుండేవి. వంటవాడు నమ్మకస్తుడని నమ్మాను. కాని ఎంత మంచి నౌకరైనా, పై అజమాయిషీ లేకపోతే దుర్బుద్ధికి లోనౌతాడు. అందులో వంటవాళ్ల సంగతి చెప్పనక్కరలేదు. వాడు, నౌకర్లు కలసి 6, 7 మాసాలకు రావలసిన బియ్యాన్ని రెండున్నర, మూడు మాసాలకే పూర్తిచేశారు. అడిగితే, అయిపోయిన వన్నారు. భార్య రాకపోవటం, ఒంటరిగా వుండటం వలన కలిగిన నష్ట మిది.

నాభార్య బరంపురానికి ఐదారు మాసాలకు గాని రాలేదు. చిత్తూరు విడిచిపెట్టే ముందు శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనానికి,

కొండ ఎక్కి ఆ సాయంత్రమే దిగివచ్చాం నడకలో అని పైన చెప్పాను. ఆమె కప్పుడు లేచూలట. ఎక్కటం, దిగటంవల్ల కలిగిన శ్రమకారణంగా, గర్భస్రావం అయిందట. తరువాత జబ్బుపడిందట. తొట్టిస్నానం వగైరా చేసిందట. అందువల్ల నా వంటరి జీవితం. చిత్తూరునుండి బాబు బరంపురానికి వచ్చిన కొంతకాలానికిగాని ఆమె బరంపురం చేరుకోలేదు. బాబు రాక ముందే, ఆఫీసు నానుకొనివున్న చిన్న ఇల్లును విడిచిపెట్టాను. ఆ యిల్లు మిక్కిలి చిన్నది. కాని పైన పడకగది, స్నానం వగైరాకు ఇంకొక చిన్నగది వుండటంవల్ల, ఒంటరి జీవితానికి చెప్పుకోతగ్గంత అననుకూలం కలగలేదు. పైగా ఆవరణ పెద్దది కనుక ఉదయం, సాయంత్రం షికారుగా అటు యిటు తిరగ టానికి అవకాశం వుండింది. ఆవరణ బైట రైల్వేస్టేషన్ రోడ్డు వరకు వాహ్యాళికి అనుకూలం.

మూడు, నాలుగు మాసాలైన తర్వాత గట్టిగా ప్రయత్నించి ఊరు బైట, మా ఆఫీసుకు మైలుదాటిన దూరములో వుండిన, కోర్టుపేటలోని ఒక యింటిలో చేరాను. నా గృహానికి కొంతదూరంలో న్యాయస్థానము లున్నవి. న్యాయస్థానాలకు సంబంధించినవారు కొందరా పరిసరప్రాంతాల్లో ఇళ్లు కట్టుకొని, అద్దెకు కాపురమున్నారు. అందువలన దానికి కోర్టుపేట అని పేరు వచ్చింది. నే నుండిన యిల్లు పెద్ద రోడ్డుకు, మలుపు చిన్న రోడ్డుకు ఆనుకొనివున్న మందసా రాజావారి యింటికి రెండోది. నా యింటితర్వాత ఎదురుగా కొన్ని యిళ్లు వుండటంవల్ల, మాకు ఒకప్రక్క వీధి ఏర్పడి మాకు పెద్ద రోడ్డు రద్దీ, దుమారం ఇబ్బంది తప్పింది. ఆ యింటిని కొని తన స్వంతంచేసుకొన్నవారు ప్రముఖ వ్యాపారస్తుడు శ్రీ వైశ్యరాజు వెంకటరత్నంరాజు. ఇల్లంత పెద్దదికాదు గాని, ముందు కొంత ఆవరణ, చుట్టూ ప్రహారీగోడ వున్నది. ప్రహారీ దర్వాజా బైట ఒక పెద్ద బొగడ చెట్టు, చెట్టుచుట్టూ గచ్చు దిమ్మ ఉండినవి. ఇంటి గుమ్మం నానుకొని వరండా, దాని ముందు ఎత్తైనగచ్చు ప్లాట్‌ఫారం. ఈ

సౌకర్యాలవల్ల మే మక్కడ 3 సంవత్సరాల పైచిలుకు ఉండ గలిగాము. ప్లాట్ ఫారం వలయాకారంగా ఉండేది. విశాల మైన ఆ వలయం చుట్టూ, పూలమొక్కల కుండీలు పెట్టాము. ముఖ్యంగా రకరకాల చేమంతిమొక్క లుంచాము. వెనుక స్థలం చాలా చిన్నది. దాని నానుకొని అన్నీ వరిచేలే. రైతు కుటుంబీకులంకాబట్టి మా కేమాత్రం అలజడి కలగలేదు. పైగా సంతోషంగా ఉండేది. మరిన్ని ఇంటి నానుకొని ఒక ప్రక్క వరండా, వరండా తరువాత 2, 3 గజములు ఖాళీ వుండి వంట గది, ధాన్యం కొట్లు. మే ముండిన కాలంలో ధాన్యం కొట్లు ఖాళీగా వుండేవి. కొట్లక్రింద పైనచెప్పినట్లు త్రాచుపాము లుండేవటకాని, చంపిన త్రాచుకాక, మరొక త్రాచును చూడలేదు. తేలు బాధ కూడా ఎరుగం.

బరంపురం మరీ పెద్ద పట్టణంకాదు. కాని, వర్తక వ్యాపారాలు బాగా జరిగే పట్టణమే. అడవుల్లో, కొండల్లో పండించబడేవి విరివిగా దొరికేవి. వ్యాపార వృద్ధికి తోడ్పడేవి. కమిషన్ వ్యాపారంహెచ్చుగా జరిగేది. పెద్ద అందమైన పట్టణమని చెప్పటానికి వీలులేదుగాని, గోదావరి నదికి ఉత్తరాన వున్న కొన్ని పట్టణములకంటె చాలా మెరుగు. పెద్ద పెద్ద భవంతులు లేవుగాని చిన్నచిన్న పెంకుటిళ్లు, చిన్న భవంతులతో మాత్రమే నిండియుండినది కాదు. ఆ పట్టణములో నివసించు పౌరులలో ఎక్కువ పలుకుబడి, సంపద, వర్తక వ్యాపారాలు కల వారు న్యాయవాదివృత్తిలో నున్నవారు, ఉద్యోగాలు చేయు వారు తెలుగువారు. ఎక్కువమంది పౌరులు ఉరియావారే కావచ్చునుగాని, తెలుగుసంస్కృతి ఆ రోజుల్లో, కొట్టవచ్చి నట్లుండేది. ఓఢ్రుల్లో కొంతమంది పెద్దలున్నా, పైచేయి తెలుగు వారిదే.

గంజాం జిల్లా మిక్కిలి పెద్దదిగా వుండేది. ఒకప్రక్క చిలక సరస్సు, ఒకప్రక్క ఘుసూరు—ఉదయగిరి ఏజన్సి, ఒకప్రక్క పర్లాకిమిడి ఏజన్సి, ఇంకొకప్రక్క దూసి నది సరిహద్దులు కలిగి, అది మిక్కిలి విస్తారమైన జిల్లా. ఆ జిల్లాలో కొండలు, సవరులు,

మొదలైన కొండజాతులవారు ఇప్పటికిని నివసించుచున్నారు. అడవులు, మన్యప్రదేశాలు జాస్తి. పెద్దపులులు, చిరుతపులులు మొదలైన క్రూరమృగాలు, కణుజు, దుప్పి, జింక, కొండగొఱ్ఱె, మొదలైన సాధుజంతువులు, అడవి కోళ్లు, రకరకాల బాతులు, పచ్చపావురాలు, మొదలైన పక్షులు విస్తారముగా నుండినవి. కొయ్యంగొ, బెక్టి, మాగ మొదలైన చేపలు, సముద్రపీతలు, రొయ్యలు పుష్కలముగా దొరికేవి. ఆ జిల్లాలో చిన్నచిన్న కొండలు, పెద్దపెద్ద చెట్లు, పచ్చ పచ్చ, రంగు రంగుల పొదలు, పచ్చికతో నిండిన మైదానములు కనులకు విందొనర్చుతవి. సోంపేటనుండి ఉద్దానం అనే తోటల ప్రదేశం ఉత్సాహాన్ని కలగజేసేది. దక్షిణాన దూసి, వంశధార, నాగావళి నదులు, ఉత్తరాన శబరి, ఋషికుల్య నదులు, నాకు జ్ఞాపకంలేని ఉపనదులు, (మహానదిశాఖ కూడ ఉన్నదనుకుంటాను) ప్రవహిస్తూ ఆ జిల్లాను ధాన్యాగారంగా చేశాయి. బరంపురానికి 9 మైళ్లలో వున్న తూర్పుసముద్రం వాతావరణాన్ని చల్లబరుస్తుంది. సముద్ర తీరానవున్న గోపాలపురం వినోదయాత్రకు మిక్కిలి అనుకూల మైనది. చిలకసముద్రం బెక్టి అనే పండుగప్ప చేపలకు, రకరకాల బాతులకు పుట్టినిల్లు. ఉద్దానం కొబ్బరి, జీడిమామిడి, పనస, అనాస వంటి ఫలాలను అందిస్తుంది. ఘుంసూరు-ఉదయగిరి ఏజన్సి, పర్లాకిమిడి ఏజన్సి పులుల వేటకు, వాని చర్మాల సంపా దనకు మిక్కిలి అనువైన ప్రదేశం. బెల్లిగూడ ఏజన్సిలో కోందుల అర్ధనగ్ననృత్యం చూడవచ్చును. బెల్లిగుంట ప్రాంతంలో ఇత్తడి తీగెతో తయారుచేసిన చేపలు, పర్లాకిమిడి వంటి ప్రదేశాల్లో పశువుల కొమ్ములతో తయారుచేసే కొంగలు, ఏనుగులు, దుప్పులు వగైరా కొనవచ్చును. రసుల్‌కొండలో ఎద్దు, గేదె చర్మాలతో కప్పిన ఇనుపబద్దెల తోలుపెట్టెలను చేయించుకొనవచ్చును. అడవులనుండి రకరకాల కొయ్యలు లభిస్తవి. వివిధాలైన కొయ్యసామాన్లు తయారుచేసే వడ్రంగు లున్నారు.

ఉరియావారు కపటులని వాడుక. కాని, వారు తెలుగు వారి కంటె మిక్కిలి హెచ్చుగా దైవారాధకులు. తెలుగు

దేశమునందుకంటె బృహత్తర దేవాలయాలు ఈదేశములో కలవు. భువనేశ్వరములోని లింగరాజు దేవాలయం, పూరిలోని జగన్నాథస్వామి దేవాలయం, కోణార్కులోని సూర్య దేవాలయం తార్కాణాలు. భువనేశ్వరంలో రాజు రాణివంటి మిక్కిలి ఆసక్తి దాయకమైన దేవాలయం, ఇతర దేవాలయాలుకూడా వున్నవి. బరంపురంలో రెండు మూడు మంచి దేవాలయాలున్నవి.

ఉరియావారిలో చాలామంది నిత్యం రెండు సార్లు స్నానం చేస్తారు. కొంచెమో గొప్పో పూజచేస్తారు. ఏ రామాయణమో చదువుకొంటారు. కాని, వారి స్నాన శుభ్రత ప్రశ్నింపదగింది. ప్రజాసామాన్యంచేసే స్నానం చెరువుల్లోనో, గుంటల్లోనో. ముఖ్యంగా పల్లెటూళ్లలో చెరువులు మిక్కిలి మురికిగా వుంటవి. ఆ చెరువుల్లో బహిఃప్రదేశానికి వెళ్ళి శుభ్రపరచుకొనటం, స్నానంచేయటం, ఆ నీటినే వంటకు, పానీయానికి ఉపయోగించటం కలదు. వారి గావంచాలు అనగా అంగవస్త్రాలు మిక్కిలి మురికిగా వుండేవి. పాటకజనం మొదలు బ్రాహ్మణుని వరకు ఒక కట్టుబట్టతోను, ఒక గావంచాతోను మాత్రమే కాలము గడిపేవారు. స్త్రీలవిషయంలో పాటకజనులేగాక శ్రీమంతులును, తక్కువ కులాలవారేగాక బ్రాహ్మణులును నిండు చీరలకు బదులు, ఒంటిపొరగూడకట్టు కట్టుకొనేవారు. పైట జార్చి తలకు తగిలించుకొన్నా క్రిందిభాగం మాత్రం ఒంటిపొర గూడకట్టే. ఇది ప్రాచీనాచార పద్ధతట. చదువుకొన్న ఆధునిక యువతులు ఆంధ్ర స్త్రీలవలె ఈనాడు చీరధారణులైనా, జాతీయాచారం ఒంటిపొర గూడకట్టే అని నాకు తోచింది. ఈ పద్ధతి కట్టువలన పాటకజనంలో నడుచుచున్నప్పుడొక తోడ కొంచెమైనా కనబడుతుంది.

ఉరియా స్త్రీలు ఎక్కువగా పసుపును వంటికి, ముఖ్యంగా ముఖానికి, వాడుతారు. పసుపు పూసుకొనందే స్నానంచేయరు. ఉత్తర భారత స్త్రీల సంగతి తెలియదుకాని, దక్షిణాదిస్త్రీలందరు ప్రాతఃకాల స్నానాదుల్లో పసుపు నుపయోగించేవారు. ఈ అలవాటు ఉరియా స్త్రీలలో చాలా హెచ్చు, ఇది బహుశా దోమలకాటు దుష్ఫలితాలను ఉపశమనం చేయటాని కను

కుంటాను. కట్టు, బొట్టు, వేషంలో నాజూకుతనం లేకపోయినా పాటకజనాన్ని, బీదసాదలను కలుపుకొని మొత్తంమీద ఉరియా జాతివారు తెలుగువారి కంటె, శరీర వర్ణంలోను, అంద చందాల్లోనూ ఎక్కువ. వారిలో అరవ తెలుగు దాక్షిణాత్యుల కంటె, ఎక్కువ మిశ్రమరక్తం ఉండవచ్చును. నాకు తెలిసినంత వరకు శరీర రంగు విషయంలో బెంగాలీలకంటె కూడ, ఉరియా వారే ఎక్కువ కాంతివంతమైన శరీరవర్ణం కలవారు. వారిలో కొందరు మిక్కిలి పసుపు రంగులోను, మరికొందరు ఎరుపు లేక పల్చని తెలుపు కలసిన పసుపు రంగులోను వుండురు. నేను ప్రొబేషనరి ఆఫీసరుగా బరంపురంలో ఉన్నప్పుడు, ఒక గ్రామానికి తనిఖీకి వెళ్లాను. నే నొక పన్నుదారుని వెంటబెట్టు కొని ఆయన గృహంలోకి వెళ్లినప్పుడు, ఆ గృహంలోని 20 ఏండ్ల వయస్సుగల యువతిని చూచి, ఆమె శరీర వర్ణానికి, సౌంద ర్యానికి ఆశ్చర్యపడ్డాను. అప్పుడప్పుడు మిక్కిలి అందమైన స్త్రీలను చూడటం తటస్థించింది.

ఉరియావారి ప్రాతకాలం గృహాలకు, సింహద్వారం వెనుక ఒక దర్వాజా తప్ప రెండోత్రోవ వుండదు. కిటికీలు చిన్నవిగా వుంటవి. ఇల్లు వెడల్పు తక్కువ, పొడు గెక్కువ. బైట వాళ్లు లోపలికి చొరబడితే, తప్పుకు పోవటానికి ఇంకొకత్రోవ లేదు. ఇంచుమించు సొరంగాలవలె వుంటవి.

గంజాం జిల్లా అంత భాగ్యవంతమైన జిల్లా కాదు. ధనవంతు లైనవారు తక్కువ. కాని ఆ జిల్లాలో 17 జమీందారీ లుండినవి. పర్లాకిమిడి అన్నింటిలోకి పెద్ద జమీందారి. అన్నింటికంటె చిన్నది సింగ్రి అనుకొంటాను. కళ్లికోట, ధారాకోట, మందసా, బొడొకిమిడి, సన్నొకిమిడి, చీకటి చెప్పుకోతగ్గవి. పర్లాకిమిడి, కళ్లికోట పెద్ద జమీలైనా ఆ ఎస్టేట్ల జనులు ఎక్కువభాగం బీద వాళ్లు. అయితే, విస్తీర్ణమైనవి కాబట్టి రాబడి ఎక్కువగానే ఉండేది. ఆదాయంపన్ను విషయంలో పర్లాకిమిడి జమీందారు గారి ఇతర రాబడులవల్ల ఆ ఎస్టేట్ ఎక్కువ పన్ను నిచ్చేది.

ఆ జిల్లాలో ఒక్క ఆస్కా పంచదార ఫ్యాక్టరీ తప్ప, అటు వంటి పెద్ద పారిశ్రామిక సంస్థలు ఇంచుమించుగా లేవని చెప్పవచ్చును. సోపాడు వంటి సముద్రతీరప్రాంతాల్లో ఉప్పు తయారుచేయటం, పలాసా వంటి చోట్ల జీడిపప్పు తయారు చేయటం ఉండేది.

గంజాం జల్లా ధాన్యాగారమని పైన చెప్పాను. అక్కడ పండించే వరిధాన్యం మిక్కిలి శ్రేష్ఠమైనది. రత్నచుడి, సాంబావు అని ఎరుపు, తెలుపు ధాన్యాల నంటారు రెండిటి లోను మంచి రకాలున్నవి. కాని, రత్నచుడి సర్వసామాన్యంగా మేలురకం జాతిది. రైసుమిల్లులు చాలా తక్కువ. చాలా వరకు ధాన్యాన్ని బియ్యంగా మార్చటం డింకీ అనే దంపుడు పద్ధతిని. మనప్రక్కవలెనే ధాన్యం గుంట. అయితే, రోకళ్లతోగాక పెద్ద దూలానికి ఇనుపపొన్ను అమర్చి, ఏతాం మాదిరిగా క్రిందకు పైకి ఆడించి దంపుతారు.

రకరకాలైన అడవుల్లో ఉత్పత్తి అయ్యే కొయ్య, కరక్కాయ, పాలగుండ, చింతపండు, బంకజిగురు మొదలైనవి, కొండచెరియల్లో అల్లం, వలిసెలు వగైరా ఆ జిల్లాలో ప్రత్యేక వస్తువులు.

బరంపురంవంటి పట్టణాలలో పెద్దవడ్డీవ్యాపారస్తులు కొలది మంది వుండినారు. కాని చిన్నమూలధనంతో వడ్డీవ్యాపారం మొత్తంమీద పల్లెటూళ్లలోనే. ఈ పల్లెటూళ్లలోని వడ్డీ వ్యాపారం చాలావరకు ఇన్‌కమ్‌టాక్స్‌వారి కందకుండా వుండేది. బరంపురంలో వ్యాపారంచేసే మార్వాడీలు ఎక్కువగానే వుండేవారు. కాని వారి వడ్డీవ్యాపారం తక్కువ. గంజాం జిల్లాలో ఆదాయంపన్ను నిచ్చేవి మొత్తంమీద తిండికి, బట్టకు సంబం ధించినవే. కొనుగోలు విక్రయాలు బియ్యం, బెల్లం, పచారి దినుసులు, నూనెలు, బట్టలు మొదలైనవే. వడ్డీవ్యాపారం కూడా వీనికి అనుబంధమే. పారిశ్రామిక పెట్టుబడికికాదు.

అందువల్ల, ఆ సర్కిల్ రిజిస్టరులో వున్న పదమూడువందల పైచిలుకు పన్నుదారులలో నూటికి 80 వంతువరకు చిన్నకారు

వర్తకులే. దాని పర్యవసానం కష్టం ఎక్కువ, పన్నురాబడి తక్కువ. పట్టీపట్టనట్లు సులువుగా వర్తించగల ఆఫీసర్లకు చాలా సుఖప్రదమైన సర్కిల్. కాని, నావంటి అతి జాగ్రత్తపడేవానికి, దమ్మిడి దమ్మిడీకి నిశిత పరీక్ష చేసేవానికి పని కష్టమే. అందువలన, నేను రాత్రి చీకటిపడేవరకు, కొన్నికొన్ని సమయాల్లో ప్రొద్దు పోయేవరకు పనిచేసేవాడిని. నేను పనిచేయుటమేకాదు. నా గుమాస్తాలచేత కూడ చేయించేవాడను.

బరంపురం పట్టణములోని పెద్ద కేసులు వైశ్యరాజు కుటుంబాలకు, ఇద్దరు ముగ్గురు మార్వాడీలకు, పాకనాటి కుటుంబానికి, ఒకటి, రెండు బట్టల కొట్లకు చెందినవి. వైశ్య రాజువారు ముగ్గురు అన్నదమ్ములు. వైశ్యరాజు సూరయ్యరాజు, కాశీ విశ్వనాథంరాజు, వెంకరత్నంరాజు. వీరికి వడ్డీవ్యాపారంతో బాటు, వివిధ సరుకుల్లో టోకు వ్యాపారం, కమిషన్ వ్యాపార ముండేవి. ఏజన్సీ ప్రాంతములో పండే వలిసెలు, కరక్కాయలు, చింతపండు, అల్లం మొదలైన వేగాక పప్పులు, కాయధాన్యాలు, ఉప్పు, నూనెలు మొదలైనవానిలో పెద్దగా వ్యాపారంచేసేవారు. ఈ ముగ్గురు అన్నదమ్ముల్లో వెంకటరత్నంరాజుగారికి వడ్డీ వ్యాపారం హెచ్చుగావుండేది. వారి లెక్కలపుస్తకాల్లో కొంత డబ్బును చూపించుచుండుట లేదు. వారు చూపించిన వడ్డీ వ్యాపారానికి తిరుగు మూలధనంకంటె ఎక్కువ డబ్బున్నదని పుకారు విని, వారిని గట్టిగా ప్రశ్నించి, "మీకే అపకారం చేయను. మీరు వడ్డీకి ఇచ్చినా, ఇవ్వకపోయినా అసలు డబ్బు ఎంతున్నదో చెప్పండి" అని కోరాను, స్నేహభావంతో అన్నట్లు లాలింపుగా. వారికి విడమర్చి చెప్పినందుకుకాబోలు, "మాకు వ్యవధి ఇవ్వండి" అని వెళ్లి తరువాత కొంత పెద్దమొత్తాన్నే పుస్త కాల్లోకి ఎక్కించి, నాకు తెచ్చి చూపించాడు. ఈ అదనం డబ్బు ఏవిధంగావచ్చిందో చెప్పారు. ప్రతిరోజు పరకో, పాతికో ఒక ఇనప్పెట్టెలో వేసేవారట. దానిని ముట్టుకోనేవారుకాదట. సంవత్సరాలతరబడి పెరిగిన దీ మొత్తమట. ఈ వివరానికి భిన్న మైన సాక్ష్యం నావద్దలేదు. వారి లెక్కల్లో తప్పులులేవు. వడ్డీకి యిచ్చి వారు చూపించని పద్దులు నాకు దొరకలేదు. అందువల్ల

వారి కథనాన్ని ఒప్పుకొన్నాను, అప్పటి నుండైనా వడ్డీకిచ్చే మూల ధనం లెక్కల్లో పెరిగి, అధిక ఆదాయం కనబరుస్తారని.

డబ్బు నితరులకిస్తే రాదేమో అని భయంచేత వడ్డీకి త్రిప్పకుండా, నగదుగానే దాచుకొనేవారు పల్లెటూళ్లలో అక్కడక్కడ వుంటారు. ఒక ఉరియా ఆసామి ధనికుడని వాడుక. ఆ వాడుకనుబట్టి అతని లెక్కలు సరిగావుండనందున హెచ్చు వడ్డీ వస్తుందని, ఎక్కువ ఆదాయంపన్నును విధించేవారం. అతడు "నా కింత వడ్డీరాదు, నేను వడ్డీ కిచ్చిం దింతమాత్రమే" అని గగ్గోలు పెట్టాడు. అతనిని పంపించివేసి మా ఇన్‌స్పెక్టరును అకస్మాత్తు తనిఖీకి అత నింటికి పంపాను. ఆయన వెళ్లి చూడగా ఆ ఆసామి భోషాణంలో వెండి రూపాయలు 60 వేలు వున్నాయట. ఈ సంఘటన జరిగి ఇప్పటి కించుమించు 40 సంవత్సరాలైంది. ఆ రోజుల్లో, మారుమూలల్లో ఉన్న ఉరియా ప్రజలు ఇంత భయ భ్రాంతులై వుండేవారు.

చేతికివచ్చిన రూపాయని గట్టిగా బిగబట్టుకోవాలనే ఆకాంక్ష ప్రబలంగా వుండేది. అందువల్ల సర్వసామాన్యంగా ఈ పల్లెటూరు వడ్డీవ్యాపారస్తులు యథార్థంగా ఎక్కువ ధనం వడ్డీకి త్రిప్పుకొన్నా తక్కువ పెట్టుబడి చూపించి, పన్ను ఎగగొట్టాలనే ఆదుర్దాపడేవారు. ఏవిధంగానైనా పన్ను లేకుండా చేయించు కోవాలని బీద అరుపులు అరిచేవారు. ఇది చాలావరకు అన్ని చోట్ల పన్నుదారుల విషయంలో నిజమైనా ప్రత్యేకించి చిరుగుల బట్టలతో దీనాతిదీనంగా రావటం, గగ్గోలుపెట్టటం, చివరకు సాష్టాంగపడి ప్రాకుచూ వచ్చి కాళ్లను పట్టుకోబోవటం ఇక్కడ జరుగుచుండేది. సాధారణంగా, ఇటువంటి వారిని ఏది అడిగినా, "కిచ్ఛ నై బాబు" (ఏమీ లేదు) అని పదేపదే వాపోవటం మామూలు.

వీరి దీనాలాపాలలో కొంతకుగొంతైనా నిజముండి వుండ వచ్చునుగాని, చాలామంది విషయంలో కాపట్యం, లోభత్వం తాండవమాడేది. ఈ బీద అరపులు అరిచేవాళ్లు తమ బాకీదార్లను పీల్చి, పిప్పిచేసేవారు. చిన్నచిన్న మొత్తాలను తీసుకొనే బీద

రైతులనుండి పెద్ద రేట్ల వడ్డీని గుంజుకొనేవారు. పైగా ఏజన్సీ ప్రాంతంలోని వ్యాపారులు రెట్టింపు వడ్డీతో వాని పంటను కాజేసేవారట.

పెద్ద కేసుల్లో ఒకటి పర్లాకిమిడి రాజావారిది. దీనిని తనిఖీ చెయ్యాలంటే రోజులు పడుతుంది. అందువల్ల ఈ కేసులో అనుభవమున్న మా హెడ్ క్లార్కు శ్రీ పెయ్యేటి కనకరాజు పంతులుకు తనిఖీ కిచ్చేవారం. ఆయన వారంరోజులపాటు తనిఖీచేసేవారు. తనిఖీచేయటంలో స్తనశల్యపరీక్షచేసి దమ్మిడీ, దమ్మిడీ ఆదాయంలో చేర్చేవాడు. వింత ఏమిటంటే రాజావారి పుస్తకాలను తనిఖీకి తీసుకువచ్చే గుమాస్తా బ్రాహ్మణుడు. మా హెడ్ క్లార్కు బ్రాహ్మణుడు. బంధుత్వంలేదుగాని, సర్వ సామాన్యంగా, ఆ గుమాస్తా శ్రీ కనకరాజుపంతులు ఇంటిలోనే భోజనంచేసేవాడు. అయినా నాకుగాని, నాముందు ఆఫీసర్లకు గాని లాలూచీ వుండేదేమో అని తలంపుండేదికాదు. తీక్ష్ణంగా తనిఖీచేసి, విపులంగా నోటును శ్రీ కనకరాజు వ్రాసినా దానిని సాంతంగా చూచి పన్నును నిర్ధారణచేసేవారం. విచారించ వలసిన కేసులు చాలా వుండేవికాబట్టి పర్లాకిమిడి, ఆస్కా మిల్లు వంటి పెద్ద కేసులనేగాక, చిన్న కేసులనుకూడా ఇతర గుమాస్తాలకు స్టేటుమెంట్లు వగైరా పరీక్షించండని ఇచ్చేవారం. మార్వాడీభాష నాకు తెలియదు. ఉరియాభాష అంతంతమాత్రం. అందువల్ల ఈ కేసులను విచారించుటలో ఆ భాషలు తెలిసిన గుమాస్తాల సాయం తప్పకుండా ఉండేది. వాళ్లు పంపిన నోట్సుమీద కొంత వరకైనా ఆధారపడవలసివచ్చేది. అయితే పన్ను ఎక్కడ తప్పిపోతుందో అనే దుగ్ధ పీడించటంవల్ల అతి జాగ్రత్తగా పరిశీలించేవాడను. పైన చెప్పినట్లు ఆఫీసు నిర్ణీతకాలాన్నిమించి శ్రమించి వాడను.

పర్లాకిమిడి రాజాగారు గాక ఇంకా 16 మంది జమీందార్లు గంజాం జిల్లాలో వుండేవారని పైన చెప్పానుకదా! వారందరు కూడా ఆదాయం పన్నిచ్చువారే. పైన చెప్పినట్లు కళ్లికోట, ధారాకోట, మందసా, చీకటి, బొడొకిమిడి, సన్నొకిమిడి మొదలైన

జమీందార్లుగాక తతిమ్మావారి పన్నువిధింపుగల ఆదాయం చాలా తక్కువ. వ్యవసాయంనుండి వచ్చు ఆదాయంమీాద పన్నువిధింపు హక్కు లేదు. కాబట్టి వారి యితర ఆదాయం అంత ఎక్కువగా ఉండేదికాదు. అడవులనుండి వచ్చు కలప, కరక్కాయలు, వలిసెలు, పశువులమేత రుసుం, అప్పులమీాద వడ్డీ, గవర్నమెంటు సెక్యూరిటీలనుండి వచ్చిన వడ్డీ, కంపెనీలనుండి వచ్చిన డివిడెండులవంటి వానిమీాద పన్ను. అందువల్ల జమీాందారులనుండి వసూలుచేసే ఆదాయంపన్ను మొత్తంమీాద తక్కువే.

ఉరియాస్త్రీలు సర్వసామాన్యంగా ఎక్కువ నగలను ధరిస్తారు. నిజానికి ఎంత బీదస్త్రీ అయినా, చిన్న మంత్రైనా బంగారము ఏ ముక్కుపుడకగానో ధరించకుండా వుండదు. కారణము వారికున్న స్త్రీధనమంతా బంగారు, వెండి నగలే. పూర్వకాలం తెలుగుస్త్రీలవలె రాగిడి, చంద్ర సూర్యవంకలు, నాగరము మొదలైనవి, తలమీాద జడపువ్వు, జడకుచ్చులు మొదలైనవి శిరోజాల్లోనూ పెట్టుకోనరుగాని ముక్కునిండా, చెవులనిండా, కంఠమునిండా, చేతులనిండా, కాళ్లనిండా. బంగారం, వెండి నగలను ఎంత బరువైనవైనా ఓపికతో పెట్టుకొంటారు. అందువలన బంగారు, వెండి నగల వర్తకం మిక్కిలి హెచ్చు. బరంపురంలోనేగాక, ఇతర పట్టణాల్లోకూడా బంగారం, వెండి వస్తువుల వ్యాపారం విరివిగా సాగుచుండేది. ఈ వ్యాపారంలో అధిక లాభాలను వర్తకులు గడించేవారు.

ఏజన్సీప్రాంతపు గ్రామాదుల్లో వడ్డీవ్యాపారం అధిక లాభదాయకంగా వుండేది. ఆటవికజాతులైన కోందులు, సవరలు మొదలైన అనాగరిక జనులకు వడ్డీకి అప్పివ్వటంలో చిన్న చిన్న వర్తకులు చాలా మోసంచేసేవారు. ఈ విషయంలో చమత్కారమైన కథ ఒక టున్నది. అది నిజమైనను కావచ్చును. వర్తకుడు ఒక ఆటవికునకు ఒక రూపాయి అప్పిస్తే దానిని రెండు రూపాయలుగా వ్రాసుకొనేవాడట. ఈ రెండు రూపాయల అప్పును, ఆ ఆటవికునిచేత ఒప్పించేవాడట.

ఎలా అనగా, వానితో "నేను నీకు ఒక రూపాయి అప్పు ఇచ్చాను కదా! కాబట్టి ఒకరూపాయ, నీవు ఒకరూపాయ తీసుకొన్నావు కదా! ఇంకొక రూపాయ, కాబట్టి మొత్తం రెండు రూపాయలు" అనేవాడట. వడ్డీరేటుకూడా చాలా హెచ్చుగా వుండేది, రూపాయకి, అణానుండి 4 అణాలవరకు వానికి బియ్యం, వుల్లి పాయలు, మిరపకాయలు, నూనె, బట్టలు మొదలైన దినుసులు రెట్టింపు ధరల కిచ్చేవారు. అడవిలోని ఉత్పత్తులు కరక్కాయ, జిగురువంటి వానిని, కొండ సానువులందు పండించే అల్లం, నైగరు గింజలు (వలిసెలు) మొదలైనవానిని మిక్కిలి చౌకధరలకు వారివద్దనుండి గ్రహించేవారు. ఈవిధముగా ఆటవికులను మోసముచేసి, వారి వద్దనుండి అధిక లాభాలు చిన్న వర్తకులు గడించుచుండేవారు. చిన్నవర్తకులనుండి పట్టణములోని పెద్ద వర్తకులు చౌకగా కొని, ఎక్కువ లాభాలకు అమ్ముకొనేవారు.

ఇతరచోట్లవలెనే బరంపురంలోకూడా వస్త్రాలను నేస్తారు. ఉరియా ప్రజల వస్త్రధారణ స్వల్పంకాబట్టి, చాలావరకు ముతక రకం కాబట్టి సన్ననూలుబట్టల వ్యాపారం చాలా తక్కువ. కాని బరంపురంలో వివిధ రకముల పట్టుబట్టలను, క్షీరాబ్ధి అని పేరుగల పట్టుతో నేసేవారు చాలామం దున్నారు. ఈబట్టలు ప్రసిద్ధికెక్కినవి. పూజాపునస్కారాలకు పనికివచ్చేవేగాక విలాసంగా ధరించుట కనువగు ధోవతులు. పై కండువాలు, చీరెలు, రవికెగుడ్డలు చాలా బాగుగా నేస్తారు. అవి హుందాగా, అందంగా వుంటవి. కాని ధర్మవరం, బెంగుళూరు, కొల్లెంగాల్ పట్టువస్త్రాలతో పోల్చిచూస్తే మోటు అనిపిస్తవి.

జపాన్ నుండి తెచ్చిన పట్టును బరంపురీయులు శుద్ధిచేసి తెల్లని క్షీరాబ్ధిపట్టును తయారుచేస్తారు. ఈ తెల్లపట్టుకు రకరకాల రంగులు వేస్తారు. రంగులు చాలావరకు ముదురు రంగులు. ఆ రోజుల్లో (1936) అవి ఆకర్షణీయంగానే వుండేవి. కాని, ఇప్పుడు వాని కంత గిరాకి మనప్రాంతాల్లో లేదు. అయితే పెండ్లి మొదలైన శుభకార్యాల్లో, పూజకు పురుషులు ధరించే పట్టువస్త్రాల నిప్పటికి ఆదరిస్తున్నాము. అవి సాధారణంగా వంగ పండు ఛాయలోనో, నీలిరంగులోనో వుండును. మామూలు

కట్టుబట్టలు తెలుపులోనే వుండును. ఈ వ్యాపారమునుండి వచ్చే పన్నురాబడి, మరింత తక్కువగా ఉండేదికాదు.

ఆ జిల్లా అడవుల్లో లభ్యమయ్యే కలప, వేగిస, గుగ్గిలం, వేప, అడవి మామిడి, నల్లమద్ది, ఇరుగుడు, రోజ్ వుడ్, (నూకమాను) టేకు మొదలైనవి. టేకు అంతవిస్తారముగా లభ్యమయ్యేది కాదు. రోజ్ వుడ్ చాలామంచిది దొరికేది. నలుపు, గులాబిరంగు రోజ్ వుడ్ వుండేది. మామిడికలప కూడ జాస్తే. వేగిస, వేప, కలప ఎక్కువ వాడుకలో వుండేవి. మొత్తంమీద కలపవ్యాపారం చెప్పుకోతగ్గది. కర్రతో, మిక్కిలి నైపుణ్యంతో కుర్చీలు, మేజాబల్లలు, ఎత్తు బల్లలు, భోజనం బల్లలు వగైరాచేయు వడ్రంగు లున్నారు.

చెంబులు, ఇతరపాత్రలు మంచి కంచుతో చేయటంలో గంజాం జిల్లాలోని కొన్ని ప్రదేశాలు మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. ఇత్తడి తీగతో చేపలను చేయటం, పశువుల కొమ్ముతో కొంగలు మొదలైనవి చేయటం ఆ జిల్లా విశేషమని పైనచెప్పాను. అయితే ఈ చేతిపరిశ్రమలు మిక్కిలి స్వల్పం. వీనివల్ల వచ్చే ఆదాయం స్వల్పం.

పైన చెప్పినట్లు గంజాం జిల్లా సమశీతోష్ణం కలది కొన్ని ప్రాంతాల్లో శీతల వాతావరణమే జాస్తి. అందువలన ఆస్కా మొదలైన ప్రాంతాల్లో చిక్కగా, పెద్దవిగా పెరిగే కాలిఫ్లవర్స్, కాబేజి ముద్దలు, టొమాటోలు, కారెట్లు, బటాణీ మొదలైనవానిని జాస్తిగా పండిస్తారు. భూమి సారవంతమైనది.

ఆ జిల్లాలోని వివిధ ప్రదేశాల్లో దొరకు నీరు తియ్యగా వుంటుంది, ఉప్పగా లేక చప్పగా వుండే నీటిని నేను చూడలేదు. బరంపురం నీటితో పోల్చి చూస్తే, కృష్ణానది నీరు కూడా నాకు చప్పగానే తోచింది. దూసి, వంశధార, నాగావళి మొదలగునవి చిన్ననదులే కాని, ఋషికుల్యానది మిక్కిలి పొడవుగలది, వెడల్పుగలది. దీనిలోనికి శబరి మొదలగు ఉపనదులు వచ్చి పడతవి. ఋషికుల్యానది నీరు మంచి తీపి.

ఆ జిల్లా ప్రకృతి సౌందర్యాన్ని గురించి నే నిదివరకే చెప్పి యున్నాను. క్యాంపు చేయుటకు మిక్కిలి అనుకూలమైన ప్రదేశాలు ఆ జిల్లాలో కలవు ఈ క్రింది క్యాంపులలోని విషయాలను ఇప్పుడు చెప్పుతాను.

## ఆస్కా

ఇది ఆస్కా తాలూకా హెడ్ క్వార్టర్స్. అయినా దీనిని పట్టణ మనుటకంటె గ్రామ మనటమే సమంజసం. ఇది బరంపురానికి 25 మైళ్ల దూరంలో, రసుల్ కొండకు పోయే పెద్ద రోడ్డుమీద వున్నది. ఒక ఫర్లాంగు పొడుగున రోడ్డు కిరుప్రక్కల కట్టబడిన యిల్లే ఈ గ్రామం. ఇక్కడి విశేషం ఆస్కా పంచదారఫ్యాక్టరి. ఫ్యాక్టరి ఊరు చివర పెద్ద ఆవరణలో వున్నది. ఈ చిన్న పట్టణములో ఒక ప్రముఖ న్యాయవాది హరిహరపండా అనేవా రుండినారు. వారు న్యాయవాది వృత్తిచే డబ్బు సంపాదించి భూ, గృహ వసతులను సంపాదించినారు. కంపెనీలలో షేర్లు కూడా కలవు. ఉరియావారు మితవ్యయం చేయువారని, భోజన లాలసత్వ మంతగా లేనివారని పైన చెప్పియున్నాను. కాని, శ్రీ హరిపండా వయస్సుమళ్లినను, భోజనవిషయంలో మిక్కిలి శ్రద్ధ తీసుకొనేవారట. ఉరియా క్లార్కు మహాపాత్రో రొట్టెలువేసుకొనుచు, శ్రీ పండాకు నిత్యం చేప లుండాలని, ఎంత ఖరీదయినా, దూరాన్నుంచిఅయినా, రకరకాల చేపలు తెప్పించుకొంటారని గొప్పగా చెప్పినాడు. ఉరియావారికి చేపలు మిక్కిలి ఇష్టం.

ఆస్కా పంచదార మిల్లును మించన్ అనే ఆంగ్లో ఇండియన్ కట్టించినాడట. ఆయన ఉరియాస్త్రీని వివాహమాడి ఆస్కాలోనే చనిపోయాడట. ఆయన మరణానంతరం చేతులుమారి చివరకు పరమానందసాహుగారి చేతిలోకి వచ్చింది. ఈ మిల్లులో సారాయి కూడా తయారుచేసేవారు. సారాయి మామూలు సారాయివంటిదే కాని, పంచదారవిషయ మట్లు కాదు. ఆ మిల్లులో ఉత్పత్తిఅయిన పంచదారలో ఏ జంతు సంబంధమైన దానిని, అనగా బొమికలపొడివంటిదానిని, పంచ

దారను శుభ్రపరచుట కుపయోగించేవారు కారట. అందువల్ల జైన మతస్థులు, శాకాహారులు దీనిని ఆప్యాయంగా కొనుక్కొనే వారట. ఈ పంచదార పలుకు గలిగి, తెల్లగా చూచుటకు బాగుగా వుండేది. ఇది చాలా పెద్ద కేసు అయినందున దీని విచారణ బరంపురంలోనే జరిగేది. నేను క్యాంపులో విచారించేవి చిన్నతరహా కేసులు. చిల్లర దుకాణాలు, పచారి దినుసులు వగైరా అమ్మే వర్తకుల కేసులు, వడ్డీవ్యాపారం మొదలైనవి మాత్రమే.

ఇక్కడి భూముల్లో వరిధాన్యమే గాకుండా కాబేజి, కాలి ఫ్లవర్, బటాణి మొదలైన కూరవస్తువులను పండించేవారని పైన చెప్పాను. అనుకూల వాతావరణంవల్ల ఇవి మిక్కిలి పెద్దవిగాను, ఆరోగ్యవంతంగాను వుండేవి. మిక్కిలి చౌకకూడ. ఆస్కాలో పండించే బటాణీకంటె, ఖరగ్‌పూర్‌లో పండించే బటాణీ మేలు. వీశె 1కి బేడో, పావలో వుండేది. ఇక్కడకు చుట్టుప్రక్కల చిట్టడవులనుండి కట్టెపుల్లలు వచ్చేవి. పొడుగ్గా కట్టలు కట్టి, ముఖ్యంగా స్త్రీలు తలమీద మోసుకొని వచ్చేవారు. బరంపురంనుండి ఉత్తరంగా, ఆస్కా మీదుగా ఘుంసూరు, ఉదయగిరి వరకు ఓఢ్రుల పుట్ట. తెలుగువాళ్లు మచ్చుకైనా కనపడరు. ఆస్కా నుండి బియ్యం, మొరమొరాలు బెల్లంతో కలిపి, ఫుట్‌బాలంత గుండ్రని ఉండలుచేసి, ప్రయాణాలలో ఆహారంగా ఉపయోగించటం జాస్తి. ఒకటి రెండుండలు గావంచాకు కట్టుకొంటే, సామాన్య ప్రయాణీకునకు దమ్మిడీ ఖర్చు లేకుండా ఒకటి రెండు రోజుల ప్రయాణం గడుస్తుంది.

## రసుల్‌కొండ

ఇది ఆస్కాకు 25 మైళ్ల దూరంలోవున్న చిన్నపట్టణం. ఇక్కడనుండి ఏజన్సి, అనగా చిన్నచిన్నకొండలు, చిట్టడవులు. మన్యప్రదేశాలు ప్రారంభం. రసుల్‌కొండ ప్రదేశం శీతాకాలంలో పీరభూమివలె వుంటుంది. నవంబరు, డిసెంబరు, జనవరి నెలల్లోనూ, వేసవికాలం అనగా, ఏప్రిల్, మే నెలల్లోనూ,

ఇక్కడ మకాం మిక్కిలి సుఖప్రదంగా వుంటుంది. మకాంకు ఇన్‌స్పెక్షన్ బంగళా వున్నది. కాని అది చిన్నది. అంత అను కూలమైనదికాదు. ఈ ప్రాంతం ఫారెస్టు ఏరియాలోనిది. కాబట్టి ఫారెస్టు డిపార్టుమెంటువా రున్నారు. వారి పెద్ద ఉద్యోగులు మకాంచేయటానికి సువిశాలమైన బంగళా కలదు. ఈ బంగళాలో మధ్యహాలు, ఈప్రక్క, ఆప్రక్క స్నానగదులతో కూడిన గదులు, ముందు మిక్కిలి విశాలమైన వరండా, వెనుకప్రక్క వంటగదులు మొదలైనవి పెద్ద ఆవరణలో వుండి, పూలచెట్లతో మిక్కిలి శోభాయమానంగా వుండేది. ఇక్కడి మకాం ఇంటి వద్ద నివసించుటకంటె ఉల్లాసకరంగా ఉండేది.

అంతగా చెప్పుకోవలసిన ఆదాయంపన్ను నిచ్చే కేసులు లేవు. ఆస్కాలో వున్న కేసుల కంటె ఇక్కడి కేసులు ఎక్కువ శ్రమ నిచ్చేవికావు. కాని ఇక్క డొక విశేషమున్నది. కలప వ్యాపారం జాస్తి. దానినుండి వచ్చు ఆదాయంపన్ను ఇతర చోట్ల కలపవ్యాపారంనుండి వచ్చుదానికంటె హెచ్చు. మైనర్ ఫారెస్టు ప్రాడ్యూస్ వ్యాపారం లాభసాటిదే.

ఆఫీసరుకు పన్ను విచారణ సౌలభ్యం కంటె, ఉనికి వలన కలుగు సుఖం, సంతోషం మెండైనవి. పరిసరాలు పచ్చని చెట్లు, పొదలు, బయళ్లతో కన్నులపండుగగా ఉండును. వాతావరణం చలికాలంలో పెళుసు (క్రిస్ప్) పొడిచలి, ఉదయాన లేత ఎండ, మధ్యాహ్నం తీవ్రముకాని ఎండ, సాయంత్రం చలిచలిగా వుండే ఎండ. స్వచ్ఛమైన గాలి. వేసవిలో ఎండతీవ్రత లేక చల్లగా, నెమ్మదిగా వీచు మలయానిలంవంటి గాలి. ప్రాణం హాయిగా, మనస్సు ఉల్లాసంగా ఉండును.

మాంసాహారులైన ఆఫీసర్లకు ఇది భోగభూమి. అడవి కోళ్లు, పచ్చపావురాలు మొదలైనవి దొరుకును. వాని మాంసము మంచి రుచి. ఇక్కడి మేకలు మిక్కిలి పొట్టివి. మామూలు మేక పిల్లలవంటి కురచ, స్వల్పశరీరాలు గలవి. కాని, వాని మాంసం మిక్కిలి రుచి. మాంసం విషయంలో నాకు తరచుగా గుర్తుకు వస్తూ ఉండేవి రసుల్‌కొండ చిన్నమేకల మాంసము. అనంతపూర్

జిల్లాలోని కల్యాణదుర్గ ప్రాంతంలోని మిక్కిలి పెద్దవైన మేకల మాంసం, ఆ జిల్లాలోని పెనుగొండ, హిందూపురములో దొరుకు గొర్రెల మాంసం—ఈ మాంసములు మిక్కిలి మెత్తగాను, చిక్కగాను, రుచికరముగాను వుండును. ఈ మేక, గొర్రె మాంసముల వంటి మాంసములు నా కితర చోట్లలో తటస్థించలేదు.

ఇక్కడి మకాంలో ఇనుపబద్దలచట్రంమీద గొడ్డుచర్మం కప్పిన తోలుపెట్టెలను చేయించాను. అసిస్టెంటు కమిషనర్ శ్రీ రామిస్వామి అయ్యంగారు "నాకు కూడా కావా"లంటే వారికి కూడా చేయించిపెట్టాను.

## ఘుంసూరు-ఉదయగిరి, తిక్కాబలి మకాంలు

రసుల్‌కొండ నుండి 18 మైళ్లు సాదారోడ్డు పై కెక్కుచు, అక్కడి నుండి 12 మైళ్లు ఘాట్ రోడ్డుమీద కొండ ఎక్కాలి. ప్రయాణం 12 మైళ్లూ బస్సులోనే. బస్సు డమ డమ కొట్టుకొనుచు, ఘీంకారం చేస్తూ కొండ నెక్కేది. ఘుంసూరు-ఉదయగిరి బంగళాలో ఒకసారి మాత్రమే మకాంచేసినట్లు గుర్తు. దానికి 9 మైళ్ల దూరములో నున్న తిక్కాబలి అను కుగ్రామంలో ప్రతి సంవత్సరం మకాం చేసేవాడిని. అయితే ఘుంసూరు-ఉదయగిరి ఊళ్లోకిగాని, తిక్కాబలి ఊళ్లోకిగాని వెళ్లియుండలేదు. ఈ రెండు బంగళాలు ఊరి బయటనే వున్నవి. బంగళాలు చిన్నవి. అరుదుగా గాని ఆఫీసర్లు క్యాంపు చేయరు. అయితే వంటకు పుల్లలు, కూరగాయలు పుష్కలం. పాలకు కొంత ఇబ్బందేగాని, జవానులు ప్రాత అలవాటు చొప్పున సమకూర్చేవారు. మన్యప్రదేశం. కేసులు చిన్నవి. సంఖ్య తక్కువ. క్యాంపుకూడ 3, 4 రోజులు మాత్రమే. తిక్కాబలిలో వారం వారం సంత. ఒక సంతకు వెళ్లి చూచాను. కోందులు వగైరా కొండజాతులవారు కూరగాయలు వగైరా అమ్మేవారు. వాళ్లు గంపలనిండా తెచ్చిన పెద్ద పెద్ద టొమాటోపళ్లు నన్ను ఎక్కువగా ఆకర్షించినవి. వీశె ఒక అణా మాత్రమే. కాబేజి, కాలిఫ్లవర్, కారట్, నూల్‌కోల్ వంటివి పుష్కలం. ఉరియా వర్తకులు బియ్యం

నూనె, ఉప్పు, చింతపండు, మిరపకాయల వంటివి దుకాణాలు పెట్టారు. అక్కడి ప్రజలకు తగిన వస్తువులుండేవి.

నేను సర్వసామాన్యంగా మకాం బంగాళా వరండాలో నిద్రించేవాడను. కాని శీతాకాలంలో తిక్కాబలి మిక్కిలి చలిప్రదేశం. అందువల్ల లోపలనే నిద్రించేవాడను. అయినా చలి ఎక్కువ. అందువల్ల తలకు ఉన్ని మఫ్లర్ చుట్టుకొని, ఉన్ని షర్టుమీద ఉన్ని బనీను వేసుకొని, శాలువాతోపాటు రగ్గు కూడా కప్పుకొనేవాడను. క్యాంపు శీతాకాలములోనే. చలి అయినా సుఖప్రదంగా వుంటుంది. అందువల్ల నవంబరు, జనవరి మధ్యకాలంలో నా క్యాంపు. చిన్న వర్తకులను కొండక్రిందకు లాగటంకంటె, కొండపైనే వారికేసులు విచారిస్తే వారికి అనుకూలం. ఆఫీసరుకు సరదాతీరుతుంది. మన్యప్రదేశంలో క్యాంపుకు ఎక్కువ డబ్బు వస్తుంది.

మొదటి సంవత్సరం తిక్కాబలికి 50 మైళ్ల దూరములో వున్న బెల్లిగూడ ఏజన్సీకి వెళ్లాను. ఇది అడవి ప్రదేశం. అక్కడ ఏ అయిదుగురో, ఆరుగురో ఉరియా వర్తకులు తప్ప తతిమ్మావారంతా కొండజాతి వారగు కోందులు. అక్కడి స్త్రీలు బొడ్డు క్రిందిభాగం సగంవరకు సరిపడు మందపు గుడ్డను చుట్టుకొందురు. బొడ్డు పైభాగమంతయు ఏగుడ్డతోనూ కప్పబడి వుండదు. వక్షస్థలాన్ని కొంతవరకు మరుగుపరిచే పూసల హారాలను మాత్రమే వేసికొంటారు. మిక్కిలి అరుదుగా క్యాంపు చేయు ఆఫీసర్ల గౌరవార్థం, కోందుస్త్రీలు పైచెప్పిన అర్ధనగ్నంగా నృత్యం చేసేవారు. నేను మాత్రం ఎందుకు చేయించకూడదని ఒక సాయంత్రం నృత్యం జరిపించి, వారికి తగిన బహుమతి నిచ్చాను. నేను ముచ్చటపడినమాటటుంచి, నాతో వచ్చియుండిన నా ఉరియా గుమాస్తా, జవాన్లు వింతతోకూడిన సంతోషాన్ని పొందారని అనుకొంటాను. నాకు ముందు ఆఫీసరుగా వుండిన వారెవరును, ఆ బెల్లిగూడ ఏజన్సీకి క్యాంపుకు పోయివుండలేదు. గంజాం జిల్లా సర్కిలును 1925 సంవత్సరంలో ప్రారంభించారు. మొదటి ఆఫీసరు శ్రీ అబ్దుస్ సలాం సయ్యద్

గారు. వారు ఘుంసూరు-ఉదయగిరిలో ఒక రోజుండి జ్వరపడి, భయగ్రస్తులై తిరిగి వెళ్లిపోయినారట. తిరిగి ఆప్రాంతాలకే వారు వెళ్లలేదు. ఈ బెల్లిగూడ ఏజన్సీలో మలేరియా, దోమ కాటు జాస్తి. అక్కడి నీరు త్రాగినవెంటనే జబ్బు పడుదురట. ఈసంగతిని రసుల్‌కొండ పోలీసు అసిస్టెంటు సూపరింటెండెంటుగా వుండుచుండిన సుబ్బరామన్ అనువారు మాటల సందర్భంలో నా ఏజన్సీ క్యాంపు ప్రయత్నం తెలిసికొని, మిక్కిలి స్నేహ పూరితంగా దోమలను చొరనివ్వని గుడారంవంటి వారి దోమ తెర నిచ్చారు. దాని నుపయోగించుకొని దోమలకాటుకు గురికాకుండా బైటపడ్డాను. అక్కడి నీరు త్రాగకూడదని కొన్ని డజనుల సోడాసీసాలను పట్టుకొని వెళ్లాను. ఆ ఏజన్సీకి ఏ చిన్న బస్సు లేనందున రసుల్‌కొండ నుండి అద్దెకారులో వెళ్లాము. నీటికి బదులు సోడా మాత్రమే త్రాగాను. ముచ్చటగా 3 రోజులుండి చిల్లర కేసులు అరడజనో, డజనో పూర్తిచేసు కొని సురక్షితంగా ఇంటికి చేరుకొన్నాను.

తిక్కాబలి సమీపంలో చర్మశుద్ధికర్మాగారా లుండేవి. ఒక కర్మాగార యజమానులకు రసుల్‌కొండలో కూడా ఆఫీసు, దుకాణా లుండేవి. గంజాం జిల్లాలో అడవిప్రాంతం జాస్తి గనుక, అడవుల్లో మేస్తూ చనిపోయే పశువుల కళేబరాలు జాస్తిగా వుండును. తోళ్లను అడవి జాతులవారి నుండి చౌకగా కొని, వీరు వ్యాపారాన్ని సాగించుచుండినారు. ఘుంసూరు-ఉదయగిరి ఏజన్సీలో పెద్దపులులు అప్పటికి జాస్తిగా వుండినవట. వానిని వేటాడినప్పుడు, ముసలితనంవల్ల లేక వ్యాధివల్ల చనిపోయి నప్పుడు లభించే పులితోళ్లను చర్మవ్యాపారులు సేకరించి, రసుల్ కొండలోను, ఇతర ప్రాంతాలలోను ఉద్యోగంచేయు పెద్ద ఉద్యోగులకు బహుమతిగా ఇచ్చేవారు. నే నెరిగినంతవరకు తోళ్ల వ్యాపారం మహమ్మదీయులే చేస్తూ వుండేవారు. వారు గొఱ్ఱె, మేక చర్మాలనుగూడ కొని అమ్మేవారు. వారిలో నొకరు నా కొక మధ్యరకం సైజు పులి చర్మాన్ని, చిరుతపులి చర్మాన్ని బహూకరించారు. గంజాం జిల్లా కలెక్టరుగా వుండిన శ్రీ టి.

భాస్కరరావునాయుడుగారింట్లో నేనొక మిక్కిలి పెద్ద పులిచర్మాన్ని చూచాను. అది రసుల్ కొండ ప్రాంతంనుండి వచ్చిందే. నాకు పులిచర్మం బహూకరించిన మహమ్మదీయుడు పిల్లలుగా నున్న ప్పుడే బీజాలు కత్తిరించివేసిన కోడిపుంజులను సాకేవాడు. ఈ పుంజులు క్రొవ్వుతో బలిసి యుండేవి. వాని మాంసము మిక్కిలి రుచికరముగా వుంటుంది.

## సురడా

ఇది కూడా చిన్న క్యాంపే. ఇక్కడి బంగళా ఒక చిన్న కొండ నించుమించుగా ఆనుకొనివున్నది. చిరుతపులి భయ ముండేది. వరండాలో గాక లోపలే పడుకొనియుంటాను. ఈ క్యాంపులోనే మొదటిసారి జిల్లా ఫారెస్టు ఆఫీసరు కె. జి. బల్లియప్ప గారిని కలుసుకొన్నాను. వారు మిక్కిలి స్నేహపాత్రులు. సరసులు, సహృదయులు. తర్వాత వారి భార్యను, కొడుకును, కూతురును 1935 రసుల్ కొండ క్యాంపులో కలసికొన్నాను. పిల్లలు కాన్వెంటులో చదువుచున్నందువల్ల ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడినారు. భార్య చాలా మర్యాదస్థురాలు. శ్రీ బల్లియప్పగారు యూరపియన్ స్టైలులో ఉండేవారు. నేను విచారించవలసిన కేసులు అంతంతమాత్రం. విచారణ శ్రమ తక్కువ. గాలిపాటు వగైరా సుఖప్రదం.

## ఛత్రపూరు

ఇది జిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు సూపరింటెండెంటు మొదలైన జిల్లా ఆఫీసర్ల ఉనికి. బరంపురంలో జిల్లా జడ్జి, సబ్ జడ్జి, ఇతర సబార్డినేట్ ఆఫీసర్లు వుండేవారు. ఛత్రపూరు సామాన్య పట్టణం. నేను బరంపురం సర్కిల్ ఛార్జి తీసుకొనిన తర్వాత, కొలదికాలం శ్రీ టి. భాస్కరరావునాయుడుగారు అక్కడ జిల్లా కలెక్టరుగా వుండినారు. నేను వారిని ఆక్స్‌ఫర్డులో బాగుగా, చనువుగా ఎరిగివుంటిని. వారిని చూచుటకు వెళ్లినప్పుడు అక్కడ హైకోర్టు జడ్జిగా పనిచేసిన పి. రాజగోపాల్, ఐ. సి. యస్. గారిని చూచాను. వారప్పుడు సబ్ కలెక్టరుగా వుండినారు.

నేను ఛత్రపూరుకు మొదటిసారి క్యాంపుకు వెళ్లినప్పుడు, సి. నరసింహంగారు జిల్లా పంచాయతి ఆఫీసరుగా వుంటుండేవారు. వారి హెడ్ క్వార్టర్స్ ఛత్రపూరే. వారు నన్ను విందునకు పిలిచి, వారి భార్యగారు స్వయముగా మిక్కిలి రుచిగా పచనంచేసిన మాంసాదులచేత మిక్కిలి తృప్తిపరచారు. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో నేతిని వంట కుపయోగించేవారు. ఈరోజుల్లో ఎక్కువగా నూనెలనే వాడుచున్నారుగాని, ఆ రోజుల్లో ఇంచుమించు పూర్తిగా నేతినే వాడేవారు. తూర్పు గోదావరి జిల్లాలో మాత్రం ఎక్కువగా నువ్వులనూనెను వాడేవారు. అందువల్ల వంట నూనెవల్లనయినా, నేను కృష్ణాజిల్లా వాడనైనా నా కావంటకములు మిక్కిలి తృప్తిని కలిగించినవి. వంటచేయటం తెలిస్తే, ఏవిధంగా నూనెను వాడవలెనో తెలిస్తే నూనెతోచేసిన మాంసాదుల వంటకాలే ఒకవిధంగా ఎక్కువ రుచికరంగా వుంటవేమో అనిపించింది.

ఆ క్యాంపులో నరసింహంగారికి మిక్కిలి పరిచితుడు జానకిరామయ్య అనేవారు నాకు పరిచయ మయ్యారు. శ్రీ జానకిరామయ్య ఛత్రపురంలో చిన్న ఉద్యోగి. ఆయన నేను బరంపురంలో వున్నంతకాలం అప్పుడప్పుడు కలసికొనేవారు. మంచి మాటకారి. స్నేహభావముతో మెలగేవాడు. ఒక క్యాంపులో శ్రీ జానకిరామయ్య, ఇక్కడనుండి ఒక యూరపియన్ ఆఫీసరు బదిలీ అయి వెళ్లిపోవుచున్నాడు, వారు సామానులను అమ్మివేయుచున్నారు, కాళ్లు చాపి పడుకొనుటకు అనువుగావుండు పేముకుర్చీ ఒకటున్నది, దాని విలువ 25 రూపాయలని చెప్పు చున్నారు చూద్దాము రండని తీసుకొనివెళ్లాడు. నేనుచూచి, పనికివస్తుందనుకొన్నాను. అయితే అప్పుడు నావద్ద డబ్బు తక్కువగా వున్నందున 15 రూపాయలు శ్రీ జానకిరామయ్యనుండి తీసుకుని కొన్నాను. ఆ 15 రూపాయిలను కొంత కాలానికిగాని ఇవ్వ లేదు. ఎప్పటి కప్పుడు డబ్బు కక్కుర్తి వుండేది. దీనినిబట్టి నే నెంత దుబారామనిషినో అర్థ మవుతుంది

పన్నువిచారణకేసులు సామాన్యములే. చెప్పుకోవలసినవి ఏమిన్ని లేవు.

# గోపాలపురం

ఇది చిన్న పట్టణం. సముద్రతీరాన బరంపురానికి 9, 10 మైళ్ల దూరములో వున్నది. సముద్రస్నానానికి, షికారుకు అనువైన ప్రదేశం. కలకత్తా మొదలగు దూరప్రదేశములనుండి వినోద యాత్రికులు వచ్చుదురు. ఇక్కడ శ్వేత దంపతులచే నిర్వహింపబడు ఒక మంచి హోటలుండినది. బీచి మధ్యరకం. కాని, వాతావరణం బాగావుంటుంది. కొబ్బరి వగైరా తోటలు జాస్తి. సముద్రతీరం తెల్లని ఇసుకతో శుభ్రంగా వుంటుంది.

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు వేసవికాలములో సంవత్సరమున కొకసారి ఇక్కడ క్యాంపుచేస్తాడు. కేసులు చిన్నవి. ఆయనకు విశ్రాంతి కలుగుతుంది.

ఈ సముద్రతీరాన తెల్ల చందువ చేపలు పుష్కలంగా దొరుకుతవి. నల్ల చందువాల కంటె తెల్లవి మిక్కిలి రుచికరమైనవి. ఒక సంవత్సరం క్యాంపులో, ప్రతిరోజూ మా వంటవాడు చందువాలు వండేవాడు. పైగా ఎక్కువగా వడ్డించేవాడు. వానిని రోజూ ఎక్కువగా తినటంవల్ల నాకు విరోచనాలు ప్రారంభమైనాయి. తరువాత ఆ చేపలను కొంతకాలం ముట్టుకొనలేదు.

ఆదివెలమ కులానికి చెందిన కొందరిక్కడ నివసిస్తూ వ్యాపారము చేస్తూండేవారు. ఇప్పటికిని చేస్తున్నారు. కోకా అప్పారావుగారు అనేవారు వచ్చి పోవు ఓడలకు సరుకులను, భోజనం మొదలైనవాని కుపయోగించే వస్తువులను సరఫరా చేసేవారు. రంగూన్ మొదలగు దేశములనుండి వచ్చిన సరుకులను వాని యజమానులు తీసుకొనిపోయే వరకు తమ గోదాములలో నిల్వచేసేవారు. కోకా చిన కామయ్యనాయుడుగారు, వారి కుమారుడు గోవిందరాజులునాయుడుగా రిక్కడ కాపుర మేర్పరచుకొన్నారు. గోవిందరాజులునాయుడుగారు నాకు స్నేహితులైనారు. ఒకనాడు వారు వారి తోటకు తీసుకొని వెళ్లి, లేత కొబ్బరికాయనీళ్లు ఇచ్చారు. ఒక చెట్టు వద్ద నేలమీద ఇసుకలో కూర్చుని యుండగా, వారి నౌకరు చెట్టుపైనుండి బొండాలను క్రిందకు దింపాడు. అవొకరకం గంగాఫలములు. ఒక బొండం

లోని నీరే ముక్కాలు లీటరువరకుండినది. అంత జాస్తినీరు ఏ బొండం నుండీ లభ్యమవటం ఇంతవరకు నేను ఎరిగియుండలేదు.

## ఇచ్ఛాపురం

ఇది బరంపురానికి 20 మైళ్ల దూరంలో వున్నది. తాలూకా ముఖ్యపట్టణం. చిన్నదే. ఇక్కడి నుండి గంజాం జిల్లా తెలుగు ప్రాంతం ప్రారంభం. నిజానికి గంజాం జిల్లా మద్రాసు ఉమ్మడి రాష్ట్రంనుండి విడిపోయి ఒరిస్సారాష్ట్రంలో చేరినప్పుడు, ఇచ్ఛాపురంనుండి దక్షిణ గంజాం అంతా మద్రాసురాష్ట్రంలో చేర్చబడ్డది. ఇక్కడి రహదారి బంగళా చాలా పెద్దది. ఇది పెద్దదిగా వుండటానికి కారణం. రెండు వరసల స్తంభాలమీద, ముందు వరండాను విస్తృతంగా పెంచటమే. ఇక్కడ బంగారు నగల వర్తకం, ఇతర వ్యాపారం కూడా ఈ చిన్నపట్టణానికి మించినవే. మొత్తంమీద కేసులు మధ్యరకం. అంత శ్రమ యిచ్చేవి కావు. ఇప్పుడది ఆంధ్రప్రదేశ్ లోకి వచ్చింది.

## సోంపేట

ఇది ఇచ్ఛాపురానికి 10 మైళ్లలో వున్నది. దీని విశేషం, దీని పరిసరప్రాంతం ఉద్దానం అని పిలువబడే తోటల భూమి. ఇక్కడ కొబ్బరి తోటలు జాస్తి. జీడిమామిడి తోటలు కలవు. అనాసపండ్లు, పనసపండ్లు ఎక్కువగా పెంచుతారు. ప్రదేశమంతయు ఇసుక గరపనేల. ఉద్దానంలో చిన్న చిన్న గ్రామాలున్నవి. ఈ ఉద్దానంలో సాయంత్రం షికారుకు వెళ్లితే, మిక్కిలి సౌఖ్యప్రదంగా వుంటుంది. ఈ ప్రాంతంలోని ప్రజలు విద్యావిహీనులైన బీదవారు. ఈ ప్రదేశంలో ఒకప్పుడు కాళింగులు మిక్కిలి పలుకుబడిగలవారుగా వుండేవారట. వారిలో కొందరు ప్రముఖులు స్త్రీల విషయములో స్వేచ్ఛావిహారం చేసేవారట. భర్త కాయకష్టం చేసుకొనటానికి బైటకు పోగా, ఒంటరిగా వున్న అతని భార్యతో కామకలాపాలు జరిపేవారట. ఇంటిలోకి వెళ్లే ముందు చెప్పులు విడిచి, కర్రను బైట గుమ్మం ప్రక్కను ఆనించేవారట. ఒక

వేళ ఆమె భర్త ముందుగా తిరిగివస్తే ఆ చెప్పులు, కర్ర చూచి తిరిగి వెళ్లిపోయేవాడట.

వ్యాపారం ఉద్దానంలో పండే కొబ్బరికాయలు వగైరాయే గాక, చిల్లరదుకాణాలు, బట్టలకొట్లు ఎక్కువగానే వుండేవి. ఇక్కడ బంగారం వస్తువులు తయారీ, అమ్మకం హెచ్చు. ఒకటి, రెండు పెద్ద బంగారంకొట్ల కేసులను బరంపురంలో విచారించే వారం.

## బారువ

సముద్రతీర ప్రాంతం, పెద్ద పల్లెటూరువంటి చిన్నపట్టణం. ఇక్కడి సముద్రతీరం బారుగాను, విశాలంగాను వుంటుంది. ఇది చిన్న ఓడరేవు. కూలిజనులు రంగూన్‌కు ఇక్కడనుండి వెళ్తారు. ఊరు వెలుపల నున్న బంగళాకు మంచినీళ్లు కొంత దూరాన వున్న నూతినుండి తెచ్చుకోవాలి. ఒక వేసవి (1935) క్యాంపుకు (సముద్రతీరాల క్యాంపులు వేసవిలోనే) నా భార్యతో వెళ్లి 4, 5 రోజులు గడిపాను. ప్రతి సాయంత్రం పెందలకడనే పని పూర్తిచేసుకొని ఇసుకలో నడచి, కొంచెం దూరంలోవున్న తీరాన్ని పచారుచేసే వాళ్లం. నిజానికి నాభార్యతో మిక్కిలి తృప్తిగా గడిపింది ఆ రోజులే అనుకొంటాను. ఇక్కడి కేసులు మిక్కిలి చిన్నవి. మిక్కిలి తక్కువగా విచారణకు వచ్చేవి. వేసవి కాలంలో పని తక్కువ, విశ్రాంతి ఎక్కువ. ఈ ప్రాంతంలో నేను గమనించిన విశేషం రెడ్డిగీలు అనే కులస్తులు. వీళ్లు పల్లెకారులవలె చేపలుపట్టుకొని జీవిస్తారు. ఇతర కూలిపనులు చేసినా, చేపలు పట్టుటమే వాళ్ళ ముఖ్య జీవనాధారమని నాకు తట్టింది. ఈ కులస్తులు రాజమండ్రివంటి పట్టణాలకు చేరి రెడ్డికులస్థుల మని చెప్పుకొనుచున్నారట.

## టెక్కలి

ఇది టెక్కలి జమీందారుండే ఒక పెద్ద గ్రామంవంటి చిన్నపట్టణం. దీనిగుండా కలకత్తా—మద్రాసును కలిపే, ఈశాన్య

రైలుమార్గము పోవును. రైల్వేస్టేషను చిన్నదైనను ముఖ్యమైనదే. చెప్పుకోవలసిన కేసులుగాని, విశేషాలుగాని లేవు. క్యాంపు రెండు మూడు రోజులే. సంవత్సరానికొకసారి క్యాంపు. పన్నురాబడి చాలా స్వల్పం.

## కళింగపట్టణం

ఒకప్పుడిది మిక్కిలి ప్రసిద్ధిగాంచిన ఓడరేవు. బారువ నుండికంటె ఇక్కడినుండి మిక్కిలి హెచ్చుగా రంగూన్‌కు బీదప్రజలు కూలి నాలికి వెళ్లేవారు. కొంతమంది నాలుగు డబ్బులు సంపాదించి కొలది సంవత్సరాలకు తిరిగి వచ్చేవారు, కొంతమంది అక్కడే స్థిరపడిపోయేవారు. సామాన్య వ్యాపారం, కొద్దిపాటి పన్నురాబడి.

## నౌపాడ

ఇది సముద్రతీర జన స్థలి. ఇక్కడి విశేషం ఉప్పును ఉత్పత్తి చేయటం. శ్రేష్ఠమైనది ఉప్పు. ఉప్పును తయారుచేసే వేసవికాలంలో తళతళ మెరిసే ఉప్పుకుప్పలతో నిండి, ఈ ప్రాంత మంతయు మిక్కిలి ముచ్చటగా వుండును. గంజాం జిల్లావారే గాక విశాఖపట్టణం, విజయనగరాలకు సంబంధించిన కొందరి కిక్కడ ఉప్పు కొఠారులు కలవు. వారు రైతులకు పెట్టుబడి పెట్టి, ఉప్పును తయారుచేయించి ఎగుమతి చేయించేవారు. వీరేగాక, గంజాం జిల్లాలోని పెట్టుబడిదారులు కూడా చాలావరకు తెలుగు వారే. ప్రభుత్వంనుండి భూములను గుత్తకు తీసుకొని కాలుకో, పాటకో ఉప్పును తయారు చేయించేవారు.

నౌపాడ నాకు క్రొత్తది కాదు. నేను ప్రొబేషనరి ఆఫీసరుగావుండే కాలంలో నౌపాడ తనిఖీకి వెళ్లాను. మా అసిస్టెంటు కమిషనరుగారు "ఉప్పు పండించేవారు, ఉప్పు వర్తకులు లెక్కలు సరిగా చూపించేటట్టులేదు చాలా తక్కువ ఆదాయాన్ని చూపిస్తున్నారు. అకస్మాత్ తనిఖీ చేయుం" డని చెప్పారు. అసిస్టెంటు కమిషనరు అబ్దుస్ సలామ్ సయ్యద్‌గారు మొదటిలో ఎక్సైజు అన్డ్ అబ్కారి డిపార్టుమెంటులో వుండేవారు. క్రొత్తగా

1922 ఆక్టు క్రింద ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటు ఏర్పడి, ప్రప్రథమంగా 1925 లో జిల్లాలలో ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్లను ఏర్పరచినప్పుడు శ్రీ సయ్యద్‌గారు గంజాం జిల్లా ఆఫీసరుగా నియమింపబడినారు. అందువల్ల గంజాం జిల్లాలోని వివిధ ప్రదేశాలు, వ్యాపారాలు వారికి బాగుగా తెలుసును. వారి ఆజ్ఞప్రకారము బంట్రోతును తీసుకొని నౌపాడకు వెళ్లాను. అది డిసెంబరు మాసమైనా ఊరంతా మశూచికాలతో, ప్రతి ఇంట్లోను ఒకరో, ఇద్దరో మూల్గుచూ పరుండినారు అయినా, నేను ధైర్యంచేసి వెనుకాడుచున్న జవానును మందలించి ఇండ్లలోకి వెళ్లి నా ధర్మాన్ని నేను నెరవేర్చాను. అది మొండి ధైర్యమే. అప్పుడు వయస్సులో వున్నాను. పైగా నా ఆక్సుఫర్డు తరిఫీదు అక్కరకు వచ్చింది.

ఆఫీసరుగా నేనే వూరిలోకి పోయియుండలేదు. ఊరి బైట నున్న రహదారి బంగళాకు ఊరిలోని కుళ్ళు, కంపు దరిజేరవు. పైగా తనిఖీకి ఇన్‌స్పెక్టరుంటాడుకదా. అందువల్ల నేనీదఫా నౌపాడ ఊరిలోకి వెళ్లలేదు. వచ్చిన కేసులను రహదారి బంగళాలోనే విచారించి పూర్తిచేశాను. గంజాం జిల్లావి ఒకటి, రెండు పెద్ద కేసులు (ఉప్పువి) ఉంటే బరంపురంలోనే విచారణ జరిపేవారం.

## పలాసా

ఇక్కడి విశేషం జీడిపప్పు తయారీ. జిల్లాలో దొరికే గింజలే గాక బైటనుండి దిగుమతి చేసుకొంటారు. పెనాల్లో వేయించి, కూలీలచేత వేయించిన గింజలను పగులగొట్టించి, పప్పును గుండు, బద్ద, ముక్కగా ఏర్పించి కలకత్తా మొదలైన చోట్లకు ఎగుమతి చేస్తారు. గుండు పప్పు అమెరికావంటి విదేశాలకు కలకత్తా నుండి ఎగుమతి అవుతుంది. ఎగుమతికి తయారుచేసే పప్పుకు గాను గింజలను సగంమాత్రమే వేయించేవారు. పగులగొట్టే కూలీలు ఇంచుమించుగా అందరూ స్త్రీలే. స్థానికంగాగాని, ఇతరత్రాగాని అప్పటికప్పుడు తినటానికి గింజలను పూర్తిగా వేయించేవారు. నేనొక క్యాంపులో తయారుచేసే బట్టీలకు వెళ్లి

వేయించటం, పగులగొట్టి పప్పుతీయటం చూచాను. నోరూరించకుండా వుండలేకపోయాను. ఇంటికి కొంత తెచ్చుకొన్నాను.

మరొక విశేషం. ఇక్కడి ములగకాయలు పొడవుగాను, బలిష్ఠముగాను వుంటవి. అయితే, వాని గుజ్జు మిక్కిలి మృదువుగాను, పుష్కలంగాను, రుచిగాను వుంటుంది.

బరంపురంలో విచారించవలసిన పెద్దకేసు లీ ప్రాంతంలో లేవు. క్యాంపు కేసులు చిన్నవే.

## హిరమండలము

ఇక్కడ కుష్ఠురోగులు జాస్తి. వెళ్లిన తర్వాతగాని నాకు తెలియలేదు. బెరుకు బెరుకుగా 3, 4 రోజులుండి తర్వాత వెళ్లనేలేదు. మిక్కిలి చిన్నప్రదేశం. పన్నురాబడి చాలా తక్కువ.

## శ్రీకాకుళం

ఇది నా రోజుల్లో (1932-36) ఒకమాదిరి పట్టణం. ఒకప్పుడు అనగా, మహమ్మదీయులకాలంలో ప్రసిద్ధికెక్కి ఉండినది. ఇక్క డొక నవాబుండేవాడట. ఆ రోజుల్లో హైదరాబాదుకు, దాని పరిసరప్రాంతాలకు వెళ్లే రహదారి అట. తపాలా బట్వాడా కేంద్ర మట. వచ్చిన తపాలా సంచులను పగులగొట్టి, వెళ్లే తపాలా సంచులకు సీళ్లు వేసేవారట. శిఖాఅంటే సీలు అట. శిఖా అను పేరు చికా అయి తరువాత, ఊరు చికాకోలు అయి, చివరకు శ్రీకాకుళంగా మారిందట. ఇక్కడ అమీర్ గేటు అని ఒక పెద్ద శిథిలావస్థలో వున్న ముఖద్వార మున్నది. ఇది మహమ్మదీయుల పరిపాలనను సూచిస్తున్నది. రహదారి బంగళా వెనుక నానుకొని సమీపానవున్న నాగవళినది ప్రవహించుచుంటుంది. బరంపురానికి శ్రీకాకుళం, దక్షిణంగా 100 మైళ్ల దూరంలో వున్నది. దీనికి దక్షిణంగా 20 మైళ్ల దూరంలో, దూసి వద్ద వంశధారనది వున్నది. ఈ వంశధారనదియే గంజాం జిల్లా దక్షిణ సరిహద్దు. చికాకోలు(శ్రీకాకుళం) ఈశాన్యరైలుమీద లేదు. దీనికి వెళ్లే రైలుస్టేషను ఆముదాలవలస. ఈ రెంటి మధ్య దూరం 9 మైళ్లు.

ఆ రోజుల్లో శ్రీకాకుళం (చికాకోలు) తాలూకా ముఖ్య పట్టణం మాత్రమే. తాలూకా ఆఫీసర్లు, డిస్ట్రిక్ట్ మునిసిఫ్, ఇన్‌స్పెక్టర్లు వంటి చిన్న ఉద్యోగు లుండేవారు. పరిశ్రమలు లేవు. మామూలు వ్యాపారం ఫరవాలేదుగాని, ఎగుమతి దిగుమతుల వ్యాపారం ఉండేదికాదు. అయితే కొంత సంస్కృతి, సంస్కారం కలచోటు. నవాబులనాటి సంచలనం పూర్తిగా పోలేదు. బాగుగా చదువుకొన్నవారు, లౌకికులు, పదిచోట్లు తిరిగేవారు, వాదోపవాదాలు చేసేవారు, ధీమాగా, దర్జాగా వర్తించేవారు లేకపోలేదు. స్నేహశీలురు కూడా ఉండినారు. శ్రీకాకుళం పూర్తి తెలుగు ప్రదేశమేగాని, ఓఢ్ర సంప్రదాయంగల కళింగ కోమటులుగూడా ఉండేవారు. గౌర కోమటులు అనగా ఆర్య వైశ్యుల మని చెప్పుకొనే వారే ఎక్కువ ప్రాబల్యంగలవారు. వారిలో ఇద్దరు, ముగ్గురు గట్టి వకీళ్లు, నాజూకు కుటుంబా లుండే వారు. చికాకోలు తెలగాలు మంచికాపులు (బలిజలు) అని వాడుక. వారి శ్రేష్ఠతకు రాజమండ్రి మొరక వీధి కాపులతో పోలుస్తారు. ఆ ప్రాంతంలో కాపులని పిలువబడే ఇంకొక కుల మున్నది. ఆ కులం తమ కులంకంటె తక్కువని, శ్రీకాకుళం వారు తమను కాపు లనటానికి ఒప్పుకోరు. ఈ తెలగాలు పూర్వ కాలంలో యుద్ధంలో పేరొందినవారట. ఇప్పటికిని రాజసంగానే వుంటారు. వకీళ్లలో బరాటం వెంకట రమణయ్యగారు వగైరా గాక పేరొందిన బుర్రా వారి కుటుంబ ముండినది. వీరు ముగ్గు రన్నదమ్ములని గుర్తు. ఇద్దరు శంకరశాస్త్రిగారు, దేవేంద్రనాథ శాస్త్రిగారు చికాకోలులో ప్రాక్టీసు చేసేవారు. మూడోవారు విశాఖపట్టణంలో ప్రాక్టీసు చేసేవారు. వారిపేరు సుబ్రహ్మణ్య శాస్త్రి అని గుర్తు. దేవేంద్రనాథశాస్త్రిగారు నన్ను కలుసు కొనుచుండేవారు.

నా కక్కడ బాగా పరిచయమైనవారు ముగ్గురు. ఒకరు ఇప్పిలి సూర్యనారాయణచెట్టిగారు. వీరు కళింగ కోమటులు. వయస్సు మళ్లినవారు. చాలా సరసులు. స్నేహపాత్రులు. వారి కేదో చిన్న వ్యాపార ముండినది. రెండవవారు వీరవల్లి బుచ్చబ్బాయిగారు. వీరు దేవతా కోమట్లట. చాలా నెమ్మదిగా

వర్తించే పెద్దమనిషి. మూడవవారు విశ్వనాథ భాస్కరరావు గారు. వీరు బ్రాహ్మణులు. వీరు కూడా స్నేహభావంతో మెలగేవారు. వీరు ముగ్గురూ స్నేహితులు. ఒకరికొకరు తోడుగా వుండేవారు. ముగ్గురిలో శ్రీ సూర్యనారాయణచెట్టి కొలికిపూస.

ఇతర పెద్దమనుష్యులలో రావుసాహెబ్ కత్తిరిశెట్టి నరసయ్యనాయుడుగా రొకరు. మా ఇన్‌స్పెక్టరు సూర్యారావు కూడా కత్తిరిశెట్టి ఇంటిపేరు కలవారే. నరసయ్యనాయుడుగారిని, "బంధుత్వం ఉన్నదా" అని అడిగాను. నవ్వి వూరుకొన్నారు. సూర్యారావును అడిగితే, తటపటాయించి, లేదన్నాడు. దీని భావమేమి తిరుమలేశ! రెండోవారు యాహ్యా సాహెబ్ గారు. వీరు ఎక్సైజ్ ఇన్‌స్పెక్టరుగా వుండినారు. చాలా ఆప్యాయత చూపించేవారు. చికాకోలులోనేగాక బరంపురం, ఇతరచోట్ల కలసికొనేవారు. ఒకసారి తన భార్యను కూడా తీసుకొనివచ్చి నా భార్యకు పరిచయ పరచినారు. వారు ఖందరు వాస్తవ్యులు. పైగా మా నోబుల్ కాలేజి విద్యార్థి. ఆ అభిమానం వారికి జాస్తి. బందరులో పేరుగన్న ఫుట్‌బాల్ ఆటగాండ్ర కుటుంబములోని వారు. ఈ కుటుంబ సభ్యు లందరూ నోబుల్ కళాశాల విద్యార్థులు. మిక్కిలి విశ్వాసంతో, భక్తితో నోబుల్ కాలేజిని అంటకాగి ఉండేవారు. మూడవవారు 1935 అక్టోబరులో శ్రీ బొబ్బిలి రాజాగారు ముఖ్యమంత్రిగా శ్రీకాకుళంలో మకాం చేస్తున్నప్పుడు వారి కొనర్చిన తేనీటి విందు సమయాన కలుసుకొన్న మాజీ జిల్లా జడ్జి న్యాపతి బలరామదాసు పంతులుగారు. వీ రప్పటికే వృద్ధులు. తరువాత ఇంకొకసారి కలుసుకొన్నట్లు గుర్తు.

## నరసన్నపేట

ఇది చిన్న పట్టణమైనా వృద్ధిలో వుండింది. వాతావరణం చల్లగా, హాయిగా వుంటుంది. పొట్టి స్వామిబాబు అనేవా రక్కడ సుప్రసిద్ధులు. వారు కళింగ కోమటులైనా, గౌర కోమటులవలె ఉండేవారు. ఆచార వ్యవహారాల్లో ఆర్య వైశ్యు లనేవారివలెనే నడుచుకొనేవారు. పూర్తి శాకాహారులు. ఎంతో మర్యాదస్థులు.

స్నేహశీలురు. బాగుగా చదువుకొన్నవారు. వారేకాక వారి కుటుంబం అంతా ఢోక్కశుద్ధి అయినవారే. వారి అల్లుడు శ్రీ అంధవరపు లక్ష్మణమూర్తి, శ్రీ శశిభూషణం బాగానే చదువుకొన్నవారు. రెండోవారనుకొందును తెల్లగా, చాలా అందంగా వుండినారు. స్వామిబాబుగారి భార్య పెద్దగా చదువుకోక పోవచ్చునుగాని మంచి మర్యాద, నేర్పు గలవారు. వారు వచ్చి నాతో క్యాంపుకు వచ్చి వుండిన నా భార్యను భోజనానికి పిల్చారు. శ్రీ స్వామిబాబు నన్నాహ్వానించారు. ఆమెగారు మీగడ పెరుగు వడ్డించారు. నేను వ్రేళ్ళతో తడవటంచూచి ఇంకా జాస్తిగా వడ్డించారు. నాకు మీగడ పెరుగు ఇష్టం. స్వామిబాబుగారు విధాన సభ్యులుగా కొంతకాల ముండినారు. వారు జాతీయవాదియే గాక కాంగ్రెసుపార్టీవారు. ఎల్లప్పుడు చక్కని పొందూరు ఖద్దరు దుస్తులను ధరించేవారు. వారి అల్లుళ్లు కూడా ఖద్దరుధారులే.

ఈ క్యాంపులో విశేషం శ్రీ సి. ఎ. రామకృష్ణన్, ఐ. సి. యస్. గారిని ప్రప్రథమంగా కలసికొనటం. వారు మాజీ హైకోర్టు జడ్జి సర్ అనంతరామయ్యరుగారి కుమారులు. చాలా సరసులు. అప్పుడు (జూన్ 1935) వారు నరసన్నపేటలో డిప్యూటీ తహసిల్దారువద్ద తరిఫీదుకు వచ్చారు. 15 రోజులుండి చికాకోలుకు వెళ్లి, ఒక మాసం రోజులు తహసిల్దారు వగైరాల వద్ద తరిఫీదుపొంది తరువాత మద్రాసుకు పరీక్షలు వ్రాయుటకు వెళ్లానన్నారు. అసిస్టెంటు కలెక్టరుగా తరిఫీదును పొందుచుండినారు. తరువాత వారిని మద్రాసులో కలసికొన్నాను. వారి కుమార్తె వివాహానికి, విందుకు హాజరైనాను. ఒక కుమార్తె అరంగేట్రల్ (ప్రథమ నృత్య ప్రదర్శన)కు పిల్చారు. స్వామిబాబుగారు వారి గౌరవార్థం ఇచ్చిన తేనీటివిందులో పాల్గొన్నాను.

## పర్లాకిమిడి

పర్లాకిమిడి జమీందారు కిది కేంద్రస్థానం. విస్తృతమైన ప్రాసాదంలో జమీందారుగారు నివసిస్తారు. వీరి వ్యక్తిగత హోదా రాజా. అప్పటి కింకా మహారాజ హోదా వచ్చియుండ లేదు. వీరు ప్రఖ్యాత పూరి గంగవంశానికి చెందిన క్షత్రియులట.

మిక్కిలి భాగ్యవంతులు. జమీా పెద్దది. వారి కితర ఆదాయా లున్నవి.

శ్రీ రాజాగారికి రెండు అతిథిగృహా లుండినవి. ఒకటి "వసంత విహార్". అది మిక్కిలి సౌందర్యవంతమైనది, సౌఖ్య ప్రదమైనది. పూలతోటలతో, ఫలవృక్షములతో దాని సువిశాల ఆవరణ నిండియుండును. ఒకప్పుడు వైస్రాయిగారు వచ్చి 2, 3 రోజు లుండిరట. ఆ సందర్భంలో చాలా ధనాన్ని వెచ్చించి, దానిని సుందరతమంగా చేశారట. రెండోది రాజాగారి పిల్లల చదువు కొరకు నిర్మించబడ్డది. కొన్ని సంవత్సరాలకు ముందు, పిల్లల చదువు కని టేలర్ అనే ఇంగ్లీషు అధ్యాపకుని నియమించారట. ఆయన నివాసంకొరకు కాబంగళా కట్టబడింది. పిల్లలు కూడా అక్కడే చదువుకొనేవారట. దానికి టేలర్ బంగళా అని పేరు వచ్చింది. చాలా పెద్ద మేడ. ఆవరణ మిక్కిలి పెద్దది. పూలచెట్లు, పొద లుండేవి. ఆ రోజుల్లో అది ఖాళీగా వుండింది. రహదారి బంగళా కంటె అది చాలా బాగుంటుందని మా ఆఫీసు వాళ్లు చెప్పగా, మొదటి క్యాంపుకు శ్రీ రాజావారికి వ్రాశాను. రాజావారు సమ్మతించారు. వారి నౌకర్లు బంగళాను సిద్ధపరచి భోజనపదార్థాలు సేకరించి యుంచారు. వంటకు కావలసినవన్నీ వాడుకప్రకారము నావెంట తీసుకొనివెళ్లి యుంటిని. రాజాగారు పంపించిన సంగతి తెలుసుకొని, "ఇది ఏమి"? అని అడుగగా, "రాజాగారి బంగళాలో మకాం పెట్టినప్పుడు రాజాగారి అతిథులుగా ఎంచబడతారు. అందువలన ఈ సరఫరా చేయబడింది" అని చెప్పారు. వెళ్లినరాత్రి గాక రెండో రోజున కూడా సప్లయిరాగా, తటపటాయించి, మూడో రోజున, "దయచేసి యిక పంపవ" ద్దని రాజాగారికి ఉత్తరం పంపాను "అపార్థం చేసుకోవ" ద్దని ప్రార్థించాను. అంతటితో ఆ సరాఫరా ఆగిపోయింది. తరువాత ఆ బంగళాలో క్యాంపు చేయలేదు. తరువాత క్యాంపులు రహదారి బంగళాలో చేశాను. ఈ బంగళా చిన్నదైనా అనుకూలమైనదే. చిన్న కొండ నానుకొని యున్నది. కొండ మొదటి భాగాన కందిమొక్క లుండినవి. అవి పెద్ద కందుల నిచ్చేవి. పెద్ద కందులను చూడటం నాకదే ప్రథమం.

నే నక్కడ మకాంచేసేది సామాన్యంగా డిసెంబరు మాసంలో. శీతాకాలంలో పర్లాకిమిడి వాతావరణం మిక్కిలి మనోహరంగా, ఉత్సాహకరంగా వుంటుంది. తేమలేని చురుకైన పొడి శీతల వాయువులు, ఉదయాన బంగారు ఛాయలను వెదజల్లే సూర్యరశ్మితోనూ, మధ్యాహ్నం హాయిని గొలిపే వెచ్చదనంతోనూ మిక్కిలి సౌఖ్యప్రదంగా ఉంటుంది. ఇక్కడకు వచ్చిన ఇంగ్లీషువారు ఇక్కడి వాతావరణం, ప్రకృతి శోభ స్కాట్లండ్ లోవలె వున్నవని అన్నారట.

వారి మేడలో మకాంపెట్టిన మొదటి క్యాంపులో వారిని వెళ్లి చూడటం మర్యాదని వారికి ముందుగా కబురంపాను. రాజాగారు మర్యాదగా ఆహ్వానించారు. వారిని కలసికొన్నది ఒక పెద్ద హాలులో. ఆ హాలులో పెద్దపులులు, చిరుతపులులు నిండు చర్మములతో నేర్పుగా తయారుచేసిన రూపాలుండినవి. అకస్మాత్తుగా చూచినవారి కవి సజీవములైన మృగములే అనిపించును. మర్యాదగా కొన్ని నిమిషములు గడపి సెలవుతీసుకొని వచ్చివేశాను.

రాజాగారి దివాణమునుండి మొదటి రోజు రాత్రి వచ్చిన కొరమేను చేపవంటి రుచిగల కొరమేను చేపను నే నిదివరకు తిని యుండలేదని అనుకొన్నాను. కారణ మడుగగా మురుగునీరు, బురదతో కూడివుండిన ఒక చెరువునుండి పట్టారని చెప్పారు. భూసారం, నీటిసారం, మరిన్ని వాతావరణ ప్రభావం కాబోలును, అంత రుచిగా ఆ చేప వుండటం.

పర్లాకిమిడిలో బెజవాడకు చెందిన మాదిరెడ్డి పాపారావు నాయుడుగారి కుమారుడు కృష్ణారావునాయుడుగారు పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగా వుండినారు. వారు మిక్కిలి స్నేహపూర్వకంగా న న్నొక సోదరుని మాదిరిగా ఆదరించారు. తరువాత వారిని అనేకసార్లు మద్రాసులో కలసికొన్నాను. వారి అన్న శేషగిరిరావుగారు నా బాల్యంలో నా స్వగ్రామం బొమ్ములూరుకు 2 మైళ్లలో వున్న గుడివాడలో కిరసనాయిల్ ఏజంటుగా వుండేవారు. బొమ్ములూరు అప్పు డప్పుడు వస్తూండేవారు. మా కుటుంబాన్ని ఎరిగియుండిరి. ఆ పరిచయం మమ్ములనెక్కడు

దగ్గరకు చేర్చింది. చదువుకొన్నవారు, సంస్కారం కలవారు అప్పారావు అనేవారు. కొమ్ముతో కొంగలను, దుప్పులను, జింకలను, కుందేళ్లు, ఏనుగులు మొదలైనవానిని పనివారిచేత చేయించి, మెరుగులు దిద్దించి ఇండియన్ ఇండస్ట్రీస్ హోమ్ అను పేరుతో ఒక దుకాణం నడిపేవారు. వారి యొద్దనుండి కొంగలు, దుప్పులు మొదలైనవానిని నేను కొన్నాను. అవిగాక నేను సంపాదించియుండిన దుప్పికొమ్మును పై పేడు తీయించి. ఏనుగు దంతపు తెలుపులోనికి వచ్చునట్లు రుద్దించి, మెరుపు తెప్పించి దాని నొక కొయ్య ఫలకముమీద అమర్పించారు. వీరి సోదరుడు వైకుంఠరావుగారు గొప్పగా చదివినవారు. వారు తాత్విక చింతన గలవారు. థియాసఫిస్టు. స్వతంత్రప్రవృత్తి కలవారు. ఆజన్మాంతం బ్రహ్మచారిగా నిలచిపోయారు. స్నేహ ప్రపూర్ణులైనవారు. నాకు బాగుగా పరిచయులై నన్ను అప్పు డప్పుడు కలసికొనుచుండేవారు.

## మందసా

1933 లేక 1934 సంవత్సరం వేసవిలో ఇక్కడ మొట్ట మొదటి మకాం. అప్పటి జమీందారుగారు 18 ఏండ్లు నిండని యువకుడు. వారి తండ్రిగారు చనిపోగా, వీరు కోర్టు ఆఫ్ వార్డ్సు పర్యవేక్షణక్రింద నుండినారు. వీరి విద్యాభ్యాసానికి శ్రీ తాపీ ధర్మారావుగారు ట్యూటరుగా నియమింపబడ్డారు. ధర్మారావు గారి డ్యూటీ చదువు చెప్పుటయేగాక, యువక జమీందారుగారికి తోడుగావుండి, వారి ఆటపాటలలో పాల్గొనుచు ఒక విధమైన సంరక్షకుడుగా వుండట మనుకొంటాను. జమీందారుగారి నివాస భవనానికి అనతిదూరంలో వారి విశాలమైన ఉద్యానవనం వుండింది. దానిలో ఒక బంగళా అతిథుల కొరకు, ముఖ్యంగా అక్కడ మకాం చేయు ఆఫీసర్ల కొరకు కట్టబడిన దని అనుకొంటాను. ఆ బంగళాలో నేను మకాం పెట్టాను. బంగళాకు 10, 15 గజాల దూరంలో టెన్నిసు కోర్టు లుండేవి. ధర్మారావుగారు ఆ యువక జమీందారుతో కలసి టెన్నిసు ఆడుటకు వచ్చిన సందర్భంలో నేను వా రిద్దరిని చూచి, సంభాషించటం జరిగింది. తరువాత

ధర్మారావుగారిని మద్రాసులోను, హైదరాబాదులోను చాలా సార్లు కలసికోవటం తటస్థించింది. వారు ఇంగ్లీషులో బి. ఎ. డిగ్రీ తీసుకొన్నవారేగాక ప్రఖ్యాత తెలుగు రచయిత, వ్యాఖ్యాన కర్త. 'దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు' వంటి పరిశోధన పూర్వక గ్రంథాలను వ్రాసినవారు. చేమకూర వెంకటకవి 'విజయవిలాసా'నికి హృదయోల్లాసవ్యాఖ్య అనే పేరుతో బృహత్తరమైన వ్యాఖ్యను వ్రాసినవారు. 'ఆంధ్ర విశారద' అని గౌరవింపబడువారు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమిలో విశిష్ట సభ్యులుగా నుండినవారు. ఆంధ్రవాఙ్మయ లోకంలో వారి నెరుగని వా రెవరును ఉండరు. వారు పాత్రికేయులుగా కూడా వుండి 'కాగడా', 'జనవాణి' వంటి పత్రికలను కొంతకాలం నడిపారు. వారి పరిచయం కలుగుటవలన మందసా క్యాంపు ఇంకొక విధంగా సాఫల్యమైనది.

క్యాంపులో చెప్పుకోతగిన కేసు లుండేవి కావు. రాజా గారి కేసు కూడా చిన్నదే. ఎస్టేటు కోర్ట్ ఆఫ్ వార్డ్సు క్రింద ఉండినందువల్ల మరీ సులువు.

## సన్నాకిమిడి (బుగుడ)

అప్పటికి సన్నాకిమిడి జమీాందారుగారు యువకులు, చాలా స్నేహశీలురు. వారి చేతికి, కాళ్లకు కూడా ఒక్కొక్క దానికి ఆరు వ్రేళ్లు వుండినట్లు గుర్తు. వారు వివాహం చేసు కొన్నది కొండ ప్రాంతములోని జమీాందారుగారి కుటుంబము నుండి. ఆమెను నేను చూచుట తటస్థించింది. శరీర వర్ణము తక్కువ. ఈ యువక దంపతులు ఘోషా అంతగా పాటించేవారు కాదు. ఆమెగారు లేనిపోని సిగ్గు నభినయించక, సహజంగా వర్తించే స్వభావంకలవారు. జమీాందారుగారికి కొంచెం కొంచెం తెలుగు వచ్చేదిగాని, ఆమెకు బొత్తిగా తెలియదు.

---

ఆస్కా నుండి ఈ క్యాంపుకు వెళ్లాను. నేయి అయిపోయి నందున ఆడిటర్ ద్వారా బరంపురానికి నేతికి కబురంపాను. కాని, ఆయన తీసుకొనిరావటం మరచిపోయారు. అందువల్ల బుగుడలో

నేతిని సంపాదించవలసి వచ్చింది. జమీందారుగారు పంపించారో లేక మా జవానులు బజారులో కొనుక్కువచ్చారో నే నిప్పుడు చెప్పలేను. నెయ్యి మిక్కిలి కంపుగా వుండినది. గొర్రె, మేక పాలనుండి తయారుచేయబడిన నెయ్యేమో అనిపించింది. దానిని వంటవాడు వుపయోగించకుండా నిషేధించాను. మరునాడు ఇంటివద్దనుండి నేయి వచ్చింది. ఉరియావారి కా కంపు పట్టింపు లేకపోవచ్చును.

ఈ క్యాంపునుండి, ఏడు మైళ్ల లో వుండిన భూగర్భంనుండి పై కెగదన్ను గంధకం నీటి బుగ్గకు వెళ్లాను. ఆ బుగ్గకు గొట్టం అమర్చి, దిమ్మకట్టి, దిమ్మకు వెడల్పుగా పళ్లెం, అంచు కట్టారు. అందులో దిగి స్నానంచేయటానికి అనుకూలంగా వుంటుంది. వెచ్చని నీరు. ఆ నీటిస్నానంవల్ల చర్మవ్యాధులు నివారణ అవుతవట. స్నానం హాయి నిచ్చింది.

అనతిదూరంలో ఎత్తైన ప్రదేశాన అంతకుపూర్వం గంజాం జిల్లా కలెక్టరుగా వుండిన గాలెట్టిగారు కట్టించిన మనో హరమైన బంగళాలో విశ్రమించాను. ఆ బంగళాలో వా రప్పు డప్పుడు మకాంచేస్తూ గంధకం బుగ్గలో స్నానంచేసేవారట. బంగళా ఒకచిన్న కొండమీదనున్నట్లుండినది. దాని ఆవరణలో గులాబిచెట్లు పెద్ద పెద్ద పొదలుగా వుండినవి. ఆ గులాబిపూలు, చిన్నడాలియాపువ్వు లంత పెద్దవి. అంత పెద్ద గులాబిపువ్వు లను అంత విరగ పూయటం, నే నంతవరకు చూచియుండలేదు. ఇంత పెద్ద పువ్వు లుండటానికి ఆ సల్ఫర్ స్ప్రింగే కారణ మను కొన్నాను. ఆ ప్రదేశ మంతయు గంధకమయమైయుండును.

## రంభ

బరంపురానికి కొన్ని మైళ్లదూరంలో కల్లికోటకు సమీపంలోవున్న ఈ ప్రదేశం మిక్కిలి రమణీయమైనది. చిలక సరస్సును ఆనుకొని వున్నది. ఇది చాలా చిన్న గ్రామం. ఉల్లా సంగా గడపటానికి తప్ప కేసులు విచారణ స్వల్పం. రెండు రోజులు మాత్రమే మకాం చేశాను.

చిలక సరస్సు మిక్కిలి పొడవు గలిగి, విశాలమై అక్కడక్కడ చిన్న చిన్న దీవులను కలిగి వున్నది. దీనిలో రకరకాల చేప లుండును. బెక్టి అనగా పండుగప్పచేప కీ సరస్సు ప్రసిద్ధి. పైగా అనేక జాతుల బాతులు, మిక్కిలి పెద్దవి కూడా ఇందులోని మిట్టలలో, రెల్లు దిబ్బలలో కాపురం. మరిన్ని శీతాకాలంలో ఎఱ్ఱతల బాతులు వస్తవి. ఇవి కాశ్మీరంనుండి వచ్చి శీతాకాలం పోగానే వెళ్లిపోతవని చెప్పారు.

ఈ సరస్సుకు క్యాంపులోనేగాక అంతకు ముందొకసారి వెళ్లాను. నా జ్యేష్ఠపుత్రుడు పూర్ణచంద్రరావు బరంపురం హైస్కూలులో చదువుకొంటూ స్కౌటుగా వుండినాడు. బిసంకటక్ జమీందారుగారు తాట్రాజ్ అనే బిరుదుగలవారు. స్కౌట్ సంస్థలో కొంత ప్రధాన పాత్రను వహించేవారు. వా రప్పుడు గంజాం జిల్లా స్కౌటు కమిషనర్ గా వుండేవారనుకొందును. ఎత్తైన విగ్రహంతో శ్రద్ధగా, చురుకుగా స్కౌటు విన్యాసముల్లో పాల్గొనుచుండిన పూర్ణచంద్రరావును చూచి, ఆకర్షింపబడి, వానితో పరిచయంచేసుకొని వుండినారు. ఆ పరిచయంతో ఒకనాడు మాయింటికి వచ్చి, మే మిచ్చిన ఉపాహారం గ్రహించి, కొంతసేపు గడపి వెళ్లేచు, "చిలక సరస్సువద్ద మాకు బంగళావున్నది. నే నక్కడ వుంటాను. మీరు తప్పకుండా వచ్చే ఏప్రిల్, మే లలో అక్కడకు రండి, అన్ని సదుపాయాలు కలిగిస్తాను. బాతుల వేటకు వెళ్దాం, సరదాగా వుంటుం" దని పదే పదే చెప్పారు. ఈ ఆహ్వానాన్ని పురస్కరించుకొని బరంపురంలో అసిస్టెంటు సర్జనుగా వున్న డాక్టర్ కోకా వేణుగోపాలరావుగారితోను, వారి మిత్రు లొక రిద్దరితోను కలసి, ఒక సాయంత్రం రైలులో వెళ్లటానికి బయలుదేరి స్టేషనుకు చేరాం. ముందుగా తెల్పటం మంచిదని వారికి స్టేషనునుండి ఫోనుచేయగా వారు ప్రస్తుతానికి వీలులేదు, ఎవరో ఆఫీసర్లు వచ్చియున్నారు అని చెప్పారట. కాని, మాకు సరిగా అర్థం కాలేదు. పైగా అన్నీ సిద్ధంచేసుకొని, మిక్కిలి ఉత్సాహంతో

స్టేషనుకు వెళ్లాం కాబట్టి, తిరిగి పోవటానికి కిష్టంలేక రైలెక్కి
ఆ ప్రదేశం చేరాము. మేం మెటును వచ్చుచున్నామని గ్రహించి
వారి బంగళాకు సమీపం, బెలుగాం రైల్వేస్టేషను (రంభ కావ
వలి స్టేషను) కు తా నంతవరకు ఆతిథ్యమిచ్చుచున్న వారితో
కలసి వచ్చారు. ఆ స్నేహితులు రైల్వే ఉన్నతాధికారులు
సూపరింటెండెంటు ఆఫ్ ట్రాఫిక్, డిప్యూటీ ఛీఫ్ ఇంజనీర్ అని
గుర్తు. వారి నిద్దరిని మాకు పరిచయ పరచారు. వారు రైలులో
కలకత్తాకు వెళ్లిపోయారు. శ్రీ తాట్రాజ్ గారు మా విడిది
బంగళాలో మాకు భోజనం వగైరా ఏర్పాటు చేయించారు.

మరునా డుదయం చీక టుండగానే మేము బాతుల వేటకు
వెళ్లవలసివుండినది. పడవలను, షికారిదార్లను శ్రీ తాట్రాజ్
గారు ఏర్పరచారు. కాని. రాత్రి వెళ్లిపోయిన ఆఫీసర్లతో,
రెండు మూడురోజులు జల్సాగా గడపటంచేత తనకు మిక్కిలి
బడలికగావున్నదని, అందువల్ల తాను రాజాలనని కబురు
పంపించారు.

వారు పంపిన వేటగాండ్రతో, మేము సరస్సుమీదికి
వెళ్లాం. డాక్టర్ వేణుగోపాలరావు తుపాకీ ప్రేల్చగలరు. తన
తుపాకీని తీసుకొనివచ్చారు. మేము తెలతెలవారుచుండగనే
పడవలలో బయలుదేరాము. పొద్దెక్కువరకు ప్రయత్నించాము
గాని ఒకటో, రెండో ఎర్రతల గల కాశ్మీరు బాతులు తప్ప
ఇతర బాతులు దొరకలేదు. నిజానికి మాధ్యేయం ఎర్రతలగల
బాతులవంటి చిన్నబాతులే. ఇవి చప్పున దొరికేవికావు. వేటలో
అదృష్టప్రభావం ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఎంత ప్రయత్నించినా
జంతువులుగాని, పక్షులుగాని తుపాకీ దెబ్బలకు అందవు. ఈ
నిజం, నేను తర్వాత ఉద్యోగంచేసిన బెజవాడ సర్కిల్‌లోను,
కాకినాడ సర్కిల్‌లోను తెలిసివచ్చింది. మేము నిరాశాపరులమై
తిరిగివచ్చు రైలుకోసం ఎదురుచూచుచుండగా, బెలుగాం
స్టేషను మాస్టరుగారు తెలుగువారు, మా నిరుత్సాహస్థితికి జాలి
పడినారేమో అనునట్లుగా ఒక పెద్దసైజు పండుగప్ప (బెక్టి)
చేప నిప్పించారు. తాట్రాజుగారు మేము బయలుదేరేముందు

బంగళాకువచ్చి వీడ్కోలిచ్చారు. స్టేషనువరకు సాగనంపలేదు. మొత్తంమీద వారు మేమనుకొన్నంతగా మర్యాద, మన్ననలు, సాయము చేయలేదు. వారి కిష్టములేకపోయినా మేము బలవంతంగావెళ్లి, రైల్వే ఆఫీసర్లతో వారు జరుపుకొనుచుండిన ఇష్టాగోష్టులను, జల్సాను భంగపరచామని అయివుండవచ్చును.

నేను రంభలో రహాదారి బంగళాలో క్యాంపుచేస్తున్నప్పుడు దాని కనతిదూరంలోనే కల్లికోట రాజావారు వారి బంగళాలో వుండిరట. ఎక్కడినుండి వచ్చిందోగాని. బహుశా వారి నౌకరు చెప్పియుండవచ్చును, ఒక సూచన వచ్చింది కల్లికోట రాజాగారు వచ్చి మిమ్ములను చూచి వెళ్తారట అని. వస్తారేమో అని ఎదురు చూచాను. కాని వారు రాలేదు. వారక్కడుండినారని నాకు తెలియబరచుటకు కాబోలు ఆ కబురు. నేనట్టి విషయాల్లో విముఖుడనుగా వుంటాను. జమీందారులని, పెద్ద ఆఫీసర్లని ఎగబడి నా అంత నేను వెళ్లి దర్శించుకొనే స్వభావం కలవాడను కాను. ఉన్నత విద్యావంతుడను, చేయుచున్న ఉద్యోగం చిన్నది కాదు, పైగా నా వ్యక్తిత్వం తక్కువది కాదు. అందువల్ల నే నితరుల దయా దాక్షిణ్యాలమీద ఆధారపడవలసిన అవసరం లేదు. వారికి సలాంకొట్టి, వారి మెప్పును పొందాలనుకోవటం నా హోదాను తగ్గిస్తుంది అనే ధీమా కలవాడను. అందువల్ల వారిని అప్పుడుగాని, తర్వాతగాని కలుసుకోలేదు.

పై క్యాంపులుగాక, కాశీబుగ్గలో మకాం చేశాను. కాని వివరాలు గుర్తులేవు. ఇంకెక్కడకైనా మకాం వెళ్లానేమో ఇప్పుడు చెప్పలేను. ఇంతటితో గంజాం జిల్లాలోని క్యాంపుల విషయం పూర్తిఅయింది.

బరంపురం ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా కొన్ని అనుభవాలు గుర్తుకు వస్తున్నవి. ఒకసారి ఒక ఉరియా వారి కేసును విచారించుచుండగా, ఆ పన్నుదారుడు మిక్కిలి నిర్లక్ష్యంగా సమాధానాలు చెప్పుచుండినాడు. అతని లెక్కలు అధ్వాన్నంగా వుండినవి. పైగా అంచనాకంటె మిక్కిలి తక్కువ ఆదాయం చూపించాడు. అతని తలబిరుసు సమాధానాలకు, నిక్కుకు

నేను తీవ్రపడి అతనిని గట్టిగా మందలించాను. ఒకటి రెండు దూషణమాట లని యుండవచ్చును. ఆ వ్యక్తి ఒక మత గురువు వంశములోనివాడట. ఈవిషయం నాకు తెలిసియుండలేదు. అయినా, మత గురువు సంబంధమైన వ్యక్తికి అట్టి అప్రాచ్యపు నడవడి వుండకూడదుకదా. తప్పుడు లెక్కలువ్రాసి, నిజమైనవని దబాయించకూడదుకదా. తప్పుడు మనిషి గురువైనను, దూష్యుడేకదా! బహుశా ఉరియా క్లార్కు ప్రేరేపణకూడా వుండినదేమో ఆయన, తన్ను దూషించినట్లు నామీద పిటీషను మా అసిస్టెంటు కమీషనరుగారికి పంపాడు. అప్పుడు మా అసిస్టెంటు కమిషనరుగా వుండిన (శ్రీ) కె. రామస్వామి అయ్యంగారు మామూలుగా క్యాంపుకు వచ్చినప్పుడు, ఈ ప్రస్తావన తెచ్చారు. నే నేదో సమాధానం చెప్పాను. అంతటితో ఆ విషయం సమసిపోయింది.

ఆ రోజుల్లో పరిపాలనకు, అప్పీళ్ల విచారణకు ఒకే అసిస్టెంటు కమిషన రుండేవారు. అంతకుముందొక క్యాంపుకు వచ్చినవారు అబ్దుస్ సలాం సయ్యద్‌గారు. వీరు అప్పీళ్ల విచారణ నా ఆఫీసుగదిలోనే జరుపుకొన్నారు. నేను గుమాస్తాలుండు హాలులో కొయ్యతెరలు అడ్డంపెట్టుకొని, నా పనులు నేను చేసుకొనుచుండినాను. ఆడిటర్లలో ప్రముఖుడు, సయ్యద్ గారికి ప్రాత పరిచితుడు, (శ్రీ) ఉన్నవ అప్పారావు అప్పీలు విచారణనుండి ఏదో కేసులో నావద్ద హాజరై, తాను అసిస్టెంటు కమిషనర్‌గారి సుముఖత్వాన్ని పొందానని ధీమాతో కాబోలు, కొంత నిర్లక్ష్యంగా నాయెడ వర్తించాడు. నేను పన్ను వేసిన కేసును అసిస్టెంటు కమిషనర్‌గారు తగ్గించారనో, కొట్టివేశారనో విజయగర్వంతో నీ లెక్ఖేమిటనే భావంతో తలబిరుసుగా ఉన్నాడని నాకు తోచింది. అందువల్ల చిరాకుకలిగి ఆయనను గట్టిగా చివాట్లు పెట్టాను. పదిమంది వినుచుండగా చివాట్లు తిన్నానని లజ్జపడ్డా, దానికంటె మిక్కిలి హెచ్చుగా నా కాగ్రహం కలిగిందేమో అని భయపడ్డాడు. సంవత్సరానికి రెండు, మూడు సార్లు వచ్చి, కొన్ని అప్పీళ్లను వినిపోయే అసిస్టెంటు కమిషనర్

సానుభూతికన్న, నిత్యం సంవత్సరం పొడుగూతా తాను హాజరయ్యే ఆఫీసరు సానుభూతి ఎక్కువవసరం కదా! కాబట్టి నన్ను సుముఖుణ్ణి చేసుకోవాలని, బరంపురంలో ఎక్సైజ్ ఆఫీసరుగా వుంటున్న (శ్రీ) దావులూరి దుర్గాప్రసాదరావుగారిని నావద్దకు (శ్రీ) అప్పారావు పంపాడు. వారితో, "నేను తాత్కాలిక కోపంతో మందలించానుగాని, (శ్రీ) అప్పారావును నేను ఎక్కువగా ఆదరిస్తా"నని చెప్పి పంపివేశాను. నాకు ముక్కోపం. సహనం తక్కువ. కాని నా కోపం క్షణికమే. నిజానికి (శ్రీ) అప్పారావంటే నాకభిమానమే. అపసవ్య నడవడిని, తప్పుడు లెక్కలను సహించే ఓర్పు లేదు.

ఇంకొక విషయం జ్ఞప్తికి వచ్చుచున్నది. నేను ఆస్కాక్యాంపునుండి పై క్యాంపుకు వెళ్లటానికి సామానులన్నిటిని సర్ది, బస్సులోకి ఎక్కించిన తర్వాత మంచినీరు త్రాగా లనిపించింది. మంచినీరుకొరకు వంటవానిని పిలుస్తుండగా, ప్రక్కగదిలో క్యాంపుచేస్తుండిన డిప్యూటీ కలెక్టరు (శ్రీ) వెంకట రమణయ్య, మాధ్వుడు, "మంచినీరు నేనిప్పించెద"నని వారి నౌకరిచేత మంచినీరు తెప్పించాడు. త్రాగిన తర్వాత ఆ గ్లాసును వారిచేతి కిచ్చుట కిష్టంలేక వరండాలో నౌకరుగాని, బల్లగాని లేనందున నేలమీద పెట్టాను. అంతమాత్రానికే (శ్రీ) వెంకట రమణయ్య అది చూచి, నేను శూద్రుడను కాబట్టి, తక్కువ కులస్తుడ నను భావంతో (ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు) అలా చేశానని ఎంచాడు. అప్పటి కప్పుడే తన కులాధిక్యాన్ని వెలువరించటం ఆరంభించాడు. తరువాత కలసినప్పుడుగూడ అదే విధంగా నే నేదో తక్కువవాడనైనట్లు ప్రవర్తించాడు. ఆ మూర్ఖుడు, నేను సహజమైన పరిశుభ్రతను గురించిన భావముతో ఆ మంచినీరు త్రాగిన గ్లాసు నతనిచేతి కివ్వకుండా, ఇంకొకమార్గం లేనందున బస్సులో ఎక్కబోతూ క్రిందపెట్టానుగాని, అతడు బ్రాహ్మణుడు, నేను శూద్రుడ నను అభిప్రాయంతో చేయలేదని గ్రహించలేకపోయాడు. తరువాత ఆ ఉద్యోగికి, అత డేమాత్రం ఎక్కువవాడు కాదని, ప్రస్ఫుటంచేయటం జరిగింది. నే నతనికంటె విద్యాధికుడను. నా

హోదాకంటె అతని హోదా ఏమాత్రమో చిన్నదేగాని, పెద్దది కాదు. అయినా అత డట్లు ప్రవర్తించాడంటే కులం హెచ్చుతగ్గుల భావం, ఆరోజుల్లో అలావుండేది. ఈ సంఘటన యిప్పటికిని నా మనస్సులో చెరిగిపోలేదు.

నాముందు హాజరైనవారికి చొక్కాయుండినా లేక పోయినా, తలగుడ్డమాత్రం వుండాలని పట్టుబట్టేవాడను. గంజాం జిల్లా అప్పటి కింకను మద్రాసు రాష్ట్రంలోనే వుండినది. ఈ రాష్ట్రమునందు భిన్నభిన్నాలుగా దుస్తులు ధరించు ఆచారంకలవా రున్నారు. తెలుగువారికి తలగుడ్డ ఆచారధర్మం. కాని తమిళులకుగాని, ఉరియావారికిగాని అట్టి ఆచారం లేదను కొంటాను. అయినా నా మూర్ఖత్వం నా కా భేదాన్ని స్ఫురింప చేయనీయలేదు. పైగా తలపాగా గౌరవసూచకమని నా అభి ప్రాయం. వ్యవసాయ నౌకరులైనా తలగుడ్డలేకుండా ఎదుటకు రారు. తలగుడ్డలేకుండా వస్తే, అవమానపరచినట్లని తలం పుండినది. అందువల్ల ప్రతివాడు తలగుడ్డలేకుండా, నా ఎదుటకు రాకూడదని పట్టుదల.

విద్యాధికుడును, న్యాయవాదియు, ప్రముఖ రాజకీయ వేత్తగా పరిణతచెంది, తరువాత ఒరిస్సా రాష్ట్ర ముఖ్యమంత్రిగా, ఉత్తరప్రదేశ్ గవర్నరుగా పదవులను నిర్వహించిన విశ్వనాథ దాసుగారి విషయంలో కూడ నే నట్లు ఉద్దేశపడితినిగాని, వారి గురుత్వము, స్నేహాభావము నన్ను అనుచితమునుండి తప్పించినది. అట్లే పిఠాపురం వాస్తవ్యులును, మాకు ఇన్‌కమ్‌టాక్సు కమిషనర్ గానేగాక, కేంద్ర రెవిన్యూబోర్డుకు అధ్యక్షులుగా వుండిన శ్రీ పి. సి. పాఢేగారి తమ్ముని విషయంలో కూడా అట్టి తలంపే కలిగినదిగాని సాహసించలేకపోయాను.

ఈ నడవడికి పునాది, నాకు దుస్తుల ధారణ విషయంలో గల అభిప్రాయం, ఆచరణ. నే నా రోజుల్లో టై కట్టుకొని, చిన్నకోటుతోసహా నిండు సూటు వేసుకొని, మేజోళ్లతోసహా బూట్లు వేసుకొని దొరటోపీ పెట్టుకొనేవాడిని. మండు వేసవిలో కూడా ఈ వేషమే.

1930-31 లో నేను ప్రొబేషనరుగా వుండినప్పుడు ఇన్‌కమ్ టాక్సు సర్కిల్ నిర్వహణ బాధ్యత లేని స్వేచ్ఛాపరుడనుగా వుంటిని. అప్పుడు బరంపురంలో కొందరు నాకు మిక్కిలి పరిచితులైనారు. తిరిగి నేను 1932 అక్టోబరు ఆఖరుకు సర్కిల్ ఆఫీసరుగా చేరిన తర్వాత, ఆ పరిచయులలో ముగ్గురు, నలుగురు మిత్రులుగా రూపొందారు. వీరిలో ముఖ్యులు తాయి రామయ్యనాయుడుగారు, వైశ్యరాజు వెంకటరత్నంరాజుగారు, పాకనాటి కృష్ణమూర్తినాయుడుగారు, రామయ్యనాయుడుగారి బావమరది మాదిరెడ్డి పుండరీకాక్షనాయుడుగారు మిత్రులవంటివారైనారు. వీరుగాక, ఎక్కువ పరిచయస్తులు రావు బహాదర్ పాకల వెంకట నారాయణరావుపాత్రుడుగారు, కోకా అప్పారావునాయుడుగారి వంటివారు.

సన్నహితమిత్రుడు తాయి రామయ్యనాయుడుగారు భూవసతి కలవారు. వారి కెట్టి వ్యాపారం వుండి యుండలేదు. మిక్కిలి ఖర్చుదారుడు. కనుక, అప్పులే వుండినవి. వైశ్యరాజు వెంకటరత్నంరాజుగారు, పాకనాటి కృష్ణమూర్తినాయుడుగారు పెద్ద వ్యాపారస్తులే. పుండరీకాక్షనాయుడుగారు చిన్న మందుల కొట్టును నడుపుకొనేవారు. కోకా అప్పారావునాయుడుగారు న్యాయవాది, జస్టిస్ పార్టీ ప్రముఖులలో రెండవ శ్రేణిలోనివారు. సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారితో కలసి 1917 లో ఇంగ్లండుకు రాయబారం వెళ్లిన వర్గంలో వుండినారు. రావు బహాదర్ పాకల వెంకట నారాయణరావుపాత్రుడు (పాత్రో గౌరవపదం—నాయుడుకు బదులు) గారు ప్రముఖ న్యాయవాది. వారు పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను, జిల్లాబోర్డు అధ్యక్షులుగాను చాలా కాలం పనిచేశారు. మిక్కిలి వృద్ధాప్యంలో, ఈమధ్యనే, పరలోకగతులైనారు. పెద్దలగు రావు సాహెబ్ వరదా కామేశ్వరరావు నాయడుగారు, రావు బహద్దర్ శ్రీకృష్ణపాత్రుడుగారు నాయందు అభిమానము చూపించేవారు. శ్రీ కామేశ్వరరావునాయుడుగారి కుమారులు శ్రీ రామారావు, శ్రీ భావన్నారాయణగార్లు స్నేహభావంలో, ఆప్యాయతతో వుండేవారు. శ్రీకృష్ణపాత్రుడుగారు

డిప్యూటీ కలెక్టరుగా పనిచేసి, తర్వాత 13 సంవత్సరాలు బొబ్బిలి సంస్థానం దివానుగా పనిచేసిన ప్రముఖులు.

అప్పుడప్పుడు రామయ్యనాయుడుగారింటిలో బ్రాంది పానీయంతో కూడిన పులావ్ విందులకు హాజరయ్యేవాడను. ఒకసారి బలవంతంచేస్తే బ్రాందిని ఎక్కువగా త్రాగి, భరించలేక క్రక్కివేశాను. కాని అప్పుడప్పుడు బ్రాందిని సేవించటం తప్పేది కాదు. సహవాసంరీత్యా, భోజనంవంటి సమయాల్లో కొంత బలవంతానికి లోబడే బలహీనత నాలో వుండినది. నిజానికి ఇంగ్లండులో కూడ నిత్యకృత్యంగా మద్యం సేవించేవాడనుకాను. నలుగురు మిత్రులం కలసి, ఏ చీట్లపేకో నా గదిలో ఆడుకొనుచుండినప్పుడు, ఏదైనా మద్యం తెప్పించి వారికిచ్చి, నేను కూడా పాల్గొనేవాడనుగాని, దానిని నిత్యం వుంచుకొని నాఅంతట నేను తీసుకొనే అలవాటుండినదికాదు. నేను ఈ దేశానికి తిరిగివచ్చిన తర్వాత ఎన్నడును, ఏ పానీయాన్ని కొనివుండలేదు. నాకు సిగరెట్లుకూడా అలవాటు కాలేదు. ఇంగ్లండులో వున్నప్పుడు స్నేహితులతో అప్పుడప్పుడు సహవాసానికి కాల్చటమేగాని దానికి అలవాటు పడలేదు. ఇండియాలో అసలే కాల్చటంలేదు. బరంపురం విడిచిపెట్టిన తర్వాత, మద్యాన్ని కొలదిసార్లు ఇతరులు అందివ్వగా, వద్దనలేక పుచ్చుకొన్నానుగాని, ఇష్టముండికాదు.

రామయ్యనాయుడుగారు తన యింట విందులకు నన్ను పిల్చుటయేగాక, అప్పుడప్పుడు చిన్న పరజా బాతులను, సముద్రపు పీతలను పంపించేవారు. పీతలను మిక్కిలి శుభ్రపరచటం అందరికిని సాధ్యమయ్యేపనికాదు. అందువలన, వారి యింటిలోనే శుభ్రంచేయించి పంపించేవారు. ఉష్ణం చేస్త వంటారుగాని మిక్కిలి రుచిగా వుంటవి.

రామయ్యనాయుడుగారు మంచి హుషారు మనిషి, స్నేహశీలుడు. విద్య అంతగాలేకపోయినా, మిక్కిలి చురుకైన బుర్ర. కార్యదక్షుడు. చిన్నవయస్సులో సంపదను వృద్ధిపరచారు. వారు శ్రీకృష్ణపాత్రుడుగారి పెద్దలుడు. వారి కొక కొడుకు, ఇద్దరు

కుమార్తెలు. పెద్ద కుమార్తె శ్రీమతి బుల్లెమ్మను మాదిరెడ్డి వెంకటేశ్వరరావుగారి కిచ్చి వివాహంచేశారు. శ్రీ వెంకటేశ్వరరావు శ్రీ పుండరీకాక్షుడుగారి అన్న కుమారుడు. వీరు వకీలుపట్టా పుచ్చుకొని కొంతకాలం ప్రాక్టీసుచేసి తర్వాత లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్‌లో పనిచేసి రిటైరై బెంగుళూరులో స్థిరపడిపోయారు. వీరి పెండ్లికి నేను అతిథిగా వెళ్లాను. ఈమధ్య అనగా, 1972 మే నెలాఖరున, దంపతులను వారింటివద్ద కలసికొని సంతోషించాను. వారి కుమారుడు రామమోహనరావు ఒక పెద్ద హాస్పిటల్లో ఇ. యన్. టి. డిపార్టుమెంటుకు ముఖ్యాధికారి. రామయ్యనాయుడుగారి రెండవ కుమార్తె శ్రీమతి కాళీమణి. ఇప్పుడు బరంపురం మునిసిపల్ కౌన్సిలర్‌గాను, పట్టణ స్వతంత్ర పార్టీ అధ్యక్షులుగాను ఉండినారు. కుమారుడు జగన్నాథరావు ( నానబాబు—ముద్దుపేరు ) తండ్రి భూములను చూచుకొనుచున్నాడు.

రామయ్యగారికొక దోషమున్నది. మితములేని త్రాగుడు. రోజులు గడచినకొద్దీ త్రాగుడు ఎక్కువైంది. ఈ లోపంచేత హెచ్చు ధన వ్యయమై, వారి చక్కని బంగళా మిద్దెను నేను బరంపురంనుండి వచ్చివేసిన కొలది సంవత్సరాలకే అమ్మివేశారట. తరువాత చనిపోయారు.

వైశ్యరాజు వెంకటరత్నంరాజుగారు కళింగకోమటులు. కులరీత్యా కళింగకోమట్లు మాంసాహారులు. ఇంటివద్ద వారి భార్య మాంస మత్స్యాదులను వండుటకు అంగీకరించేది కాదట. అందువల్ల అవకాశం దొరికినప్పుడల్లా బయట వీనిని భుజించేవారు. వీరికి మద్యపానంకూడా కొంత అలవాటుగాని, అది మితముగానే ఉండేది. ఈ అలవాటువల్ల రామయ్యనాయుడుగారికి దగ్గర స్నేహితుడైనాడు. వెంకటరత్నంరాజుగారితో నా పరిచయం, రామయ్యనాయుడుగారి ద్వారానే. కలసికొన్నప్పుడు రామయ్యనాయుడుగారింటివద్దనే. రామయ్యనాయుడుగారితో స్నేహము లేకపోతే వెంకటరత్నంరాజుగారు నా దృష్టిలోకి వచ్చేవారు కాదు. కాని, ఆయనమీద కొంత అభిమానము పెంచు

కొన్నాను. ఆ అభిమానంవల్ల 1952–వ సంవత్సరములో నేను విజయవాడ రేంజికి అప్పెలేట్ అసిస్టెంటు కమిషనరుగా నియమింపబడి విజయనగరం మకాం వెళ్లినప్పుడు, "నన్ను వచ్చి చూచిపోవలసిం"దని వెంకటరత్నంరాజుగారికి వ్రాశాను. 1936 ఏప్రియల్ 1-వ తారీఖునుండి బరంపురం సర్కిల్, ఒరిస్సా రాష్ట్ర ఇన్‌కంటాక్స్ కమిషనర్ ఆధిపత్యంలోకి వెళ్లియున్నందున నాకు బరంపురం సంబంధం తెగిపోయింది. రామయ్యనాయుడుగారు చనిపోయారు. కృష్ణమూర్తినాయుడుగారు చనిపోయారు. ఇక మిగిలింది వెంకటరత్నంరాజుగారు. బరంపురంమీాది మమకారం తోడ్పడింది. అందువల్ల బరంపురం జ్ఞాపకంరాగానే, వెంకటరత్నంరాజుగారిమీాద మనస్సుపోయింది. అందువల్ల వారిని వచ్చి చూచిపొండని వ్రాశాను. వారు విజయనగరం వచ్చి, ఒకటి రెండు పూటలు నాతో వుల్లాసంగా గడపి వెళ్లిపోయారు.

తర్వాత వారు చనిపోవటం తటస్థించింది. వారి ఏకైక పుత్రుడు బదరీనారాయణమూర్తిరాజుగారికి 1958 లో నా రెండవ కుమార్తె వివాహానికి, 1960 లో నా ఇప్పటి పెద్ద కుమారుని వివాహానికి శుభలేఖలు పంపాను. చాలా దూరప్రయాణముగుట చేతను, నేను 1936 మార్చి ఆఖరున బరంపురాన్ని విడచినప్పటికి బాలుడగుట చేతను, నాతో చనువులేకుండుట చేతను ఆయన స్వయముగా వివాహానికి రాలేదు. కాని, గౌరవసూచకంగా చిన్న వెండిపాత్రలు బహుమానంగా పంపారు. బహుమానాలు పంపుటమూలంగా, ఆయన తన అభిమానం వెల్లడించినందులకు సంతోషించానుగాని, బహుమతులను స్వీకరించవలసివచ్చినందులకు కొంత వ్యాకులత చెందాను. అందువలన 1961–వ సంవత్సరములో జరిగిన నా రెండవ కుమారుని వివాహానికి, కావలెనని ఆహ్వానం పంపలేదు. 1962–వ సంవత్సరంలో ఒరిస్సా రాజధానియగు భువనేశ్వరానికి 18 మైళ్ల దూరంలోవున్న బెరాంగ్‌లోని ఒరిస్సా ఇండస్ట్రీస్ లిమిటెడ్ సంస్థకు, ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా సంస్థకు నేను నామినీ డైరెక్టర్‌గా నియమింపబడిన సందర్భంగా 1964 మార్చిలో భువనేశ్వరము నుండి తిరిగి వస్తూ బరంపురంలో రెండురోజులు

గడపినప్పుడు, తండ్రి వెంకటరత్నంరాజుగారు చనిపోయిన సందర్భం పురస్కరించుకొని బదరీనారాయణమూర్తిరాజును ఆయన ఇంటికి వెళ్లి పరామర్శించాను. ఒక పూట వారి కారు కూడా ఇచ్చారు. ఆ విధంగా ఆ అబ్బాయి పరిచయమైంది. తర్వాత ఆయనగారి కుమార్తె వివాహానికి ఆహ్వానంరాగా, రాలేనని విచారం తెలుపుతూ, వధూవరుల నాశీర్వదిస్తూ బహుమానంగా చెక్కు పంపాను. నేను 1953 లోనే రిటైరైనా, ఆఫీసర్ల డబ్బు కూడదని కాబోలు, ఆ చెక్కును ఆ అబ్బాయి తిరిగి పంపాడు. ఈ విధంగా వెంకటరత్నంరాజుగారితో, సంబంధం వదులుకోలేదు.

పుండరీకాక్షనాయుడుగారు అప్పటికే వయస్సుమళ్లిన ట్లుండేవారు. కాని, వారిని 1964 లో దర్శించినప్పుడు, వారి భార్య మరణంపొందియుండినారుగాని, వారు క్షేమముగనే వున్నారు. శ్రీ నాయుడు మిక్కిలి సాత్వికులు. సహృదయము కలవారు. వారి భార్య రామయ్యనాయుడుగారి సోదరి, మిక్కిలి ఆదరముతో పలుకరించేవారు.

పాకనాటి కృష్ణమూర్తినాయుడుగారు మిక్కిలి మర్యాదస్తులు. గౌరవముతోనేగాక, స్నేహంభావముతో మాట్లాడే వారు. వారికి సంతానం లేదు. వారి అన్నగారు వెంకటేశ్వరరావు నాయుడుగారు నేను అక్కడికి వెళ్లక పూర్వమే, కొన్ని సంవత్సరాలకు ముందే మరణించారు. వెంకటేశ్వరరావునాయుడుగారికి ముగ్గురు కుమారులు. నారాయణరావు, వకుళాభరణం, జగన్నాథరావు. జగన్నాథరావుగారిని కృష్ణమూర్తినాయుడు గారు దగ్గరకు తీసుకొని, తన పుత్రునిగా భావించుకొనేవారు. జగన్నాథరావుగారు ఒరిస్సా ప్రభుత్వంలో, కాంగ్రెసుపార్టీ వారుగా ఆరోగ్యం మొదలగు శాఖలకు మంత్రిగా వుండేవారు. 1964 లో భువనేశ్వరంలోని వారింటికి వెళ్లానుగాని, వారప్పుడు బైటికి వెళ్లియుండినారు. నా భువనేశ్వరం క్యాంపు ఒకరోజే. మొదటి రెండు దఫాలలో వారక్కడుండినట్లు తెలిసివుండలేదు. వకుళాభరణంగారు విజయనగరంలో స్థిరపడిపోయి, అక్కడ

వ్యాపారం వృద్ధిచేసుకున్నారు. నారాయణరావుగారు బరంపురం లోని తమ ఇంటిలోనే వున్నారు. పైన చెప్పినట్లు 1964 మార్చిలో నేను బరంపురం వెళ్లినప్పుడు వారి అతిథిగానే వెళ్లాను. ఆ రోజు ఉదయం 9, 10 గంటలకల్లా బరంపురం చేరుకోవలసిన రైలు, ఏ ఒంటిగంటకో చేరుకొన్నది. నాకోసం అంతవరకు భోజనంచేయకుండా వేచియుండి, నన్ను యింటికి తీసుకొనివెళ్లి భోజనాదులను మిక్కిలి గౌరవముతో, అభిమానపూర్వకముగా ఏర్పరచారు.

1910-11 సంవత్సరంలోనే మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరుగా కొంతకాలముండినవారు, గంజాం జిల్లా ప్రముఖుల్లో ఉన్నతస్థానం సంపాదించినవారు, శ్రీ వరదా కామేశ్వరరావు నాయుడుగారు నాయందు మిక్కిలి అభిమానంతో వుండేవారు. వారి కుమారులలో శ్రీ భావన్నారాయణరావుగారు నాతో, ఇప్పటికిని ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుచున్నారు. కామేశ్వర రావునాయుడుగారి అభిమానం ఎంత చిక్కనిదో తెలియజేయటాని కొకటి చెప్తాను. వారికి విస్తారమైన భూములేగాక, పెద్దపెద్ద మామిడితోటలున్నవి. నాకు బరంపురానికి మామిడిపండ్లు పంప టమేగాక, నేను అక్కడినుండి బదిలీఅయిపోయిన తరువాత కూడా పంపించేవారు. నేను ఉద్యోగవిరమణచేసిన తర్వాత కూడా పంపి నట్లుగుర్తు. రెండవ కుమారుడు భావన్నారాయణరావుగారు నేను బరంపురం విడిచిపెట్టి 37 సంవత్సరములు దాటినా, ఇప్పటికిని ప్రతి సంవత్సరం జనవరి మొదటి తేదీనాటికి, నూతన వర్ష శుభా కాంక్షలను పంపుచున్నారు. దానికి సమాధానముగా నేను నా కుటుంబ సభ్యుల క్షేమ సమాచారాలను, నా జీవిత విధానాన్ని వారికి తెలియజేస్తూంటాను. వారి 1969 నూతన వర్ష శుభాకాంక్ష లకు నేను జవాబు వ్రాయుచు, "నాకంటిలో శుక్లం ఏర్పడిందని, తీసివేయించినా దృష్టి సరిగారాలే"దని వ్రాశాను. వెంటనే వారు జవాబిస్తూ, "మద్రాసులో అమెరికాలో విద్య నభ్యసించి, ప్రవీణులైన నేత్రవైద్యులు రంగారావుగా రున్నారు. వారు ఇటువంటి కేసులు బాగుచేశారు. మీరు వారి సలహా, సహా యాలను తీసుకొ"మని సలహా యిచ్చారు.

వరదా కామేశ్వరరావునాయుడుగారు సునిశిత మేధావంతులు. చాలా పెద్దమనుష్యులు. సరిపడిన ఒడ్డు పొడుగులతో, తేజోవంతమైన ముఖ కవళికలతో, ముచ్చటగానుండు గుబురు మీసాలతో, మంచి దుస్తులతో, ఇంపైన తలపాగతో మిక్కిలి ఆకర్షణీయముగా వుండేవారు. వారు స్వశక్తివలన పిత్రార్జితాన్ని మిక్కిలి అభివృద్ధికి తెచ్చి, నేను బరంపురంలో వుండిన కాలములో కొన్ని వందల ఎకరాల భూమికి అధిపతిగా వుండేవారు. పెద్ద పెద్ద మామిడితోట లుండినవి. వారొక సంప్రదాయాన్ని నెలకొల్పినారట. తోటకాపలామనిషి పండిన మొదటి ఫలాన్ని జాగ్రత్తగా తీసుకొనివచ్చి వారికి సమర్పించేవాడట, వారతనికి మంచి భోజనము పెట్టించి, వస్త్రములు మొదలైనవి బహూకరించి పంపేవారట. 1910, 1911 సంవత్సరములలోనే వారికి రెండు అశ్వాలు పూన్చిన పెద్ద గుఱ్ఱంబండి ఉండేదట. వారికి మద్యపానం, స్త్రీ లోలత్వ మున్నట్లు నేను వినలేదు. కాని, భోగలాలసత్వం, భోజనప్రియత్వం జాస్తిగా వుండేదట. వారి స్థిరనివాసం ఈశాన్యరైల్వేమీద, బరంపురానికి కొన్నిమైళ్ల దూరములోవుండిన పూండి స్టేషన్ గ్రామం. నేను బరంపురం నుండి విజయనగరానికి బదిలీ అయి వెళ్లేటప్పుడు పూండి స్టేషనుకు సమీపములోవున్న తమ ఇంటి మేడపైన నిల్చుండి, ''మీకు చెయ్యూపి వీడ్కోలు చెప్పుతాను. జవాబుగా మీరు చేయి వూపండి'' అని కోరారు. వారట్లుచేయగా నేను ప్రతిసంజ్ఞ చేశాను. అంత అభిమానముండినది వారికి నామీద. శ్రీకృష్ణపాత్రుడుగారు (పాత్రుడు అనే గౌరవసూచకాన్ని వారి పూర్వీకులకు ఓఢ్రరాజు లిచ్చియుండిరట. వారి తండ్రి సూర్యనారాయణరావునాయుడు గారు సూర్యనారాయణపాత్రుడుగా వ్యవహరించారు) కూడ నా యందు మిక్కిలి అభిమానంగా వుండేవారు. వారి ముగ్గురు కుమారుల్లో పెద్దవారు రావు బహదర్ నారాయణరావుపాత్రుడు గారిని గురించి పైన చెప్పియున్నాను. రెండవవారు ఇన్‌కమ్ టాక్స్ అసిస్టెంటు కమిషనరుగా ఉద్యోగంచేసి పింఛను పుచ్చుకొంటూ విజయవాడలో స్థిరపడిపోయివున్న ఆదినారాయణరావు నాయుడుగారు. మూడవవారు అప్పలకంపన్న డిప్యూటీ కమిష

నరుగా పనిచేసి రిటైరై, హైదరాబాదులో నివాస మేర్పరచు కొన్నారు. ఆదినారాయణరావునాయుడుగారు, బరంపురంవచ్చిన సందర్భంలో శ్రీకృష్ణపాత్రుడుగారితో నాకు పరిచయం కలిగింది. తరువాత 1, 2 సాళ్లు వారిని చూచుట తటస్థించింది. వా రప్పుడు బరంపురానికి 7, 8 మైళ్ల దూరంలోవున్న జగన్నాథపురములో స్థిరపడిపోయారు. నేను బరంపురంనుండి బదిలీ అయి వెళ్లి పోవుటకు ముందు, వారు నన్ను జగన్నాథపురములోని వా రింటికి విందునకు పిలిచారు. శ్రీకృష్ణపాత్రుడుగారు మితభాషి. సాధారణంగా చాలా తక్కువమందితో స్వేచ్ఛగా వ్యవహ రిస్తారు. మంచి ధీమా, హుందాతనం కలిగినవారు. అట్టివారి ఆహ్వానాన్ని నాయందు వారికిగల మిక్కిలి అభిమాన సూచకంగా ఎంచుకొని, అధిక సంతోషముతో అంగీకరించాను. శ్రీ నారాయణరావుపాత్రుడుగారు తోడురాగా జగన్నాథపురం వెళ్లాను. శ్రీ వరదా కామేశ్వరరావునాయుడుగారు, శ్రీ కోకా చిన్నకామయ్యనాయుడుగారు, ఇంకొక రిద్దరు విందులో పాల్గొన్నారు. శ్రీకృష్ణపాత్రుడుగారు వివిధములైన వంటక ములతో భోజనం మిక్కిలి తృప్తికరమౌనట్లు ఏర్పరచారు. కామేశ్వరరావునాయుడుగారు పాలనుగాని, పెరుగు, మజ్జిగలను గాని ముట్టుకోరట. ఈ సంగతి విందులో తెలుసుకొని మిక్కిలి ఆశ్చర్యపోయాను. ఇంగ్లండులో కొందరు ఇంగ్లీషువారికి యాపిల్ పండ్లు ఏమాత్రం సహించని సంగతి నా కప్పుడు గుర్తుకువచ్చింది. శ్రీకృష్ణపాత్రుడుగారు శరదృతువునందలి నదివలె గంభీరమైన వారు. స్ఫురద్రూపులు. నిండైన ముఖముతో, దట్టమైన మీసకట్టుతో మిక్కిలి హుందాగా వుండేవారు.

బరంపురంలో ఇతర పరిచయులుకూడా వుండినారు. బ్రాహ్మణులు నాభీ అన్నదమ్ములు మోటారుకారులు, వాని సామానులు మొదలగువానిలో వ్యాపారముచేయుచుండేవారు. 1964 లో నేను బరంపురం వెళ్లినప్పుడు పనిగట్టుకొని వెళ్లి, వారిలో పెద్దవారిని చూచాను. వారికి దగ్గర బంధువను కొంటాను, శ్రీనివాసరావుగారు మంచి చిత్రలేఖకులు. వారిని

ఒకటి, రెండుసార్లు 1932-36 సంవత్సరములలో బరంపురంలో చూచాను. వారి చిత్రలేఖనాలను కూడా చూచియున్నాను. తర్వాత ఈమధ్య రామాయణచిత్రాలను చిత్రించి, వ్యాఖ్యానంతో కూడిన సంపుటాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి సహాయముతో ప్రచురించారు. నా కోర్టుపేట నివాస గృహ సమీపాన కాపురం వుండిన జగన్నాథరావుగా రింకొకరు. వారు మంచి మర్యాదస్తులు. చేసేది గుమాస్తావంటి చిన్న ఉద్యోగమైనా హుందాగా నడచేవారు. వారిని 1964 లో తిరిగి చూడటం తటస్థించింది.

శ్రీ సి. నరసింహంగారు ఛత్రపూర్‌లో జిల్లా పంచాయతీ ఆఫీసరుగా పనిచేస్తుండిరని పైన చెప్పియున్నాను. వారిని బరంపురం మునిసిపల్ కమిషనరుగా నియమించారు. వారితోనూ, వారి కుటుంబంతోనూ అప్పటినుండి స్నేహ మధికమైంది. వారు మునిసిపల్ కమిషనరుగా వచ్చిన కొద్దికాలానికే పంచమ జార్జిచక్రవర్తి పాలన రజతోత్సవాన్ని మిక్కిలి జయప్రదంగా జరపాలని కలెక్టరు డిక్సన్ గారు తలపెట్టారు. నరసింహంగారిని పిలిపించి చెప్పారు. ఇది 1935 మార్చిలో. క్రొత్తగా కమిషనరుగా వచ్చిన నరసింహంగారు 1932 అక్టోబరునుండి వుండియున్న నా సహాయాన్ని కోరారు. నేను వారితో కలసి పట్టణ ప్రముఖులను, వర్తక శ్రేష్ఠులను దర్శించి, వారివలన చెప్పుకో తగిన విరాళాలను సేకరించాము. గవర్నమెంటు ఉద్యోగులు విరాళాలను వసూలుచేయకూడ దనే ఆర్డరు తర్వాతగాని రాలేదు. ఈ సహకారంవలన మా స్నేహితం మరింత గట్టి పడింది. నరసింహంగారి ప్రముఖ పాత్రకు కలెక్టరుగారు హర్షించి రావు సాహెబ్ బిరుదును వారికి సిఫార్సు చేశారు.

1934 డిసెంబరు క్రిస్‌మస్ సెలవుల్లో మా కుటుంబం కలకత్తా చూడాలనుకొన్నాం. నాకు కూడా అదే మొదటిసారి. నరసింహంగారితో చెప్పగా, "నేనుకూడా వస్తా"నన్నారు. నాభార్య, నా కుమారుడు, నేను, నరసింహంగారు 22-వ తారీఖున బయలుదేరి వెళ్లి, జనవరి 1-వ తారీఖున తిరిగి వచ్చాము. మేము నల్లురం చిత్త

రంజన్ సెంట్రల్ ఎవిన్యూ దగ్గర, బెన్‌టిక్ వీధిలో ఒక అరవాయన నడిపే మహాలక్ష్మి హోటలులో దిగాము. వసతి ఫరవాలేదు. భోజనం మా కలవాటైనదే. కలకత్తాలో 9 రోజులు సుఖంగా, సంతోషంగా గడిపాం. విక్టోరియా మెమోరియల్ మ్యూజియమ్, మల్లిక్ పాలెస్, జూ, కాళీ గుడి, దక్షిణేశ్వర్ గుడి, (శ్రీ రామకృష్ణ పరమహంస నివాసం) కృత్రిమ సరస్సు చూచాం. రామనాధ శాస్త్రిగారి సాయంతో తెలుగు సినిమా సీను తీయటం చూచాం. ధర్మతలవీధిలో తోలుపెట్టెలు, పూలమొక్కలు పెట్టుకొనే ఇత్తడి గొట్టాలు వగైరా కొన్నాం. వెళ్లిన 3, 4 రోజులకు నా కంఠం పట్టింది. ఇది కలకత్తా కంఠపడిశమట. అందువల్ల తతిమ్మా వారు చూచి సంతోషించిన, గ్రాండ్ సర్కస్ ప్రదర్శనానికి వెళ్లలేకపోయాను. కొన్ని వినోదాలను వదులుకోవలసి వచ్చింది.

ఈ కలకత్తా సందర్శనంలోనే నాభార్యను డాక్టర్ మేరీ షెప్పర్డు అనే వారితో తనిఖీ చేయించాను. నా మొదటి బిడ్డ వజ్రాంబ అనే కూతురు 1916 అక్టోబరు 2-వ తారీఖున జన్మించింది. నా ప్రధమ పుత్రుడు పూర్ణచంద్రరావు 1919 జూలై 24-వ తారీఖున పుట్టాడు. ఈ ఇద్దరు నేను 1920 లో ఇంగ్లండుకు వెళ్లకపూర్వం కలిగారు. నాభార్య 1930 లో నావద్దకు వచ్చిన తర్వాత, ఆమెకు కొన్ని గర్భాలు పోయాయి. అందువలన కలకత్తాలో మంచి పేరుపొందిన డాక్టర్ మేరీ షెప్పర్డ్‌గారిచేత తనిఖీచేయించి, ఆమె సలహాలను పాటించాము. తత్ఫలితంగా 1936 మార్చి 15-వ తారీఖున నా రెండో కుమారుడు రాధాకృష్ణ, బరంపురంలోని డాక్టర్ ఎలిజబెత్ గ్రెగరి గారి సలహా, సహాయాలతో జన్మించాడు. ఈవిధంగా మా కలకత్తా ప్రయాణం వినోదకరం అయింది. సంతానాన్ని ప్రసాదించింది.

1934 వేసవిలో నని గుర్తు. కాంగ్రెసు నిర్వహించిన ప్రథమ సత్యాగ్రహంలో, భూమి శిస్తులు కట్టకూడదనే అంశం ప్రముఖముగా వుండింది. గుంటూరు జిల్లా, పెదనందిపాడు ఫిర్కాలో పన్నుల నిరాకరణోద్యమానికి నాయకత్వంవహించి, ఆ నిరాకరణాన్ని మిక్కిలి జయప్రదంగా నడపిన ప్రముఖుడు



శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారి గానసభ 1934 సంవత్సరములో బరంపురం, గంజాం జిల్లా ఒరిస్సా రాష్ట్రం

కూర్చున్నవారు : 1. శ్రీ వైశ్యరాజు వెంకటరత్నంరాజు, 2. శ్రీ పాకనాటి కృష్ణమూర్తినాయుడు 3. గ్రంథకర్త, 4. శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరి, 5. శ్రీ తాయి రామయ్యనాయుడు, 6. శ్రీ గోవిందరాజులునాయుడు, 7. శ్రీ మాదిరెడ్డి పుండరీకాక్షనాయుడు

నిలుచున్నవారు : 1. చంద్రరావు, 2. శ్రీ తాయి జగన్నాథరావు ( నాన్నబాబు ), 3. శ్రీ వరదా భావన్నారాయణరావు

శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారు. వారు ముందుగా తెలియ పర్చి నా అంగీకారాన్ని పొంది బరంపురానికి వచ్చారు. ఆ పన్నుల నిరాకరణోద్యమంలో గట్టి దెబ్బలు తిన్నందున ఆరోగ్యం కొంత క్షీణించింది. కాని, తన అభిమాన కళ గాత్ర సంగీతములో బాగుగా తర్ఫీదుపొంది, గట్టిగా సాధనచేసి సంగీత ప్రవీణులైనారు. బరంపురంలో సంగీత సభలను ఏర్పాటుచేయవలసినదిగా అర్థించారు. మొదటి కచేరీని మా యింటిలోనే ఏర్పాటు చేశాను. వచ్చిన శ్రోతలు బాగున్నదని మెచ్చుకొన్నారు. తరువాత రామయ్యనాయుడుగారు, కృష్ణమూర్తినాయుడుగారు వంటి మిత్రులు 3, 4 ఏర్పాటు చేశారు. అన్ని కచేరీలు జయప్రదంగానే జరిగాయి. వీరయ్యచౌదరిగాత్రం జిలుగు కలిగి, శ్రావ్యమైనదే గాక, వారి సంగీతజ్ఞానం హెచ్చుస్థాయిలోనిదేగాక, వారు మాటలు విడమర్చి, అవి శ్రోతలకు అర్థమయ్యేటట్లుగా గానమే గాక, భావముకూడా బోధపడేటట్లుగా, హస్త ముఖ విన్యాసములతో పాడేవారు. అదీ వారి విశిష్టత. వారి కచేరీలు సార్థకమవటానికి కారణమది. వారు తరువాత దక్షిణాదికి వెళ్లి, ఇంకను సాధనచేసి, మంచి పేరును సంపాదించుకొన్నారు. నేను కాకినాడలో వున్నప్పుడు 1945 లో అనుకొంటాను, అక్కడి ప్రఖ్యాత సరస్వతీ గానసభ తరఫున ఆ గానసభ సంస్థాపకులు, మూలాధారం దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, ఆ సంవత్సరం పాల్గొనిన గాయకులలో వారిని ఉత్తమునిగా ఎంచి వారికి బంగారు పతకాన్ని బహూకరించారు.

ధారాకోట, చీకటి, సన్నకిమిడి, సురంగి, మందసా జమీందారులను కలసికొనటం తటస్థించింది. పర్లాకిమిడిరాజా గారిని నేను వారి ప్రాసాదంలో కలసికొన్నాను. ఒకసారి ధారాకోట జమీందారుగారు ఇంటికివచ్చి, పది నిమిషాలు కూర్చొని వెళ్లారు. ఒకనాడు వారి కుమారు లొకరో, ఇద్దరో మా యింటి ఆవరణ ముఖద్వారమునకు వచ్చి, వాకిట్లోవున్న మా జవానుచేత వారి రాకను తెలిపారు. నేను వారిని "లోపలికి రం"డని జవానుచేత చెప్పించాను. "మాకు తొందరపని వున్న"దని చెప్పి లోపలకు రాకుండానే వెళ్లిపోయారు. బయటి గేటువద్దకు

నేను వెళ్లి వారిని ఆహ్వానించలేదని వారు దురభిమానంతో వెళ్లి పోయి యుంటారు. అప్పుడు వచ్చియున్న మా అసిస్టెంటు కమిషనరు కె. సి. వెంకట్రామయ్యారుగారు ధారాకోట బంగళా లోనే మకాం. ఈ యువకులు తాము ఆ రాత్రి ఆ బంగళాలో గడపటానికి అవకాశముండునా అని తెలుసుకోనటానికి, మా యింటికి వెళ్లామన్నారట. నేను తమ నేదో అమర్యాద చేశానని వారు భావించి యుండవచ్చును. అందువల్ల అసిస్టెంటు కమిషనరుగారి స్టెనోగ్రాఫరు ద్వారా (తరువాత అతడు ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరైనాడు) ఏ కుంభకోణం జరిగిందో, నేను యథా ప్రకారం అసిస్టెంటు కమిషనరుగారిని చూడటానికి ఆ బంగళాకు సాయంత్రం వెళ్లినప్పుడు నన్ను కూర్చోమని ఆయనగా రనలేదు. కొంచెంసేపు నిలబడియే మాట్లాడి, చిరాకు కలిగి కుర్చీలాక్కొని కూర్చుండి, పది నిమిషాలైనతర్వాత వచ్చివేశాను. మరునా డుదయం స్టెనోగ్రాఫరుతో, "వెంకట్రామయ్యారుగారు నన్ను కూర్చో మనకపోవటం నన్ను అగౌరవపరచినట్లు. తాను నా పై అధికారి అయినా నేను హోదాగల గజెటెడ్ ఆఫీసరును. వారిని ఆఫీసులో మాత్రమే కలుసుకోవలసిన డ్యూటీ గాని, వారు నివసిస్తుండే బంగళాకు వెళ్లవలసిన అవసరం లేదు. సర్వసౌలభ్యాలు, సౌకర్యాలు నేను స్వయంగా అజమాయిషీచేసి ఏర్పాటుచేయవలసిన అవసరం లేదు. మర్యాదకు చేస్తాము. వారు మర్యాద చూపించకపోతే, మేమూ అట్టి మర్యాద చూపించము" అని గట్టిగా చివాట్లుపెట్టాను. ఇటువంటి అసిస్టెంటు కమిషనర్లు, సమర్థులైన తమ స్టెనోగ్రాఫర్ల మీద ఆధారపడియుంటారు. వాళ్ల కుట్రలకు త లొగ్గుతారు. ఈ వెంకట్రామయ్యారుగారికి ఒక యువకుడు వంటవా డుండేవాడు. అతడు బద్మాష్. మాటిమాటికి అలిగి పడుకునేవాడు. వెంక ట్రామయ్యారుగారు వానిని బ్రతిమాలి వంటచేయించుకోవలసి వచ్చేది. ఏ మెతకతనం కనిపెట్టి బెదిరించేవాడో వంటవాడు!

వంటవాని ప్రస్తావన ఒక విషయాన్ని గుర్తుకు తెస్తున్నది. నరసాపురం క్యాంపులో తటస్థపడిన శ్రీ సి. ఎ. రామకృష్ణన్, ఐ. సి యస్. ను భోజనానికి రమ్మన్నాను. ఆయన మాంసా

హోరాదులు తిననన్నాడు. "మీరు కలెక్టరు డిక్సన్‌తో భోజనం చేసినప్పుడు తినలేదా" అని అడిగాను. "అక్కడ తిన్నానుగాని, మా వంటవాడు ఊరుకోడు. నేను మీతో మాంసం తిన్నానంటే నన్ను విడిచిపెట్టి పోతా" డన్నాడు. బ్రాహ్మణ వంటవాళ్ల కాబెదిరింపు, ఇండియన్ ఆఫీసర్లకు తెల్లవాళ్లంటే అంత భయం.

బరంపురంలోని జిల్లా జడ్జిగారి బంగళా మంచి వసతులు కలిగిన పెద్ద కట్టడం. ఈ పెద్ద బంగళాకు కూడా మించినదేమో అనునట్లున్న విశాలమైన ఆవరణ. ఆవరణ నిండా ఫలవృక్షాలు, పూలమొక్కలు, పచ్చికబయళ్లు. నేను వెళ్లినప్పుడు శ్రీ యన్. చంద్రశేఖర అయ్యర్ అనేవారు జిల్లా జడ్జిగా వుండినారు. వారు మిక్కిలి సౌజన్యవంతులు, స్నేహాభిలాషి. పూర్వాచారాలను పాటిస్తూ సంధ్యావందనం, జపం మొదలైన పూజా పునస్కారాలు చేసుకొంటూ ఉదయం, సాయంత్రం విభూతిరేఖలతో, రుద్రాక్షమాలికలతో మతగురువులాగ వుండేవారు. అయినా, "నన్నంటరాకురా నా మాలకాకి" అనే ధోరణిలో, బ్రాహ్మణేతరుల విషయంలో వర్తించే మనస్తత్వంకలవారు కారు. వారు మాట, మంచి కలవారు. స్నేహపూర్వకంగా మాట్లాడేవారు. ఏ రకమైన నిరసన వారియందు కనపడలేదు. మాతృభాష అయిన అరవం, ఇంగ్లీషు భాషల్లోనే గాక, సంస్కృతంలో కూడా పండితులు. వారు తరువాత మద్రాసు హైకోర్టు జడ్జిగా పేరు ప్రతిష్ఠలు పొందారు. సుప్రీమ్ కోర్టు జడ్జి కూడా అయినారు.

ఒక క్యాంపుకు శ్రీ కె. రామస్వామి అయ్యంగారు అసిస్టెంటు కమిషనరుగా వచ్చారు. వారికిని, చంద్రశేఖర అయ్యర్‌గారికిని అదివరకు పరిచయమున్నదో లేదో కాని, వీరు జడ్జిగారింటికి వెళ్లటం వారి విందుల నారగించటం జరిగింది. ఇది మొదటిసారి. రెండోసారి వచ్చినప్పుడు, శ్రీ రామస్వామి అయ్యంగారు సరాసరి జడ్జిగారి బంగళాలోనే దిగి, వారి అతిథి అయ్యారు.

అప్పుడు యస్. పార్థసారథి అయ్యంగా రనేవారు జిల్లా పోలీసు సూపరింటెండెంటుగా వుండేవారు. వారిని జడ్జిగా రింట్లోనే

మొట్టమొదట నేను కలసికొన్నది. తర్వాత మా యింటివద్ద శ్రీ రామస్వామి అయ్యంగారికి నేను తేనీటివిందు చేయగా, వారిని కూడా ఆహ్వానించాను. వచ్చి కులాసాగా కబుర్లు చెప్పారు. శ్రీ పార్థసారధి అయ్యంగారిది మిక్కిలి చురుకైన బుర్ర. వారు పెద్ద చదువులు చదివినవారే గాక, విశేష లోకజ్ఞానం కలవారు. ఉదార స్వభావులు. స్నేహశీలురు. అయితే స్వతంత్రబుద్ధి, ఆత్మవిశ్వాసం ఎక్కువగా కలవారు. కొంచెం తిక్కతనం కూడా వుండినదేమో అని నా అనుమానం. అందువల్లకాబోలు రాణించవలసినంతగా రాణించలేదు. చివరదశలో కేరళ రాష్ట్రానికి పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ అయి, రిటైరైనారు.

వారిని గురించి రెండు విషయాలు జ్ఞాపకమున్నాయి. ఒకసారి ఛత్రపూర్‌లో కొందరు బ్రాహ్మణ మిత్రులు విందు ఏర్పాటుచేసుకొన్నారు. నే నెందుకులే అంటే, వినక మా అసిస్టెంటు కమిషనర్ శ్రీ కె. రామస్వామి అయ్యంగారు నన్ను కూడా తీసుకొని వెళ్లారు. తీరా భోజనాల సమయానికి శ్రీ పార్థ సారథి అయ్యంగారు నన్ను పిలిచి, "ఇది జంధ్యాల వ్యవహారం. మీ రింటికి వెళ్లిపొం"డని సలహాయిచ్చారు ఇది నాకు బాధాకరమే అయింది. శ్రీ పార్థసారధికి పట్టింపు లేకపోవచ్చును. ఇతరుల తరఫున ఆయ నట్లు చెప్పియుండవచ్చును. రెండోది, నేను నెల్లూరులో వుండగా ఏదో వివాహంలో కలసికొనుట తటస్థించింది. వెళ్లిన పెండ్లివారు రెడ్లు. వారి విందు నారగించాం. అయినా శ్రీ పార్థసారథి అయ్యంగారు, "ఈ రెడ్లు బలిసి వున్నారు. బాగా పన్ను వేయం"డన్నారు. ఇది తిక్కతనంగాక మరేమిటి?

జిల్లా జడ్జి శ్రీ చంద్రశేఖర అయ్యర్ గారు వెళ్లిపోయిన తర్వాత, డి. రామలింగం అనే వారు జిల్లా జడ్జిగా వచ్చారు. వీరు ఐ. సి. యస్. ఆఫీసరు. ఐ. సి. యస్. ఆఫీసర్లు కొందరు అసిస్టెంటు కలెక్టర్లుగా తరిఫీదుపొంది, కొంతకాలం సబ్ కలెక్టర్లుగా రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేసి, న్యాయశాఖను ఎన్నుకొంటారు. శ్రీ రామలింగం కూడా సబ్ కలెక్టరుగా కొంతకాలం కృష్ణాజిల్లాలో పనిచేసి, తరువాత న్యాయశాఖలోకి మారారు. వీరిని ఇంగ్లండులో ఎరిగియుంటిని. ఈ ఊరుకు దగ్గరలో వున్న

పామర్రులో వారు సబ్ కలెక్టరుగా వున్నప్పుడు చూచాను. వారు బరంపురం వచ్చినప్పుడు సబ్ జడ్జి మజ్జిగ బలరామరెడ్డి గారు శ్రీ రామలింగంగారి గౌరవార్థం ఇచ్చిన విందులో కలుసుకొన్నాను. తర్వాత వారిని వారి బంగళాలో దర్శించటం, వారు మా యింటి కొకసారి రావటం వగైరా జరుపుకొంటిమి.

నేను ఆక్సుఫర్డ్‌లో వారితో పరిచయమైన తర్వాత ఒకసారి భోజనానికి పిలిచాను. వారు సందేహిస్తూ నన్నే రమ్మన్నారు. వెళ్లి భోజనంచేసి వచ్చాను. తరువాత వారే చెప్పారు. "మీరు ఇండియా ఆఫీసు తరఫున గూఢచారిగా పనిచేస్తున్నారేమో అనుకొని సందేహించా"నన్నారు."పామర్రులో కలసికొన్నప్పుడు, యల్. వి. బి. చౌదరి అంటే ఎవరో అనుకొన్నాను. శ్రీ వెలగపూడి రామకృష్ణ మిమ్ములను భద్రయ్యా అని పిలుస్తుంటే, అదే మీ పేరను కొన్నాను" అన్నారు.

శ్రీ రామలింగంగారు జడ్జిగావున్న కాలంలో, సర్ అబ్దుల్ రహమాన్‌గారి రెండో కుమారుడు శ్రీ రహీమ్ బరంపురంలో సబ్ కలెక్టరుగా ఉండేవారు. వారు జర్మన్ యువతిని వివాహం చేసుకొన్నారు. జడ్జిగారి కంటె వెనుకవచ్చిన సబ్ కలెక్టరుగారు మర్యాదకు మొదట జడ్జిగారిని కలుసుకొనవలసి యుండినది. జడ్జిగారి భార్య వున్నారు కాబట్టి శ్రీ రహిమాన్ తన జర్మన్ భార్యతో వెళ్లి చూడాలి. కాని జర్మన్‌యువతి చాలా నిక్కు కలదట. అందుకని, జడ్జిగారు భార్యతో బైటికి వెళ్లియున్నప్పుడు వారింటికి వెళ్ళి, తాము వచ్చినట్లు కార్డులు (విజిటింగ్ కార్డులు) ఇచ్చి వెళ్లారట. సరిగా ఈపనినే జడ్జి దంపతులు చేశారు.

ఒకసారి క్యాంపుకు వచ్చిన మా కమిషనర్ క్లార్కుగారితో కలసి సబ్ కలెక్టరుగారి బంగళాకు వెళ్లాను. ఈ యువకుడు అందమైనవాడు. చలాకి, చమత్కారం, స్నేహభావం కలవాడే. ఆయన జర్మన్ భార్య దర్శనం కాలేదు. అప్పటి కింకా శ్వేతజాతి దురహంకారం మిగిలి యుంటుంది.

శ్రీ బజులుల్లాగారి కుమారుడు శ్రీ కరంతుల్లా కొంతకాలం బరంపురంలో సబ్ కలెక్టరుగా వుండేవారు. ఆయన మిక్కిలి

తుస్సుగల మనిషి. ఒకసారి ఒక ప్రముఖ మహమ్మదీయ బట్టల వర్తకుడు ఆయనగారి గౌరవార్థం విందుచేస్తూ నన్నుకూడా పిల్చాడు. సహజంగా ముఖ్య అతిథిని ఎక్కువ గౌరవిస్తారు. ముఖ్య అతిథి, వచ్చిన ఇతర అతిథులతో సామరస్యంగా నడచుకొంటాడు. కాని, శ్రీకరంతుల్లా చాలా పెళుసుగా వర్తించాడు. నేనా నడవడిని సహించక ఎదురుచెప్పాను. ఆయనగారు కోర్టుపేటలోనే ఉంటూ వుండేవాడు. నేను నా కోర్టుపేట యింటినుండి ఆఫీసుకు జట్కాలో వెళ్లుచుంటే, ఆయన తన కారులో ఆదారిన వెళ్లుచూ తటస్థపడేవాడు. నేను జట్కా వెనుక ముందుకు తిరిగి కూర్చుండటం వల్ల కారు నడుపుకు వస్తున్న ఆయనను సూటిగా చూడటం తటస్థించేది. మే మొకరి నొకరు గుర్తుపట్టనట్లే నటించేవాళ్లం. రహీంమ్‌గా రింటి కొకసారి వెళ్లానుగాని, శ్రీ కరంతుల్లా గడప త్రొక్కలేదు.

కమిషనర్ క్లార్క్ గారు క్యాంపుకు వంటవానిని తీసుకొని రాలేదు. నేనే వంటవానిని ఏర్పాటుచేసి వంట వస్తువులను సరఫరాచేశాను. వెళ్లేటప్పుడు బిల్లు ఇవ్వమన్నారు. "నా కమిషనర్‌కు నేను రెండు, మూడు రోజులు భోజనం పెట్టలేనా, బిల్లు వ"ద్దన్నాను. వారు చిరుకోపంతో తన్నా నన్నారు. "తన్నండి, బిల్లు ఇవ్వ"నన్నాను. అసిస్టెంటు కమిషనర్ రామస్వామి అయ్యంగారు సమాధానపరచారు. తగ్గించి, దొంగ బిల్లు ఇవ్వటానికి నే నొప్పుకోలేదు.

రిజర్వు క్యాంకు షేర్లు 1933 లోనో, 1934 లోనో కొనాలనుకొన్నాను. డబ్బులేదు. అందువల్ల బరంపురంలోని కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకుకు రు. 500 లు అప్పుకు దరఖాస్తు పెట్టాను. అప్పుడు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు ప్రెసిడెంటు శ్రీ ఉన్నవ రామలింగం మాష్టారుగారు. వీరు మునిసిపల్ ఛైర్మన్‌గా కొంతకాలం పనిచేశారు, అయినా వారు కల్లికోట కాలేజిలో అధ్యాపకులుగానో, ప్రిన్సిపాల్‌గానో కొన్ని సంవత్సరా లుండినారట. అందువల్ల వారిని మాష్టారు రామలింగంగా రనేవారు. దీని కింకొక కారణం వున్నది. ఇంకొక ఉన్నవ రామలింగంగా రున్నారు. వారు రావుసాహెబ్ కంట్రాక్టరు రామలింగంగారు.

మాష్టారు రామలింగంగారు మిక్కిలి ఉన్నతాదర్శాలుగల విశిష్ట వ్యక్తి. నిరాడంబరుడు. ప్రజాసేవాసక్తుడు. తాము మునిసిపల్ ఛైర్మన్‌గావుండగా పాకీవాళ్లు సమ్మెచేస్తే, కొంతమంది యువకులను వెంటవేసుకొని వీధులన్నీ శుభ్రంచేశారట. నిజమైన గాంధేయుడు. నేను అప్పుకు ధరఖాస్తు చేసిన రెండు, మూడు రోజులకు వీరిని ఏ సందర్భంలోనో కలసికొన్నాను. నన్ను చూచి, వచ్చి కౌగలించుకొన్నారు. నేను చకితుడనై "ఏమి విశేష?" మన్నాను. "మీరు మా మేనమామ" లన్నారు. వారి విజయనగరం మేనమామలు లింగం వారట.

నేను అప్పటివరకు "లింగం" ఇంటిపేరు కలవారు మే మొక్కరమే అనుకొన్నాను. అప్పుడు తెలిసింది లింగంవారు, ఇతర కులాల్లోకూడా వున్నారని. ఉన్నవవారు బ్రాహ్మణులు. చికాకోలు క్యాంపులో లింగం తమ్మయ్యనాయుడుగారనే కవిగారు తటస్థపడ్డారు. వారు తెలగాలు. తర్వాత అనంతపురంలో వారి లెక్కల తనిఖీకి వచ్చిన లింగం వెంకటేశ్వరరావు అనే వారు వైశ్యులు. లింగం జగన్నాధరావుగారనే బ్రాహ్మణకులంవారిని పిఠాపురంలో చూచాను. వారింటికి వెళ్లగా, వారెంతో సత్క రించి, వారు రచించిన పద్య పుస్తకాలను నాకు బహూకరించారు. బావమరది వరసైన వారెవ్వరో నేనీ సంగతి చెప్పుచుండగా విని, "బావా, మీ లింగం వారు మాదిగల్లోకూడా వున్నా"రన్నాడు.

రావు సాహెబ్ కంట్రాక్టరు రామలింగంగారితోనూ, వారి కుమారులు నరసింహారావు, శంకరరావు, సుందరరావుగార్ల తోనూ పరిచయం కలిగింది. మూడవవారు, విశాఖపట్టణంలో న్యాయవాదిగా రాణించుచున్నారు. వారిని 1964 లో తిరిగి కలసి కొనటం తటస్థించింది. నేను భువనేశ్వర్‌నుండి తిరిగి వచ్చుచు బరంపురానికి వెళ్లినప్పుడు, కంట్రాక్టరు రామలింగంగారింటికి వెళ్లి చూచివచ్చాను.

బరంపురంలో మా కెక్కుడు దగ్గరకు వచ్చినవారు మరొక రున్నారు. వారు డాక్టరు చంద్రరావుగారు. వారు మిక్కిలి సద్గుణ వంతులు. చాలా నెమ్మదిగా ఏ ఆర్భాటంలేకుండా, వైద్యవృత్తిని

మిక్కిలి జాగ్రత్తగా, సమర్థవంతంగా చేసేవారు. మా కుటుంబ వైద్యులుగా రూపొందారు. అంతేగాక స్నేహితులుగా పరిణ మించారు. వారు తెలగాలు వారి తండ్రిగారు పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు జేసి, పింఛను పుచ్చుకొనుచుండినారు. పోలీసు ఆఫీసరు కుమారులైనా ఆ వాసన కించిత్తైనా డాక్టరు చంద్రరావుగారు తోపింపచేసేవారు కాదు. 1964 లో విచా రించగా, వా రక్కడనుండి వెళ్లిపోయారని తెలిసింది.

1936 ఏప్రిల్ నుండి, గంజాం జిల్లా సర్కిల్ ఒరిస్సా రాష్ట్రా నికి వెళ్లబోవుచున్నది. 1935 డిసెంబరు చివర వారంలో మా అసిస్టెంటు కమిషనరుగారినుండి ఉత్తరం వచ్చింది. "మీరుగాని, మీ స్టాఫ్‌లో ఎవరైనాగాని ఒరిస్సా రాష్ట్రానికి వెళ్లుటకు ఉద్దేశ పడుచున్నారా"అని. బీహార్ అన్డ్ ఒరిస్సా ఇన్‌కమ్‌టాక్స్ కమిషనరుగారు, మద్రాసు కమిషనరుగారికి వ్రాశారట. ఉరియా క్లార్కు మహాపాత్రో సహజంగా ఒరిస్సాకే పోతాడు. తెలుగు వారిలో హెడ్ క్లార్కు పెయ్యేటి కనకరాజు వంటివారు ఇష్టాన్ని తెలిపారు. రెండు సంవత్సరాల తర్వాత మద్రాసు రాష్ట్రానికి తిరిగి వెళ్లే హక్కున్నది. అందువల్ల నేను వెళ్తానని వ్రాశాను. అయితే 100 రూపాయలు స్పెషల్ అలవెన్సు కోరాను. ఒరిస్సాలో మన్య ప్రాంతం ఎక్కువ. తీరా అసిస్టెంటు కమిషనరు వెంకట్రామయ్యార్ గారు, "మీకు ఒరిస్సాకు వెళ్లేఅవకాశం లేదు కాబట్టి మీరిదివరకు కోరివుండినట్లు 4 నెలల సెలవు పెట్టుకోవచ్చు" నని తెలిపారు. అది కొంత నిరుత్సాహాన్ని కలిగించింది.

గంజాం సర్కిల్ పోతుంది గనుక, విజయనగరంలో క్రొత్త సర్కిల్ పెట్టుటకు నిర్ణయమైంది. లేకపోతే ఇచ్ఛాపురంనుండి కూడా కేసులు విశాఖపట్టణం సర్కిల్ కే పోవలసి వచ్చేవి. నేను విజయనగరం సర్కిల్ 1-4-1936 తారీఖున ప్రారంభించి, 9-4-1936 వరకు మాత్రమే అక్కడుండి, సర్కిల్ ఛార్జి అసిస్టెంటు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరుకు ఒప్పగించి, నాల్గుమాసాల ప్రివిలేజ్ సెలవుమీద, ముందు బరంపురం వచ్చేశాను. 15-3-1936 నాడు మా రెండో కొడుకు పుట్టిన సందర్భంగా, కుటుంబం బరంపురంలోనే వుండినది.

పదిరోజు లాగి మంచిది చూచుకొని, ఇంటికి వెళ్లాలని ఉద్దేశించాం. నేను విజయనగరంనుండి తిరిగి వచ్చిన తర్వాత, ఒరిస్సా కమిషనరు ఛటర్జీగారు బరంపురం సర్కిల్‌ను చూడటానికి వచ్చారు. నేను వారిని దర్శించాను (14-4-1936). వారితో ఆ సాయంత్రం రెండు గంటలు, ఆమాటా, ఈమాటా మాట్లాడుచు గడిపాం. అప్పుడు తేలిం దేమంటే, వారి ఛార్జిలో గుమాస్తాలుగా చేరినవారు ఆ కాడర్‌లోనే వుంటారట. వారికి పెద్ద ప్రమోషన్ ఆఫీసు సూపరింటెండెంటుగా మాత్రమేనట. ఆఫీసర్లు ఎప్పటికిని కాలేరట. గ్రాడ్యుయేట్సు (బి. ఎ. వగైరా పట్టాలు) కానివారి కెప్పటికి ఆఫీసరు అయ్యే అవకాశం లేదట. మద్రాసు కమిషనర్ అధికారంలో, బి. ఎ. కాకపోయినా చిన్న గుమాస్తాగా చేరినా ఆఫీసరే కాదు, కమిషనరు అయ్యే అవకాశం ఉన్నది.

నేను ఇంగ్లండునుండి తిరిగి వచ్చిన క్రొత్తలో (1927) నా మేనమామ బలవంతాన ఒక వీలునామామీద సాక్షిసంతకం పెట్టాను. డోకిపర్రుకు చెందిన వీరమాచనేని నారాయణమూర్తి నిస్సంతుగా పిన్నవయస్సులోనే చనిపోయాడు. ఆయన నా పిన తండ్రి నాగభూషణంగారి భార్య సోదరుడు. ఆయన భార్య శ్రీమతి వజ్రమ్మ, నా పెదమారుటి తల్లి, వెంకటశేషమ్మగారి కుటుంబానికి దగ్గరవారు. శ్రీ నారాయణమూర్తి వ్రాసిన విల్లు ఆయన భార్యకు, తరువాత ఆయన అన్నకు లాభించేది. కాని మధ్య ఏ బంధుత్వంలేని కొండపల్లి బుచ్చయ్య అనే వ్యక్తి, నారాయణ మూర్తి తన కేదో ఆస్తిని సంక్రమింపజేసినట్లు ఒక వీలునామా కల్పరచి, వాదానికి దిగాడు. ఈ రెండో వీలునామా సంగతి నాకు తెలిసియుండలేదు దీనిమీద ఘురానా మని షాకరు సంతకం తర్వాత చేశాడట. కొండపల్లి బుచ్చయ్య మద్రాసు హైకోర్టులో దాఖలుచేసిన కేసులో సాక్ష్యం కావలసివచ్చింది. సాక్ష్యాన్ని తీసుకొనటానికి కమిషనరును నియమించారు. ఆయనగారు మొదట నన్ను 1936 మార్చిలో కలసికొన్నప్పుడు వీలునామాను తీసుకొనిరాలేదు. కొన్నిరోజులకు నేను బరంపురంలో ఉండగానే తిరిగి వచ్చాడు. శ్రీ బుచ్చయ్య వచ్చాడట. నాకు కన్పడలేదు.

ఆయన తరఫున వకీలు, శ్రీమతి వజ్రమ్మ తరఫున వకీలు హాజరయ్యారు. అప్పుడు కూడా విచారణ పూర్తి అయినట్లు నాకు గుర్తులేదు. అయితే ఆ సంవత్సరం డయరీని దాఖలు చేశాను. తిరిగి నా ప్రసక్తి లేకుండాపోయింది. శ్రీ బుచ్చయ్య వాదనను హైకోర్టువారు నిరాకరించారట.

నా 3½ సంవత్సరాల బరంపురం సర్కిల్ ఆధిపత్యంలో అనేకమంది ఆఫీసర్లు పరిచయ మయ్యారు. పైన చెప్పినవారు గాక రసుల్‌కొండలో శ్రీ శేషాద్రి, ఐ. సి. యస్., శ్రీ విశ్వనాథ అయ్యర్, ఐ. సి. యస్., పోలీసు అసిస్టెంటు కమిషనర్ శ్రీ సుబ్బరాయన్, సురడా క్యాంపులో శ్రీ కె. జి. బల్లియప్ప, ఆస్కా క్యాంపులో శ్రీ పొన్నప్ప వగైరా. ఇతరచోట్ల అడవుల కన్సర్వేటర్ శ్రీ సాతే, జిల్లా ఫారెస్టు ఆఫీసరు శ్రీ సహాయ్, జిల్లాబోర్డు ఇంజనీయర్ శ్రీ సత్యనారాయణశర్మ, డిప్యూటీ కలెక్టర్స్ మోయిడ్డీన్ ఖాన్, మోయిడ్డీన్, ఆదోని జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ శివరామ రథోవంటివా రున్నారు. జిల్లా కలెక్టర్ డిక్సన్‌గారిని కలసికొన్నానుగాని, వారితో అంత పరిచయం కలగలేదు. జిల్లా జడ్జి శ్రీ చంద్రశేఖర్ బాగా పరిచయులైనారు. శ్రీ పి. రామలింగంగారిని ఇంగ్లండులో ఎరిగియుంటిని, కాబట్టి ఎక్కువ చనువే.

కలెక్టర్ డిక్సన్‌గారి పేరు చెప్పినప్పుడు ఒక విషయం జ్ఞప్తికి వస్తున్నది. వారికి క్రికెట్ ఆట చాలా ప్రీతి. వారి పేరున డిక్సన్ ఎలెవెన్ అనే ఒక టీము వుండేది. వీరు గంజాం జిల్లా కలెక్టరుగా రాకముందు, మద్రాసు ప్రాంతంలో పరిచయులైనవారు వారి ఎలెవెన్ (పదకొండు) లో వుండినారు. ఒకనాడు నేను క్యాంపు నుండి రైలులో తిరిగి వచ్చుచుండగా, ఇద్దరు మద్రాసువారు ఛత్రపూరుకు క్రికెట్ ఆటకు వెళ్లటానికి రైలులో వస్తుండినారు. వారిలో ఒకరు సుప్రసిద్ధ మద్రాసు ఫొటోగ్రాఫ్ కంపెనీ ప్రొప్రైటరు శ్రీ జి. కె. వేల్. ఈ విషయం శ్రీ వేల్‌ను మద్రాసులో కలసికొన్నప్పుడు ఒకటి రెండు సార్లు జ్ఞప్తికి తెచ్చుకొన్నాము.

రైలు ప్రయాణం సంగతి వచ్చినప్పుడు ఇంకొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది. నేను బరంపురం నుండి, చికాకోలు ప్రాంతానికి క్యాంపుకు హౌరా-మద్రాసు మెయిల్‌లో ప్రయాణం చేయు చుండినాను. నా కప్పుడు కారు లేదు. ప్రయాణ మంతా రైలు లోనే. నా కంపార్టుమెంటులో ఒక దీర్ఘకాయుడు, స్ఫురద్రూపి, కోలముఖం, పొడుగైన చెవులు, మేధాసంపన్నతను సూచించే ఫాల భాగం, మంచి వర్చస్సు కలిగినవా రుండినారు. నేను వారిని నిశితంగా రెండు మూడుసార్లు చూచి, ఉండబట్టలేక "మీరెవరు?"రని ప్రశ్నించాను. "ఎవరను కొంటున్నారు" అని వారు ఎదురు ప్రశ్న వేశారు. తడుముకోకుండా, "మీరు గొప్ప లాయరైనా అయి వుండాలి, హైకోర్టు జడ్జి అయినా అయివుండాలి" అన్నాను. "ఎందు కట్లా అనుకొంటున్నా?"రని తిరిగి ప్రశ్న. "మీ వర్చస్సు, మీ ముఖ కవళికలు అట్లనిపించుచున్నా"రన్నాను. వారు నవ్వి "నేను సేలం విజయరాఘవాచారి"నన్నారు. నా అంచనా తప్పు కాదనిపించింది. మాటలు కలిశాయి. ఆ సందర్భంలో రెండు అభిప్రాయాలను వారు వెలిబుచ్చారు. ఒకటి, కాశ్మీర్ బ్రాహ్మణుడైన పండిత మదనమోహన మాలవ్యాగారితో శ్రీ విజయ రాఘవాచారిగా రొకసారి భోజనం చేశారట. తన కెబ్బెరిక మనిపించిందట. శ్రీ మాలవ్యాగారు ఉత్తమ కాశ్మీర బ్రాహ్మణుడైనా, సదాచార సంపన్నుడైనా భోజనంచేసే చేతితోనే మంచినీళ్లు త్రాగేశారట. భోజనంచేసేటప్పుడు, ఎడమచేతిని కూడా పదార్థాలను అందుకో టానికి ఉపయోగించేవారట. కాశ్మీర్ బ్రాహ్మణులు మాం సాహారులేగాని, శ్రీ మాలవ్యా శాకాహారాన్నే తీసుకొనేవారట. కాని దక్షిణాది సనాతనాచారులకు ఉత్తరదేశ బ్రాహ్మణుల ఆచారాలు ఎబ్బెట్టుగా వుంటవట. రెండోది, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారికంటె శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎక్కువ మౌలిక ( ఒరిజినల్ ) ఆలోచనాపరుడట.

భోజనం చేయకుండానే రైలెక్కాను కాబట్టి, ఇంటివద్ద నుండి తెచ్చుకొన్న ఉదయ భోజనం రైల్లోనే తిన్నాను. నా మాంసాహారాన్ని వా రేమనుకొన్నారో గానీ సౌహార్దముతోనే, నేను నాగమ్యస్థానం స్టేషనులో దిగినప్పుడు నాకు వీడ్కోలిచ్చారు.

ఉద్యోగస్థుల్లో డిస్ట్రిక్టు మునిసిఫ్ శ్రీ కన్నబాబుగారు, కోర్టుపేట వీధిలో, మా యింటికి దగ్గరగా వుండేవారు. వారు సుప్రసిద్ధ న్యాయవాది రావుబహాదర్ తాడేపల్లి పట్టాభిరామయ్య గారి అల్లుడు. మంచివారు. అప్పుడప్పుడు కలసికొనేవారం. కొంతవరకు పూర్వాచారాలను జరుపుకోవాలనే మనస్తత్వం కలవారు. భగవద్గీతలోని, "చాతుర్వర్ణ్యం మయా సృష్టం, గుణ కర్మ విభాగశః" అనే శ్లోకం వారిని తార్కికుణ్ణి చేసేది.

ఓఢ్రమంగళ్లు శరీరం పట్టటానికి, తలంటుకు పేరుగన్న వాళ్లు. నాకు చాలాకాలంనుండీ, ప్రతివారం తలంటుస్నానం అలవాటు. తలంటుస్నానం శనివారం మంచిదంటారు కాని, శనివారం మాకు ఎక్కువ పనివుంటుంది. పైగా క్యాంపుకు ఆదివారం మధ్యాహ్నం బైలుదేరివెళ్లి మరు ఆదివారం ఉదయానికి తిరిగి వస్తాం. అందువల్ల ఆదివారమే నా తలంటు. ఒక మంగలి మామూలు అయిపోయాడు. వాడు బుగ్గనిండా కారాకిల్లీ వేసుకొని, నములుతూ వచ్చేవాడు. ఒకసారి కారాకిల్లీ వేసుకొని వచ్చానని నాకు తెల్పటానికి కాబోలు నామీద తన నోటిగాలిని ఊదాడు. నేను చివాట్లు పెట్టాను. ఇంకొకసారి, మోహర్బానీకి గట్టిగా నడుము విరిచాడు. నడుము పట్టింది. తర్వాత జాగ్రత్తగానే చేసేవాడు. వళ్లుపట్టటం, మెడ విరచటం, నడుము, మోకాళ్లు, పాదాలు, వగైరా, విరచటం ఉరియా మంగళ్ల ప్రత్యేకత.

ఉద్యోగస్తులతోనేగాక, ప్రముఖ న్యాయవాదులు శ్రీ ఆర్. వి. రమణమూర్తి, శ్రీ తాడేపల్లి పట్టాభిరామయ్య, శ్రీ రామకృష్ణ రథో, శ్రీ లింగరాజు పాణిగ్రాహి, శ్రీ మాదిరెడ్డి సీతారామస్వామినాయుడు వంటివారు పరిచితులైనారు. రమణ మూర్తిగారు మిక్కిలి సమర్థులైన న్యాయవాది. పైగా మంచి వక్త. ఇంగ్లీషులో మిక్కిలి ధారాళంగా, విషయపూరితంగా మాట్లాడేవారు. పాణిగ్రాహిగారు ధీమాగలవారు. శక్తివంతులు. ఒరిస్సా రాష్ట్రానికి తరువాత చీఫ్ జడ్జి అయ్యారు. శ్రీ పట్టాభి రామయ్యగారు చాలా సంవత్సరాలు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా

వుండి, రావు బహాదర్ బిరుదును పొందారు. శ్రీ రథో అప్పుడు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా వున్నారు.

శ్రీ గిరిగారు విధాన సభకు పోటీచేసే సందర్భంలో బరంపురంలో వారి నొకసారి చూచినట్లు గుర్తు. అంతకు ముందు మీ వోట్లను ఇవ్వండని వచ్చిన వారి ఏజంట్లతో, తప్పకుండా వారి అభ్యర్థిత్వాన్ని బలపరుస్తా మని చెప్పి ఆ విధంగా చేశాము. 1928 లో మద్రాసు బార్ ఎసోసియేషన్‌కు, ఎవరినో కలసికొనుటకు వారు వచ్చినప్పుడు వారి పరిచయ భాగ్యం కలిగింది. 1954 లో నేను ఢిల్లీకి వెళ్లినప్పుడు వా రింటికి వెళ్లి వారిని దర్శించాను. అప్పుడు వారితో శ్రీ వెలగపూడి రామకృష్ణగారు మాట్లాడుచుండినారు. మరీ మంచి దైంది. రామకృష్ణగారికి, గిరిగారికి గాఢ స్నేహం. రామకృష్ణగా రిచ్చిన విందుల సందర్భంలోను, ఇతరత్రా శ్రీ గిరి గారిని కలసికొనియుంటిని. వారు 1937 శ్రీ రాజాజీ కాబినెట్‌లో మంత్రిగా నున్నప్పుడు, ఒక మీటింగులో కలసికొనగా ఎంతో ఆదరించారు. 1970 సెప్టెంబరు ఆరవ తారీఖున కీ. శే. శ్రీ వెలగపూడి రామకృష్ణ కాంస్య విగ్రహాన్ని, వారు ఉయ్యూరు కె. సి. పి. లిమిటెడ్ ఆవరణలో ఆవిష్కరించినప్పుడు వారి సమీపానికి వెళ్లగా, యల్. వి. బి. చౌద రిడుగో అని రంగా గారన్నారు. ఎవరితోనో మాట్లాడుచుండిన శ్రీ గిరిగారు, చప్పున వెనుకకు తిరిగి, నన్ను పలుకరించి కరచాలనం చేశారు. వారి సౌజన్యత, సహృదయత, స్నేహభావం అటువంటివి. వారి తండ్రి వరాహగిరి జోగయ్య పంతులుగారు బరంపురంలో ప్రఖ్యాత న్యాయవాదియేగాక, ప్రజారంజకులైన ప్రముఖులు. ఏ సందర్భములోనో వా రింటికి ఒకటి, రెండుసార్లు వెళ్లి వారి దర్శనంచేశాను. అక్కడక్కడ వారిని చూడటం, మాట్లాడటం జరిగింది. వారి అల్లుడు వీరరాఘవస్వామిగారు మా బాబు పూర్ణచంద్రరావు గురువు. చాలా మంచివారు. శేముషితోబాటు, కళాసేవకుడు. నాటకాలలో వేషం వేయుటం వారి అభిమానం.

పైవి గాక ఒకటి, రెండు అనుభవాలు గుర్తుకు వస్తున్నవి. గవర్నరు హోప్ గారు బరంపురం పర్యటనకు వచ్చారు. ఒక పెద్ద

ఆతిథ్యం (రెసెప్షన్) లో, గంజాం జిల్లాలోని జమీందారులు హాజరైనారు. వారిలో చిలకసరస్సు ప్రాంత జమీందారు లుండినారు. గవర్నరుగారి రాకకు అందరం ఎదురుచూస్తూ ఉండినాము. ఈ జమీందారులలో పిన్నవయస్కులు, ముఖ్యంగా చిలకసరస్సు ప్రాంతంవారు, మాటిమాటికి హడావుడిగా రెసెప్షన్ భవనంలోకి వెళ్లటం, చప్పున రావటం గమనించాను. ఎందు కిట్లు చేస్తున్నారని విచారించగా, వారు తమ దుస్తులను సవరించుకొనటానికి, ముఖము చెమట, జిడ్డు తుడిచివేసుకొన టానికని తేలింది. గవర్నరుగారికి తాము టిప్ టాప్‌గా కనబడాలి. అదీ వారి ఆతురత!

ఈ పర్యటనలోనే గవర్నరుగారి కింకొకచోట టీ పార్టీ జరిగింది. అప్పుడు శ్రీ గిడుగు సీతాపతిగారు ప్రముఖ పాత్ర వహించారు. వా రప్పుడు వెస్టుతో గూడిన సెండు సూటు వేసుకొని, ఠీవిగా తలపాగా చుట్టుకొని యున్నారు. వచ్చిన అతిథులను గవర్నరుగారికి పరిచయంచేశారు. నావద్దకు వచ్చినప్పుడు గవర్నరుగా రేదో అనబోయి, మానివేశారు. నే నంతకు ముందే ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా ఖాయ మయ్యాను. ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంటు సెంట్రల్ గవర్నమెంటులో భాగమైనా, సెంట్రల్ గవర్నమెంటువారు కమిషనర్ చేసిన ఖాయం (పరమనెంటు) సిఫార్సులను ఆమోదించే అధికారం రాష్ట్రగవర్నర్లకు ఆ కాలంలో సంక్రమింపజేశారట. అందువల్ల గవర్నరు స్టాన్లె గారు నా ఖాయాన్ని అంతకు ముందే అనుమతించి యున్నారు. ఒకటి రెండు సార్లు నా ఖాయం వారి అనుమతికోసం వెళ్లవలసివచ్చిందని తర్వాత విన్నాను. దీనికి కారణం లేకపోలేదు. చిత్తూరుకు చెందిన విశ్వనాథ అయ్యర్ (అని గుర్తు) గారు లా సెక్రటరిగా ఉండినారట. చిత్తూరులోని నా పరసనల్ క్లార్కు స్వామినాథ అయ్యర్ నావల్ల పనినుండి తొలగింపబడ్డాడు కదా! ఈ కార్పణ్యంవల్ల విశ్వనాథ అయ్యర్ ఏవో అడ్డంకులు పెట్టినట్లున్నది. మా కమిషనర్ సెనెక్ గారు రెండోసారి గట్టిగా గవర్నరుగారికి వ్రాయటం జరిగిందట. అది గవర్నరుగారికి గుర్తుకు వచ్చి యుండవచ్చును.

1933-34 సంవత్సరంలో తలగుడ్డ తప్ప పూర్తి దొర వేషంలో ఉండిన శ్రీ గిడుగు సీతాపతికి, 1953-54 సంవత్సరంలో నేను సీటుగా బుష్షర్టు, లాగు వేసుకొనటం గిట్టకపోయింది. గంగిరెద్దు వేషం అన్నారనిపించింది. ప్రక్కనున్న శ్రీ సీలంరాజు వెంకట శేషయ్యగారు చకితులై తీవ్ర అసమ్మతిని తెలిపారు. కాల మహిమా లేక వ్యక్తి కుంచిత తత్వమా ?

బరంపురంలో ఆఫీసు సిబ్బంది విషయం. అసిస్టెంటు ఆఫీసరుగా (అప్పటి కింకను పేరును ఇన్స్పెక్టరని మార్చలేదు) శ్రీ కత్తెరశెట్టి సూర్యారావుండేవాడు అతడు పరసనల్ క్లార్కు నుండి హెడ్ క్లార్కు, అసిస్టెంటు ఆఫీసరు, తిరిగి హెడ్ క్లార్కు, ఈ విధంగా పైకెక్కుచు, క్రిందకు దిగుచు చివరకు ఆఫీసరై, ఉద్యోగ విరమణ చేశాడు. తన విధులను తెలివితేటలతోనే నిర్వహించాడు. ఈ సర్కిల్‌లో నాకు సహాయకారిగానే ఉండి నాడు. హెడ్ క్లార్కు శ్రీ పెయ్యేటి పేర్రాజుపంతులు చాలా నిజాయితీ కలవాడు. కష్టపడి పనిచేసేవాడు. శ్రద్ధ కలవాడు. కొంతకాలం అసిస్టెంటు ఆఫీసరుగా పనిచేసి, కనిష్ఠ పరిమితి ఆదాయాన్ని వెయ్యి రూపాయలకు తగ్గించినప్పుడు, పన్ను వేసే అధికారాన్ని ఈయనకిచ్చారు. డి. సన్యాసయ్య అనే వారు కొంతకాలం హెడ్ క్లార్కుగా పనిచేశారు. శ్రద్ధా భక్తులు కలవారు. ఓపిక కలవారు. చేవ్రాత చక్కగా వుండేది. యమ్. వెంకట్రావు, జి. నారాయణరావు, పద్మనాభస్వామి గుమాస్తాలు. పి. జగన్నాథరావు టైపిస్టు. శ్రీ వెంకట్రావు సమర్థుడైన గుమాస్తా, కొంత కాపట్యం, నటన వుందనుకొంటాను. తరువాత కూడా ఈయన తగిలాడు. శ్రీ నారాయణరావు సమర్థుడేగాక, ఆఫీసరుతో అనుకూలంగావుండి, సహాయాన్ని అందించేవాడు. ఆయన ఆఫీసరై, నేను విజయనగరం అప్పిలేటు అసిస్టెంటు కమిషనరుగా మకాం వెళ్లినప్పుడు, ఆ సర్కిల్ ఆఫీసరుగా వుండి నాడు. గుంటూరు మొదలైనచోట్ల ఆఫీసరు ఉద్యోగం నిర్వహించి, విరమణ చేశారు. ఈయన అన్న డాక్టరు సూర్య నారాయణగారు నాకు మొదట బరంపురంలోను, తర్వాత

నరసన్నపేటలోనూ, సబ్ అసిస్టెంటు సర్జన్‌గా స్నేహితులైనారు. మంచి స్నేహశీలి. మర్యాద మన్ననలు కలవారు. శ్రీ పద్మనాభస్వామి కొంత బద్ధకస్థుడు. వేళమించినా తప్పనిసరికి ఆఫీసులో ఉండినా గొణుక్కొనేవా డనుకొందును. మధ్యకాలంలో రైల్వే ఉద్యోగిగా వెళ్లిపోయాడు. జగన్నాథరావు చురుకైనవాడు. చేయదలచుకొంటే పని బాగా చేసేవాడు.

నేను 1936 మార్చి, 31-వ తారీఖున, గంజాం జిల్లా ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్ ఆఫీసరత్వాన్ని వదలి, బరంపురం విడిచి, విజయనగరం వెళ్లానని పైన చెప్పాను. ఇంకా 5, 6 వారాలకు వెళ్తాననగా, హెడ్‌క్లార్కు పెయ్యేటి కనకరాజు, "అయ్యా, మీరు ప్రొద్దుపోయేవరకు ఆఫీసులో వుంటే, మా గుమాస్తాల కందరికి ఇబ్బందిగా వుంటున్నది. పెందలకడనే పని పూర్తిచేసుకొంటే బాగుంటుం"దన్నారు నే నాశ్చర్యపడి, "3 సంవత్సరాలనుండి లేని ఇబ్బంది ఇప్పుడు వచ్చిందా, గుమాస్తాలందరట్లు చెప్పమన్నారా?" అంటే, "చెప్పమన్నా"రన్నారు. తీరా విచారిస్తే, ఒక్క ఉరియా గుమాస్తా తప్ప, ఇతరులు మే మెరగ మన్నారు. ఈ యిద్దరు ఒరిస్సాలో మిగిలిపోయారు. ఆలస్యంగా పనిచేస్తున్నారని తెలిస్తే, వచ్చే క్రొత్త అధికారి కూడా ఈ పద్ధతి అవలంబిస్తాడేమో అని భయపడ్డారో, లేక, ఎట్లైనా ఈ ఆఫీసరు వెళ్లిపోతున్నాడుకదా, తిరిగి ఎప్పుడూ ఈయనవద్ద పనిచేయం కదా అనే ధీమాతోనో, వీళ్లిట్లు సాహసించకలిగారు. నిజానికి ఆలస్యంగా పనిచేయుటం నా తప్పే. అయితే పని అటువంటిది. నా ఆరోగ్యం, సౌఖ్యం కొరకు నేను చేసిందికాదు. ఆఫీసు జవాన్లు వెంకటప్ప, అక్కయ్య, మోహన్ బెహరా, రంజాన్ ఆలీ వుండేవారు. వీరందరిలో అక్కయ్య సమర్థుడు. చెప్పిన పనిని నిక్కచ్చిగా చేసేవాడు. భయ భక్తులతో నడచుకొనేవాడు. సిపాయివలె నిటారుగ, ఠీవిగ ఉండేవాడు. నా పెద్ద కుమార్తె, వజ్రాంబ వివాహం 1931 ఏప్రిల్‌లో జరిగినప్పుడు, నేను అతనిని నాతో పెడసనగల్లుకు తీసుకొని వచ్చాను. ఏదైనా స్వంతపనికి అతనిని నియమించేవాడను. వెంకటప్పకూడ మిక్కిలి శ్రద్ధా

భక్తులు, అనుకూలత కలిగినవాడే. కాని, కొంత చాదస్తుడు. అధిక ప్రసంగం చేసే గుణం ఉండినది. అయితే ఆఫీసరు మనస్తత్వాన్ని బట్టి పద్ధతులు మార్చుకొనే స్వభావం కలవాడు. ఆచారాన్ని పాటించే శ్రీ ప్రసాదరావుగారు ఆఫీసరుగా ఉన్నప్పుడు ప్రొద్దున్నే మడికట్టుకొన్నట్లు వంటవాని వలె చిన్న అంగవస్త్రము కట్టుకొని, నీళ్లతోడటం వగైరా పనులు చేసేవాడు. నా హయాంలో మామూలు జవాను వేషంతోనే వుండేవాడు. వీళ్లిద్దరు నాతోబాటు విజయనగరం ఆఫీసుకు బదిలీ అయ్యారు. మోహన్ బెహరా మామూలు ఉరియా జవాను. వీలుగావుంటే ఒళ్లు దాచుకొనేవాడు. రంజాన్ ఆలీ చాలా మంచివాడు. నెమ్మది, ఓర్పు. చెప్పింది తూ. చ. తప్పకుండా చేయటం అతని విశేషం. అట్టే తెలివితేటలు కలవాడు కాదు. కుయుక్తులు లేనే లేవు. నరహరి అనే ఇంకొక ఉరియా యువకుడు మషాల్చిగాను, వెంకటేశ్వర్లు అనే చాకలి కుర్రవాడు పంకా లాగేవాడుగాను ఇంచుమించు తృప్తిగానే పనిచేశారు.

అప్పుడప్పుడు క్యాంపుకు వచ్చిన పెద్దలు, ఏదో పనిమీద వచ్చి నన్ను కలసికొన్న బంధువులు ఉండేవారు. 1936 ఫిబ్రవరిలోనే నొకనాటి సాయంత్రం ఆఫీసులో పనిచేస్తూండగా అప్పుడు రెజిస్ట్రేషన్ ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా వుండిన దివాన్ బహదర్ బండి శ్రీహరిరావునాయుడుగారు నాకెట్టెదుట కనపడ్డారు. నేను లేచి వారిని దయచెయ్యండని కుర్చీ చూపించాను. నాలుగు నిమిషాలుండి వెళ్లిపోయారు. మరునాడుదయం వారుండుచుండిన బంగళాకు వెళ్లాను. వారు షికారుకు నడచి వెళ్లారట. ఒక గంట కాచుకొనియుండిన తర్వాత, వారు వచ్చి చాలా ఆప్యాయతతో ఆమాటా ఈమాటా మాట్లాడారు. తాను 15 రూపాయల గుమాస్తాగా రెవిన్యూ డిపార్ట్‌మెంటులో చేరారట. శ్రమించి ఉన్నతపదవికి వచ్చారట. మాటల వరసలో తాను ఈస్టు గోదావరి కమ్మవారు గరటయ్యగారింటిలో చాలాసార్లు భోజనం చేశానని, గరటయ్యగారు తనకు చదువు చెప్పించారని చెప్పారు. వీరిని నేను 1920 లో ఇంగ్లండుకు వెళ్లేటప్పుడు గుడివాడలో వారు

డిప్యూటీ కలెక్టరుగా నుండగా కలసికొని వారి అభిమానాన్ని, ఆశీస్సులను పొందాను. వారి నా రాత్రి భోజనాని కాహ్వానించి సబ్ జడ్జి బలరామరెడ్డిగారిని, మునిసిపల్ కమిషనరు చెలికాని వెంకటరావుగారిని కూడా ఆహ్వానించాను. రావు బహదర్ యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారు, మాగంటి బాపినీడు గారు, కాట్రగడ్డ శేషాచలంగారు, రంగాగారు, లచ్చన్నగారు, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు మొదలైన స్నేహితులు, బంధువులు వచ్చారు. శ్రీ రంగనాయకులునాయుడుగారు ఆ రోజుల్లో కేంద్ర స్టేట్ కౌన్సిల్ మెంబరు. తిరిగి ఎన్నికల సందర్భంలో బరంపురం వచ్చి కంట్రాక్టరు రామలింగంగారింట్లో దిగి, నన్ను చూడటానికి వచ్చారు. వారు ఘరానా మనుష్యులు. మిక్కిలి మేధావి. వ్రాత కోతలు సరిగా రావుగాని, నోటి లెక్కలు బ్రహ్మాండంగా కట్టేవారు. వారి జ్ఞాపకశక్తి అసాధారణం. తర్వాత కాటూరి (కృష్ణాజిల్లా) జమీందారీ కొని, కాటూరి జమీందారులైనారు. వా రిద్దరు కుమారులు తిరుపతయ్య, రామనాథబాబు గార్లు నిస్సంతుగా చనిపోయారు. వారి పేర హైస్కూలొకటి స్థాపించారు.

కాట్రగడ్డ శేషాచలంగారు బారువా సముద్రతీరంలో కొబ్బరి పీచు తయారుచేయటానికి వసతు లెట్లున్నవో పరిశోధించ టానికి గవర్నమెంటు తరఫున వచ్చారు. వారు, నేను కలసి 1920 సంవత్సరంలో ఇంగ్లండుకు విద్యాభ్యాసానికి వెళ్లినట్లు పైన తెల్పియే యున్నాను. ఒక రోజుండి వెళ్లిపోయారు.

మాగంటి బాపినీడుగారు ఆంధ్రా యూనివర్శిటి సెనేట్‌కు ఎన్నికల సందర్భములో తన అభ్యర్థిత్వానికి ఓట్లకోసం వచ్చారు. దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు తాను రచించి ప్రచురించిన పాఠ్య పుస్తకాలను, స్కూళ్లలో పెట్టించుకొనటానికి వచ్చారు.

శ్రీ రంగా ఏదో రాజకీయ ప్రచారానికి వచ్చారు. వా రప్పుడు పోలీసు అజమాయిషీలో వుండినారు. వారిని వెంబడిస్తూ ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు, ఒక కాన్‌స్టబుల్ వుండేవారు. ఒకనాటి ఉదయం కాన్‌స్టబుల్ వచ్చి "రంగాగారు వచ్చియున్నారు, మీ

యింటికి భోజనానికి వస్తానని చెప్పి రమ్మన్నా''రని చెప్పాడు. సరే అన్నాను. భోజనంవేళకు రంగాగారు లచ్చన్నగారిని తీసుకొనివచ్చారు. లచ్చన్నగారిని అదివరకు చూచి యుండలేదు. ఆ రోజుల్లో అప్పుడప్పుడే రాజకీయాల్లో పైకి వస్తున్నారు. వేషం అదీ చూస్తే సామాన్య వ్యక్తిగా తోచారు. రంగాగారు చెప్పక పోతే మాతోపాటు భోజనం చేయించేవాడను కాదు. తర్వాత చాలాసార్లు వారు మా యింటికి స్వేచ్ఛగా రావటం, మా కుటుంబాన్నంతా కలియకలుపుకొనటం, మాతో కలసి భోజనం చేయటం జరిగింది. నేను వారిని మొదట చూచినప్పుడు రంగాగారి అనేకమంది శిష్యులలో తక్కువస్థాయి కార్యకర్తల్లో ఒక రనుకొన్నాను. వారూ, వీరూ వచ్చి పోతూండేవారు. వీరూ, వాగూ పరిచయ మాతూండేవారు. ఇది ఎంతవద్దనుకొన్నా జరుగుతునే ఉండేది.

నేను బరంపురం విడిచిపెట్టే సమయం దగ్గరకు వచ్చింది. రామానాయుడు, పాకనాటి కృష్ణమూర్తినాయుడుగార్ల వంటి మిత్రులు విందులు చేశారు. రామానాయుడుగారు వచ్చి "మీకు వెండి టిఫిన్ కారియర్ వగైరా బహూకరిస్తాం" అన్నారు. వద్దని గట్టిగా చెప్పాను. ఇంకొకరు వచ్చి "నాలుగు వందల రూపాయలు ఖర్చుపెట్టి మీకు గొప్పగా విందు ఏర్పాటు చేస్తా" మన్నారు. ఏ విధంగా అయినా వంద రూపాయలకు మించకూడ దన్నాను. అదీ జాస్తే అని చెప్పాను. ఆవిధంగానే పాకనాటి కృష్ణమూర్తి నాయుడుగారింటివద్ద జరిగింది.

మార్చి 15-వ తారీఖున పుట్టిన మగబిడ్డకు 29-వ తారీఖున ఉయ్యాలవేసి, వాని ముత్తవతల్లి రంగమ్మగారిచేత 'రాధాకృష్ణ' అని పేరు పెట్టించాము. వారిని, వీరిని పిలిస్తే బహుమతులు పట్టుకొనివస్తా రని ఎవరినీ పిలవకుండా మాలో మేము జరుపుకొన్నాం. నీలకంఠేశ్వరస్వామి గుడికి వెళ్లి పూజలు జరిపించాం.

నాకు గంజాం జిల్లా సర్కిల్, బరంపురం నివాసం మిక్కిలి సంతోషకరమైన అనుభవం. నే నితర జిల్లాలలో పనిచేశాను

గాని, గంజాం జిల్లాలో వంటి రమ్యప్రదేశాలను, మకాంలకు మిక్కిలి అనుకూలమైన చోట్లను ఇతర జిల్లాలలో చూడలేదు. బరంపురంలో కలిగిన స్నేహితచనువులు ఇతర పట్టణాలలో సంభవించలేదు. ఇప్పటికిని, నా ప్రథమ ప్రేమను చూరగొన్న ఆ జిల్లా, ఆ పట్టణం నా స్మృతిపథంలో నాటుకొనిపోయి యున్నవి.

31 మార్చి రాత్రి విజయనగరానికి బయలుదేరాను. అనేక మంది మిత్రులు, పరిచయులు స్టేషనుకు వచ్చి సాగనంపారు. అంతటితో నా గంజాం జిల్లా ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు ఉద్యోగం పూర్తి అయింది.

1936 ఏప్రిల్ 1-వ తారీఖున విజయనగరం చేరి, అక్కడ క్రొత్త సర్కిల్ ప్రారంభించాను. బరంపురంనుండి గుమాస్తాలు, జి. నారాయణరావు, పి. జగన్నాథరావు, జవాన్లు, వెంకటప్ప, అక్కయ్య క్రొత్త సర్కిల్‌లో చేరారు. అసిస్టెంటు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా, శ్రీ ఎ. హనుమంతరావు, జవానుగా పైడితల్లి క్రొత్తగా వచ్చారు. తర్వాత కొన్ని ఫైల్సును పట్టుకొని డి. రాజేశ్వరశాస్త్రి, పరసనల్ క్లార్కుగా చేరాడు. ఆడిటరు గుప్తాగారు కూడ నాకు స్వాగతం ఇచ్చారు. ఆఫీసు బిల్డింగు గట్టిదేగాని, ఆఫీసుకు అంత అనుకూలమైనది కాదు. గుప్తాగారు కొంత శ్రమతీసుకొని, తన సోదరుని ఇల్లు ఇప్పించినట్లున్నారు. గుప్తాగారు నిజానికి ఫస్టుగ్రేడ్ ప్లీడరు. వారు ఇన్‌కమ్‌టాక్సు కేసులలో హాజరౌతూండేవారు.

సంవత్సరారంభం. పైగా, నే నక్కడుండేది 8 రోజులే. 9-వ తేదీనుండి 4 నెలలు సెలవుమీద వెళ్లుచున్నాను. మరిన్ని కాదు, బొంగరం ఏర్పరచుకోనాలి. అందువల్ల నేను ఏమీ కేసులు వినలేదు. అసలు నోటీసులే పంపలేదు. బహుశా వారా లప్పటికి వచ్చియుండవు.

నన్ను చూడటానికి, సబ్ జడ్జి ఉద్యోగం నిర్వహించి రిటైరయిన రంగనాథంపంతు లనేవారు, వచ్చారు. వారు నియోగి కారు. శ్రీ వైష్ణవులు. వారికి, విజయనగర సంస్థానానికి ఏదో బాదరాయణసంబంధ ముండినది. విజయనగరంలో కొంత



గంజాం జిల్లా బరంపురం సర్కిల్ వీడ్కోలు - 1936 — కూర్చున్నవారు: (మొదటి పంక్తి) 1. శ్రీ మద్దూరి వెంకటరావు, 2. శ్రీ కత్తిరిశెట్టి సూర్యారావు, 3. శ్రీ తురగా రామచంద్రరావు, 4. ఆఫీసరు, గ్రంథకర్త, 5. శ్రీ పెయ్యేటి కనకరాజు, 6. శ్రీ శర్మ
నిలుచున్నవారు: (మొదటి పంక్తి) 2. శ్రీ పద్మనాభస్వామి, 3. శ్రీ మహాపాత్రో, 4. శ్రీ జగన్నాథరావు
(రెండవ పంక్తి) 1. రంజాన్ అలీ, 3. నరహరి బెహరా, 4. మోహన బెహరా, 5. అక్కయ్య, 6. వెంకటేశ్వర్లు, 7. వెంకటప్ప

మంది కమ్మవారున్నారు. వారిని దొర లంటారు. బొడ్డు రంగారావు దొర అనే వారు వచ్చారు. మర్నాడు మునిసిపల్ ఛైర్‌మన్ శ్రీ పి. వీరభద్రరావుగారి కారును తీసుకొని వచ్చారు. మేమా కారులో కంటోన్మెంటుకు వెళ్లి ఎస్టేటు కలెక్టర్ శ్రీ సత్యనాథన్, ఐ. సి. యస్. గారిని చూచాము. తాడేపల్లి పట్టాభిరామయ్యగారు (బరంపురం) విజయనగర సంస్థానానికి, న్యాయశాస్త్ర సలహాదారుడుగా నియమింపబడి వున్నారు. వారు చెప్పటం వల్లనే రంగనాథంపంతులుగారు వచ్చి చూచియుండినారు. వారున్న చోటుకు వెళ్లి మాట్లాడి వచ్చాను. తర్వాత గోపాలరావు జమీందారుగారిని చూచాను. వారి నే కారణంవల్ల చూచానో ఇప్పుడు జ్ఞప్తిలేదు. వారు క్షత్రియులైనా నల్లగా, లావుగా, వస్త్రధారణలో శ్రద్ధలేనట్లు కనిపించారు. వారు ఫలానా అని తెలియకపోతే ఏ చిల్లర దుకాణదారుడో అనుకొంటారు. దీనినిబట్టి కులం, అంతస్తును బట్టి రూపురేఖ లుంటవనుకొనటం పొరపాటే అవుతుంది. మరునాడనుకొంటాను, శ్రీ పట్టాభిరామయ్యగారు, శ్రీ పి వీరభద్రరావుగారు వచ్చి ఆమాటా, ఈమాటా మాట్లాడి వెళ్లారు.

శ్రీ రంగారావు దొర భోజనానికి పిలిచాడు. భోజనం పిలుపును కాదనలేకపోవటం నా బలహీనత. సరే అన్నాను. వారి పెదతండ్రి కొడుకు సన్నబాబుగారింటికి తీసుకొనివెళ్లాడు. అక్కడే భోజనం. కొద్దిమంది కమ్మవారు వచ్చారు. పెద్దాపురం చల్లాదొరైగారు కూడా ఉన్నారు. సన్నబాబుగారు పట్టే పట్టనట్లుగ వుండిపోయారు. ఆయన పలుకుబడి కలవాడు. అయితే రౌడీ అని పేరు డిప్యూటీ కలెక్టర్ ఆదోనిగారు సన్నబాబు విషయంలో జాగ్రత్తగా వుండవలసిందని సలహాయిచ్చారు.

ఆహ్వాన భోజనానికి ముందు 9-వ తారీఖు ఉదయమే, అసిస్టెంటు ఆఫీసరు హనుమంతరావుకు ఛార్జి వప్పగించి, భోజనం అయిన తరువాత బరంపురానికి వెళ్లిపోయాను. నా స్థానంలో నియమించబడ్డ శ్రీ జి. అప్పారావు అసిస్టెంటు ఆఫీసరు పదవి

నుండి ప్రమోషన్ అయ్యాడు. వా రప్పటికి విజయనగరం చేరుకోలేదు.

నేను 9–వ తారీఖు రాత్రికో, 10–వ తారీఖు ఉదయానికో బరంపురం చేరుకొన్నాను. అక్కడ 18–వ తారీఖువరకుండి, స్నేహితుల మర్యాదలుపొంది, 19–వ తారీఖు ఉదయం మెయిల్లో పదిమంది అభిమానులు వీడ్కోలివ్వగా బయలుదేరి, 20–వ తారీఖు ఉదయం బెజవాడకు చేరుకొన్నాం. మిత్రుడు శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణగారు వా రింటికి తీసుకొనివెళ్లి ఆదరించారు. భోజనానంతరం మిత్రుడు పోలీసు ఇన్‌స్పెక్టర్ శ్రీ సూర్యదేవర రామచంద్రరావుగారు, టాక్సీని ఏర్పాటుచేయగా అందులో సాయంత్రానికి పెదసనగల్లు చేరుకొన్నాం.

పెదసనగల్లుకు చేరినప్పటినుండి ఇంటి వ్యవహారాలు, బంధువుల రాకపోకలు. వెళ్లిన కొద్దిరోజులకే ఒక పెదతండ్రి మనుమరాళ్ల పెళ్లిళ్లు. తర్వాత నా భార్య అక్క రెండో కుమారుడు సీతారామారావు పెండ్లి (8–5–36). పిమ్మట నా బావ మరది నిమ్మగడ్డ దుర్గానాగేశ్వరుడుగారి పెద్దమేనల్లుడు అడుసుమిల్లి వెంకటసుబ్రహ్మణ్యం పెండ్లి ( 16–5–36 ). ఈ చివరి పెళ్లిలో కమ్మవా రొకరు పౌరోహిత్యం జరిపారు. రామస్వామిచౌదరి గారి వంటి మహనీయులు జన్మించిన కులాన్ని, పూజా పునస్కారాల్లో, మంత్ర తంత్రాల్లో, దాసులుగా పేర్కొనే బ్రాహ్మణ పౌరోహిత్యాన్ని నిరసించి, స్వకుల పౌరోహిత్యంతో జరుపుకొనే వారు బయలుదేరారు. 1917 సంవత్సరంలోనే శ్రీ కూర్మా వెంకటరెడ్డిగారి వదినె కుమారుడు శ్రీ రామారావు వివాహానికి ఆధ్వర్యం వహించినవారు కమ్మ, రెడ్డి కులస్థులు. వీరు కర్మ కాండను నేర్చుకొని, అచ్చమైన వైదికులుగా తయారయ్యారు. నిజానికి వీ రొక కమ్మ లేక రెడ్డి వైదిక లేక శ్రోత్రియ కులాన్ని ప్రారంభిస్తారేమో అని కొంతమందికైనా తోచింది. క్రమేపి, మేము బ్రాహ్మణులం, అగ్రజాతివారం, మీ రందరూ దాసులు అనే అహంభావం చచ్చి, బ్రాహ్మణులు కూలికివచ్చిన వారుగా స్థిరమైనప్పుడు, ఎవరో ఒకరు తప్ప, మామూలు పురోహితుల చేతనే వివాహాదికార్యాలను జరిపించుకొనుచున్నారు.



శ్రీ చల్లపల్లి రాజా శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరు గారి గ్రూపు ఫొటో - 1936

నిలుచున్నవారు : 2. గ్రంథకర్త, 3. శ్రీ చల్లపల్లి రాజావారు, 4. శ్రీ వై. రామకృష్ణప్రసాద్ గారు,
5. శ్రీ జ్ఞానప్రకాశంగారు, 6. శ్రీ ఐనాల బాబూరావుగారు

మా వదిన కొడుకు సీతారామారావు మా లింగం కుటుంబంలోనివాడు. అతని పితామహుడు వెంకట సుబ్బయ్యగారు, నా పెదతండ్రి కుమారుడు. మా లింగం కుటుంబంలో మగపిల్లల పెళ్లిళ్లలో, కంకణాలు ఊడదీసే రోజున వీరభద్రస్వామిపళ్లెం (అనగా ఆరాధన) జరుపుకుంటాం అని పైనచెప్పాను. ఈ పెళ్లికి కూడా ఆ ఆచారాన్ని విడువకుండా వీరభద్రునిపళ్లెం పట్టి, తెల్లవారువరకు నారసాలు వేసుకొన్నాం. నేను నారసం వేసుకొన్నట్లు గుర్తులేదు.

పెడసనగల్లులో చలపల్లి రాజావారు మూడు ఎకరాల మాగాణి భూమి నిచ్చినందున, వారిపేర శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ గ్రంథాలయం స్థాపించియున్నారు. దీని సాంవత్సరికోత్సవానికి, హయ్యర్ ఎలిమెంటరీ స్కూలు భవనానికి శంఖుస్థాపనచేయటానికి శ్రీ రాజావారు శ్రీ శివరామప్రసాద్ బహద్దర్ వారు, 1936 మేనెల 9-వ తారీఖున తమ తమ్ములు శ్రీ రామకృష్ణప్రసాద్ గారితోను, పినతల్లి భర్త శ్రీ చిరుమామిళ్ల నాయుడమ్మగారు వగైరాలతో వచ్చారు. రాజాగారు స్కూలు భవనానికి శంఖుస్థాపన చేశారు. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షతన, గ్రంథాలయ వార్షికోత్సవం జరిగింది. శ్రీ పండిత వెంకటసుబ్బయ్య, శ్రీ మొర్నేని సుబ్రహ్మణ్యం వగైరాలు హాజరయ్యారు. పై కార్యక్రమం పూర్తిఅయిన తర్వాత ఊరేగింపు జరిగింది. మేము, గ్రామస్థులలో చాలా మంది రాజాగారికి పూలదండలువేసి, హారతు లిచ్చాము. అనంతరం పులావు విందు జరిగింది.

నేను కౌమారంలోనే, వివాహానికి పూర్వమే మా బొమ్ములూరు శ్రీ బాలాత్రిపురసుందరీసమేత సోమేశ్వరస్వామివారికి మ్రొక్కుకొనియుంటిని. ఆ మ్రొక్కును ఈ నెలలో (22-5-1936) తీర్చుకొంటిని. సోమేశ్వరస్వామివారికి మహన్యాస అభిషేకం, బాలాత్రిపురసుందరి అమ్మవారికి సహస్రనామపూజ జరిపించాను. స్వామివారికి అభిషేకం పూజారి, ఐదుగురు బ్రాహ్మణులతోడుతో జరిపారు. అమ్మవారి సహస్రనామపూజ, తాడేపల్లి సుబ్బయ్య గారు చేశారు. నేను వారానికి ముందే బొమ్ములూరు ప్రాంతానికి

వచ్చియుండినాను. నా భార్య, పిల్లలు పెడసనగల్లులోనే వుండిపోయారు. నా తమ్ముడు సత్యనారాయణ, జ్ఞాతులు, బంధువులు, వగైరా హాజరైనారు. సమయానికి ఇంటివద్ద తమ్ముని కొడుకు సూర్యనారాయణ వుండినాడు. వానిని దీవించాను.

నా మూడో పెద తండ్రి ఆదినారాయణగారి రెండో అల్లుడు, తుమ్మలపల్లి వాస్తవ్యుడు శ్రీ గూడపాటి వెంకట సుబ్బయ్యగారు, "నా కంధత్వం ప్రాప్తించింది, నేను రాలేను. మీరే వచ్చి చూచి వెళ్లం"డని కబురు పంపారు. వెంకట సుబ్బయ్యగారు సరసులు, బంధుప్రీతి కలవారు. వారి భార్య శ్రీమతి మాణిక్యమ్మగారు చాలా సాత్వికగుణసంపన్నురాలు. నేను వెళ్లగా వారెంతో ఆదరించారు. నేను వారిని చూచి మిక్కిలి సంతోషించాను. మాణిక్యమ్మగారి తమ్ముడు శ్రీ అంజయ్యగారింట్లో కూడా భోజనంచేశాను. ఆయనగారి భార్య రంగమ్మగారు రకరకాల వంటలుచేసి, మిక్కిలి తృప్తి నిచ్చు భోజనం పెట్టారు. మరునాడు అంజయ్యన్నగారి అల్లుడు కాకర్ల భాస్కరరావుగారింటికి రామాపురం వెళ్లాను. వారు సగౌరవంగా, ఆప్యాయతతో ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి, సంతోషించాను. నాతోబాటు, అంజయ్యన్నగారి తమ్ముడు సత్యనారాయణ, నా మేనల్లుడు, వారి పెద్దన్న వీరభద్రయ్యగారి అల్లుడు శ్రీ త్రిపురనేని శివప్రసాదరావు కారులో వచ్చారు.

చౌటపల్లి నా పినతల్లి శేషమ్మగారి భర్త అట్లూరి వెంకటప్పయ్య, వారి సోదరుడు వెంకట సుబ్బయ్యగార్ల ఇండ్లకు వెళ్లాను. పెయ్యేరు పోలవరపు నీలయ్యగారింటికి వెళ్లి, అంతకు ముందే భార్య చనిపోయి దుఃఖంలోవున్న ఆయనను పరామర్శించాను. వారింట్లో వుంటున్న ఆయన సోదరి, పైనచెప్పిన వీలునామా విషయంలో పేర్కొన్న శ్రీమతి వీరమాచనేని వజ్రమ్మను పలకరించి వచ్చాను. పెడన దగ్గర నందమూరు నా మేనమామ శ్రీ త్రిపురనేని రామశాస్త్రుర్లుగారింటికి

వెళ్లాను. అక్కడ కవిరాజు రామస్వామిచౌదరిగారి రెండో అన్న, పండితుడు నరసయ్యగారిని, శ్రీ కానూరి వెంకట చలపతయ్యగారిని కలసికొన్నాను. వెంకట చలపతయ్యగారు సహజంగా మేధావి. రైతునాయకులు. మాట చతురత, నిపుణత కలవారు. వారికి ఇన్‌కమ్‌టాక్స్ నోటీసు క్రొత్తగా వచ్చిందట. ఆ విషయమై నా నుండి కొన్ని వివరాలు తెలిసికొన్నారు. నోటీ సిచ్చినవారు బందరు సర్కిల్ ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగారు. అప్పుడు బందరులో కానుమిల్లి పట్టాభి రామయ్యగారు అసిస్టెంటు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు. "వారిని కలుసుకొని విషయాలు పూర్తిగా అవగాహన చేసుకోవాలి, మీరు కూడా బందరు రావా"లని చలపతయ్యగారు కోరగా బందరు వెళ్లాను. వారిని పట్టాభిరామయ్యగారికి పరిచయపరచాను. ఆ సందర్భంలో వారి అడ్రసు తెలియనందున, అప్పుడు సబ్ మాజిస్ట్రేటుగా వుంటున్న వారి తమ్ముడు, సుబ్బారావుగారింటికి వెళ్లి తెలిసికొన్నాను. అదే నేను సుబ్బారావుగారిని మొదటి దఫా చూడటం (29-5-1936). శ్రీ పాకల ఆదినారాయణ రావుగారప్పుడక్కడ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు. వారిని వెళ్లి చూచి, పట్టాభిరామయ్యగారింటిలో భోజనంచేశాను. కొన్ని సంవత్సరాల తర్వాత, నా కంటె ముందు అసిస్టెంటు కమిషనరుగా పదవిని పొందిన పట్టాభిరామయ్యగారే కారణంవల్లనో అసిస్టెంటు ఆఫీసరు, హెడ్ క్లార్కు లేనిదే ఆఫీసరు దమ్మిడీకి పనికి రాడని తీవ్రంగా వాదించాడు.

గుడివాడలోని వారి మేడ విషయంలో నా పినతండ్రి నాగభూషణంగారికిని, శ్రీ త్రిపురనేని శివప్రసాదరావుకు తగాదా రాగా, నేను కొంత జోక్యం కల్పించుకోవలసి వచ్చింది. ప్రసాద రావు ముత్తవతల్లి, నా తల్లి అన్నదమ్ముల బిడ్డలు.

పై విధంగా అక్కడక్కడ తిరగటం, బంధువులను చూడటం అటుంచి, అసలు మా పెదసనగల్లు కుటుంబ వ్యవహారాలు పరిష్కరించుకోవలసిన కాల మాసన్నమైనది. ఇదివరలో చెప్పినట్లు, మా మామ శ్రీ సూరపనేని సీతారాముడుగారి ఏకైకపుత్రుడు

శ్రీ పున్నయ్య నిస్సంతుగా చనిపోగా, మా మామగారు తన యావదాస్తిని, మా అత్త శ్రీమతి రంగమ్మగారి పేర వీలునామా వ్రాసియిచ్చి యుండినాడుకదా, ఆయన ఇద్దరు కుమార్తెలు, ఆ ఆస్తిని పంచుకోవలసి యున్నది. నా భార్య అక్క పున్నమ్మ గారు తన హక్కును, తన కొడుకులకు విడుదలచేసియున్నది. అందువల్ల ఆమె కొడుకులు సూర్యప్రకాశరావు, సీతారామారావు వగైరా, నా భార్య అన్నపూర్ణమ్మ పంపకం చేసుకోవలసి యుండింది. అయితే రంగమ్మగారు దఖలు వ్రాసిన ఆస్తిని మాత్రమే వీరు పంచుకోవటం. పున్నమ్మగారు తన పేర, తన కొడుకులపేర అంతకుముందు వేరే కొనియున్న భూములు పంపిణీలోకి రాలేదు. భూములు, ఇండ్లస్థలాలు పంపిణీ విషయంలో, నా భార్య మేనమామ చెరుకూరి వెంకటరత్నంగారి అల్లుడు, పెదముత్తేవి కాపురస్థుడు, శ్రీ కాకర్ల కాకుళ్‌స్వామి వస్తానన్నారు గాని రాలేదు. ఏదో భేదాభిప్రాయంవల్ల ఊళ్లో ఉండిన మా పెద్దత్తగారి కుమారుడు సూరపనేని వీరరాఘవయ్యగారి ప్రస్తావన లేకపోయింది. సరే, మనమే చూచుకొందాం అనుకొన్నాం. ఇతరుల సంగతి నాకు తెలియదుగాని, మా కమ్మవారిలో పెద్దవారు వాటాలు వేయటం, చిన్నవారు పట్టటం ఆచారం. పెద్దామె పున్నమ్మగారు, భర్త సత్యనారాయణ, తల్లి రంగమ్మగారితో సంప్రదించుకొన్నది. వాళ్లు రెండు వాటా జాబితాలు వేశారు. నేను, నాభార్య సంప్రదించుకొని ఒక వాటా పట్టాం. మేము పట్టే సమయంలో శ్రీ కాకుళ్‌స్వామి వచ్చాడు. ఈ వాటా జాబితాలు భూముల సంబంధం మాత్రమే. కాపుర ముండుచుండే పెంకుటిల్లును, దాని ఆవరణలోని చిన్న ఇంటిని పెద్దామెకు విడిచిపెట్టాం. తతిమ్మా పశువుల చావిళ్లు, వాములదొడ్డి వగైరా పంపకంలో, మా వాటాకు చాలా నాసిగా వచ్చాయి. ఈవిషయం ఎవరో ప్రస్తావించగా, వాళ్లకు భూములు మెరుగు విచ్చాం అన్నారట. నిజానికి వాటాలు వేసింది వాళ్లు, పట్టింది మేము. ఈ పంపిణీ దస్తావేజు యద్దనపూడి వెంకటరత్నంగారు వ్రాశారు. పూర్తి అయిన తారీఖు 20-6-1936. పామర్రు సబ్ రిజిస్ట్రార్ ( పెద్దాపురం కాపురస్థుడట ) శ్రీ వడ్డి లక్ష్మీనరసింహాం వచ్చి, నా భార్యచేత

రిజిస్ట్రేషన్ పూర్తిచేయించాడు. ఆమె అక్క కొడుకులు పామర్రు వెళ్లి, తమవంతు రిజిస్ట్రేషన్ పూర్తిచేశారు.

ఈ పంపిణీ విశేషాలు (సైడ్ లైట్సు) మా జాయింటు ఉంద్రపూడి భూమి 12 ఎకరాలు పంపిణీకి రాలేదు. మూడు ఎకరాలు స్వాధీనం కాలేదట. తతిమ్మా 9 ఎకరాలు అమ్ముకొని, వాళ్లపేర అయ్యంకిలో భూమి కొనుక్కున్నారట. నిజానికి నా పెళ్లికి కట్నంగా చదివించిన 8 ఎకరాలలో, చాలాభాగం ఈ ఉంద్రపూడి భూమే. మాకు వచ్చింది 32 ఎకరాలు, వాళ్ల అన్న దమ్ములు 6 గురుకు 110 ఎకరాలు. 1930 లో నా అప్పు తీర్చటానికి పదివే లివ్వగా, తండ్రి కొడుకులు దుబారాచేసిందిగాక, వాళ్లవద్ద చాలాడబ్బుం దనుకొన్నాము, ఈ అన్యాయాన్ని నేను ఎత్తగా, తన పెద్దకొడుకు మీద పెట్టి ఆ పెద్దామె నన్ను చాలా దూషించింది. అక్కడున్న నా పెద్దకొడుకు పూర్ణచంద్రరావు సహించలేక అందుకోగా వానిని అడ్డమైన తిట్లు తిట్టింది. దురాశ చేత హద్దు చెడిన ఆడదాన్ని పట్టటానికి పగ్గాలుంటవా?

నా భార్య వట్టి మేధకురాలు. చేతిలో బెల్లంపెడితే ఎగిరి గంతేసే గుణం. నీవు మంచిదాని వని లాలిస్తే, పొంగిపోయి అన్నిటికీ తలూపే స్వభావం. అన్నిటికి మించి, తన అక్క అంటే తగని భయం. అక్క భర్త అన్నా, కొడుకులన్నా మితిమించిన అభిమానం. పెద్దకూతు రెటుచెపితే అటు తలూపే పద్ధతి తల్లిది. పిత్రార్జితం ఆశలేని షడ్డకునకు దొరికినంత లాగాలని చూపు. నాకుకూడా పిత్రార్జితం లేకపోయినా ఉద్యోగంలో ఉన్నానని, సంపాదించుకొంటున్నా ననేది కూడా ఈ నడవడికి కొంత కారణమై ఉండవచ్చు. అప్పటివరకు అత్త రంగమ్మకు, నే నంటే అంత గిట్టేదికాదు. నాయందు మిక్కిలి అభిమానంతో వుండుచుండిన మా మామ సీతారాముడుగారు చనిపోయి యుండటం నా దురదృష్టం.

పంపిణీ ప్రస్తావన రాగానే, ఆ యింటిలోని వాతావరణం నాకు వ్యతిరేక మనిపించింది. నా భార్య ఎల్లప్పుడూ వాళ్ల కనుకూలంగా వుండటం నాకు గిట్టలేదు, అందువల్ల నేను వేరే

వుంటానని చెప్పి, పంపిణీ పూర్తికాకముందే మా కిస్తామన్న వాముల దొడ్డి (గేటు దొడ్డి) లో తాటాకుపాక వేయించుకొన్నాను. అందులో కాపురం పెట్టాను. ఒక గవుండ్ల కుర్రవానిని ఈడే కృష్ణను నెల 1కి రూ. 8 లు జీతం చొప్పున నౌకరుగా పెట్టు కొన్నాను. భోజనం ప్రాతఇంటినుండి వచ్చేది. నా భార్య, పసిబిడ్డ రాధాకృష్ణతో ప్రాతఇంటిలోనే ఉండిపోయింది.

పంపిణీలో కలిగిన ముభావంవల్ల నా వదినె కొడుకులు, నాతో సహకరించుటకు పూనుకోలేదు. అందువల్ల నేను ప్రయత్నించి, ఇదివరకుఇంట్లో పనిచేస్తూ ఉండిన గవుండ్ల యువకుడు బోలెం గిర్రాజు అనే వానిని దుమ్మి 17 ఎకరాలు 5 సంవత్సరాల కవులు కిచ్చి రిజిస్టర్ చేయించాను. అలాగే ఒక చాకలికి పెడసనగల్లు రత్తం అనే వానికి, 5 సంవత్సరాలు రిజిస్టర్ కవులుకు 5, 6 ఎకరాలిచ్చాను. మాకు వచ్చిన 32 ఎకరాలలో మిగిలిన దానిని వాళ్లకు, వీళ్లకు కౌలు కిచ్చాను. ఈవిధంగా నేను బయటివాళ్లకు కవులు కివ్వకపోతే, పంపిణీ అర్థ ముండేది కాదు. ప్రాత పెత్తనమే సాగేది. సెలవు పూర్తి అయిన తర్వాత భార్యా బిడ్డలతో బయలుదేరి అనంతపురం వెళ్లి అనంతపురం సర్కిల్ ఛార్జి 1936 ఆగష్టు 24-వ తేదీన ఒప్పగించుకొన్నాను.

## అనంతపురం సర్కిల్

అనంతపురం జిల్లా, అనంతపురంలో (శ్రీ) వడ్డాది పేర్రాజు గారు ఆఫీసరుగా ఉండినారు. వారు, అనంతపురం ప్రముఖ న్యాయవాది శేషగిరిరావుగారు బందోబస్తుగా కట్టించుకొని, పాల గచ్చు చేయించుకొన్న డాబా యింటిలో అద్దె కుండినారు. మధ్య వయస్సులోనే (శ్రీ) శేషగిరిరావు చనిపోగా వారి భార్య, కుమార్తెలు, కొడుకు హనుమంతరావు వగైరా వెనుక చావడిలో ఉంటూ, ఇంటిని యావత్తూ అద్దె కిచ్చియుండినారు. శ్రీ పేర్రాజుగారు ఆ యింటినే నా కేర్పాటుచేశారు. మే మక్కడకు 24-వ తేదీ ఉదయం చేరుకొన్నాము. ఆ సాయంత్రానికి గాని వారు వెళ్లిపోరు. అందువల్ల వారు మమ్ములను ఇంట్లోకి అతిథులనుగా ఆహ్వానించి ఉపాహారాలు, భోజనం వగైరా ఏర్పాటుచేశారు.

పేర్రాజు పంతులుగారు మిక్కిలి పెద్దమనిషి. సహృదయుడు. స్నేహశీలుడు. ఉపాహారమయిన తర్వాత, శ్రీ పేర్రాజు ఛార్జి అప్పగించారు. ఆ సాయంత్రం ఇల్లంతా ఖాళీచేసి వెళ్లిపోయారు.

1936 సంవత్సరంలో అనంతపురం చిన్న పట్టణం. పరిశ్రమలు లేవు, జనం తక్కువ. వ్యాపారాదులు సామాన్యం. రోడ్లు వగైరా మధ్యరకం. వాతావరణం ఆరోగ్యకరమైనదేగాని, వర్షపాతం తక్కువ. ఆగష్టు, సెప్టెంబరు నెలల్లో హోరుగాలి జాస్తి. ఆ పట్టణంలో విశేషాలు రెండు. ఒకటి, 'సీడెడ్ డిస్ట్రిక్ట్సు కాలేజి' అనే పేరుగల ఉన్నత కళాశాల, రెండు, పోలీసు జవానులకు, సబ్ యిన్‌స్పెక్టర్లకు తర్ఫీదు నిచ్చే 'పోలీసు తర్ఫీదు స్కూలు'. ఆ జిల్లా యితర పట్టణాలలో తాడిపత్రి సారా ఫ్యాక్టరీ శివాలయ, విష్ణ్వాలయాలు, హిందూపురానికి 10 మైళ్ల దూరములో ఉన్న లేపాక్షి శివాలయం, పెద్ద నంది, ధర్మవరంలోని పట్టువస్త్రాల తయారీ, పెనుగొండలోని ద్రాక్ష, అంజూర, బొప్పాయి పండ్లు, మడకశిర, అమరావతి ల్లోని పనసపండ్లు పేర్కొనవలసినవి.

లేపాక్షి దేవాలయం అతి ప్రాచీనమైనది. దాని కుడ్యముల మీద మిక్కిలి నేర్పుతో చెక్కిన శిలావిగ్రహాలున్నవి. వాని కంటె అధిక ప్రఖ్యాతి పొందినవి దేవాలయ కుడ్యముల పైభాగములందు, పైకప్పు క్రిందిభాగము (సరంబి)లలో చిత్రింపబడిన వర్ణచిత్రములే. ఈ చిత్రాలు వివిధ భంగిమలలో చిత్రింపబడినవి. గర్భగుడికి ముందు పెద్ద హాలులోని సరంబి మీద చిత్రింపబడిన వీరభద్రస్వామి ఆకారం, మిక్కిలి తేజోవంతమైనది. ఆంధ్ర ప్రదేశ్ లలిత కళా అకాడమి వారు వాని ప్రతిబింబాలను ఫొటోలు తీయించి, వానిని రంగులలోను, నలుపు తెలుపు రూపంలోను ముద్రించి, శ్రీ ఆమంచర్ల గోపాలరావుగారు వ్రాసిన వ్యాఖ్యతో పెద్ద పుస్తకాన్ని ప్రచురించారు.

తాడిపత్రి శివాలయ ముఖద్వారంమీద విగ్రహాలు మిక్కిలి అద్భుతంగా చెక్కబడినవి, సజీవములా అనిపిస్తవి. ఉపయోగింపబడ్డ రాయి, అచ్చమైన నల్లరాయి. ఈ దేవాలయ మించు మించుగా శిథిలావస్థలో వున్నది. కొన్ని నిడుపైన ద్వారఫలకాలు

విడిగా పడియున్నవి. వాని మీాది విగ్రహాలు మిక్కిలి, ఆకర్ష ణీయంగా వున్నవి. ఈ ఫలకాలు గోధుమరంగు గల రాతితో (బహుశా శాండ్ స్టోను) చేయబడినవని నాకు గుర్తు. విష్ణ్వాలయ మండప స్తంభములమీాద కూడా చాలా విగ్రహాలు చెక్కబడి యున్నవి. కాని, అవి అంత నైపుణ్యంతో చెక్కబడియుండ లేదు. పైగా ముక్కు, వగైరా విరగకొట్టబడియున్నవి. శివాలయములోని చెక్కడాలను కూడా, విధ్వంసకారులు కొంత చెడగొట్టారుగాని, వారి విధ్వంసకాండ విష్ణ్వాలయంమీాదనే ప్రబలింది.

పెనుగొండలోని చిక్కని ఊదారంగు గల ద్రాక్షపండ్లు మరీఅంత తీపిగా గాక కొంచెం పులుపుతోకూడి, రుచికరముగా ఉంటవి. అక్కడి బొప్పాయి పండ్లు మిక్కిలి పెద్దవి, తీపివి. తక్కువ విత్తనములతో, కండపుష్టి కలిగి యుంటవి. ఈ రెండింటి కంటె అక్కడి అంజూరపండ్లు మంచి గుజ్జుతో మధురముగాను, రుచికరముగాను వుండును. పెనుగొండలో ఇంకొక విశేష మున్నది. విజయనగరసామ్రాజ్యం పతనమైనప్పుడు, విజయనగరం రాజు రత్నాలు, ముత్యాలు, బంగారం, వెండిరాసులు, ఆభరణాలు మొదలైన వానిని కొన్ని పదుల ఏనుగులమీాద నెక్కించుకొని, పెనుగొండకు పారిపోయి వచ్చినాడట. పట్టణానికి ఆనుకొనివున్న చిన్న కొండపైన కోట నొకదానిని కట్టించుకొని, అక్కడనుండి కొంతకాల మా ప్రాంతాన్ని పాలించాడట. ఆ కోట ఇప్పుడు శిథిలావస్థలో వున్నది. ఒక క్యాంపులో, నేనా కొండను కొంచెం కష్టంమీాద ఎక్కి, ఆ శిథిలాలను చూచి వింతపడ్డాను.

మడకశిర, అమరావతిల లోని పనసపండ్లు మిక్కిలి పెద్దవి, రుచికరమైనవి. చెట్ల కొమ్మలనుండియే గాక, వ్రేళ్లనుండి కూడా పండ్లు ఫలిస్తవట.

గంజాం జిల్లా అంత కాకపోయినా, అనంతపురం జిల్లా కూడా, మిక్కిలి అనుకూలమైన జిల్లా. ఇక్కడ కూడా మిక్కిలి సౌఖ్యప్రదమైన, ఆహ్లాదకరమైన క్యాంపులు కొన్ని వున్నవి. హిందూపురం, పెనుగొండ, మడకశిర, అమరావతి, కదిరి,

కల్యాణదుర్గం పేర్కొనదగినవి. మొదటి నాలుగు బెంగుళూరుకు సమీపం. అందువలన, వాతావరణం వేసవిలో కూడా ఆహ్లాదకరంగా వుంటుంది.

ఇక్కడ చెప్పుకోదగిన నదులు లేవు. ఒకటో, రెండో నదా లున్నవి. మాగాణీ సాగు తాడిపత్రి తాలూకాలోను, ధర్మవరమువద్ద వున్న బుక్క చెరువు మొదలైన పెద్దచెరువుల క్రిందను, రాతిభూమిని పగులగొట్టి వెడల్పుగా, లోతుగా త్రవ్విన బావులనుండి. అనంతపురం జిల్లా డక్కన్ ప్లేటోకు సంబంధించినది గనుక, దాని నేల ఎత్తుగా, మెరకగా, పొడిగా వుంటుంది. మేఘాలు తరచు ఆకాశములో ప్రయాణం చేయుచుండినా, వాని నుండి ఒక్క వర్షబిందు వైనా భూమిపై పడక పోవచ్చును. నే నెన్నోసార్లు వర్షం వస్తుం దనుకొనుచుండగా, మేఘాలు జారిపోయేవి. జిల్లాలోని ఇతరచోట్ల సంగతి గుర్తు లేదుగాని, అనంతపురం టౌనులో మాత్రం ఆగష్టు, సెప్టెంబరు నెలలలో మిక్కిలి ఉద్ధృతంగా పెనుగాలులు వీచటం సర్వ సామాన్యం. జిల్లా విస్తీర్ణంకలదైనా, విస్తీర్ణానికి తగినంత జన సంఖ్య లేదు. అనంతపురంనుండి కదిరి 50 మైళ్ల దూరం. ఈ దూర ప్రదేశానికి వెళ్లుచున్నప్పుడు చెట్లుగాని, చేమలుగాని కనపడవు. ఇంచుమించుగా పల్లెటూళ్లు కనబడవు. ఒకటి, రెండుచోట్ల కొన్ని చిన్న చిన్న కొంపలను మాత్రమే చూచాను. జిల్లాలో, బహుశా తాడిపత్రి తాలూకాయే ధనవంతమైన దని చెప్పవచ్చును. అక్కడి భూములు నల్లరేవడివి. పంటలు బాగుగా పండును. రైతులు కష్టపడి పనిచేస్తారు. తాడిపత్రి పట్టణమున కనతిదూరములో, చిత్రావతి అను చిన్న నది కలదు. అది కొంత వ్యవసాయానికి దోహదమిస్తుంది. పెనుగొండ, హిందూపురము, కదిరి, కల్యాణదుర్గము, పరిసరప్రాంతాలు వృక్షసంతతిచేత పచ్చగా, రమణీయముగా వుండును.

## క్యాంపులు - పెనుగొండ

ఇది చిన్నపట్టణం. ఇక్కడి వాతావరణం సమశీతోష్ణములు కలిగి హాయిగా వుంటుంది. పట్టణం చాలాభాగం కొండగుట్టలచేత

పరివేష్టితమై వున్నది. ఆ కొండగుట్టలమీద వృక్షజాల ముండుట చేత, చల్లని వాతావరణానికి తోడ్పడటమేగాక, కన్నులకు ఇంపుగా వుంటుంది. పట్టణంలోని వర్తక వాణిజ్యాలు సామాన్యమైనవి. పరిశ్రమలు లేవు. అక్కడి క్యాంపు సామాన్యంగా వేసవిలోనే. బంగళా చిన్నగుట్టమీద వున్నది. అనతిదూరంలోనే, చెట్లతో నిండిన కొండలు. అందువల్ల అక్కడి క్యాంపు సుఖప్రదముగా వుంటుంది. ఆ ప్రదేశంలో ముఖ్యం వ్యవసాయం. అయితే తోటలు జాస్తి. సేద్యం చెరువులు, బావుల క్రింద. పైన చెప్పినట్లు ఇక్కడ ద్రాక్ష, అంజూర, బొప్పాయిలు శ్రేష్ఠమైనవి. పెనుగొండ నానుకొని ప్రవహించు చిన్న నదమువలన కలిగిన ఎల్యూవియల్ సాయిల్, ఆ ప్రదేశమున పెంచబడు పై జెప్పినతోటలు, మిక్కిలి ఏపుగా పెరిగి, కమ్మని ఫలముల నిస్తవి. పెనుగొండ అనంతపురము నకు సుమారు 40 మైళ్ల దూరంలో నున్నది. దీనికి సమీపంలో శ్రీ నీలం సంజీవరెడ్డిగారి గ్రామం.

## మడకశిర

ఇది కుగ్రామం. వాతావరణం చల్లనిది. వేసవికాలం సుఖప్రదంగా వుంటుంది. ఈ ప్రాంతమంతయు తోటలమయం, పనసపండ్లు జాస్తి. పండ్లు శ్రేష్ఠమైనవి. వేరు పనస ఉంటుం దని నా కిక్కడనే తెలిసింది. క్యాంపు ఏప్రిల్ నెలలో. ఏవో చిన్న కేసులు వినటం, ఉల్లాసంగా 3, 4 రోజులు గడపటం పరిపాటి. అనంతపురం పట్టణం వేడిగావుంటుంది. కొన్నిరోజులైనా ఆ వేడిని తప్పించుకొనుటకు ఈ ప్రాంతంలో క్యాంపులు వేస్తారు. ఈ విషయంలో నాకు ముందున్న ఆఫీసర్ల పంథా ననుసరించాను. దానివల్ల శరీరానికి కొంత మేలేకదా!

మడకశిరకు కొలదిదూరంలో బెంగుళూరుకు చెందిన యన్. శ్రీరామరెడ్డి అనేవారు ఆ రోజుల్లో పందులు, కోళ్లు మొదలైనవి భారీ ఎత్తున అదొక వృత్తిగాపెట్టుకొని ఒక పెద్ద ఫారాన్ని నడిపేవారు. వారు నన్నొకక్యాంపులో కలసికొని, వారి ఫారానికి తీసుకొనివెళ్లి చూపించారు. కొంతకాలానికి ఆ ఫారాన్ని ఎవరికో అప్పగించి బెంగుళూరుకు వెళ్లిపోయారు.

విదేశీ ఆవులను తాము పెంచి, కొన్ని తమ పెట్టుబడిద్వారా యితరులచేత కొనిపించి పాలశుద్ధి కర్మాగారాన్ని స్థాపించి పాలను, దానినుండి ఉత్పత్తి అగు వెన్న, ఐస్ క్రీమ్ మొదలైన వానిని అమ్మే వ్యాపారాన్ని ఇప్పటికిని సాగించుచున్నారు. వారు ప్రముఖ రాజకీయవేత్తగా పరిణతచెందారు. కాంగ్రెసు పార్టీ వారుగా కేంద్ర విధాన సభలో చాలా సంవత్సరాలు సభ్యులుగా వుండినారు. వారు మూగ సభ్యులు కారు. తరచు లోక్ సభలో ప్రశ్నలు వేయటమో, చర్చలలో పాల్గొనటమో జరుపుచుండినారు. పైగా, పార్టీసభ్యులలో కలిగే భేదాలను పరిష్కరించుటకు, రాజీ చేయుటకు సంసిద్ధులు, పూనుకొంటారు.

బెంగుళూరులో 1959 ఫిబ్రవరినెలలో జరిగిన అఖిల భారత పశు ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసినవారిలో శ్రీరామరెడ్డిగారు ముఖ్యులు. భారమంతయు వారినెత్తిమీదనే వేసుకొన్నారు. వివిధ కమిటీలను ఏర్పాటు చేయుటలోను, వానిని నడపటంలోను వారిదే ముఖ్యపాత్ర. నిజానికి వారు జనరల్ సెక్రటరీగా నిద్రాహారాలు గమనించకుండా శ్రమించుటవల్లనే ఆ ప్రదర్శనం మిక్కిలి విజయవంతమైంది. అప్పుడు, వ్యవసాయ పశుగణాభి వృద్ధికి డిప్యూటీ మంత్రిగా వుండిన, యమ్. వి. కృష్ణప్పగారి సహకారాన్ని సంపాదింపగలిగారు. కేంద్ర మంత్రి లాల్ బహదూర్ శాస్త్రిగారి అధ్యక్షతక్రింద, అఖిల భారత పశు సంవర్ధక సభను జయప్రదంగా జరుపగలిగారు. కృష్ణాజిల్లా ప్రతినిధిగా నేను ప్రదర్శనములోను, సభలలోను, కమిటీలలోను పాల్గొన్నాను. గోవర్ధన సంఘమువారు గోవులనుమాత్రమే పెంచాలి, వానిపాలను మాత్రమే ఉపయోగించుకొనాలని ఉద్బోధించగా, నేను గట్టిగా ఎదు రించాను. "గోవుల పాలు శ్రేష్ఠమైనవే కావచ్చును. కాని, మా జిల్లాలలో వాని పాడి చాలా తక్కువ. పాలకుగాని, వెన్నకుగాని, పెరుగుకుగాని మా పల్లెటూళ్లు గేదెలమీదనే ఆధారపడి యున్నవి. మా ఆవులు, వాని దూడలకు సరిపడుపాలను మాత్రమే కలిగియుంటాయి. ఒంగోలు జాతివికూడా, ముర్రాజాతి గేదెల కెంతమాత్రం సరితూగవు. పైగా, వానిని మేపటం ఎక్కువ శ్రమ, ఖర్చు. సామాన్య గ్రామీణుడు ఏ గేదెనో పెట్టుకొని, ఏ చెత్తో,

చెదారమో వేసి కాలం గడుపుకుంటాడు. డబ్బుపెట్టి పుష్టికరమైన ఆహారాన్ని కొనలేడు. దానిని జాగ్రత్తగా కనిపెట్టుకొని వుండ వలసిన అవసరంలేదు. ఎంత అశ్రద్ధగా మేపినా, అది యిచ్చినన్ని పాలు, ఆవు యివ్వదు. పైగా, ఈరోజుల్లో చాలామంది గ్రామీణులు ముర్రాజాతి దున్నలను పారుదలచేయించి, మిశ్రమ జాతిని వృద్ధిచేసుకొనుచున్నారు. రోతక్ మొదలగు ప్రదేశముల నుండి, అచ్చమైన ముర్రాజాతి గేదెలను దిగుమతిచేసుకొను చున్నాము. ఈ గేదెలవలన, ముర్రాజాతి సంపర్కంవల్ల మాకు ఎక్కువ ఆదాయం వస్తున్నది. మీరు కోరునట్లు, మేము ఒక్క ఆవులమీదనే ఆధారపడి యుండలేము'' అని వాదించాను.

నేను మడకశిర క్యాంపులో వుండగా, శ్రీరామరెడ్డిగారు నన్ను కలసికొని వారి ఫారానికి ఆహ్వానించి యుండిన సంగతి నేను మరచిపోయాను. శ్రీరామరెడ్డిగారు మరువలేదు. వారెంతో ఆప్యాయతతో గౌరవించి, నన్ను రెండు, మూడు కమిటీలలో వేశారు. తరువాత ఢిల్లీలో జరిగిన అఖిల భారత ప్రదర్శనానికి రమ్మని వ్రాశారు. కాని వెళ్లలేకపోయాను.

## అమరావతి

ఇది నిజముగా ఒక కుగ్రామం. వాతావరణం మడకశిర వాతావరణం కంటె ఆహ్లాదకరమైనది. కారణం ఈ గ్రామం మైసూరు సరిహద్దులో వున్నది. ఇక్కడి విశేషం పనసతోటలు, కొబ్బరితోటలు. మడకశిరలోని పనసచెట్లకంటె అమరావతి లోని చెట్లు పెద్దవి. ఫలాలను ఎక్కువగా ఇస్తవి. ఇక్కడ వేరు పనసచెట్లు జాస్తి అని గుర్తు. క్యాంపు వేసవికాలంలోనే అని వేరే చెప్పనక్కరలేదు. కేసులు మిక్కిలి స్వల్పము. సంవత్సర మున కొకసారి రెండు మూడు రోజులు క్యాంపు. మడకశిరలో వలెనే, ఇక్కడి క్యాంపు వేసవి ఎండలకు జడిసే.

## హిందూపురము

ఇది అనంతపురానికి 63 మైళ్ల దూరములోవున్నది. ఇక్కడినుండి బెంగుళూరు 27 మైళ్లు మాత్రమే. అనంతపురము

జిల్లాలో ఇది ఒక ముఖ్యపట్టణం. ఇక్కడ వాతావరణం పెనుగొండ వాతావరణంకంటె తకుగుగా వుంటుంది. కాని ఆహ్లాదకరమైన చల్లని వాతావరణమే. ఇది మధ్యరకం పట్టణమైనా, ప్రజలు సమృద్ధంగానే వుంటారు. ఈపట్టణంలో చెప్పుకోతగ్గ పరిశ్రమలు లేకపోయినా, వర్తక వ్యాపారాలు పెద్దవే. ఇక్కడి పెద్ద వర్తకులందరు ఇంచుమించుగా వైశ్యులే. వీరు పెద్ద పెట్టున మండీ అనగా కమిషన్ వ్యాపారం చేస్తారు. స్వంత వ్యాపారంకూడా హెచ్చుగా, విరివిగా సాగిస్తారు. ఈ ప్రదేశం మైసూరు రాష్ట్రానికి సరిహద్దుకాబట్టి ఆ రాష్ట్రంలో విరివిగా ఉత్పత్తి అయ్యే పోకరకాలు పీటీలు, కత్తిరింపులు పచ్చివి అమ్ముతారు. 7 మైళ్ల దూరములో నున్న మైసూరు రాష్ట్రంలోని గోరీబిద్నూరులో తయారయ్యే మిక్కిలి శ్రేష్ఠమైన బెల్లం, దొడ్డబళాపూర్, చిక్క బళాపూరుల్లో నేసే ముతక పట్టుచీరలు, బెంగుళూరులో నేసే ఫిలియేచర్ పట్టుచీరెలు వగైరా ఈ పట్టణం అంగళ్లలో పుష్కలం. నూలుబట్టల వ్యాపారంకూడా జాస్తి. చెప్పుకోతగినంత బంగారం నగల, వెండి వస్తువుల వ్యాపారం సాగుతుంది. భారీ వడ్డీవ్యాపారస్తులు కలరు. అయితే మండీ వ్యాపారం ప్రముఖమైనది. మండీ వ్యాపారస్తులు తమ కమిషన్తోబాటు తారం అని, రుసుం అని, ధర్మం అని అమ్ముకొనే రైతులనుండి వసూలుచేస్తారు. కాయధాన్యాలు, చింతపండు, కుంకుళ్లు, సీకాయి, నూనెగింజలు, ధాన్యం వగైరా మండీవ్యాపారస్తుల ద్వారానే అమ్మటం. అందువల్ల మండీ వ్యాపారం విస్తృతంగా ఉంటుంది.

శీతల వాతావరణం గనుక, మంచి కూరగాయలు పుష్కలంగా దొరుకుతవి. మాంసాహారులకు హిందూపురం క్యాంపు మిక్కిలి ఆసక్తిదాయకంగా వుంటుంది. ఇక్కడ దొరికే గొర్రెమాంసం వంటి మృదువైన, రుచికరమైన మాంసం నాకింకొకచోట దొరకలేదు.

బెంగుళూరు దగ్గరగా వుండటంచేతను, తరచు బెంగుళూరు వెళ్లివచ్చుటచేతను, ఇందులో కొంతమందికి బెంగుళూరులో కూడా వ్యాపారముండుటచేతను, ఇక్కడి వర్తకులు వస్త్రధారణలో

దేహసంస్కారములో నాజూకుగా వుంటారు. ఇక్కడి వర్తకులలో ముఖ్యులు వైశ్యులు. వైశ్య కులస్థులు అంత అందమైన వారు కాదని నా కిదివరలో అభిప్రాయ ముండేది. ఇక్కడి వైశ్యులను చూచినతరువాత ఆ అభిప్రాయాన్ని మార్చుకొన్నాను. స్త్రీలే గాక పురుషులు కూడ అందముగా, నాజూకుగా వుంటారు. వీరిలో ఎక్కువమంది పసుపు, ఎరుపు వర్ణం కలవారు. రూపము నందు, వేషధారణ యందు నాజూకుతనమేగాక వీరు తెలివితేటలు, వ్యాపారదక్షత గలవారు. అయితే టోకరా వేషాలు కూడా లేక పోలేదు. వీరిలో కొందరు ఆదాయపుపన్ను విధింపు విచారణకు వచ్చుటకు అసమంజసమైన కారణాలు చెప్పి, విచారణకు హాజరు గాక, వాయిదాలు కోరుచూ విచారణ జరుపనిచ్చేవారు కాదు. ఈ సందర్భంలో ఒకరిద్దరు పెద్దవర్తకులను, మొదటి క్యాంపులోనే గట్టిగా మందలించవలసివచ్చింది.

కమిషన్ గాక, రుసుమని ధర్మమని తారమని ఎక్కువగనే ఉండీవ్యాపారస్థులు అమ్మకందారులనుండి రాబట్టుకొంటారు. ఈ రాబట్టుకొనిన అదనాన్ని, సరిగా చూపుచుండలేదేమో అని నే ననుమానపడుచుండేవాడిని. మొత్తంమీద లెక్కలు సరిగా పెట్టినట్లు కనపడినా, వచ్చిన ఆదాయాన్నంతా చూపినారని నే ననుకోలేదు. అందువలన పెద్ద లెక్కలలోకూడా అటో, యిటో కొంత ఆఫీసరు కలపటంకద్దు. కాని బరంపురంలోవలె, చీటికి మాటికి, అప్పీలుకు వెళ్లే పద్ధతి చాలాతక్కువ. మస్తుగా సంపాదించు పెద్దవర్తకులకు ఒక వంద హెచ్చైనా లెక్కలోనిది కాదు. "మా లెక్కలు సరిగాపెట్టాం, మీరు కలపటం అన్యాయం" అని వాదు లాడినా, కొంత సరసంగానే పోతూండేవారు. మాట, మంచి, మర్యాద, కనపరుస్తూండేవారు. కేసులు విచారణ మామూలు పద్ధతులలోనే జరుగుచుండేది. వాతావరణ సౌఖ్యం, భోజనం సౌఖ్యంతో పాటు విచారణకూడా సవ్యంగానే ఉండేది.

ఆఫీసరు అనుకొన్న దంతా నిజం కాదని, ఒక కేసు రుజువు చేసింది. ఒక లింగాయతు, పెద్ద వడ్డీవ్యాపారస్థుడని వినికిడి. అయితే వున్నడబ్బంతా వడ్డీకి త్రిప్పటంలేదని, ఆయన $1\frac{1}{4}$ లక్ష

రొఖ్ఖం తీసుకొనివచ్చి చూపించాడు. దీనిని తన మంచంక్రింద బల్లకూర్పు సొరుగులో నగదుగా దాచుకొన్నాడట.

బెంగుళూరు వంటి మిశ్రమ జాతులుగల పెద్దపట్టణ ప్రభావ మనుకొందును, ఇక్కడి వైశ్యులకు, ఇతరచోట్లవలె అంటు, సొంటు తక్కువ. అయితే, అగ్రకులా లనుకొనేవారికి ఇతర కులాలు గిట్టకపోవటం, ఇక్కడ కూడా లేకపోలేదు. ఈ పట్టణానికి మునిసిపల్ చైర్మన్ కరణం బ్రాహ్మణుడు. మునిసిపల్ ఇంజనీయరు పదవికి ఖాళీరాగా, అభ్యర్థులకొరకు పత్రికల్లో ప్రకటన చేశాడట. దరఖాస్తులు వచ్చినవారిలో. ఎ. యన్. రావు అనేపేరుతో దరఖాస్తు వచ్చినదట రావు అని వుండటం వల్ల, దరఖాస్తుదారు కరణం బ్రాహ్మణుడయివుంటాడని నమ్మి, మునిసిపల్ చైర్మన్ గారు ఆ దరఖాస్తును అంగీకరించి, పని ఇచ్చినట్లు ఆర్డరును పంపించాడట. తీరా ఆవ్యక్తి ఉద్యోగములో చేరుటకు వచ్చినప్పుడు అతడు బ్రాహ్మణేతరుడేగాక, బ్రాహ్మణేతర కులాల్లో తక్కువ కులానికి చెందినవాడని తెలిసికొని, పాప మాయన మిక్కిలి దుగ్ధపడినాడట. ఇది 35 ఏండ్లనాటి మాట. ఇప్పుడా మన స్తత్వం చాలా తగ్గియుండును. ఆ రావుగారు నాకు పరిచయులైనారు. వారివలన ఈ విషయం తెలిసింది.

హిందూపూర్ లో పి. డబ్లుయు. వారి ఇన్ స్పెక్షను బంగళా, ఆ ఆవరణలోనే మునిసిపాలిటీవారి బంగళా వున్నవి. మొదటి బంగళా పకడ్ బందీగా కట్టబడి, మంచి సామానుతో వున్నది. కాని దానికంటె రెల్లుకప్పుగల మునిసిపల్ బంగళాయే మెరుగు. ముఖ్యకారణం, దీనికి మధ్య హాలువ్నది. దీనిని కామన్ రూము అంటారు. మామూలుగా ఇద్ద రుండుటకు స్నానగది సహా, రెండు రూము లున్నవి. అందువల్ల ఒక్కొక్కరికి ఒక్కొక్క గది సరిపోతుంది. ఈ హాలువంటి మధ్యగది అదనం. ముందువచ్చి దిగినవారు ఈ మధ్య హాలు నుపయోగించుకొంటూరు. పైగా పొడుగుపాటి పెద్ద వరండా కలదు. ఇం కొకరు లేనప్పు డీ వరండా నంతా క్యాంపుచేసేవా గుపయోగించుకొంటూరు. ఆవరణ పెద్దది. అక్కడక్కడ చెట్లున్నవి. గాలి స్వేచ్ఛగా ప్రసార

మవుతుంది. అందువల్ల సాధారణంగా ఈ మునిసిపల్ రహాదారి బంగళాలోనే నా మకాం.

ఇక్కడ నా కిద్దరు ఎక్కువగా పరిచయమైనారు. అందులో ఒకరు శ్రీ దొంతి భీమయ్యశెట్టిగారు స్నేహితులుగా మారారు. రెండవవారు బుడన్ సాహెబ్‌గారు. వీరుకూడా పరిచయులకంటె ఎక్కువ దగ్గరగానే వచ్చారు.

భీమయ్యశెట్టిగారికి ప్రభుత్వం రావు సాహెబ్ బిరుదాన్ని ప్రసాదించింది. వీరు మిక్కిలి సుగుణ సంపత్తి గలవారు. సిజాయితీ పరులు. స్నేహపూరితులు. వీరికి పెద్ద పోకవక్కల మండీ వ్యాపార ముండేది. ఇతర వస్తువులలోకూడ కమీషను వ్యాపారము చేయుచుండేవారు. పచారీ సరుకుల దుకాణాలను ఒకటి రెంటిని నడిపేవారు. జపాను సిల్కును దిగుమతిచేసుకొని, బెంగుళూరులో కొట్టు నడిపేవారు. జపానుసిల్కు ధరలు తగ్గినందువలన చాలా నష్టపడిపోయారు. తరువాత హిందూపురములో ఒక సహకార పంచదార మిల్లుకు బాధ్యతవహించి, అది సకాలములో స్థిరపడక సరిగా పనిచేయక పోవటంవల్ల, పెద్ద నష్టానికి గురై, ఆ చీకుతో అకాలమరణమునొందినారని తెలిసికొని, మిక్కిలి విచారించాను.

తమ వ్యాపార లెక్కలను మిక్కిలి కట్టుదిట్టంగా వ్రాయించి, సరియైన ఆదాయాన్ని చూపించిన తక్కువమంది వారిలో వీరొకరు. వారు నా ప్రథమ క్యాంపులో నన్ను వచ్చి చూచిన తర్వాత, తరువాత క్యాంపుల్లో మా పరిచయం స్నేహంగా మారింది. ఒకటి, రెండుసార్లు వా రింటికివెళ్లి, వారి ఆతిథ్యాన్ని అంగీకరించాను. 1950లో నేను అప్పీల్సు అసిస్టెంటు కమిషనర్‌గా మైసూరురాష్ట్రం అప్పీళ్లనుకూడా విచారించే సందర్భంలో, బెంగుళూరు క్యాంపుకు వెళ్లియుండినప్పుడు, వారి బెంగుళూరు కొట్టును చూడటం సంభవించింది. వీరి దగ్గరబంధువులలో ఒకరు రైల్వే డెప్యూటి ఛీఫ్ ఇంజనీయరుగా వుండిరి. ఏదో సందర్భంగా కుటుంబంతో బెంగుళూరుకు వెళ్లగా, డెప్యూటి ఛీఫ్ ఇంజనీయరుగారి సోదరుని ఇంటిలో మాకు బస ఏర్పాటుచేశారు. ఈవిధముగా కూడా, శ్రీ భీమయ్యశెట్టిగారితో స్నేహం వృద్ధిచెందింది. నేను అసిస్టెంటు

కమిషనరుగా హిందూపూరుకు వెళ్లలేదు. నేను 1953 లో ఉద్యోగం విరమించిన తర్వాత, వారిని కలసికొను భాగ్యం కలుగ లేదు. వారి అకాలమరణం కొంతకాలానికి గాని నాకు తెలియ లేదు, రెండవవారు, ఖాన్ బహదూర్ సయ్యద్ బుడన్ సాహెబ్ గారు. వీరు సుశిక్షిత మేధావంతులు. ఆకర్షించే సంభాషణ వీరిది. దూరదృష్టిగలవారు. తాను చేపట్టిన కార్యాన్ని, ఎంతకష్టమైన దైనా దక్షతతో సాధించేవారు. తన సిబ్బందిని పకడ్ బందీగా, అదుపు ఆజ్ఞలలో నుంచగల సమర్థులు. వీరు మిక్కిలి తక్కువ స్థాయిలో జన్మించి, తన తెలివితేటలచేత ఆస్తిపాస్తులను విరివిగా సంపాదించారు. హిందూపుర పట్టణానికి కొంతదూరంలో వారు ఇళ్లు, చావిళ్లు వగైరా కట్టుకొని, నివసిస్తూ వుండేవారు. ఇంటి నానుకొని జామ, అరటితోటలు, వరిపండించే భూములు సంపా దించారు. జామతోటలు మిక్కిలి విస్తీర్ణమైనవి. చెట్టు చెట్టుకు శ్రద్ధతీసుకొని, ఒక్క చెట్టుకు పెద్ద బండి నిండునన్ని పండ్లు కాయించేవారు. పండ్లు మిక్కిలి పెద్దవి. అలహాబాద్ జామలు మంచి రుచిగలవి. అరటి తోటలు మధ్యరకం. వీరి తోటలో రెండు, మూడు కాఫీమొక్కలు చూచాను. కాఫీగింజలను పండించటానికి వీలుగా ఉండునేమో అని పరిశీలనకొరకట.

వీరు మహమ్మదీయులైనను, పూర్తి శాకాహారి. అందు వలన వా రింటి చుట్టుప్రక్కల కోళ్లుగాని, గొర్రెలు, మేకలుగాని వుండేవికావు. దూరంలో ఇంకొకచోట పెంటకట్టటానికని, కొన్ని గొర్రెలను వుంచే వారనుకొందును. వీరికీ మాంసాహార ద్వేషం కలగటానికి ఒక కారణం విన్నాను. వీరి తండ్రి కంట్రాక్టులు వగైరా చేస్తూ, కటికిదుకాణం నడిపే ఒక హిందూ స్త్రీతో సంబంధంపెట్టుకొన్నారట. ఆ సంబంధం ఫలితం, మన ఖాన్ బహదూర్ సయ్యద్ బుడన్ సాహెబుగారు. తినగా తినగా గారెలు చేదన్నట్లు, తల్లి కటికిదుకాణం వీరికి వైరాగ్యాన్ని కలిగించియుంటుంది. వీరు తిరిగి ఒక హిందూస్త్రీని (మొదలియార్ కులస్తురాలట) వివాహ మాడారు. తన ఇంటి విషయంలో మిక్కిలి గుట్టుగా వుండేవారు. వారి భార్యను కఠిన ఘోషాలో వుంచేవారు.

బుడన్ సాహెబ్ గారు ఆరంభంలో ఏ కంట్రాక్టులు చేసే వారోగాని, వీరి సంపాదన అబ్కారి కంట్రాక్టులవల్లనే. హిందూపుర ప్రాంతాల్లోనేగాక, సమీప మైసూరు రాష్ట్రప్రదేశాల్లో సుప్రసిద్ధ అబ్కారి కంట్రాక్టరు శ్రీ కె. యన్ గురుస్వామి వంటి వారితో కలసి, బెంగుళూరు వగైరాల్లో ఈ వ్యాపారాన్ని నడిపేవారని వదంతి. అయితే, నా కెట్టి ఆధారం దొరకలేదు. కాని, తప్పక చేశారనే తలంచాలి.

మొదటి క్యాంపులో నన్ను చూడటానికి వచ్చినప్పుడు, "మాకు జామతోటలున్నవి, మిక్కిలి ఆహ్లాదకరముగా వుంటుంది. ఒక్కసారి వచ్చి చూచి వెళ్లం"డని ఆహ్వానించారు. "నా కిప్పు డవకాశంలేదు,తర్వాత చూద్దాములెం"డని మర్యాదగా చెప్పాను. "మీకు తీరుబడిలేకపోతే అమ్మగారినైనా పంపించం"డని కోరాడు. అప్పుడు నా భార్య క్యాంపుకు వచ్చియుండింది. వీలులేదన్నాను. కాని అసాధ్యుడైన బుడన్ సాహెబ్ గారు, వద్దన్నా, ఒక బుట్ట జామపండ్లు పంపించారు. ఒక డజన్ తీసుకొని, గంపను తిరిగి పంపించేశాను. కాని, ఆయన తియ్యనిమాటలకు మర్యాద పద్ధతులకు, క్రమేణా లోబడిపోయాను. వారి తోటకు వెళ్ళటం, వారి మర్యాదల నంగీకరించటం జరిగింది.

లెక్కలలో ఎన్నదగిన తప్పులుండేవికావు. వారి జామ తోటలనుండి, అరటి తోటలనుండి, వరిధాన్యం పండించే భూముల నుండి ఆదాయం మిక్కిలి హెచ్చే. ఈ ఆదాయంమీద పన్ను లేదు. ఇన్‌కమ్‌టాక్సుకు చూపే ఆదాయం ముఖ్యంగా కొన్ని సామాన్య కల్లు దుకాణాలనుండి మాత్రమే. మైసూరు రాష్ట్రంలో దుకాణాలున్న సంగతి, లెక్కలనుబట్టి తెలిసేదికాదు. నాకప్పటికి తెలియదుకూడాను.

నాఉద్యోగ విరమణానంతరం, 1954 సంవత్సరంలో అని గుర్తు, నేను కుటుంబంతో కలసి, బెంగుళూరు వెళ్ళియున్నప్పుడు, ఖాళీగావున్న వారింటిలో దిగటం, వారి మర్యాద మన్ననలను పొందటం జరిగింది. అప్పు డొకసారి మాత్రం వారిని కలసి కొన్నాం. తిరిగి వారిని కలసికొనలేదు. వారి అబ్బాయిని

మద్రాసు అడయార్‌లో చదివించు చుండేవారని విన్నాను, వారు నన్ను మొదట కలసికొన్నది, 1936 సెప్టెంబరులో నేను 1939 డిసెంబరాఖరున, ఆ జిల్లాను విడిచిపెట్టాను. నే నక్కడున్నప్పుడు, వారు సామాన్య ధనికులుగానే వుండిరి. తిరిగి నేను 1954 సంవత్సరంలో వారిని బెంగుళూరులో కలసికొన్నప్పుడు, వారు పెద్ద ధనవంతులైనట్లు, వారి మాటలవల్ల తోచింది

హిందూపురం రెండో క్యాంపులో అనుకొంటాను, అక్కడికి 10 మైళ్ళ దూరంలోవున్న సుప్రసిద్ధ లేపాక్షి దేవాలయాన్ని చూచాను. లేపాక్షి దేవాలయంలోని, శిల్ప కళాఖండాలు, చిత్రవర్ణాల విషయం, పైన చెప్పియేయున్నాను. లేపాక్షి దేవాలయాన్ని చేరటానికి కొద్ది దూరంలో రాతి నంది విగ్రహమున్నది అది చాలా పెద్దది. దానిని ఏకశిలతో చెక్కినట్లు చెప్పారుగాని నాకట్లు తోచలేదు. అయితే, విధ్వంసకారులు విగ్రహాన్ని పగులగొట్టగా కొన్ని ముక్కలు అతికించబడి యుండును.

## ధర్మవరం

ఇది పట్టువస్త్రముల నేతకుప్రసిద్ధి. ఫిలేచర్ అనుబెంగుళూరు పట్టుతోకూడా, చక్కని నాజూకు చీరలను నేయుదురు. ఇదియే ప్రధానమైన పరిశ్రమ అని నాకు గుర్తు. పట్టణం సామాన్యం. ప్రజలు మధ్యరకం స్థితిగతులవారు. అందువలన వ్యాపారం సామాన్యమే. ఇక్కడ చెప్పుకోతగ్గది బ్రహ్మాండమైన బుక్క చెరువు. విజయనగర సామ్రాజ్యమును స్థాపించిన, బుక్కవీరుల పేరుతో ఈతటాకం పిలువబడుచున్నది. ఈ చెరువుక్రింద చాలా ఎకరాల భూమిసాగగుచున్నది. ఇందులోని చేపలు ముఖ్యంగా చావరాయిజాతివి, మిక్కిలి రుచికలవి. ఈసమీప గ్రామములోనే శ్రీ సత్యసాయిబాబాగారి పుట్టపర్తి గ్రామమున్నది.

## కదిరి

ఇది అనంతపూరు– చిత్తూరు హైరోడ్డులో, చిత్తూరు జిల్లా మదనపల్లికి 80 మైళ్ల దూరములో వున్నది. శీతలవాతావరణము

గల మదనపల్లి వాతావరణానికి కొంత తక్కువ సమశీతోష్ణవాతావరణంతో, ఆహ్లాదకరంగా వుంటుంది ఇక్కడి రహదారిబంగళా చెట్లమధ్యనుండి, చల్లదనాన్నిస్తుంది. బంగళాచుట్టూ మెట్ట భూములు. ఆచుట్టుప్రక్కల నేల బాగుగా వేయించిన కాఫీపొడి రంగు కలిగివుంటుంది. మిక్కిలి సారవంతమైనది. వేరుశనగ మొదలైన పంటలు సమృద్ధిగా పండుతవి. పట్టణం చిన్నది కేసులు సామాన్యమైనవి. ఇక్కడ పరిశ్రమలు లేవు. ఈ మేజరు పంచాయతీకి ఒక మహమ్మదీయుడు, పేరు గుర్తులేదు, అధ్యక్షులుగా వుండేవారు. ఆయన పెద్దమనిషి. మర్యాద, మన్నన కలవారు. ఇక్కడ ఒక కథ వున్నది చాలా కాలము క్రిందట ఒక మహమ్మదీయ యునకుని, ఒక హిందూ యువతి వరించిందట. ఆఊరి హిందూదేవాలయ ఉత్సవములో, వీరిద్దరు కలసి యుండటం చూచి హిందువులు అతనిని తరిమిపట్టుకొని, చంపిరట. అంతట ఆమె ఆత్మహత్య చేసుకొన్నదట. వారిద్దరికి సమాధులుకట్టి, దేవుళ్లుగా, పూజించుచున్నారు. కదిరి కొంత కాలం మహమ్మదీయుల పరిపాలనలో వుండినది. ఒక పేరుపొందిన ఫకీరు, అక్కడ వుండేవారట, వారి సమాధిని, ముస్లింలేగాక, హిందువులుకూడా దర్శించి, ఉత్సవాలలో పాల్గొంటారట.

## తాడిపత్రి

ఇది చిత్రావతినది సమీపాన వున్నది. ఇక్కడి భూములు నల్ల రేగడిభూములు. మిక్కిలి సారవంతమైనవి. అనంతపురము జిల్లాలో ఎక్కువగా వరి పండించే ప్రదేశములలో ఒకటి. మరియు నల్లరంగు మెట్టభూములు కలవు. వీనిలో వేరుశనగ, వగైరా హెచ్చుగా పండును. ప్రత్తిపంట విశేషం ప్రత్తి వ్యాపారం చెప్పుకోతగ్గది. ఈస్టుఏషియాటిక్ కంపెనివారిబ్రాంచి తాడిపత్రి పట్టణములో వుండినది. ఆ కంపెనీకి దూది సరఫరాచేయుచు, ఏజంటుగా వ్యవహరించే బ్రాహ్మణకుటుంబ మొకటుండినది. ఈ అన్నదమ్ములలో పెద్దవారు, పి. (పామిడి) సదాశివరావుగారు. వారు మిక్కిలి పెద్దమనుష్యులు, నిజాయితీపరులు. ప్రత్తినుండి గింజలను విడదీసి, దానిని నులకమంచాలమీద పరచి,

కర్రతోనూ, చేతితోనూ మోదుదురట. ధూళి, దూదిపింజ, మంచక్రింద పడునట. ఈ దూదిపింజ మిక్కిలి మృదువుగా వుండును. దీనిని పరుపుల కుపయోగింతురు. బూరుగదూదితో తయారుచేసినవానివలె, పరుపులు తలగడదిండ్లు, మెత్తగా వుండును. నేను కొన్ని పరుపులు చేయించుకొంటిని. ఈ ప్రదేశంలో పాడికూడ ఎక్కువే. ఒకటి, రెండు సందర్భాలలో నేతి నిక్కడనుండి తెప్పించుకొన్నాను. సదాశివరావుగారు తెలగాణ్యులు. పైన చెప్పినట్లు మూలా నారాయణస్వామిగారి సారా ఫ్యాక్టరీవున్నదికదా! దానినొకనారి వెళ్లిచూచాను. శివాలయం, విష్ణ్వాలయాల సంగతి, వాని శిల్పసంపదను గురించి, పైన చెప్పియే యున్నాను.

## కల్యాణదుర్గము

ఇది వీరభూమి. ఇక్కడ చిన్న కొండలున్నవి. దుర్గ మొకటున్నది. ఆ ప్రదేశాన్ని పాలించుచుండిన ప్రభువొకడు ఆ దుర్గాన్ని కట్టించి అందులో వుండేవాడట. బంగళా ఊరి బయటున్నది షికారు వెళ్లుటకు చక్కని రోడ్డు, బాటలుకలవు. పట్టణము చిన్నది. వ్యాపారముకొద్ది. నేను ఒక క్యాంపుకు, నా భార్యతో వెళ్లియుంటిని. ఇక్కడ జరిగిన ఒక వింతచర్య నా జ్ఞప్తికి వస్తున్నది. నేనొకసాయంత్రం రోడ్డువెంట షికారు వెళ్లుచుండగా, ఒకరిద్దరు పల్లెటూరివాళ్లు ఎదురుగా వచ్చుచుండి నారు. ఏబుద్ధిలో వుంటినో, వారిని అల్లంతదూరములో చూచి, కుంటివానివలె నడుచుచు, చేతులు అటు, యిటు కదలించుచు, వెగటుగా నవ్వుచు, వారిని సమీపించి, వారితో కబుర్లు సాగించాను కల్యాణదుర్గ వాతావరణం మిక్కిలి హాయినికొల్పేది. ఆ సాయంత్రం, మిక్కిలి హుషారుగా బయలుదేరాను. పైకి వెల్లుబుకుచుండిన సంతోషం, పై విచిత్ర వర్తనకు కారకమై యుంటుంది.

ఈ ప్రదేశం బెంగుళూరుకు దగ్గర. ఇక్కడి మేకపోతులంత పెద్దవాని నదివరకు చూచియుండలేదు ఇక్కడ తుప్పలు జాస్తి. వీని ఆకులు తినే ఈ మేకల మాంసం మిక్కిలి శ్రేష్ఠమైనది.

సుప్రసిద్ధ బెంగుళూరు మాంసంలో కొంతభాగం, ఈ మేకలనుండే వస్తుందట.

## గుత్తి

ఇది పేరుగన్న ప్రదేశం. నవాబుల పాలనకు ముందు, విజయనగరసామ్రాజ్య సామంతులు కట్టించిన కోటకలదు. విశాలమైన ఈ కోట ఎత్తైన కొండమీద కట్టబడి, చేరుటకు మిక్కిలి దుర్ఘటముగా వుండును. ఈ కోటను, దాని పరిసరప్రాంతాన్ని ఒకప్పుడు, కమ్మకుల ప్రముఖవీరులలో నొకరైన, పెమ్మసాని తిమ్మానాయుడు పరిపాలించినాడట. ఈ చిన్న పట్టణం, ఆ పేరుగల తాలూకాకు ముఖ్యపట్టణం, డిప్యూటీ కలెక్టరు, జిల్లా మునిసిఫ్ మొదలైన ఆఫీసర్లుంటారు. ఇక్కడ చెప్పుకోతగిన పరిశ్రమలేమియు లేవు. వాణిజ్య వ్యాపారాలు సామాన్యం. పట్టణ వాసులలో కొందరు ప్రముఖ రెడ్డి కులస్తులు కలరు. దీనికి అనతిదూరములోనే, చీమలవాగు పల్లె అను గ్రామమున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుడుగా వ్యవహరించి, పేరు ప్రతిష్ఠలు చూరగొన్న డి. సదాశివరెడ్డిగారు ఈ యూరివారే. వీరి సోదరి భర్త శ్రీ చంద్రశేఖర రెడ్డిగారు, విజయవాడలో ప్రఖ్యాత ఆడిటరుగా వుండినారు. చంద్రశేఖర రెడ్డిగారి పెదతండ్రి అనుకొందును, శ్రీ చీమలవాగుపల్లి రంగారెడ్డిగారు దేవాదాయ, ధర్మాదాయ సంస్థలకు ప్రథమ అధ్యక్షులుగా వుండినారు.

ఒక గుత్తి క్యాంపులో, చంద్రశేఖరరెడ్డిగారి సోదరుడు నన్ను తమ ఊరికి తీసికొనివెళ్లినారు. మేము ఆ ఉదయం భోజనాలకు పూర్వం పక్షులను వేటాడుటకు పొదలు, చెట్లుగల మైదానంవంటి సమీప పరిసరాలకు వెళ్లాము. కష్టంమీద ఒకటో, రెండో పిట్టలను కొట్టగలిగాము. తృప్తిగా భోజనము చేసి, పిన్న పెద్దలను కలసికొని, ఆ సాయంత్రం తిరిగివచ్చివేశాను.

గుత్తిలో ఒక విశేషం. కొన్ని ధనిక రెడ్డి కుటుంబాలు, క్రైస్తవమతాన్ని కొన్ని దశాబ్దాలక్రితం స్వీకరించియుండినవి. ఆ కుటుంబాలు ఇప్పటికిని క్రైస్తవులుగానే వున్నారు. అయితే,

వారు హిందూ కుటుంబాలతో వివాహాలు జరుపుకొనుచున్నారు. వారిది కాథలిక్ శాఖ. ఈ శాఖవారు ఆచారవ్యవహారాలలో అంత పట్టింపుకలవారు కాదనుకొందును. వారిలోని కొందరు స్త్రీలు, హిందూ స్త్రీలవలె బొట్టునుకూడ పెట్టుకొంటారు. అయితే, దంపతులకు పుట్టిన బిడ్డలు క్రైస్తవమతమునే అవలంబించాలనే షరతుమాత్ర మొకటున్నదట. ఆ షరతు ఎంత వరకు నిర్వర్తించబడుచున్నదో చెప్పలేను. నేను నెల్లూరులో ఉన్నప్పుడు ఆ జిల్లాకు కొంతకాలం కలెక్టరుగా వుండిన క్రీస్తు మతస్థుడు జోసెఫ్ రెడ్డిగారు తన కుమార్తెను, హిందూ మతస్థుడగు గుత్తిరెడ్డి యను యువకుని కిచ్చి వివాహముచేశారు.

## గుంతకల్లు

ఇది రైల్వే జంక్షను స్థానము. పట్టణము చిన్నది. ఒక పెద్ద గ్రామమంవంటిది. ఇక్కడ క్యాంపు సామాన్యం. ఈ క్యాంపులో ఒకప్పుడు జిల్లాబోర్డు అధ్యక్షులుగా పనిచేసిన రాయప్పగారిని, చందా నారాయణశ్రేష్ఠి అను ప్రముఖుని, అక్కడ నివసించుచుండిన ఒకరిద్దరు కమ్మకులస్థులను, రైల్వే డిప్యూటీ సూపరింటెండెంటుగా పనిచేయుచుండిన శర్మ అనేవారిని కలసి కొనుట తటస్థించింది. రాయప్పగారు చాలా సరసులు. గంభీర హృదయులు. విశిష్ట వ్యక్తిత్వం కలవారు. వారి కుమారుడు రాఘవన్ అనే యువకుడు, నా యప్పటి పెద్ద కుమారుడు రాధా కృష్ణ, గిండి ఇంజనీరింగు కాలేజిలో సహాధ్యాయులు. స్నేహితులైరి. ఇప్పటికిని వారిస్నేహము కొనసాగుచున్నది.

## పామిడి

ఇది మిక్కిలి చిన్న పట్టణం. ఇక్కడ రంగారీ వ్యాపారస్తులు, అనగా ముచ్చెకులస్థులు, జాస్తి అని జ్ఞాపకం. మామూలు చిల్లర దుకాణాలు వగైరా. ఇన్కమ్టాక్స్ ఆదాయం స్వల్పం. నే నొక్కసారి మాత్రమే, ఇక్కడ మకాం రెండు, మూడు రోజులు చేశాను. ఈ పట్టణానికి ఆనుకొనో లేక మిక్కిలి దగ్గరగానో, ఒక చిన్న నది వున్నది. అంత

లోతైనదికాదు. నా కారులోనో లేక ఏదైన బండిలోనో, ఈ జలప్రవాహం దాటి వెళ్లాను.

అనంతపురంలో చెప్పుకోతగ్గది సీడెడ్ డిస్ట్రిక్ట్స్ కాలేజి. అధ్యాపకుల్లో ఒకరు ప్రఖ్యాత ఆంధ్ర చిత్రకారుడు శ్రీ దామెర్ల రామారావుగారి సోదరుడు వెంకట్రావుగారు. వారిని అప్పు డప్పుడు కలసికొనుట తటస్థించేది. ప్రొఫెసర్ వెంకట్రావుగారు వారి ఇద్దరు కుమారులచేత ఒకనాటి సాయంత్రం, మా యింటి వద్ద శివతాండవం మొదలైన నృత్యాలను చేయించారు. ఆచార్య వెంకట్రావుగారు పదవీ విరమణ అయిన తర్వాత, స్వస్థలం రాజమండ్రిలోనే వుంటున్నారు. వారు సంప్రదాయ చిత్రకళాభిమానులు. ఆధునిక చిత్రకళ అనే వికృతాన్ని ఏమాత్రం సహించరు. అన్న రామారావుగారి ఆర్టు గాలరీని సంరక్షించుచున్నారు. దాని తరఫున ఆంధ్ర ప్రదేశ్ లలిత కళా అకాడమీలో సభ్యులు.

అనంతపురంలోని రెండో విశేషం, అక్కడి పోలీసు శిక్షణ కేంద్రం. దాని ప్రిన్సిపాల్‌గా శ్రీ ధనరాజులునాయుడు వుండేవారు. వారు మద్రాసు నాయుడు. పోలీసు డిప్యూటీ కమిషనర్‌గా పని చేసిన దివాన్ బహాదర్ పరాంకుశం నాయుడుగారి రెండో కుమారుడు. వారి భార్య శ్రీమతి సావిత్రమ్మ, కృష్ణా జిల్లా మచిలీ పట్టణం వాస్తవ్యులు పి. డబ్ల్యు. డిపార్టుమెంటులో ఇంజనీరుగా పనిచేసిన శ్రీ టి. పేరయ్యనాయుడుగారి కుమార్తె. ఆమెది కృష్ణా జిల్లా కాబట్టి సావిత్రమ్మగారు, నా భార్యయందు మిక్కిలి అభిమానముగా వుండేవారు. శ్రీ ధనరాజులుగారు ఒకప్పుడు చిరుతపులి పిల్లలను పెంచారు. ఒకనాడు వారింటికి వెళ్లినప్పుడు, తటాలున ఒకదానిని నామీదకు వదలగా, తాత్కాలికమైన గందరగోళం పడ్డాను. అయితే వెంటనే సంబాళించుకొని, దానిని దగ్గరకు తీశాను. ఈ చర్యను హాస్యాని కని, నేను భయపడతానో లేదో అని చేశారట. ఇది హాస్యానికైతే ఏ పెద్దమనిషి చేయని మోటు హాస్యం.

ఆ పట్టణ ప్రముఖులలో బారిష్టరు బాయపరెడ్డిగారు, న్యాయవాది మల్లారెడ్డిగారు, పప్పూరి రామాచారిగారు, శ్రీ అమిర్నేని కొండప్పగారు, డాక్టరు శివరావుగారు. న్యాయ వాదులు సర్వశ్రీ కె. యస్. రాఘవాచారిగారు, రొద్దం హనుమంతరావుగారు, పి. హనుమంతరావుగారు, జి. రామే శ్వరరావుగారు జ్ఞప్తికి వచ్చుచున్నారు. కొండప్పగారు కమ్మ కులస్థుడు. చిన్న రైతుకుటుంబములో పుట్టినవారు. వారు వయస్సు బాగా ముదిరిన తర్వాత, విద్య నారంభించి బి. ఎ. ప్యాసై, తర్వాత ఫస్టుగ్రేడు ప్లీడరు పట్టాను పొంది, న్యాయవాద వృత్తి నారంభించారు. నిర్భీతి, వాదనాపటిమ, పట్టుదల వారిని న్యాయవాదవృత్తిలో పైకి తీసుకొనివచ్చాయి. డాక్టరు టి. యమ్. నాయర్, పిట్టి త్యాగరాజశెట్టి, శ్రీ సుబ్బరాయరెడ్డి, శ్రీ పానగల్లు రాజా, శ్రీ వెంకటరెడ్డినాయుడు మొదలైన ప్రముఖులు స్థాపించి, నడిపించుచున్న జస్టిస్ పార్టీలో సభ్యులుగా వుండినారు. ఆ పార్టీ వత్తాసుతో శ్రీ కొండప్ప కొంతకాలం దేవాదాయ, ధర్మాదాయ బోర్డుకు అధ్యక్షులుగా వుండినారు. కొండప్పగారి ప్రత్యేక విశిష్టత వారి పట్టుదల. నమ్మినదానిని ధైర్యముతో, సాహసముతో చేయగల ఆత్మబలము కలవారు. దీని కొక ఉదాహరణ . వారు నేను కాపుర ముండుచుండిన న్యాయవాది శేషగిరిరావుగారి యింటికి అనతిదూరములో, పెద్ద నివాస భవనాన్ని కట్టుకొన్నారు. ఆ ప్రదేశ మంతా రాతిమయం. సామాన్యంగా అర్ధగజం లోతున రాతి చప్టాగాని, రాళ్లుగాని వుంటాయి. అయినా, కొండప్పగారు ఇంటి ఆవరణలో బత్తాయి తోట వేశారు. ఒకసారి నేను ఆ తోటలోకిపోయి భూమి స్థితిని చూచి, "రాళ్ల మయమైయిన ఈ భూమిలో చెట్లెందుకు వేశా"రని అడిగాను. "కష్టపడి సాధించితే, ఏ భూమి ఫలించదు ?" అని జవాబు చెప్పారు. వా రాభూమిని పెకలించి, చప్టాను పగుల గొట్టించి, రాళ్లను త్రవ్వి బయటకు తీసి, పలుసార్లు దున్ని సంస్క రించారు. బి. ఎ. పట్టాను పొందిన తర్వాత కూడ భూమిని దున్నేవారట.

అనంతపురం జిల్లాలో సంపన్న కుటుంబీకులు కూడ, జొన్నరొట్టెలను ఉదయం ఉపాహారంగా భుజిస్తారు. ఒకనాడు కొండప్పగారు నాకిచ్చి తినండన్నారు. నేను సందేహించుచుండగా బాగుంట వని ప్రోత్సహించారు. తిన్నాను. బాగానే వున్నవి. వీనిని కోడిగ్రుడ్ల కూరలోను, బంగాళాదుంప వగైరా కూరలోను తింటే మరీ రుచిగా వుంటవి. బ్రాహ్మణులు కూడా ఉదయం వీనిని తింటారట. కొండప్పగారికి ముఖము మీదను, మూతి వద్దను, చేతుల మీదను, తెల్లబొల్లి వచ్చింది. కొందరివలెగాక, అవికారము లేనట్లుగానే నడుచుకొనేవారు. వారి కుమారుడు శ్రీ వెంకట స్వామి కూడా న్యాయవాదవృత్తి నవలంబించాడు. వృద్ధిలోనే వున్నా రనుకొందును.

పప్పూరి రామాచారిగారు బాగుగా చదువుకొన్న రాజకీయ వాది. మాట కొంచెం పరుషం. పట్టుదల, ధైర్య సాహసాలు కలవారు. రాయలసీమ పరిస్థితులను గురించి, ఆ సీమ బీదసాదలను గురించి ప్రత్యేక సంరక్షణలు, అభివృద్ధి పనుల కొరకు గట్టిగా వాదించేవారు, ప్రచారం చేసేవారు.

బారిష్టరు బాయపరెడ్డిగారు సౌమ్యులు. మితభాషి. పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేశారు. మల్లిరెడ్డిగారు పేరు ప్రతిష్టలు గల ఐ. సి. యస్. ఆఫీసరు ఒ. పుల్లారెడ్డిగారి షడ్ఢకుడు. వారి న్యాయవాదవృత్తికూడా బాగుగానే సాగేది. న్యాయవాది రొద్దం హనుమంతరావుగారికి నాటకాల్లో వేషాలు వేయటం మిక్కిలి సరదా. కొంత పేరు సంపాదించాడు. నాటకాలను ఆడించే వారు కూడా అని గుర్తు. కె. యస్. రాఘవాచారిగారు అప్పుడు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉండేవా రనిగుర్తు. మంచితనం, మర్యాద, నిపుణత కలవారు. స్నేహశీలురు. శ్రీ రామేశ్వరరావుగారు పెద్దమనిషి. హోమియోపతి వైద్యమునందు నిపుణులు. ఏదో సందర్భంగా ఒకప్పుడు వారి సలహాను తీసుకోవటం తటస్థించింది. శ్రీ పి. హనుమంతరావుగారు మిక్కిలి యోగ్యులు. వారికి హోమియోపతి వైద్యం కూడా వచ్చును. డా. శివరావుగారు మా కుటుంబవైద్యులు. చాలా సరసులు. చాలశ్రద్ధతో చికిత్సను

చేసేవారు. నాకు పాదముల చివర వ్రేళ్లమీద, బూట్సు రాపిడి వలన కలిగిన గ్రంధులు బాధాకరముగా నుండగా, ఆఫీసునుండి తిరిగి వచ్చుచు, దారిలోని వారి క్లినిక్‌కు వెళ్లి అప్పటికప్పుడు వానిని తీయించుకొని వచ్చాను. అంత చనువు, స్వేచ్ఛ వారితో వుండేది. జి. సోమిరెడ్డిగారనే ఇంకొక బారిష్టరుండేవారు. ఆయన యువకుడు. కొద్దికాలంక్రితమే ప్రాక్టీసు మొదలుపెట్టారనుకొంటాను. అప్పుడప్పుడే కేసులు వస్తూండేవని గుర్తు. వారిది కడప జిల్లా. వీరు కొంత సంపదగల కుటుంబంలోనే పుట్టారు. వీరి అన్నగారిని గురించి ఒకకథ విన్నాను. నిజమెంతో తెలుసుకోలేదు. కాని, కొంతవరకైనా జరిగి వుంటుందని నమ్మాను. వీరన్నగారు, ఆ గ్రామంలో నిరంకుశులై వర్తిస్తూండగా స్నేహం నటించిన ముగ్గురు, నలుగురు ఆయన భోజనంచేసి అరుగుమీద సుఖాసీనులై వుండగా, హఠాత్తుగా ఆయనమీద పడి దగ్గరనున్న తుపాకిని లాక్కొని బంధించి, పైన నీళ్లు గుమ్మరించి, వంటినిండా పసుపు, కుంకుమ పులిమి, మెళ్లో వేపదండలు వేసి, బండిమీద కట్టి, ఊరేగింపుగా అమ్మవారి గుడికి తీసుకొనివెళ్లి అమ్మవారికి బలి యిచ్చారట. పోలీసులు వచ్చి కూడా ఏమీ చేయలేకపోయినారట. అన్న జనకంటకుడైనా, తమ్ముడు సోమిరెడ్డి బారిష్టరుగారు సౌమ్యులు, స్నేహస్వభావం కలవారు. వారింటికి విందుకు వెళ్లి, వారి సతీమణి ఆదరణాన్ని పొందాను.

అనంతపురంలో నాకు కలిగిన కొన్ని సంఘటనలను, అనుభవాలను చెప్పాలి. నేను 1936 ఆగష్టులో అనంతపురానికి వెళ్లిన కొంతకాలం వరకు, ఆ జిల్లా కలెక్టరుగా శ్రీ కె. సి. మానవేదన్ రాజాగా రుండేవారు. వారు కేరళ జామొరిన్ కుటుంబములోని వారట. అప్పటి జామొరిన్‌కు దగ్గరవారట. నేను ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు పదవిలో చేరిన క్రొత్తలో వారిని దర్శించటానికి వారింటికి వెళ్లాను. మాటల సందర్భంలో బ్రాహ్మణుల ప్రస్తావన వచ్చింది. ఏ సందర్భంలోనో నామనస్సు బాధపడి వుండినది. అందువల్ల బ్రాహ్మణుల తత్వాన్ని గురించి, కొంచెం నిరసనగా

మాట్లాడాను. వారు నవ్వుచూ వుండినారేగాని, అతి పతి అన లేదు. తరువాత తెలిసినది, వారు బ్రాహ్మణ సంప్రదాయం కలవారని, నిత్యం జప తపాలు చేస్తారని. వారు నాయర్ కులస్థు డనుకొన్నానుగాని, వారు సిసలైన బ్రాహ్మణ కులస్థుడు కాకపోయినా జంధ్యం వేసుకొంటూ రని, బ్రాహ్మణాచారాలు పాటిస్తారని నాకు తెలిసి యుండ లేదు. అసలు బ్రాహ్మణ రక్తం ఉండిందేమో—కేరళ వారు కదా. లోపలేమనుకున్నా చాలా ఆదరణతో మాట్లాడి, చిరునవ్వుతో సాగనంపారు. వారు చాలా సరసులు, మర్యాదస్థులు. అధికారం చెలాయించాలనే మనస్తత్వం కలవారు కాదు.

శ్రీ మానవేదన్ రాజాగారు, నే నక్కడకు వెళ్లిన అనతి కాలంలోనే బదిలీ అయి వెళ్లిపోయారు. వారినుండి ఛార్జి తీసు కొన్నది జవ్వాద్ హుస్సేన్ గారు. వీరు సత్కుల సంపన్నులు. ఇంగ్లండులో చదివి, బారిష్టరు పట్టాను పొందియుండినారు. గవర్నమెంటు సర్వీసులో, సరాసరి డిప్యూటీ కలెక్టరుగా నియమింపబడినవారు. సజ్జనుడు. స్నేహశీలుడు. నిగర్వి. అందరి తోనూ ఉల్లాసంగా, చనువుగా మెలగే స్వభావం కలవారు. తర్వాత వీరు యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్ మెంబరుగా ఢిల్లీలో ఉద్యోగం చేశారు. అనంతపురంలో ఎరిగియుండటంవల్ల, నేను అసిస్టెంటు కమిషనరుగా ప్రమోషన్ పొందే విషయంలో తోడ్పడినారు. వారి భార్యకు జబ్బుచేసి మద్రాసు ఆస్పత్రిలో ఉండగా ఒకసారి తిరిగి వారి దర్శనం చేశాను. మరల వారిని కలసికొన లేదు.

జవ్వాద్ హుస్సేన్ గారి ప్రస్తావన వచ్చినప్పుడు వారొకసారి నవ్వుచు చెప్పిన విషయం గుర్తుకు వస్తున్నది. ఒక మహమ్మ దీయ డిప్యూటీ కలెక్ట రుండేవాడట. ఆయనగారికి ఊతపదం, "అరె భాంచోత్". ఈ ఊతపదాన్ని వారు తనతో మాట్లాడుటకు వచ్చిన వారితో సంభాషణలో ఎట్టి తలంపు లేకుండానే తరుచుగా ఉపయోగించుచుండేవారట. మామూలుధోరణిలో ఎవరో ఒక పెద్దమనిషితో మాట్లాడుచున్నప్పుడుకూడా ఉపయోగించా

రట. ఆ పెద్దమనిషి తన్నవమానించినట్లు ఎంచుకొని, కలెక్టర్ జవ్వాద్ హుస్సేన్ గారితో ఫిర్యాదు చేశారట. హుస్సేన్ గారు ఆ డిప్యూటీ కలెక్టరుకు కబురంపి అడిగారట. ఆయన ఆందోళన పడుచు, సమాధానం చెప్పుచూ అలవాటుచొప్పున, "అరె భాంచోత్" అనేశాడట. హుస్సేన్ గారు విరగబడి నవ్వి, ఈ అలవాటును మార్చుకోకపోతే, చిక్కుల్లో పడతావని మందలించి పంపివేశారట.

అలవాటు పోగొట్టుకోవటం మిక్కిలి కష్టం. ఊతపదాన్ని తప్పించుకోవటం ఇంచుమించుగా సాధ్యంకానిది. నాకు కూడా ఒకటి, రెండు దూషణ ఊతపదా లున్నవి. ఒకసారి అనంత పూరులో హిందూపురం ప్రముఖ వర్తకునితో ఘర్షణలో ఉపయోగించాను. ఆయన బాధపడగా, "అబ్బే, అవి మీామీాద దూషణగా అన్నవికావు. అలవాటు ప్రకారం బయటకు వచ్చాయి" అని సమాధానపరచాను. నా వద్ద పనిచేసే ఇన్‌స్పెక్టరునుండి, మామూలు జవాను వరకు నా మాటల ధోరణి, ఊతపదాలు మొదట ఆశ్చర్యాన్ని, బాధను కలిగించినా తరువాత వానిలో అర్థంగాని, దురుద్దేశంగాని లేదని తెలుసుకొని వాని కలవాటై పట్టించుకొనేవారుకాదు. అయినా ఈ చెడ్డ అలవాటు చాలా మందికి జీవితాంతం వుంటుంది. ఈ జీవితపర్యంత రోగమే కాబోలు నా కిప్పటికినీ, నోరు కాచుకోలేకుండా వున్నాను.

జవ్వాద్ హుస్సేన్ గారు కొంతకాలానికి బదిలీ అయి వెళ్లిపోగా, శ్రీ సత్యనాథన్, ఐ. సి. యస్. గారు కలెక్టర్‌గా వచ్చారు. సత్యనాథన్ గారి తల్లి శ్రీమతి కమలమ్మ, బందరు (కృష్ణా జిల్లా) బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. అయితే ఆమె తండ్రిగారో, తాతగారో క్రిస్టియన్ మతం పుచ్చుకొన్నారు. ఆమె ఎమ్. ఎ. చదివిన విద్యావతి. ఆమె అరవ జాతి నాడార్ క్రైస్తవుని పెండ్లిచేసుకొన్నది. ఆ రోజుల్లో ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీసు ఉండేది. హోదా పెద్దది, జీతం హెచ్చు. ఆ నాడార్ యువకుడు పెద్దగా చదువుకొని ఆ సర్వీసులో ఉద్యోగి అయినాడు. వారి కుమారుడే సత్యనాథన్ గారు. శ్రీమతి కమలమ్మ తెలివితేటలు కలదేగాక, మిక్కిలి

ధీమా, దర్జా, దురహంకారం గలది. కొడుకు ఇంగ్లండులో చదువుకొనుచున్నప్పుడు తాను స్వయంగా శ్రద్ధతీసుకొని, ఆయనను ఐ. సి. యస్. కు ఎన్నిక అగునట్లు సాయపడిందట. మరిన్ని, ఆయన తరుచు జబ్బు పడుచుండేవాడట, ఈమె సాకుతూ వుండేదట. మొత్తంమీద తల్లిసాయంలేనిదే, తాను ఐ. సి. యస్. ఉద్యోగి అయ్యేవాడనుకొనను అభిప్రాయం శ్రీ సత్యనాథన్‌కు ఉండిన దని విన్నాను. నేను చూచినది, తల్లిమాటకు జవదాటక పోవటమే.

ఆమె 60-వ సంవత్సరం జన్మదినానికి, శ్రీ సత్యనాథన్ కొడుకు జన్మదినోత్సవానికి, వారి బంగళా విందులలో, వేడ్కలలో పాల్గొన్నాను ఆమె జన్మదినానికి. నే నొకచిత్రపటమును ఆమెకు బహుమతి ఇచ్చినట్లు గుర్తు.

అయితే ఒకసందర్భంగా శ్రీమతి కమలమ్మకు నామీద కోపం వచ్చింది. 1939 అక్టోబరులోనో, నవంబరులోనో కమిషనరు క్లార్క్‌గారు నా ఆఫీసు తనిఖీకి వచ్చారు. వారికి రాత్రి విందు చేశాను. నా భార్యకు విందులో పాల్గొనే అవకాశంలేకుండా పోయింది. కలెక్టరు మొదలైన ఆఫీసర్లను పిలిచానుగాని, ఆడంగుల నెవరిని పిలువలేదు. అందువల్ల శ్రీమతి కమలమ్మను పిలువలేదు. కొడుకు కలెక్టరుగా వ్యవహరిస్తున్నా, నిజమైన అధికారం చెలాయిస్తున్న కమలమ్మగారికి అహం దెబ్బతిన్నది. నే నేదో తనను కించపరచినట్లు తలంచినది. తరువాత నాతో సుముఖంగా వుండలేకపోయింది.

తలవనితలంపుగా మా కమిషనరు క్లార్క్‌గారినుండి, 1-12-1939-వ తారీఖున తాఖీదు వచ్చింది. "నీవు అతివాద రాజకీయవాది, కిసాన్ ఆందోళనకారుడు రంగాతో ఏకీభవిస్తున్నావట. ఈమధ్య ఆయన అనంతపురం వచ్చి యుద్ధానికి వ్యతిరేకంగా, రాజద్రోహంగా ఉపన్యాసాలిచ్చాడట. ఆయనకు నీవు నీ కారు యిచ్చి, నీ యింట్లోనే బస ఇచ్చావట. పైగా, గత సంవత్సరం వేసంగిలో ఆయన మదనపల్లిలో కమ్యూనిస్టుప్రచారానికి నడిపిన రాజకీయ పాఠశాలకు నీ కొడుకును పంపావట. ఈవిధంగా

చేస్తే నీ ఉద్యోగానికి ఇబ్బంది వస్తుంది. కాబట్టి, రంగాతో చేరకూడదు'' అని వార్నింగు వ్రాశారు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నేను వారికి 5-12-1939-వ తారీఖున దీర్ఘమైన జవాబు వ్రాస్తూ, ''నాకు రాజకీయాలు లేవు. రంగాగారి అభిప్రాయాలతో గాని, వారి ప్రచారాలతోగాని నాకు సంబంధం లేదు. వారు, వారి భార్య శ్రీమతి భారతీదేవిగారు, మా కుటుంబానికి ఆప్త మిత్రులు. రంగాగారు, నేను ఆక్స్‌ఫర్డ్‌లో కలసి యుంటిమి. భారతీదేవిగా రప్పుడు నాకు పరిచయులైనారు. ఆమెను నా స్వంత తోబుట్టువుగా ఎంచుకొంటాను. నాకుమారుడు చనిపోయిన తరువాత మొదటిసారి ఆ దంపతులు మాకు ఓదార్పు చెప్పటానికి మా యింటికి వచ్చారు, పైగా, 1928 లో నేనాపత్తులో వుండి నప్పుడు, వారు నాకు మాసాల కొలది ఆశ్రయ మిచ్చారు. కాబట్టి వారిని రావద్దనటం ఎట్లా? మామూలు ఆతిథ్యం జరిపాను'' అని వ్రాశాను. కొడుకు విషయంలో ''వారి రాజకీయ పాఠశాలలో గ్రామీణ ఆర్థికవిషయాలు చెపుతారు. కుర్రవాడు వెళ్తానంటే, వేసవిలో సోమరిగా వుండటం కంటె, ఎప్పటికైనా గ్రామంలో వ్యవసాయంచేసుకొనేవాడేకదా, పోనీలే, నాలుగు ముక్కలు నేర్చుకొంటాడని సమ్మతించా''నని సమాధానం చెప్పుకొన్నాను. దానిమీదట కమిషనరుగారు 6-12-1939 న టూకీగా వ్రాస్తూ, ''నీవు వ్రాసింది అర్థంచేసుకొన్నాను. అయినా, నీవు బాధ్యతగల ఆఫీసరువు, ప్రజలతో సంబంధం కలవాడవు. ప్రజలు నిన్ను అపార్థంచేసుకోకుండా వుండేటందులకు నీవు రంగా దంపతులకు, చల్లగా ఇక మనం కలసికోకూడదు అని చెప్పు. ఎందుకైనా మంచిది'' అని సలహా యిచ్చారు. అంతటితో అది సమసిపోయింది. రంగాగారు తరువాత కూడా మా యింటికి వస్తూనే వుండినారు. వారి రాకపోకలు నా ఉద్యోగానికి భంగం కలుగజేస్తవేమో అని నే నెప్పుడూ భయపడింది లేదు.

కమిషనరుగారి వార్నింగు, కలెక్టరు సత్యనాధన్‌గారు వారికి వ్రాసిన డెమి అఫీషియల్ ప్రభావమై వుంటుంది. తల్లి కమలమ్మ గారి జోక్య ముండి యుండవచ్చును. స్త్రీ అసంతృప్తి ఏదోవిధంగా బయటపడక తప్పదుకదా!

గుంటూరులో ప్రముఖ న్యాయవాదిగా పేరొందిన శ్రీ చలసాని సత్యనారాయణచౌదరిగారు సరాసరి జిల్లా జడ్జిగా నియమింపబడి ప్రప్రథమంగా అనంతపురానికి 1-2-1937 తారీఖున వచ్చారు. వారు గుడివాడ తాలూకా, మా సమీప గ్రామమగు పెదమద్దాలి వాస్తవ్యులు. నేను చదువుకొనుచుండిన రోజులనుండి ఎరిగియుండినవారు. అక్కడనుండి బదిలీ అయిన జిల్లా జడ్జి శ్రీ పి. వి. బాలకృష్ణ అయ్యరుగారు జడ్జి బంగళా ఖాళీ చేయనందున, శ్రీ సత్యనారాయణచౌదరి మా యింట్లో దిగారు. వారు భార్యాబిడ్డలతోనేగాక తలిదండ్రులతోను, భార్య మేనమామ కె. రంగస్వామినాయుడుగారితోను, అత్త సోదరితోను, గుంటూరుమిత్రుడు పళనియప్ప పిళ్లైగారితోను వచ్చారు. మా యిల్లు పెద్దది కాబట్టి, అంటు సొంటు లేదు కాబట్టి మేమంతగా ఇబ్బందిపడలేదు. 1-వ తారీఖు ఉదయమే, చౌదరిగారు జిల్లా జడ్జి పదవిని స్వీకరించారు. శ్రీ బాలకృష్ణ అయ్యరు 4-వ తారీఖున వెళ్లిపోగా, ఆ సాయంత్రం చౌదరిగారు జడ్జి బంగళాకు మారారు.

శ్రీ బాలకృష్ణ అయ్యరు ఐ. సి. యస్. ఉద్యోగి. వారిని నేనింగ్లండులో ఎరిగియుంటిని. అందువల్ల కొంత చనువుండినది. అనంతపూర్ చేరిన రెండు, మూడు గంటలకే శ్రీ సత్యనారాయణ చౌదరి, నేను శ్రీ అయ్యరుగారి వద్దకు జడ్జి బంగళాకు వెళ్లాం. వారప్పుడు స్నానం చేస్తూండినారు. అందువల్ల మేము వారి డ్రాయింగు రూములో కూర్చుండినాము. వారి సామానులు ఇంకా కట్టవలసి యున్నది. అటు చూడగా, ఒక కుర్చీమీద రెండు చిత్రపటాలుండినవి. ఎత్తిచూడగా అవి మిక్కిలి మనోహరంగా కనపడినవి. ''ఎక్కడివి?''వని శ్రీ అయ్యరుగారి నడిగాను. ''పెనుగొండ హైస్కూలు డ్రాయింగు మాస్టరు శ్రీ సి. యన్. వెంకట్రావుగారు చిత్రించిన'' వన్నారు. తరువాత నేను పెనుకొండ క్యాంపునకు వెళ్లినప్పుడు శ్రీ వెంకట్రావును పిలిపించాను. పిమ్మట వారింటికి వెళ్లగా, రెండు చిత్రాలు సిద్ధంగా వున్నవి. ఆ రెండు చిత్రాలను తెచ్చు

కొని, వారికి 80 రూపాయలు మాత్రమే ఇచ్చాను. తరువాత ఇంకా మూడు చిత్రాలను వారినుండి తీసుకొన్నాను. ఈ మూటికీ కొంచెం హెచ్చుగానే యిచ్చాను. మొదటి రెండు చిత్రాలకు వారు ఏ డెబ్బైమిది ప్రతులైనా చిత్రించి యుంటారు. అచ్చమైన కాపీకాదు. ఆ రూపాన్నే తిరిగి చిత్రించారు. అందువల్ల రూపం, చిత్రణాపద్ధతి ఒకటైనా వ్యత్యాసాలు తప్పకవున్నవి. అనంతపురం లోనే బర్మాషెల్ ఏజంటు శ్రీ యస్. సుబ్బయ్య ఇంట్లో వాని ప్రతులను (డూప్లికేట్సు) చూచాను. తరువాత మద్రాసులో టి. టి. కృష్ణమాచారింటిలో చూచాను. ఇంకెక్కడో చూచాను. ఒక దానికి 'బర్త్ ఆఫ్ ఆర్ట్' అని ఆయన పేరుపెట్టారు. ఒక సుందరి చిత్రలేఖనం నేర్చుకొన్నదట. ప్రప్రథమంగా విఘ్నేశ్వరుణ్ణి చిత్రించుచున్నది. వెనుకభాగంలో కాళికాదేవి, (సరస్వతి దేవికి వలె కళాధిష్ఠ దేవతయట) భావోద్రేకాన్ని కలిగిస్తున్నది. ఈ సుందరి చాలా చక్కగా చిత్రింపబడ్డది. రంగుల కలయిక, రేఖల సమత్వం, అవయవముల పొందిక, ముఖ సోయగం, వక్షోజాల పొంకం హృదయస్పందన కలిగిస్తవి. రెండోది, దేవదాసి. ఆమె దేవాలయంలో నృత్యం చేస్తున్నట్లు. ఈ బొమ్మకూడా చూడముచ్చటగా వున్నది. ఇంకొకటి, గోపాలకృష్ణుడు ఒక చెట్టు నీడను వేణుగానం చేస్తూండటం, గోవులు హాయి ననుభవించు చుండటం దృశ్యం. నాల్గవది, ఒక పాంథుడు దప్పికతో చలివేంద్రకు చేరగా, అక్కడి యువతి మంచినీళ్లు దోసిటలో పోయుచుండటం, పాంథు డా యువతి సౌందర్యాన్నిచూచి ముగ్ధుడవటం, అతడి అందాన్నిచూచి ఆమె స్తబ్ధురాలవటం, పోసిన నీళ్లు దోసిటనుండి జారిపోవటం చిత్రింపబడింది. ఐదవది, శివుడు జటాజూటం నుండి దిగివచ్చిన గంగను చేరదీసి లాలించటం, పార్వతి అలిగి అటుప్రక్కకు ముఖంత్రిప్పుకొనటం చూపే బొమ్మ. నేను శ్రీ వెంకట్రావుతో, "మీరు శివుని యోగధ్యానంలో చిత్రించం" డని కోరాను. ఆయన సవతుల అలకలకు గురియైన కాముక శివుణ్ణే చిత్రించారు. చిత్రం బాగానేవున్నది. తరువాత కొద్దికాలానికే వారు దివంగతులైనారు. వారి కుమారుడు శ్రీ శ్రీనివాసరావు పిన్నవయస్సువాడు. అప్పుడప్పుడు నావద్దకు వచ్చేవాడు. ఆయన

నుండి నాలు గైదు చిత్రాలు కొన్నాను. ఈ చిత్రకారుడు కూడా సమర్థుడే. ఒకసారి పణికర్ గారు ఆయన చిత్రాలను చూచి బాగున్న వన్నారు. ఈయనతో "నాన్నగారి చిత్రాలేవైనా ఉన్నవేమో తీసుకురండి, తగినట్లుగా వెల యిస్తా"నని చెప్పాను. ఒకసారి ఒక పెద్దబొమ్మను తెచ్చాడట. నే నింటిలో లేను. నా భార్య "మాకేబొమ్మ లక్కరలే"దని పంపివేసిందట. దాని నెవరికో ఇచ్చినట్లు తర్వాత ఆయన చెప్పాడు. తిరిగి కనపడలేదు.

తండ్రి కొడుకు లిద్దరూ ప్రకృతి చిత్రాలను కూడా చిత్రించేవారు. శ్రీనివాసరావు ప్రకృతి చిత్రాలు తండ్రివానికంటె మిన్న అయినవి. కుమారుని, వర్షంలోని బాటసారుల చిత్రం మంచి నేర్పరితనాన్ని చూపిస్తుంది.

శ్రీ సత్యనారాయణచౌదరి ఘటికుడు. న్యాయశాస్త్రం బాగా తెలిసినవాడు. ఆలోచనాపరుడు. నిర్ణయానికి రావటానికి తొందరపడే స్వభావంకలవాడుకాదు. ఆయన కంతకు ముందు గుంటూరు జిల్లా రాజకీయాల్లో జోక్యం వుండేది. కొంతకాలం మద్రాసు ప్రాత లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో సభ్యుడుగా వుండినాడు. ఈ రాజకీయతంత్రజ్ఞత పూర్తిగా పోలే దనుకొందును. ఇప్పుడు మద్రాసులో వుండుచున్నారు. నాకంటె, 4, 5 ఏండ్లు పెద్ద. శ్రీ ఒ. పుల్లారెడ్డి, ఐ. సి. యస్. గారు తన షడ్డకుడు న్యాయవాది మల్ రెడ్డిగా రింటికి వచ్చి, షడ్డకునితో కలసి 24-2-1937 ఉదయం మా యింటికి వచ్చారు. ఆ సాయంత్రం పుల్లారెడ్డిగారు, నేను కలసి, జడ్జి సత్యనారాయణచౌదరిగారి బంగళాకు వెళ్లాము. ఆరాత్రి శ్రీ పుల్లారెడ్డికి నేను మాయింట్లో విందుచేశాను. జిల్లా జడ్జి, పబ్లిక్ ప్రాసిక్యూటరు, వారి షడ్డకుడు, బారెట్లా శ్రీ బాయపరెడ్డి వగైరా విందులో పాల్గొన్నారు. రాత్రి ప్రొద్దు పోయినతర్వాత ఎవ రింటికి వారు వెళ్లిపోయారు.

పుల్లారెడ్డిగారిని నే నింగ్లండులో 1924 సంవత్సరంలో అనుకొంటాను కలసికొన్నాను. వారు ఇండియాలో ఐ. సి. యస్. పరీక్షలో నెగ్గి, తర్ఫీదుకు ఇంగ్లండు వచ్చారు. ఆక్స్‌ఫర్డ్ ఓరియల్

కాలేజిలో చేరారు. ఆ పరిచయం స్నేహంగా మారి కొంత కాలం సన్నిహితంగానే వుండేవారం. వా రెన్నో ఉన్నతపదవుల నధిష్ఠించారు. కొంతకాలం ఒరిస్సా జైపూర్ సంస్థానానికి దివానుగా వుండినారు. కొంతకాలం మైసూరు ప్రభుత్వంలో మంత్రిగా వుండినారు. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో హోమ్ సెక్రటరీగాను, ఆంధ్ర రాష్ట్రావతరణం తర్వాత చీఫ్ సెక్రటరీ గాను పనిచేశారు. అటు పిమ్మట కేంద్ర ప్రభుత్వ రక్షణ శాఖలో సెక్రటరీగా వుండినారు. ఈమధ్యవరకు హైదరాబాద్, రాజేంద్ర నగరంలో వ్యవసాయ విశ్వవిద్యాలయాధిపతిగా వుండినారు. వారు మిక్కిలి సమర్థులని, కార్యదక్షు లని ప్రతీతి. స్వయం కృషివల్ల, భగవంతు డిచ్చిన మేధా సంపత్తివల్ల, లౌకికజ్ఞానం పూర్తిగా కలవా రగుటచేతను పైకి వచ్చారు.

1937 వేసవిలోనో, 1938 మార్చి నెలలోనో, నేను నా పెద్ద కుమారుడు పూర్ణచంద్రరావుతో కలసి బెంగుళూరుకు వెళ్లి, అప్పు డక్క డుండుచున్న పుల్లారెడ్డిగారి ఆతిథ్యం రెండురోజు లైనా అనుభవించాం. అంత స్నేహం వుండింది.

ఒకనాడు వారితోనూ, వారి బంధువులతోనూ కలసి వారత్తవారూరు వెళ్లాను. వారి మామగారు శ్రీ దొరిగల్లు వెంకటరెడ్డిగారు. వారు ప్రముఖ భూస్వామియేగాక, ఒక పరిపాలకుడుగా జీవితం గడపారట. శత్రువులనుండి సంరక్షణ కొరకేమో అనునట్లు, కోటవంటి ఒక పెద్ద భవనాన్ని కట్టించారు. పై అంతస్తేగాక పెద్ద బురుజువంటి గోపుర మున్నది, దానిలో సువిశాలమైన గదు లున్నవి. గోపురంపైకి మెట్లున్నవి. పైనుండి చుట్టుప్రక్కల చాలా దూరం చూడవచ్చును. వెంకటరెడ్డిగారిది నిరంకుశ పరిపాలన. ఒకప్పుడు గవర్నమెంటు దృష్టికి వచ్చారని విన్నాను. మేము వెళ్లినప్పటికి శ్రీ వెంకటరెడ్డిగారు చనిపోయారు. వారి కుమారుడు నారాయణరెడ్డిగారు మాకు అతిథిసత్కారాలు చేశారు.

నేను అనంతపురములో వుండినప్పుడు, అప్పుడప్పుడు హిందూపురం క్యాంపునుండి బెంగుళూరుకు వెళ్లుట తటస్థించేది.

ఒకసారి వెళ్ళినప్పుడు పుల్లారెడ్డిగారి స్నేహితులు శ్రీ కె. యస్. గురుస్వామిగారితో పరిచయం కలిగింది. గురుస్వామిగారి తండ్రి వారి కులవృత్తి ఆబ్కారీ వ్యాపారం విస్తృతంగాచేసి సంపన్నులైనారు. గురుస్వామిగారు దానినింకా అభివృద్ధిపరచి, ఇతర వ్యాపారాలుకూడా చేసి, చాలా ధనవంతులై బెంగుళూరు ప్రముఖులలో ఒకరైనారు. బెంగుళూరు గుర్రంపందాల సంస్థలో స్టూవార్డు అయినారు. సరసులు. దక్షులు. వన్యమృగాలను వేటాడటంలో మిక్కిలి నిపుణులు. 15, 20 పెద్దపులులను వేటాడి చంపారని విన్నాను. వారి విగ్రహం పొట్టిదైనా, వారు ఠీవి, హుందాతనం, దర్జా కలవారు. స్ఫురద్రూపి. చక్కని తెల్ల తలపాగాతో ఆకర్షణీయంగా వుంటారు. కొన్ని సంవత్సరాల తర్వాత నేను కుటుంబంతో బెంగుళూరుకు వెళ్ళినప్పుడు, మమ్ములను విందుకాహ్వానించి, సత్కరించారు. 1966 సెప్టెంబరులో నేను బెంగుళూరులో కొన్నిరోజులు గడపినప్పుడు, వారిని చూచుటకు వెళ్ళాను. కాని, వారు ఆ సమయానికి ఇంటివద్ద లేనందున తిరిగి కలసికొనలేకపోయాను. లేరని చెప్పటానికి వచ్చిన ఒక యువకుని అందచందాలు చూచి చకితుడనైనాను.

శ్రీ పుల్లారెడ్డి నాకు చేసిన సహాయాన్ని గురించి వారి ప్రస్తావన ముగియకముందు చెప్పాలి. నేను 1953 జూన్ ఆఖరుకు ఉద్యోగ విరమణ చేశాను. 1953 అక్టోబరు 1-వ తారీఖున, కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. పల్లె పట్టణంగా వుండిన కర్నూలును అభివృద్ధిపరచటానికి, గుడ్డిలో మెల్లలాగా రాజధానినిగా తయారుచేయటానికి శ్రీ సి. నరసింహాన్ని ప్రభుత్వం స్పెషల్ ఆఫీసరుగా అక్కడకు పంపారు. త్వరలో అవతరించే క్రొత్త రాష్ట్రానికి అన్నిహంగులతో బాటు, పబ్లిక్ సర్వీసు కమిషన్‌ను ఏర్పాటుచేయటానికి నిర్ణయం జరిగింది. కమిషన్‌లో ఒక అధ్యక్షుడు, ఇద్దరు సభ్యులుంటారు. నేనొక సభ్యుణ్ణి కావాలని ఆశించాను. నా కోర్కెను మిత్రుడు పుల్లారెడ్డిగారికి తెలిపాను. ఆయన సహాయంచేస్తానన్నారు. ఆయన ఆంధ్ర ప్రభుత్వం ముఖ్యకార్యదర్శిగా ఏర్పడ్డారు. అందువల్ల

ఆయన పూనుకొంటే నా కోరిక నెరవేరుతుందని నా నమ్మకం. వారు ప్రభుత్వానికి సమర్పించిన లిస్టులో నాపేరు వేశారు. నా పేరు, కలెక్టరుగా ఉద్యోగంచేసిన వివేకానందమూర్తిగారి పేరు, లా సెక్రటరీగా వుండిన వెంకట రమణారావునాయుడుగారి పేరు పైకి వెళ్లాయి. నేను ముఖ్యమంత్రిగా వుండిన శ్రీ టి. ప్రకాశం పంతులుగారిని కర్నూలులో దర్శించాను. శ్రీ ప్రకాశం పంతులు గారు నన్నెరుగకపోయినా, నా పినతండ్రి నాగభూషణంగారిని ఎరుగుదురు. నేను వారికీ విషయం, నా చదువు సంధ్యలు, నేను అసిస్టెంటు కమిషనరు ఉద్యోగంనుండి అంతకు ముందే విరమించు కొన్నది వగైరా చెప్పుకొన్నాను. వారు సావకాశంగా విన్నారు. అనుకూలంగానే వున్నట్లు నాకు తోచింది. నన్ను అధ్యక్షునిగా, వివేకానందమూర్తిగారిని, శ్రీ వెంకట రమణారావునాయుడును సభ్యులనుగా శ్రీ ప్రకాశం పంతులుగారు ఆమోదించారు. ఇంతలో శ్రీ నీలంసంజీవరెడ్డిగారి వియ్యంకుడో, దగ్గర బంధువో సంజీవరెడ్డి గారిని వారి బంధువు, అంతకు ముందే కృష్ణాజిల్లా కలెక్టరుగా పనిచేసిన శ్రీ రామిరెడ్డిగారిని సభ్యునిగా ఏర్పాటు చేయండని బలవంతపెట్టారు. శ్రీ ప్రకాశంపంతులు ముఖ్యమంత్రిగా వుండినా అధికారం అంతా, డిప్యూటి ముఖ్యమంత్రి హోదాలో, కాంగ్రెసుపార్టీ నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డిదే. అందువల్ల శ్రీ సంజీవరెడ్డిగారిమాట శ్రీ ప్రకాశంపంతులుగారు కాదనలేని స్థితిలో వుండినారు. శ్రీ సంజీవరెడ్డిగారి పట్టుదలవలన శ్రీ రామి రెడ్డికి సభ్యత్వం ఇవ్వాలి. అందువల్ల వెంకట రమణారావు నాయుడుగారిని లిస్టునుండి తొలగించారు. ఆ విషయం తెలిసిన వెంకట రమణారావునాయుడుగారి తరఫున కొంతమంది విధాన సభ్యులు రాయబారం వెళ్లారు. వారు, "శ్రీ వెంకట రమణారావు నాయుడు వెనుకబడినజాతులకు చెందినవాడు, వెనుకబడిన జిల్లా లకు చెందినవాడు, పైగా ఛీఫ్ ప్రెసిడెన్సి మాజిస్ట్రేటుగా అనుభవం సంపాదించి, ఇప్పుడు లా సెక్రటరీగా వుంటున్నాడు" అని చెప్పుకొన్నారు. పైగా, జిల్లా జడ్జిగా కొలదికాలం క్రిందనే ప్రమోషనయిన బి. సిహెచ్. నారాయణమూర్తిగారికి

లా సెక్రటరీ పదవి నిచ్చేటట్లు, ఇంకొక బ్రాహ్మణుడు వివేకానంద మూర్తిగారిని సర్వీసు కమిషన్ అధ్యక్షునిగా నియమించేటట్లు, శ్రీ ప్రకాశంపంతులుగారిని ఒప్పించారు. ఈ ఏర్పాటులో నా పేరు తొలగించబడ్డది.

నేను అధ్యక్షుడనుగా, శ్రీ వివేకానందమూర్తి, శ్రీ వెంకట రమణారావునాయుడు సభ్యులుగా, శ్రీ ప్రకాశంపంతులుగారు ఆమోదించి, లాంఛనంగా ఆ జాబితాను గవర్నరుగారివద్దకు పంపారు. గవర్నరుగారు సంతకం చేస్తే, పేర్లను బహిర్గతం చేసేవారు. ఈలోపుగా శ్రీ సంజీవరెడ్డి ఫైలును వెనుకకు తెప్పించి, పై మార్పును చేయించారు.

నేను కోరింది సామాన్య సభ్యత్వం మాత్రమే. 1953 నవంబరారంభంలో అనుకొంటాను, ఒక ఉదయం, తర్వాత పబ్లిక్ సర్వీసు కమిషన్ అధ్యక్షుడైన శ్రీ కానుమిల్లి సుబ్బారావుగారు, వారి మద్రాసు పెనాయ్ నగర్ ఇంటినుండి, నా పెనాయ్ నగరం యింటికి ఫోనుచేశారు. ఫోను అందుకొనిన వెంటనే అభినందనను చెప్పారు. "దివాన్ బహద్దర్ బండి శ్రీహరిరావునాయుడుగారు వచ్చారు మీ యింటికి పంపిస్తున్నాను. వారు విశేషం చెప్తా" రన్నారు. కొలది నిమిషాలకు శ్రీహరిరావునాయుడుగారు వచ్చారు. రావటంతోనే అభినందన లిస్తూ, "మిమ్మును పబ్లిక్ సర్వీసు కమిషన్ అధ్యక్షులుగా నియమించా" రన్నారు. "సంతోషం. నేను సభ్యునిగామాత్రమే కోరుకొన్నానే" అన్నాను. "నేనీ ఉదయమే కర్నూలునుండి వచ్చాను. నిన్నరాత్రి మా అబ్బాయి కల్యాణరావు చెప్పాడు. అతడు అక్కడ పోలీసు ఆఫీసరుకదా" అన్నారు. తీరా మరునాటి సాయంత్రానికి వచ్చిన రేడియోలో, నా పేరు లేకుండా పోయింది.

ఈ విధంగా నోటికి వచ్చింది జారిపోవటం శ్రీ పుల్లారెడ్డి లోపంకాదు. శ్రీ వెంకట రమణారావునాయుడు వారికి మిక్కిలి సన్నిహితుడే. వారు, ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో హోమ్ సెక్రటరీగా, శ్రీ వెంకట రమణారావునాయుడు ఛీఫ్ ప్రెసిడెన్సి మాజిస్ట్రేటుగా వుంటున్నప్పుడు, తరచు శ్రీ నాయుడు, శ్రీ రెడ్డిని సందర్శించటం వగైరా జరుపుచుండేవారు. అయినా, శ్రీ రెడ్డి

చేసిన పొరపాటల్లా, వారు నన్నూ, శ్రీ నాయుడునూ ముగ్గురిలో ఇద్దరిని బలపరచటమే. అయితే శ్రీ పుల్లారెడ్డి పూనుకొననిదే నా ఊసే వుండేదికాదు. నాకు కొంత ప్రతిష్ఠ ఈ విధంగా కలిగించిన శ్రీ పుల్లారెడ్డికి కృతజ్ఞుడను.

అనంతపూరు ఇన్‌కమ్‌టాక్స్ ప్రాక్టీషనర్లలో శ్రీనివాసన్ అనే వా రుండేవారు. ఆయన సమర్థుడే. కొంత డాంబికం, డబాయింపు, టాలాటోలీ కలవాడు. ఆయనకు ఒక వైశ్యుడు రంగయ్యచెట్టి అనే అతను కేసులు తెచ్చిపెడుతూ వుండేవాడు. ఏదో శ్రీనివాసన్ ముట్టచెపుతూ ఉండేవాడు. ఒకనాడు కదిరి క్యాంపులో జట్కా బండిలో ముగ్గురు, నల్గురుతో శ్రీ రంగయ్య చెట్టి దిగటం చూచాను. ఆ వచ్చినవారు ఆ రోజున వారికేసుల విచారణకు వచ్చినవారు. అదివరకే కొంత తెలిసియుండిన నేను, శ్రీ రంగయ్యచెట్టిని పిలిచి, "ఎవరీ మనుష్యులు, ఎందుకు మీరు తీసుకొనివచ్చా?" రని అడిగాను. ముందు సందేహించినా, తర్వాత శ్రీ రంగయ్యచెట్టి వివరించాడు. తాను ఏ మూడో క్లాసో చదువుకొన్నానని, ఇంగ్లీషు బొత్తిగా రాదని, జీవనోపాధికి శ్రీనివాసన్‌గారిని ఆశ్రయించగా తాను కాన్‌వాస్ చేసి తెచ్చిన కేసులకు, కేసు ఒక్కింటికి రు. 1-00 కమిషన్ ఇస్తాడని చెప్పాడు. అప్పుడు నేను, "పిచ్చివాడా, పెద్దకేసులు కాక పోయినా, ఏ చిన్నకేసులో మీఅంతట మీరు పట్టుకొనివస్తే, నేను మిమ్ములను అంగీకరిస్తాను. మీ జీవనోపాధి ఇంతకంటె బాగా జరుగుతుం" దని ప్రోత్సహించాను.

అప్పటినుండి చిన్న చిన్న కేసులు, ఆఫీసరు సుముఖంగా వున్నారని కొంచెం పెద్దకేసులు తీసుకొని రావటం పరిపాటయింది. కొన్ని నెలలు గడచిన తర్వాత, ఆయన తనను ఇన్‌కమ్‌టాక్స్ ప్రాక్టీషనరుగా గుర్తించవలసిందని పిటీషన్ పెట్టుకొన్నాడు. అందుమీదట ఆయనను గుర్తిస్తూ ఆర్డరు ఇచ్చాను. క్రమేణా వృద్ధిపొందాడు. నేను అసిస్టెంటు కమిషనరునయి 1950-1953 మధ్య అనంతపూరు క్యాంపుకు వెళ్లినప్పుడు నా వద్దకు వచ్చి, అనేక కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. నే నిచ్చిన ఆర్డరును ఫ్రేము కట్టించానని, నా పేరు నిత్యం జపిస్తున్నానని, నేను పెట్టిన భిక్షవల్ల

నాలుగు డబ్బులు సంపాదించుకొంటూ, సుఖజీవనమే గాక ఇంత కూడబెట్టుకొన్నానని నివేదించుకొన్నాడు. నేను మిక్కిలి సంతోషించాను.

విచిత్ర మేమిటంటే, చదువంతగా లేని శ్రీ రంగయ్య చెట్టికి, అప్పీల్సులో కూడా పార్టీల తరఫున హాజరయ్యే అర్హత కలిగింది. శ్రీ పి. బ్రహ్మయ్య వంటి ప్రఖ్యాత ఆడిటర్ల పేరుతో హాజరయ్యే శ్రీ సీతారామన్ వంటి దక్షునకు, అనుభవజ్ఞునకు తనంట తాను ప్రాతినిధ్యం వహించే అర్హత క్రొత్త రూల్సు ప్రకారం నా కాలంలోనే లేకుండా పోయింది.

నే ననంతపురంలో ఉద్యోగిగా వున్నప్పుడు రెండు సంతోషకరమైనవి, ఒక దుఃఖ పూరితమైన సంఘటనలు సంభవించినవి. నా మూడో కొడుకు సుధాకర్, నా రెండో కూతురు కమలకుమారి అక్కడే పుట్టారు. కొడుకు 8-3-1938 న, కూతురు 24-9-1939 న జన్మించారు. సుధాకర్ మంచి ఎరుపుగా, అందంగా పుట్టాడు. పెద్దవాడు పూర్ణచంద్రరావుకంటె, రెండోవాడు రాధాకృష్ణకంటె ఎక్కువ రంగుతో వుంటా డనిపించింది. కాని, క్రమేపి చామన చాయవాడుగా తయారైనాడు. రెండోవాని విషయంలో వలెగాక, ఏ డాక్టరు తోడు అవసరం లేకుండా పోయింది. మునిసిపల్ మంత్రసానితోనే పూర్తయింది. సుధాకర్‌కు, జడ్జి శ్రీ చలసాని సత్యనారాయణచౌదరిగారిచేత పేరు పెట్టించాము. కమలకుమారి జననం, మా పెద్ద కొడుకు పూర్ణచంద్రరావు అకాలమరణ విచారం కొంతవరకైనా మరవని కాలంలో. అయితే, నాభార్య మా చనిపోయిన బాబే, ఈ బిడ్డగా తన కడుపున పుట్టిందని నమ్మింది. ఆ నమ్మకానికి నే నడ్డు తగలలేదు. అందమైన బిడ్డ కమలకుమారి. రంగు యిప్పుడు కొంత మాసినా, చామన చాయగా మారలేదు.

1938 నవంబరు 11-వ తారీఖున ఉదయం నేను స్నానం చేయుచుండగా, క్రిందటి రాత్రి బెజవాడనుండి శ్రీ పర్వతనేని రామకృష్ణయ్య పంపిన టెలిగ్రాం చేరింది. పూర్ణచంద్రరావు

(బాబు) కమ్మ హాస్టలులో టైఫాయిడ్ జ్వరంతో సీరియస్‌గా వున్నాడని వార్త. మే మా మధ్యాహ్నం 2-45 గంటలకు రైలులో బయలుదేరి, మరునాడుదయం 6 గంటలకు బెజవాడకు చేరుకొన్నాం. ఆ రోజు (12-11-1938) శనివార మగుటచేత, దుర్ముహూర్తమని సరాసరి హాస్టల్‌కు వెళ్లక, నేను డాక్టరు సూరపనేని చంద్రమౌళిగారింటికి, నా భార్య వగైరా నా పినతల్లి భర్త దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారింటికి వెళ్లాము. దుర్ముహూర్తమేగాక 9 గంటల వరకు వర్జమని, 9 గంటలు దాటిన తర్వాత బాబును చూడటానికి వెళ్లాం. వెళ్లేటప్పటికి బంధు మిత్రులు గుమిగూడి వున్నారు. బాబు మంచం మీద స్పృహలేకుండా పడియున్నాడు. తల్లి గట్టిగా కొన్నిసార్లు పిలిచిన మీదట కొంత స్పృహవచ్చి, "ఊ" అన్నాడేమో అనుకొన్నాంగాని, వాడు తిరిగి ప్రపంచంలోకి రాలేదు. ఇతరులకు బ్రతకడని తోచిందేమోగాని, నాకుమాత్రం, వాడు మమ్ములను విడిచిపెట్టి వెళ్లిపోతాడని తోచలేదు. అందువల్ల హాస్టల్ అనను కూలమని, వేరే ఇల్లు అద్దెకు తీసుకొండని బలవంతం చేశాను. నా మనస్సు నొప్పించటాని కిష్టంలేక, తమ అనుమానాలను నాకు వ్యక్తపరచటానికి సందేహించి, ఇల్లొకటి ఏర్పరచారు. "ధూళి ధూసరంతో వుంది, సాయంత్రానికి శుభ్రపరిపిస్తాం, రేపు ఉదయం తీసుకొని వెళ్ల" వచ్చని చెప్పారు. సాయంత్రానికి ముంచుకు వచ్చింది. తెల్లవారుఝామున ఐదుగంటలకల్లా, ప్రాణవాయువులు స్వర్గసీమ చేరుకొన్నవి.

1938 మార్చి పరీక్షలలో స్కూల్‌ఫైనల్ పూర్తిచేసి, శ్రీ రంగాగారు మదనపల్లిలో నడపిన రైతాంగ పాఠశాలలో వేసవిలో శిక్షణ పొంది, జూన్ ఆఖరుకు ఇంటర్ మీడియట్ చదువుకు సిద్ధమైనాడు. అనంతపూరులో సుప్రసిద్ధ దత్తమండలాల కాలేజి వున్నది. మావద్దనే వుండి, ఆ కాలేజిలో చదువుకోవాలనుకొన్నాడు. కాని, నేను అనంతపూరులో 1936 లో చేరినందున, వాని రెండు సంవత్సరాల కోర్సు పూర్తిఅయ్యేవరకు నే నక్కడుండకపోవచ్చునని, పైగా పెండ్లీడుకు వచ్చిన యువకునకు

తగిన సంబంధం రావాలంటే బెజవాడలో వుండటం మేలని, అక్కడి సమీప ప్రాంతాల్లో బంధు మిత్రు లున్నారని, నా స్వగ్రామం బొమ్మ్మలూరు, నాభార్య గ్రామం పెడసనగల్లు అనతి దూరంలో వున్నవని, మా వాళ్లు వచ్చి చూచిపోవుటకు అనుకూలంగావుండు నని తలంచి, బెజవాడ ఉయ్యూరు రాజావారి కాలేజిలో చేరమని పంపాను. తన కిష్టంలేకపోయినా, తలి దండ్రులమాటకు జవదాటని సుపుత్రు డగుటచేత బయలుదేరి వెళ్లాడు. వెళ్లేటప్పుడు, "మనవా ళ్ళుంటారు, కమ్మ హాస్టలులో చేరు. మరిన్నీ నా మిత్రుడు డాక్టరు యస్. చంద్రమౌళిగా రున్నారు. వారి సలహా సంప్రదింపులు పొందుచుండు. ఏదైనా సుస్తీచేస్తే వారున్నారుకదా" అని చెప్పాను.

బెజవాడకు చేరిన కొద్ది కాలానికే, వానికి జబ్బుచేయటం ప్రారంభించిందట. అది మొదట మలేరియాజ్వరంగా వుండిందట. డాక్టరు చంద్రమౌళిగారు చికిత్సచేశారు. నయమైపోయినట్లుండి, తిరగబెట్టిందట. కాని అది అప్పటికి విషజ్వరమని డాక్టరుగా రనుకోలేదు. బాబు చలిజ్వరమే అనుకొన్నాడు. సుస్తీగా వున్నదని వాని ఉత్తరంవల్ల గ్రహించి, అనంతపూరుకు వెంటనే రమ్మని వ్రాశాను. కాని మొదటి మూడుమాసాల పరీక్షలో బాగా వ్రాయలేదని, ఆరు మాసాల పరీక్షకు బాగా చదవాలని, అక్కడుంటే చదువు సాగుతుందని వ్రాశాడు. పైగా జ్వరం ఎక్కువగానేవున్నా, దూరంలో వుండిన కాలేజికి సైకిల్ మీద వెళ్లుచుండేవాడట. చివరకు తట్టుకోలేక పడిపోయాడు. 10-వ రాత్రి శ్రీ రామకృష్ణయ్య ఏదో పనిమీద హాస్టలులోకి వెళ్లి, బాబు గదిలోకి వెళ్లగా మడతమంచానికి అడ్డంగా స్పృహ లేకుండా పడివున్నాడట.

న న్నెరిగిన డాక్టర్లు, ఇతరులు తీసుకొనివచ్చిన డాక్టర్లు, ఆయుర్వేద వైద్యం తెలిసినవారు మే మక్కడకు చేరక పూర్వం, చేరిన తర్వాత వచ్చి చూచి వెళ్లారు. మేము చేరిన 12-వ సాయంత్రం శ్రుతిమించుచున్నదని చంద్రమౌళిగారిని తీసుకొని,

రైల్వేడాక్టరు శంకర్రావుగారివద్దకు వెళ్లి, వారిని అర్థించి, రాత్రి 8 గంటలకు తీసుకొనివచ్చాం. వారు చూచి, విషమించిందని, ఇక లాభంలేదని అభిప్రాయ పడినా రనుకొంటాను, ఏదో డాక్టరు చంద్రమౌళిగారికి చెప్పి వెళ్లిపోయారు.

రాత్రంతా వాని బాధ చూస్తూ పరితపిస్తూ మేలుకొనే వున్నాం. తెల్లవారిన తర్వాత అద్దెకారులో వాని భౌతిక దేహాన్ని పెడసనగల్లుకు తీసుకొనివెళ్లి దహన సంస్కారం చేశాము. అంతటితో మా ఋణానుబంధం తెగిపోయింది. వాని మృతి మా కిప్పటికిని, సంతాపాన్ని కలిగిస్తూనే వున్నది. ఈమధ్య నేను ప్రచురించిన "తాంబూలం — నైవేద్యం" పుస్తకములో "మాబాబు" అను శీర్షికక్రింద నా మనోక్షోభను వెలువరించియున్నాను.

మనవాళ్లకు శకునాలయందు చాలా నమ్మకం. రాబోయే మంచిచెడులను, కొన్ని సంఘటనలు ముందు సూచిస్తవంటారు. ఉదాహరణకు, మనం ప్రయాణమై వెళ్లుచుంటే, ఒంటి బ్రాహ్మణు డెదురైన, వెళ్లే పని జరగదట. ఇట్టి వానిలో నిజమున్నదేమో అని అప్పుడప్పుడు నాకు తోస్తుంది. బాబు బెజవాడకు వెళ్లే ముందు ఒకరాత్రి, తన పడకగది వెలుపలి కిటికీలోనుండి, ఒక నల్లని భయంకరాకారం, తన మొగాన్ని కిటికీచువ్వల కానించి తన్ను చూస్తున్నట్లు తట్టి భయపడ్డాడట. ఉదయం తల్లితో చెప్పాడట. నాకు వాని మృతి తర్వాతగాని తల్లి చెప్పలేదు. వాడు బెజవాడకు బయలుదేరి వెళ్లే రోజున, మా డ్రైవరు సమయానికి రాలేదు, వాని కోసం కబురంపగా కన్పడలేదు. రైలు సైము సమీపిస్తున్నదని గాబరాపడి, జట్కాబండి తెప్పించాము. దానికి దారిలో ఏదో ప్రమాదం జరిగిందట. రైలు ఆలస్యంగా రావటంవల్ల ప్రయాణం సాగింది. ఆ అశుభశకునాలు వాని అకాలమరణాన్ని సూచించిన వని అనుకోవచ్చునేమో. ఇంగ్లీషులో (కమింగ్ ఈవెంట్స్ కాస్ట్ దెయిర్ షాడోస్) "జరుగబోయే వాని సూచనలు, ముందు కనపడత"వని ఒక వాక్యం వున్నది.

బాబు మరణించిన తర్వాత ఒక సంవత్సరం పైచిలుకు అనంతపూరులోనే వుండిపోయాను. దగ్గరలో కంటె, దూరంలో వున్న అనంతపూరులోనే వుంటే, బాబును జ్ఞప్తికి తెచ్చే బంధుమిత్రులు చప్పున తటస్థపడరనే భావంతో. పైగా చప్పున సెలవు దొరకదు కదా! శ్రీ సెనెక్ గారు 1937 లో స్వదేశానికి వెళ్లిపోయిన తర్వాత, శ్రీ క్లార్కుగారే పరమనెంటు కమిషనరుగా వుండినారు. పైన చెప్పినట్లు వారు నవంబరులో అనంతపూరుకు క్యాంపు వచ్చినప్పుడు, వారితో "నాబిడ్డ మరణ దుఃఖం నన్నింకా వేధించుచున్నది. నాకు నాలుగు నెలలు సెలవు కావా"లని రుద్ధకంఠంతో, వారు, నేను కలసి నా కారులో ఎక్కడకో వెళ్లుచున్నప్పుడు చెప్పాను. వారు సానుభూతితో "దరఖాస్తు పెట్టం"డని అన్నారు. 1940 జనవరినుండి నాలుగు నెలల సెలవు శాంక్షన్ అయింది. దారిప్రయాణం సెలవు అవకాశం తీసుకొని, వారంరోజులు ముందుగానే, అనంతపురం విడిచిపెట్టి, ఇంటికి వెళ్లిపోయాను.

కమిషనర్ క్లార్కుగారి అనంతపూరు క్యాంపు సందర్భంగా, ఒక విషయం జ్ఞప్తికి వస్తున్నది. ఒకరాత్రి వారికి విందుచేశానని పైన చెప్పియున్నాను. అతిథులలో నొకరు, తెలుగు ప్రాంతాలను గురించి, తెలుగువారిని గురించి మీ అభిప్రాయమేమిటని, శ్రీ క్లార్కును అడిగారు. "అరవ సిబ్బందితో తెలుగు జిల్లాలు బాగానే వుంట వన్నారు. తెలుగు ప్రజలు అంత పేచీకోరులు, బూటకులు కారు. ఒకటిచెప్పి, ఇంకొకటి చేయరు. కాని, తెలుగు ఉద్యోగస్థులు అసమర్థులు, సోమరిపోతులు అని నా అభిప్రాయం," అని చెప్పారు. తెలుగు ఉద్యోగస్తులు సోమరిపోతులు, అసమర్థులేగాక, తగాదాకోరులని, చీటికి మాటికి అవిధేయతను కనపరుస్తారని అప్పుడు కేంద్రమంత్రిగా వుండిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పుచుండగా నేను విన్నాను. తెలుగువాడు ఉద్యోగంలో ప్రవేశించినప్పటినుండి, పని ఎట్లున్నా, ప్రమోషన్ కావాలంటాడు. పని శ్రద్ధగాచేయడు. అవిధేయతను కనపరుస్తాడు. అతనికి దంభం జాస్తి...వగైరా చెప్పారు. తాను సాధ్యమైనంతవరకు అరవ ఉద్యోగులనే ఆదరిస్తానని, తెలుగువారిని అభిమానించి దగ్గరకు

తీస్తే, నెత్తి నెక్కికూర్చుంటారని అన్నారు. నా అనుభవంకూడా ఎంత కుత్సిత మనస్కులైనా, సాధ్యమైతే గోతులు త్రవ్వేవాళ్లైనా పనిలోను, వినయ విధేయతలలోను అరవలే మిన్న అని.

నా అనంతపూరు సిబ్బంది అంతంతమాత్రం. అసిస్టెంటు ఆఫీసరు (ఇన్‌స్పెక్టరు) ఉండేవాడుకాదు. హెడ్ క్లార్కు, పరసనల్ క్లార్కు కూడా గుర్తుకురావటంలేదు. అయితే వారు నా కెట్టి ఇబ్బందిని కలిగించలేదని మాత్రం గుర్తున్నది. నా ఆఫీసు అలవాట్లు మంచివికావు. పని ఎక్కువ వున్నప్పుడు ఇంటివద్ద తెల్లవారుఝామున 4 గంటలకే లేచి, 8 గంటలవరకు ఏకబిగిన పనిచేసేవాడను. ఈ ఉదయం పని నేను అసిస్టెంటు కమిషనరుగా వున్నప్పుడు తరచు చేస్తుండేవాడను. అసిస్టెంటు కమిషనరుగా వున్నప్పుడు ఇంచుమించుగా వేళకే ఆఫీసుకు వెళ్లేవాడను కాని, అనంతపూరువంటి చోట్ల చాలా ఆలస్యంగా వెళ్లేవాడను. దాని కొంత ఫలితం, చీకటిపడేవరకు కేసులు తనిఖీచేయటం. ఈ నా చెడ్డ అలవాటును నా గుమాస్తాలు, జవానులు సహించారు. వా రెట్టి అభ్యంతరాలు లేవనెత్తలేదు.

ఆలస్యంగా ఆఫీసుకు వెళ్లటమే గాక, మధ్యాహ్నం 2 గంటలుదాటే వరకు, మందకొడిగా వుండేవాడను. సాయంత్రం 4 గంటలు అయ్యేటప్పటికి, మంచి హుషారుగా పనిచేసేవాడను. మధ్యాహ్నం ఉపాహారం తీసుకొనేవాడను కాదు. కాని, బహుశా ఉదయం భారీగా తిన్న భుక్తాయాసం సాయంత్రం 4 గంటలకు గాని పూర్తిగా తగ్గిపోయేది కా దనుకొందును. ఏ కారణంచేతనైనా, అప్పటినుండి సవ్యసాచిలాగా పనిచేసేవాడను. ఇది గమనించిన పన్నుదారు డొకడు, "మీ ఆఫీసరుగారు జోరుగా వున్నారు, ఏమైన నిషాలు పుచ్చుకొన్నారా?" అని అడిగాడట. నేను ఆఫీసులోగాని, ఇంటిలోగాని ఎన్నడూ మత్తుపానీయాలను ఉంచేవాడను కాదు, త్రాగినదిలేదు. చివరకు సిగరెట్టువంటిది కూడా కాల్చనని పైన చెప్పియే యున్నాను. అయినా, ఆ పార్టీదా రట్లనుకొన టానికి నే నాశ్చర్యపడలేదు.

మామూలు సర్కిల్‌లో నలుగురు జవాను లుంటారు, అనంతపూరులోనూ అంతే. ఇక్కడ ఇద్దరు హిందువులు

శ్రీరాములు, నారాయణ, ఇద్దరు ముస్లింలు అమీన్, అల్లాబక్ష్. శ్రీరాములు తెలివిగలవాడు. నారాయణ తెలివి తక్కువవాడు కాదు కాని, భక్తి విశ్వాసాలకు మహమ్మదీయ జవానులే మెరుగుగా వుండేవారు. నా అనుభవంలో తురక నౌకర్లే మేలని.

అనంతపూర్ జిల్లా నైసర్గికాలను గురించి, కొంతవరకైనా పైన చెప్పియున్నాను. ఆ జిల్లా ప్రజలు కొన్నిప్రాంతాల్లో, కొంతవరకైనా, మోటుమనుష్యులు. కడప, కర్నూలు జిల్లాల ప్రజలవలె హత్యాకాండలకు వెరువనివారు కాదుగాని, కోర్టులకు పోవటంకంటె, కత్తివంటిదానిని వాడటమే సుకరం వారికి. ముక్కుకు సూటిగాపోయే రకం. తమకేదైనా అన్యాయం జరిగిందంటే చంపడానికి సిద్ధం. అట్టిసంఘటన నాకు గుర్తుకు వస్తున్నది. ఉరవకొండ సమీపగ్రామం పెద్దరైతు, కమ్మకులస్తుడు, నన్నొకరాత్రి భోజనానికి పిల్చాడు. భోజనంకంటె ఆ ప్రాంతం కమ్మవారెట్లుంటారో, వారిగృహాలు, భోజనాలు ఎట్లుంటవో అన్న కుతూహలంచేత, నా కప్పుడు బాగా పరిచయులైవుండిన శ్రీ పైడి లక్ష్మయ్యచౌదరి వకీలుగారితో కలసి, అనతిదూరంలో వున్న వారింటికి, నా కారులో వెళ్లాం. లక్ష్మయ్యచౌదరిగా రెందుకు ఉరవకొండలో వున్నారో గుర్తులేదు. ఆ రైతు లక్ష్మయ్యగారికి బంధువనుకొంటాను. లక్ష్మయ్యగారి ప్రోద్బలంకూడా కొంత వుంటుంది. మేము చీకటిపడి ఆ యింటికివెళ్లాం. అందుచేత పరిసరాలు బాగా చూడలేదు.

అనంతపూరు జిల్లాలో రైతులు తమ పశువులను ఇంటి ముందుచావడిలోనే కట్టుకొనే పద్ధతిని ఈ రైతుకూడా అవలంబించాడు. ఇల్లు మామూలు కొట్టంవంటి పెంకుటిల్లని గుర్తు. ఇంటిముందు వసారాలో మాకు భోజనం ఏర్పాటుచేశారు. వారి ఆడంగులను నేను చూచుట కవకాశం లేకపోయింది. ఒక రిద్దరు పిల్లలను చూచియుంటాను. భోజనం పూర్తి తృప్తిగా జరిగింది. దానికి కారణం కోడి మాంసంతోపాటు వరిగె అన్నం. వరిగె అన్నం తినటం అదేక్రొత్త. క్రొత్త ఒక వింతకదా! వరి అన్నంలో కంటె, వరిగె అన్నంలో కోడిమాంసం ఎక్కువ రుచనిపించింది.

మొత్తంమీద సంతోషంగా ఆ రైతుపెద్ద వద్ద సెలవుతీసుకొని బయలుదేరి వచ్చాం. తర్వాత 4, 5 మాసాలకు ఇంకొక క్యాంపుకు నా కారులో వెళ్లుచుండగా డ్రైవరు చల్లగా చెప్పాడు. "మీరా రాత్రి భోజనానికి వెళ్లారే, ఆయన్ను ఉరవకొండలో పట్ట పగలు 10½ గంటలకు నడిబజారులో పోస్టాఫీసు సమీపంగా, ఎవరో హత్య చేశారట" అని. ఆయనగారు బజారు గుండా వెళ్లుచుండగా, ఒకడు తరుముకు వచ్చాడట. ఒక ఇంటిముందు పశువులకు నీళ్లుపోసే పెద్ద పొడుగాటి తొట్టి వుందట. తరుముకు వచ్చినవాడు ఆ ఆసామిని పట్టుకొని తొట్టిలో పడవేసి, దగ్గర నున్న పెద్ద రాయితో, తల చిదకకొట్టేశాడట. ఇది విన్న నా మనస్సు వికలమైపోవటంలో ఆశ్చర్యమా!

దేవాదాయ, ధర్మాదాయ బోర్డుకు తర్వాతి కాలంలో కమిషనరు ఉద్యోగం సమర్థవంతంగా నిర్వహించిన శ్రీ పైడి లక్ష్మయ్యగారి ప్రస్తావన ఇంకొక టున్నది. ఏ క్యాంపులోనో గుర్తుకు రావటంలేదు. వారు నన్ను ఒక గ్రామ ప్రాంతంలో చిన్న కొండ లున్నచోటికి తీసుకొని వెళ్లారు. చెట్లతో నిండి యున్న పెద్ద గుట్టలవంటి ఆ చిన్న కొండలలో చాలా నెమళ్లుండి నవి. వానిని చూచి చాలా ఆనందించాను.

నేను నా ఇంగ్లండు విద్యతో నా పిత్రార్జితం పోగొట్టుకొన్నా, నా భార్య ఆస్తి దండిగానే వుండింది. అయినా పై చెప్పిన సందర్భాలవల్ల, ఆ ఆస్తి నా కప్పు డేమాత్రం అక్కరకు రాలేదు. నేను 1929 ఏప్రిల్ లో ఇన్ కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో చేరాను. 1931 మే నెల నుండి, సర్కిల్ ఛార్జిలో వుండినాను. అయినా 1936 జులై, ఆగష్టులో గాని మోటారుకారు కొనలేకపోయాను. అదైనా డిపార్టుమెంటునుండి 2,000 రూపాయలు అప్పు తీసుకొని కొన్నాను. ఆరోజుల్లో మామూలు మంచికారు సరిక్రొత్తది 3,500, 4,000 రూపాయలు మాత్రమే. అంత పెట్టటానికి కూడా నాకు శక్తి యుండలేదు. డిపార్టుమెంటువా రిప్పించింది 2,000 రూపాయలే కదా. సమయానికి 2,000 రూపాయలకు బెజవాడలో కారు కుదిరింది. అది 1934 సంవత్సరం ఫోర్డు వి 8. దానిని

బెజవాడలో లేడి అపాతెకరిగా వుండుచుండిన మిసెస్ హెలెన్ గారినుండి కొన్నాను. ఆమె భర్త మిలటరీనుండి రిటైరైన ఆఫీసరు. ఆయన స్వయంగా, అతి జాగ్రత్తగా కారును నడిపే వాడట. అందువల్ల కారు క్రొత్తదానివలె వుండింది. పైగా మిసెస్ హెలెన్ ఆస్పత్రికి తప్ప బయటకు వెళ్లేదికాదు. ఆ కారణం వల్ల అంతవరకు ప్రయాణం చేసింది 7 వేల మైళ్లకు లోపే. ఆమె దానిని 3,500 రూపాయలు పైచిల్లుక్కు కొన్నదట. భర్త ఆమెతో పోట్లాడి వెళ్లిపోయాడట. తిరిగి వచ్చే అవకాశం లేదట. పెట్రోలుకు ఎక్కువ ఖర్చుపెట్టే ఈ పెద్దకారు కంటె, ఒక చిన్న కారును కొంటే, తన కెక్కువ అనుకూలంగా వుంటుందని తలంచి అమ్మకానికి పెట్టిందట.

అదే నా మొదటి కారు. ఎంతో మురిపెంగా పెడసనగల్లు తీసుకొని వచ్చాను. డ్రైవరును బెజవాడలో మాట్లాడి, ముందుగా దానిని రోడ్డువెంట అనంతపురానికి పంపాను. నా కా కారు 11 సంవత్సరాలు పనిచేసింది. నేను బెజవాడలో 1940—1943 సంవత్సరాలు ఉద్యోగంలో వుండగా, పెళ్లిళ్లకని, పేరంటాలకని చేలకడ్డంగా, గట్లమీదుగా, ఇసుకప్రదేశాల్లో, చాలా మోటుగా దానిని వాడాను. 1934 ఫోర్డ్ వి 8 ఇంజన్ చాలా సమర్థవంత మైంది. దాని బాడి, మడ్ గార్డులు వగైరా మిక్కిలి మందమైన గట్టివి. ఆయుధపూజ నాడు దానికి పూజచేసి, ఫుట్ బోర్డు మీద కొబ్బరికాయను పగులగొట్టేవాళ్లం. చివరకు నెల్లూరులో 1947 లో 3,500 రూపాయలకు అమ్మివేశాను. 10,000 రూపాయలు పైచిలుకు పెట్టి ఫోర్డు సూపర్ డీలక్సు కొన్నాను. దాని తరువాత కారు డిసాటో. దానికి కొంత డిస్కౌంటు పోను, 21,000 రూపాయ లిచ్చాను. దానిని 1957 అక్టోబరులో ఒక కోయంబత్తూరు వకీలు గారికి, 10,000 రూపాయలకు అమ్మాను. చివరి కారు స్టాండర్డు 10. అది 1959 చివరలో ఒక అనర్థం తెచ్చిపెట్టింది. మేము గుంటూరు నుండి వస్తుండగా, మంగళగిరిలో రోడ్డు కిరుప్రక్కల దుకాణాల జనసమ్మర్దం ఉంటుంది. కుడి ప్రక్కనుండి ఒక బుడుతడు చప్పున దూసుకొనివచ్చి, కారు కడ్డం



అనంతపూరు ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్ - వీడ్కోలు

కూర్చున్నవారు : 1. శ్రీ రంగయ్య, 3. ఆడిటరు శ్రీ శెట్టి, 4. శ్రీ సుబ్బారావు, ఇన్‌కంటాక్స ఆఫీసరు, 5. గ్రంథకర్త, 6. శ్రీ శ్రీనివాసులు, 8. శ్రీ రెడ్డి నిలుచున్నవారు : 1. శ్రీ శ్రీరాములు

పడ్డాడు. సమీపించుచున్న కారును లగువుతో మూడువంతులు దాటి వెనక్కు తిరిగాడు. ఎడమప్రక్క మడ్ గార్డ్ తగిలి తల పగిలి చనిపోయాడు. వెనక్కు తిరుగకపోతే ఆ కాస్త దాటి పోయేవాడు. డ్రైవరు మద్రాసునుండి వచ్చిన తలబిరుసు చెంగల్పట్టు తెలుగు యువకుడు. నేను నెమ్మది, నెమ్మది, జాగ్రత్త, జాగ్రత్త అని చెప్పుచున్నా వినిపించుకోనక వేగంగా నడిపాడు. డ్రైవరును అరెస్టు చేసి లాకప్‌లో పెట్టారు. మేము నానా అవస్థలు పడి, వాని కొరకు కొంత డబ్బు ఖర్చుపెట్టి విడిపించాము. మ వ్మెరిగిన మంగళగిరివారు నిమ్మగడ్డ హనుమంత రావుగారు, మా దోనేపూడి వియ్యంకుడు శ్రీ వెనిగళ్ల బసవయ్య చౌదరి సాయంచేసినందున మా కెట్టి ఆటంకము కలగలేదు. ఇక ఉంచగూడదని ఆ కారును త్వరలోనే అమ్మివేశాము. అప్పటి నుండి నా వాడుకలో ఏ కారూ లేదు. టాక్సీలకు బోలెడు అద్దె అడుగుతారు. వయస్సుమళ్లినవాడను కనుక, పైగా చూపు తగ్గింది కాబట్టి, బస్సులో ఎక్కడికైనా వెళ్లాలంటే మిక్కిలి ఇబ్బంది పడుచున్నాను. సుఖ మనుభవించే యోగ్యత లేనివాడ నైనాను.

పైన చెప్పానుకదా, 1940 జనవరి నుండి నాలుగు నెలలు సెలవుమీద వెళ్లానని. సెల వెక్కడ గడిపేది? మొదట నివాస స్థలానికి వెళ్లాలి కదా. నా స్వస్థలం బొమ్మ్మలూరుకు నే నెప్పుడో దూరమైపోయాను. మంచో చెడో, కష్టమో సుఖమో వ్యవసాయ భూములున్న పెడసనగల్లుకు వెళ్లక తప్పదు. నేను 1936 లో వేసుకొన్న పాకను విడిచిపెట్టివేశాము. పైగా నా పెద్దకొడుకు చనిపోయిన సందర్భంగా కలిగిన సానుభూతి వున్నది. నేను సరిపెట్టుకొనే పద్ధతి అనుకూలంగా వున్నది. అందువల్ల మేము ప్రాత యింటికే వెళ్లాము, అక్కడే సెలవుకాల మంతా వుండినాము.

భూములు కౌలులోనే వుండినవి. వానికి మరమ్మతు కావలసి యున్నది. పైగా నిస్సారమై వున్నవి. అందువల్ల మెరక పల్లాలు

భాగుచేసుకోవటం, గట్లను బిగించుకోవటం, పాటిమట్టి వగైరా తోలుకొనడం వంటి పనులను నేను స్వయంగా దగ్గరుండి చేయించు కొన్నాను. మరిన్ని, మాకు ఇల్లు లేదుకదా. మాకు పంపిణీలో వచ్చి, నేను 1936 లో పాకవేసుకొన్న దొడ్డిని, ప్రాత యింటి ప్రక్క మాకు వచ్చిన చావడి దొడ్డి వగైరా మార్పిడిచేసుకొని కొంత, కొని కొంత విస్తరించుకొన్నాము. ముందు భాగాన్ని ఇంటికి గాను, వెనుక భాగాన్ని పశువుల చావిళ్లకు, వాములదొడ్డికి విభజించుకొని, ఇంటి భాగానికి ప్రహరీ కట్టాలని గోతులు తీయించాను. ఇంతలో ఊరివారిలో కొంతమంది గుసగుసలు పోయారు. సూరపనేని వెంకటరత్నంగారి కుమారుడు వెంకట సుబ్బయ్య వచ్చి, "మీరు గ్రామకంఠం కలుపుకొంటున్నా"రన్నాడు. నేనాశ్చర్యపోయి ఎక్కడన్నాను. ఈశాన్యమూల చూపించాడు. మాకు పంపిణీలో వచ్చిన గేటు దొడ్డికి ఉత్తరభాగాన, నా భార్య మేనమామలకు చెందిన స్థలాన్ని మేము కొనియుండినాము. దాని నానుకొని ఈశాన్యమూలగా ముందున్న స్థలం కొలది గజాలు గ్రామకంఠమట. అది అంతా 108 చదరపు గజాలు. దానిని మినహాయిస్తే తూర్పుగోడ గాని, ఉత్తరగోడ గాని సవ్యంగా కట్టటానికి వీలులేదు. ఒకముక్క కొరికివేసినట్లు బోసిగా వుంటుంది. నేను వెంకట సుబ్బయ్యను, ఆయనతో వచ్చిన ఇద్దరు ముగ్గురను రండి అని వెంట తీసుకొని రోడ్డువెంట బయలుదేరి కొంత దూరంలో వున్న మెట్టచేలోకి తీసికొని వెళ్లాను. అందరం కూర్చున్న తరువాత "గ్రామకంఠం విషయం నాకు తెలియదు. స్థలం కూచిపూడికి వెళ్లే రోడ్డుమీద వున్నది. గ్రామకంఠం అనే దంతా ఒకమూలనున్న ముక్కకదా! అది గ్రామానికి ఏమాత్రం ఉపకరించదుకదా! నేనాముక్కను విడిచిపెట్టి ప్రహరీ కడితే వికృతంగా వుండదా! రహదారి రోడ్డుమీద ఆ వికృతప్రాకారం గ్రామానికి అలంకారమా!" అని చెప్పి, ఆ స్థలం ఖరీదెంతుంటుం దని అడిగాను. వారిలో ఒకరు చదరపు గజం రు. 1 ఉంటుం దన్నారు. నేను రు. 2 చొప్పున ఇస్తానని చెప్పాను. వాళ్లు చాలా సంతోషించారు. ఆప్రకారం చీటీ వ్రాసి గ్రామ మునిసిఫ్

సూరపనేని పున్నయ్యగారివద్దకు పంపాను. ఆ ప్రస్తావన అంతటితో సమసిపోయింది.

గ్రామస్థులలో చుప్పనాతితనం ఎక్కువ. ఈ గ్రామంలో మరీ ఎక్కువ. ఈ గ్రామస్థుల మనస్థితి విచిత్రంగా వుంటుంది. ఏ పనిచేసినా, ఏది అమ్మాలనుకొన్నా వాళ్లాలోచించేది, ఆ పని మన కనుకూలమా, అది కొనటం మనకు లాభదాయకమా అని కాదు. ఆపని జరిగితే ఆ రెండో ఆసామికి లాభిస్తుందేమో, అతని వస్తువును కొంటే, అతని అప్పుతీరి సుఖపడతాడేమో అనే అసూయేగాని మనకు ఉపయోగం, లాభిస్తుంది అనే ఆలోచన లేదు.

దురాక్రమణవల్లనో, ఏ యితర కారణాలవల్లనో, సరిహద్దు చేనుగట్లు వంకరగా వుంటే, "తమ్ముడూ, ఈగట్లు చూడటానికి అసహ్యంగా వున్నాయ్ – మనము సరిచేసుకొందాం – నా కొక ప్రక్క కలిస్తే, నీ కొక ప్రక్క కలుస్తుందికదా. వ్యత్యాసం ఏమీ వుండదు, ఒకవేళ వున్నా, అతి స్వల్పం. హెచ్చు తగ్గులకు ముదరా కట్టుకొందాం" అని ఒకప్పుడు నా బంధువుకు చెప్పాను. అతడు "ఎందుకు లేవే, అట్టా వుండనివ్వే" అని, ససేమిరా వద్దన్నాడు. యోచనలేని రైతుల మనస్తత్వా లీ విధంగానే వుండేవి.

ఈ దొడ్డికి ప్రహారీగోడ కట్టించుట, లోపలి స్థలాన్ని సమ పరచటం వగైరా పనితో మిగతా సెలవుకాలం పూర్తి అయింది. ఇక్కడొక విషయం చెప్పాలి. ప్రహారీగోడకు ఇటుకరాయి తక్కువైతే పెదపూడి, పరుచూరి సీతారామయ్యగారివద్ద వున్న దని తెలిసి కబురంపగా, వారు అమ్మ నన్నారు. నేను స్వయంగా వెళ్లి వారిని బ్రతిమాలి, "నేను తిరిగి ఉద్యోగంమీద వెళ్లిపోవాలి. మీరు రాయి ఇవ్వకపోతే గోడ నిలిచిపోతుం"దని చెప్పగా, వా రేడెనిమిదివేలు ఇటుక నిచ్చారు. అప్పుడు ధర వెయ్యికి రు. 9 లు మాత్రమే. ఇప్పుడు వెయ్యి యిటుక రు. 80 నుండి రు. 100 వరకున్నదట. పైగా అప్పుడు మంచిమట్టితో ఇటుక తీసి, సవ్యంగా కట్టెలు వగైరాతో కాల్చేవారు. ఇప్పుడు ఏ చేనుమట్టైనా

వాడి, వడ్లఊకతో కాల్చి రు. 80 లు, రు. 100 లు. చెప్పు చున్నారు.

పై విధంగా సెలవు పూర్తిచేసుకొని 6-5-1940 తారీఖున బెజవాడ సర్కిల్ ఆఫీసరుగా ఛార్జి తీసుకొన్నాను.

బెజవాడ (ఇప్పుడు విజయవాడ) సర్కారు జిల్లాలకు గుండెకాయవంటిది. పరిశ్రమలు తక్కువైనా, వ్యాపారరీత్యా చెప్పుకో తగ్గదే—మరిన్ని, మద్రాసు, కలకత్తా, హైదరాబాద్, బందరు, గుంటూరు, గుంటకల్లు, హుబ్లి వగైరా ప్రదేశాలకు వెళ్లే రైలు మార్గాల కూడలి. ప్రక్కనే జీవనది కృష్ణ వున్నది. సుప్రసిద్ధ కనకదుర్గఅమ్మవారి గుడివున్నది. ఆంధ్ర సిమెంటుమిల్లు, చాలా రైసుమిల్లు లున్నవి. జనసందోహం జాస్తి. నిత్యం వేలజనులు బయటినుండి వస్తూ పోతుంటారు. పట్టణం మురికి కూపమైనా పరిసర ప్రాంతాలు, ఇంద్ర నీలాద్రి కొండల వరుసలు, చిన్న చిన్న గుహలు, పట్నం వెలుపలి విశాలమైన మైదానాల వంటివి కొంత ఆసక్తిదాయకమైనవే. నీటిపారుదల (పి. డబ్ల్యు) డిపార్ట్మెంటు కిది కేంద్రం. సూపరింటెండెంటు ఇంజనీరు వగైరా వుంటారు. సబ్ కలెక్టరు ఆఫీసున్నది. పోలీసు పెరేడ్ గ్రౌండు చెప్పుకోతగ్గది.

మా ఇన్కమ్టాక్స్ ఆఫీసు, రైల్వేస్టేషన్కు దగ్గర్లో మెనక్జి మేడలో వుండేది. క్రిందిభాగంలో మెనక్జిగారి కుమారుడు శ్రీ ఫిరోజ్ కుటుంబంతో నివసించేవాడు. మేడమీద ఇన్కమ్టాక్స్ ఆఫీసు, అసిస్టెంటు కమిషనరుగారి ఆఫీసు లుండేవి.

తండ్రి మెనక్జిగారు, రకరకాల ఫ్యాన్సి సరుకులు అమ్మే దుకాణాన్ని నడిపేవారు. నేను బెజవాడ ఉద్యోగములో వున్నప్పుడు కూడా ఆషాపు వుండేది. కాని, తండ్రి మెనక్జిగారు మృతిజెంది వుండినారు. వారి కుమారులలో ఒకరు శ్రీ జహాంగీరు దానిని నడుపుచుండేవారు. అయితే అప్పటి కది క్షీణదశలో వుండినది. క్రమేణ ఆ దుకాణాన్ని మూసివేసి జహాంగీరుగారు బొంబాయి కనుకుంటాను వెళ్లిపోయారు. శ్రీ ఫిరోజ్ కూడా వృద్ధిలోనికి వచ్చినట్లులేదు. ఆ పెద్ద మేడను ఎవరికో అమ్మి

వేశారట. ఈ మధ్య బెజవాడలో కనపడి, ఏదో కంట్రాక్టులు చేస్తున్నా నన్నారు.

తండ్రి మెనక్‌జిగారు చాలా వ్యాపార దక్షుడట. ఒకప్పుడు వారిషాపు మిక్కిలి ఉచ్ఛదశలో వుండేదట. వారు పాశ్చాత్య దేశాలనుండి సరుకులు తెప్పించేవారట. ఇంకొక విశేషం, జిబ్రాల్టర్‌నుండి శ్పానిష్ గ్రేప్సు (ద్రాక్ష) తెప్పించేవారని, మా కమిషనరు సెనెక్‌గారు ఆ షాపుకు వెళ్లేవారని విన్నాను. ప్రత్యేకించి ఆశ్పానిష్ ద్రాక్ష వారిని మిక్కిలి ఆకర్షించేదట.

మా అసిస్టెంటు కమిషనరు శ్రీ అబ్దుస్ సలామ్ సయ్యాద్ గారు నవాయితా ముస్లిమ్, అనగా మధ్యకాలంలో ఇండియాకు వచ్చి, స్థిరపడిపోయిన వారి సంతతివారు. ఈ నవాయితాలు చాలా స్ఫురద్రూపులు. మిక్కిలి అందమైనవారు. సయ్యాద్‌గారు, ఆర్కాటు నవాబు కుటుంబానికి, తమ మాతామహి ద్వారా బంధువులట. మాతామహి భర్త నవాబ్‌గారి వైదుకాంగ్ అట.

శ్రీ సయ్యాద్ ఇంటర్‌మీడియెట్ చదువుచూ మానివేసి గవర్నమెంటు ఉద్యోగిగా చేరారు. ఎక్సైజ్ అన్డ్ ఆబ్కారి డిపార్టుమెంటులో ఇన్‌స్పెక్టరుగా చేరినానని చెప్పారు. ఆర్కాటు నవాబుగారి సంబంధముండబట్టే ననుకొంటాను వారు సరాసరి గజెటెడ్ ఆఫీసరుగా చేరింది.

తరువాత 1925 లో ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటు జిల్లాలకు విస్తరింపజేయబడి నప్పుడు, గంజాం జిల్లాకు ప్రథమ ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగా నియమింపబడ్డారు. నేను 1940 మే లో బెజవాడకు వెళ్లినప్పుడు వారంతకు ముందు కొన్ని సంవత్సరముల నుండి బెజవాడలో అసిస్టెంటు కమిషనరుగా ఉండుచుండినారు. నేనక్కడకు చేరిన సంవత్సరాదికో కొంచె మెక్కువ కాలానికో అక్కడనుండి బదిలీపై మద్రాసుకు వెళ్లిపోయారు. మొత్తం 11 సంవత్సరాలు బెజవాడలో వుండినారట.

శ్రీ సయ్యాద్‌గారు కష్టజీవి. మిక్కిలి శ్రమపడి పనిచేసే వారు. ప్రతి చిన్నవిషయంకూడా శ్రద్ధగా చూచేవారు. పెద్ద

తెలివితేటలు కలవారు కాదు గాని, కార్యసాధన దీక్షాపరులు—సహజంగా వచ్చిన వైతేనేమి, మొదట ఎక్సైజ్ ఇన్‌స్పెక్టరుగా నేర్చుకొన్న వైతేనేమి, లేక ఇన్‌కమ్‌టాక్స్ ఉద్యోగ నిర్వహణ స్వభావంవల్ల కలిగినవైతేనేమి వారికి అనుమానం, కుయుక్తి ఉండేవి. అయినా చెడ్డవారు కాదు. కావాలని తన సిబ్బందికి గాని, ఇతరులకుగాని అన్యాయంచేసే స్వభావం కలవారు కాదు.

మతానుచరణ, నమాజ్ వగైరా నిష్ఠగా, శ్రద్ధగా చేసే వారు. అట్లని మతావేశపరులు కాదు. ఆ రోజుల్లో జాతీయభావం కనపరచేవారు. తర్వాత, అప్పటి నైజాం ప్రభుత్వ ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటు అధిపతిగా హైదరాబాద్‌లో వున్నప్పుడు, మత తత్వం బలిసిందని, జాతీయ వ్యతిరేక భావాల్ని ప్రస్ఫుటపరచే వారని విన్నాను. దీనికి కొంత కారణం వారి మిక్కిలి చక్కని పెద్దకుమార్తె నిచ్చి ఉత్తర హిందూస్థాన్ ముస్లిం యువకునికి పెండ్లి చేయటం, అల్లుడు పాకిస్థాన్‌కు వెళ్లిపోవటం, పైగా వారి ఇద్దరు కుమారులు పాకిస్తాన్‌కు వెళ్లిపోవటం అయి యుండ వచ్చును.

సయ్యీద్‌గారి, నా మధ్య బేదాభిప్రాయాలు కొన్ని వుండినా, అవి ఘర్షణకు దారి తీయలేదు. ఒకసారి మాత్రం నేను వారితో గట్టిగా మాట్లాడాను. ఏదో మనస్సు నొచ్చి, "నాకీ ఉద్యోగం శాశ్వతం కాదు. ప్రస్తుతానికి తలొగ్గాను. ఎప్పుడైనా వదలిపెట్టి వెళ్లేవాడనే" అన్నాను. వారు మనస్సులో ఏమను కొన్నారో గాని "అవును, మీ విల్లుకు రెండు నారు లున్నవికదా" అన్నారు. నాకు కొంత (భార్యా ద్వారా నయితేనేమి) ఆస్తి వుండటం, నేను బారిష్టరును అయి వుండటం వా రట్లు అనునట్లు చేసింది.

వారు అనుమానస్వభావం కలవారని పైన చెప్పి యున్నాను. నా నిజాయితీని వా రెన్నడు సందేహించలేదు. కాని మొగమాటం మనిషినని, కఠినంగా వర్తించి దోషులను దండించటానికి ప్రయత్నించనని వారి అభిప్రాయం. దొంగ లెక్కలను పట్టుకొనుటకు ప్రయత్నించనని, పన్నుదారు సరిగా

ఆదాయాన్ని చూపించటం లేదని రుజువుపరచే సాక్ష్యాన్ని సేకరించవని వారి గట్టి అనుమానం. దీనికి కారణం లేకపోలేదు. రావు బహాదర్ ఆలపాటి కుటుంబరావుగారు వైశ్యులు. మిక్కిలి బీదదశలోనుండి ఉన్నతస్థాయికి వచ్చినవారు. విరివిగా రైసు మిల్లింగు వగైరా వ్యాపారం చేస్తూండేవారు. వారు తప్పుడు లెక్కలు వ్రాస్తున్నారని, ఆదాయం చాలావరకు కమ్మీ చేస్తున్నారని శ్రీ సయ్యీదుకు ఎవరో అంటించారు. అందు మీద వారు నాతో "మీరు శ్రీ కుటుంబరావుమీద అకస్మాత్ తనిఖీ చేయం"డని నోటిమాటతో చెప్పారు. నాకు నాయంతట పోలీసువాని వలె ఒకరిమీద దాడిచేయటం యిష్టంలేదు. పైగా ఆ డ్యూటీ నాది కాదు. నా ఇన్‌స్పెక్టరుది. అందువల్ల, మిక్కిలి అనుభవజ్ఞుడు, సమర్థుడైన నా ఇన్‌స్పెక్టరు తుమ్మలపల్లి నారాయణరావుగారి నా పనికి నియోగించాను. ఆయన తనిఖీకి వెళ్లి విచారించి, ఆరోపణలు నిజంకాదని రిపోర్టిచ్చారు. అయినా నేను గుడివాడ క్యాంపుకు వెళ్లినప్పుడు, శ్రీ కుటుంబరావు తన ఆదాయాన్ని తగ్గించి చూపించుటంలో ఒక గుడివాడ స్త్రీకి సంబంధమున్నదని అనుమానముండినందున, గౌరవ కుటుంబానికి చెందిన ఆ స్త్రీని ప్రశ్నించి, యధార్థం లేదని తేల్చుకొన్నాను. ఈ సంగతులు శ్రీ సయ్యీద్‌గారికి చెప్పాను. వారు తృప్తి పడలేదు.

నేను ఎక్స్‌పార్టీ పన్నులు వేసేవాడనుకాదు. జరిమానాలు (పెనాల్టీలు) వేసేవాడనుకాదు. ఏవైనా అవకతవకలు కనపడితే చివాట్లు పెట్టి, కొంత ఆదాయం కలిపేవాడినిగాని, కఠినంగా పెనాల్టీలు విధించటానికి నా మనస్సు ఒప్పేదికాదు. మరిన్ని, పన్ను సకాలంలో కట్టకపోతే, పన్నుమొత్తమంత పెనాల్టీ వేయువచ్చును. ఇతర పెనాల్టీలవలె గాక, ఈ పెనాల్టీకి అప్పీలు లేదు. క్వచిత్‌గా తప్ప, ఈ కఠిన చర్యలకు నేను వ్యతిరేకిని. ఈ విషయం శ్రీ సయ్యీద్‌గారు ప్రస్తావించి, "మీ పన్నుదారు లంతా అంత న్యాయవంతులా? అంత సక్రమంగా నడుచుకొనే

వారా? మీరు దయాదాక్షిణ్యాలు చూపటానికా ఆఫీసరైంది?'' అని ఒకటి రెండుసార్లు కోపపడ్డారు. నేను పట్టించుకోలేదు.

వర్జీనియా పుగాకు కేసులు కొన్నివుండేవి. ఒక పెద్ద కేసులో (శ్రీ కాట్రగడ్డ అన్నదమ్ములు) పండించిన పుగాకుమీద పన్ను వేయమన్నారు. కృషిచేసి భూములలో పండించిన రైతులే, పచ్చి పుగాకును బారెనులలో వేడిగాలికి పండురంగు తెప్పించి, మాగబెట్టి అమ్ముకుంటారు. చేలో పచ్చి పుగాకు అమ్మరు. నిజానికది అమ్మకానికిరాదు. పచ్చి పుగాకును కొనేవారుండరు. ఏ చిన్న ఆసామైనా, బారెనులో మాగబెట్టుటకు శక్తిలేక కొద్దో, గొప్పో, ఎక్కడో, ఏపెద్ద ఆసామికో అమ్మటం జరగవచ్చునేమో గాని. అట్టి సందర్భాలు పన్నువేసే అంతటివి కావు. అందువల్ల నేను సయ్యాద్ గారితో ''చేలో పండించిన పుగాకుమీద పన్ను వేయటం అసబబు, చెల్ల''దని అంటిని. వారు ''కాదు కూడదు, అమ్మకం మొత్తంలో నుంచి, ఫ్లూ క్యూర్ (బారెన్లో పండు రంగుకు తెప్పించటం) వల్ల వచ్చే అధిక ధరను విడదీసి, దాని మీద పన్ను వేయవచ్చు''నన్నారు. ''మీరా విధంగా నాకు ఆదేశాలు ఇవ్వం''డన్నాను. వారు విపులంగా వ్రాసి పంపారు. వాని నాధారంగా పన్నువేశాను. పన్నుదారుడు హైకోర్టు వరకు వెళ్లి, అక్కడ నెగ్గాడు.

అయితే, తన అభిమానాన్ని, అభిప్రాయాలను ఆఫీసరు తలమీద రుద్దే స్వభావం కలవారు కాదు. ఒకసారి బెజవాడలో రైల్వే మెడికల్ ఆఫీసరుగా వుండుచుండిన, డాక్టరు ఇ. సోమశేఖరంగారు శ్రీ సయ్యాద్‌గారివద్దకు వెళ్లి, ''నా ప్రైవేట్ ప్రాక్టీసు ఆదాయాన్ని చూపించండని నోటీసువచ్చింది. మీరు పిలిచి ఆఫీసరుకు చెప్పం''డని, వారికున్న స్నేహాన్ని పురస్కరించుకొని వారిని కోరాడట. అసిస్టెంటు కమిషనరుగారు ''మీరు వెళ్లి ఆఫీసరుకు సమాధానం చెప్పం''డని నావద్దకు పంపారు. రైల్వే డాక్టర్లకు పన్నువేసేది స్థానిక ఆఫీసరుకాదు. అయితే, పన్ను విధించే ఆఫీసరుకు స్థానిక ఆఫీసరు రిపోర్టు పంపాలి.

ఏదో ఒక పెద్ద కేసులో "మీరు డ్రాఫ్ట్ ఆర్డరు నాకు చూపించి, ఫైనల్ ఆర్డరు పాసు చేయండి" అని, శ్రీ సయ్యాద్ గారు నాకు నోటిమాట చెప్పారట. ఆ సంగతి మరచిపోయో, లేక వట్టి నోటిమాటనో, నేను వారికి చెప్పకుండానే కేసు పూర్తిచేశాను. తర్వాత కొన్నిరోజులకు వారిని కలసికొనటం తటస్థించింది. వారు చిరునవ్వుతో, "మీరా కేసును నా సంప్రదింపు లేకుండానే పూర్తిచేశారుకదా!" అన్నారు. నేను చకితుడనై "మరచిపోయి యుంటాను. బుద్ధిపూర్వకంగా పై అధికారిని తిరస్కరించ"నన్నాను. వారు తిరిగి ఏమీ అనలేదు.

నా అనుమానం, నా కాన్ఫిడెన్షియల్ రికార్డులో అంత అనుకూలంగా వ్రాసి ఉండలేదేమో అని. అయితే స్నేహ పూర్వకంగా, మర్యాదగా వుండేవారు.

వారు పై అధికారులయందు మిక్కిలి వినయ విధేయతలతో వుండేవారు. ఇది వారి వంశ సంప్రదాయం కొంత అయి వుంటుంది. నవాబులముందు, దగ్గర బంధువులు కూడ సలాములు కొట్టుచూ, అణగిమణగి వుండే ఆచారంకదా! పైగా, అధికారుల మనస్తత్వాన్ని ఆకళింపుజేసుకొని, తనకేది లాభిస్తుందో అను దూరాలోచనా పరులైన సయ్యాద్ గారికి, వినయ విధేయతలు సహజమే కావచ్చును. అయినా, వారు కూడా పెద్ద హోదాలోనే వుండి నారు కదా! అందువల్ల వారు పై అధికారుల ముందు నడుచు కొన్న తీరు నా కప్పుడు కొంత ఆశ్చర్యాన్ని, ఏహ్యాన్ని కలిగించేది. ఉదాహరణకు, అప్పటికి అప్పిలేట్ ట్రిబ్యునల్‌ను ఏర్పాటు చేయటం గాక, సెంట్రల్ రివిన్యూ బోర్డుకు అనుబంధంగా, ఇన్ స్పెక్షన్ డైరెక్టరును నియమించారు. మొదటి డైరెక్టరుగా శీతల్ ప్రసాద్ అనే వారిని, ఇండియా ప్రభుత్వం నియమించింది. ఈయన ఉద్దండుడు. లెక్కలలో అతి నిపుణుడు. పైగా దుందుడుకు మనిషి. ఆయనకు ట్రయల్ బాలెన్సు అన్నా, బాలెన్సు షీటు అన్నా సవ్యసాచిత్వ నైపుణ్యం. నాకు లెక్కలు మొదటినుండి అంతంతమాత్రం. వీనిలో నా బుర్ర మిక్కిలి మందంగా పని చేస్తుంది. ఆయన నామీద రామబాణాల వలె ప్రశ్నలు కురిపించి, తికమక చేశాడు. తనవద్ద ఫైలు పెట్టుకొని అందులోని ట్రయల్

బాలెన్సు వగైరా చూపించినట్లు చూపిస్తూ, వెంటవెంటనే అడిగిన ప్రశ్నలకు నేను సరిగా సమాధానం ఇవ్వలేకపోయాను. ఆయన నిరసనగా మాట్లాడాడు. నాకు చిర్రెత్తి, "అయ్యా, నేను విద్యార్థికుడను. బారిష్టరునే గాక, ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేటును. నిజాయితీపరుడను. కష్టపడి పనిచేసేవాడను. నన్ను మీరు నిరసించకూడ"దని గట్టిగా చెప్పాను. మా ముందు కాళ్లు చేతులు ముడుచుకొని, వణుకుచున్నట్లుగా కూర్చొని వుండిన సయ్యాద్‌గారు కిక్కురుమనలేదు. నన్ను కొంతవరకైనా సమర్థించు ఒక్కమాటైనా మాట్లాడలేదు. నే నెట్లయి పోయినా, తన భవిష్యత్తుకు శ్రీ శీతల్‌ప్రసాద్‌గారి ప్రసన్నభావం తనకు కావాలి.

నేను బెజవాడ సర్కిల్‌కు వెళ్లినప్పటికి, ఆఫీసరును నేనొక్కడనే. అసిస్టెంటు కమిషనరుగారు కూడ ఒక్కరే. వారు ఆఫీసర్ల పని తనిఖీ చేయటమేగాక, అప్పీళ్లను కూడా పరిష్కరించేవారు. శీతల్ ప్రసాద్‌గారు బెజవాడకు వచ్చేటప్పటికి, అసిస్టెంటు కమిషనరు ఉద్యోగ విధులను రెండుగా విభజించి, అప్పీళ్లు వినటానికి ఇంకొక అసిస్టెంటు కమిషనరును నియమించారు. క్రొత్తగా వచ్చినవారు శ్రీ కె. గోవిందనాయర్‌గారు. ప్రక్కగదిలోనుండి నామాటలను వినిన శ్రీ నాయర్‌గారు తర్వాత, "సెబాసు, గట్టిగా సమాధానం చెప్పా"రని నవ్వుతూ అన్నారు.

శీతల్ ప్రసాద్‌గారిని చూడటానికి వారు రాత్రి రాగా, మరునాటి ఉదయం, వా రుండు చుండిన ఇన్‌స్పెక్షన్ బంగళాకు వెళ్లాను. "వా రేదో పనిమీద వున్నారు. ఉండం"డని వారి చప్రాసి (పంజాబీ తలగుడ్డతో, మంచి దర్జాగా వున్నాడు) చెప్పాడు. అరగంట వేచియుండినా, ఇంకా ఏ స్నానగదిలోనో వున్నట్లు చెప్పాడు. ఇక నే నుండటాని కవకాశంలేదని వెళ్లిపోయాను. వీడు, నా మీద పుల్లింగాలు చెప్పి, శీతల్ ప్రసాద్‌గారికి నా మీద కోపం తెప్పించాడేమో అని నా అనుమానం.

ఈ శీతల్ ప్రసాద్‌గారినే తప్పుడు లెక్కలు వ్రాయించాడని, గవర్నమెంటును మోసగించాడని కేంద్ర ప్రభుత్వం సాగదీసింది.

అప్పటి కాయన గవర్నమెంటు ఉద్యోగం మానుకొని, ఒక పెద్ద బొగ్గు కంపెనీలో చేరాడు.

శ్రీ సయ్యాద్‌గారి కాలంలోనే, క్రొత్తగా ఏర్పడిన ఇన్‌కమ్‌టాక్స్ అప్పిలేటు ట్రిబ్యునల్ బెజవాడకు వచ్చింది. ఇద్దరు సభ్యులు. ఒకరు లా తెలిసినవారు. రెండవవారు లెక్కలు తెలిసినవారు. లా కు వర్మ అనే ఉత్తర భారతీయుడు, లెక్కలకు బొంబాయిలో ప్రాక్టీసు చేస్తూండే ప్రముఖ ఆడిటర్ శ్రీ పి. యస్. అయ్యరుగారు. వీ రిద్దరు ప్రథమ ట్రిబ్యునల్‌కు నియమింపబడ్డారు. వర్మగారి న్యాయశాస్త్ర ప్రవీణత ఎంతో గాని, వారి పోజులు జాస్తి. మనిషి మంచివాడుగానే తోచాడు. కాని, తన గొప్పతనాన్ని ఇతరులు గుర్తించాలని ఆశించేవాడు. తనకీ ఉద్యోగం వచ్చినప్పుడు తాను ప్రాక్టీసు చేస్తూవుండే హైకోర్టు చీఫ్ జస్టిస్‌ను చూడటానికి వెళ్లగా, ఆయన తన్నెంతో అభినందించి, మీ ఉద్యోగం హైకోర్టు జడ్జి పదవి కంటె గొప్పదని అన్నాడని చెప్పాడు. శ్రీ అయ్యర్ మంచి హుషారు మనిషి. మిక్కిలి తెలివితేటలు కలవాడు. త్వరితగతిని పనులు జరిపేవాడు. ఇద్దరూ స్నేహభావంతోనే మెలిగారు గాని, శ్రీ వర్మది తెచ్చిపెట్టుకొన్నట్లుండేది. శ్రీ అయ్యర్‌ది పొంగి పొరలి వచ్చినట్లుండేది.

వీరు మూడు రోజు లనుకుంటాను, బెజవాడలో క్యాంపు చేసింది. వర్జీనియా పుగాకు అప్పీల్సు కూడా వీరు విన్నారు. చేలో ఉత్పత్తిచేసిన పచ్చి పుగాకును ఏవిధంగా క్యూర్ (తయారు) చేస్తారో, అసలా బారెన్లు ఎట్లుంటవో తెలిసికొనా లని రెండు మూడు బారెన్లు స్వయంగా వెళ్లిచూచారు.

క్రొత్తగా పెట్టిన స్కీములో మొదటి దఫా ఏర్పడిన బెంచి కాబట్టి, అక్కడక్కడకు వెళ్లి అప్పీల్సు విన్నారు. పిమ్మట, కమిషనరు ఉండే ప్రధాన పట్టణంలో ఇట్టి బెంచీలు స్థిరపడి, అప్పీల్సును వినుచున్నారు. వీరు వినేది సెకండు అప్పీల్సు. అనగా, అప్పిలేటు అసిస్టెంటు కమిషనరుగారి తీర్పుల మీద చేసుకొన్న రెండో అప్పీల్సును వీరు వింటారు. వీరి తీర్పులమీద అప్పీలు

హైకోర్టుకు. హైకోర్టు, లా ఉంటేనే గాని, అప్పీలు చేబట్టదు. అప్పిలేట్ ట్రిబ్యునల్ లా, ఫాక్టు (విషయం) రెంటిని విచారిస్తారు.

శ్రీ అబ్దుల్ సలామ్ సయ్యాద్‌గారు, బదిలీపై వెళ్లిపోయిన తర్వాత శ్రీ హుస్సేన్ చిడా అనే వారు ఇన్‌స్పెక్టింగ్ అసిస్టెంటు కమిషనరుగా వచ్చారు. వీరు కూడా నవాబులే. తెలుపు ఎరుపుతో అందంగా ఉండేవారు. తన అందాన్ని మిక్కిలి జాగ్రత్తగా పోషించుకొనేవారు. వారి తలవెంట్రుకలు వయస్సుచేతనో, అకాలంగానో కొంతకు కొంత నెరిసినవి. నెరిసింది కప్పిపుచ్చటానికి వెంట్రుకలకు రంగు వేసేవారు. అవి బయటికి నల్లగా నిగనిగలాడుచుండేవి. ఒక ఉదయం వారిని చూడటానికి వారు కాకినాడకు క్యాంపుకు వచ్చినప్పుడు వెళ్లగా, అప్పుడే స్నాన గదినుండి వచ్చారు. తల నెరసినట్లు అప్పుడుగాని తెలియలేదు.

శ్రీ చిడాగారు తెలివితేటలుగల సమర్థుడే. అయితే కొంత తొందరపాటు మనిషి. మర్యాదగా స్నేహభావంతో వుండేవారు గాని, వారికి చప్పున కోపం వచ్చే స్వభావ ముండింది. నామీద అట్టి కోప మెప్పుడూ చూపలేదు గాని, తన సిబ్బంది కొంత చవి చూచింది. అయినా, ఆయన ఎవరికీ అపకారం చేసినట్లు లేదు. బెజవాడలో వారు సవ్యంగానే, మర్యాదగానే ఉద్యోగ నిర్వహణం చేశారు.

వారు బెజవాడలోని ఆఫీసర్లను ప్రోత్సహించి, ఆఫీసర్ల క్లబ్బును స్థాపించారు. వారు దాని ప్రథమ అధ్యక్షులు. నావంటి వారు ప్రథమ (స్థాపిత) సభ్యులు. వారు అందరాఫీసర్లతోనూ, మిక్కిలి స్నేహభావంతో మెలిగేవారు. ఆఫీసర్లకు వారందభిమానం వుండేది. చిడాగారికి చీట్లపేక ఇష్టం. ప్రతి సాయంత్రం తప్పకుండా క్లబ్బుకు వెళ్లటం, చీట్లపేక ఆడటం పరిపాటి. నే నప్పుడప్పుడు వెళ్లుచుండేవాడను. చీట్లపేకాటలో పాల్గొనటం అరుదు.

చిడాగారు త్రాగినట్లు నాకు గుర్తులేదు. వారసలు త్రాగే వారే కాదని నా అభిప్రాయం. స్త్రీ వాంఛాపరు లని అనుమానం. కాని, నే నెక్కడట్టి సందర్భం వినలేదు. వారు పురుషత్వాం అభివృద్ధి కొరకు ఇన్‌జెక్షన్లు తీసుకోవటం నాకు తెలుసు.

వారు పెద్దస్థాయి ముస్లిమ్ అయినా, వారి భార్యకు ఘోషా వుండేది కాదు. ఆమె మేలిముసు గైనా వేసుకొనేదికాదు. అందరికి కనబడేది. శ్రీ సయ్యాద్‌గారి భార్యను అదాటున ఒకసారి మాత్రం చూచాను. చిడాగారింటికి వెళ్లినప్పుడల్లా వారి భార్య కనపడేది, మాట్లాడేది.

చిడాగారికి కూడా ఆఫీసర్లలో కొంతమంది మీద ఎక్కువ అభిమానం వున్నట్లు గ్రహించాను. నా విషయంలో వ్యతిరేక భావం లేకపోయినా, మొత్తంమీద అభిమానం తక్కువే అనుకొంటాను. నాకు ప్రమోషన్‌లో ఆటంకం వస్తుందని, వారికి ముందే తెలిసియుండిం దనుకొంటాను. అందువల్ల చివర దశలో ఎక్కువ అభిమానం, తన కాకినాడ సర్కిల్ తనిఖీలో చూపించారు. చిడాగారి కాలంలో నాకు ఉద్యోగరీత్యా ఎట్టి సలహాలు, అభ్యంతరాలు, ఆటంకాలు రాలేదు. నా పనేదో నేను చూచుకొనేవాడిని. వారి కాలంలో నా బెజవాడ ఛార్జిని తనిఖీ చేసినట్లుకూడా గుర్తులేదు.

బెజవాడపట్టణం కేసులలో కొన్ని పెద్దవేగాని, అంత క్లిష్టమైనవి కావు. వ్యాపారమున్నా, విదేశ వాణిజ్యం లేదనే చెప్పాలి. రైసుమిల్లులు, ఒక్కసిమెంటు ఫ్యాక్టరీ తప్ప, పరిశ్రమలు లేవు. సిమెంటు ఫ్యాక్టరీ లెక్కలు బెజవాడ ఆఫీసరు తనిఖీ చేసేవాడని గుర్తులేదు. రైసుమిల్లు లెక్కలలో తప్పులు, దాపుళ్లు వుండే వనటానికి సందేహించవలసినది లేదు. అలాగే, ఇనపకొట్లు, బట్టలషాపులు వగైరా, ముక్కుకు సూటిగా ఆదాయాన్నంతా బయటపెట్టేవారని అనుకోను. ఒక పెద్ద రైసు మిల్లు చాలా కమ్మీ చేస్తుండినదని వాడుక. కాని, సాక్ష్యాధారం దొరకలేదు. ఇక బట్టల విషయంలో చెప్పటం కష్టం. 1942 నవంబరు నుండి, ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఉదయం వున్న ధర సాయంత్రానికి పెరిగేది. రాత్రి వున్న ధర కంటె మరునాటి ఉదయం ధర ఎక్కువ. వర్తకులు రోజుకు ఒకటి రెండు సార్లైనా ధరల చీటీలు మార్చేవారట. బట్టల వర్తకులు విపరీత లాభాలు సంపాదించారు. అయితే ఈ లాభాలు 1943-44

మదింపుకుగాని రాలేదు. నేను 1943 జూలై రెండో వారంలో కాకినాడకు బదిలీ మీద వెళ్లిపోయాను.

శ్రీ కె. గోవిందనాయరుగారు బెజవాడలో అప్పీల్సు అసిస్టెంటు కమీషనరుగా కొద్దికాలమే వుండి, బదిలీ అయిపోయారు. వారి స్థానే, నేను బరంపురంలో ఎరిగివుండిన శ్రీ కె. రామస్వామి అయ్యంగారు వచ్చారు. వారి ప్రధాన స్థానం అప్పుడు బెజవాడ కానట్లున్నది. రాజమండ్రి అయి యుండవచ్చును. వారు క్యాంపుకు వచ్చి యుండిరి. నేను సాయంత్రంవరకు ఆఫీసులో పనిచేసి, ఇంటికి వెళ్లుటకు సిద్ధమై వుండగా, శ్రీ అయ్యంగారు "ఇక్కడేదో పారిశ్రామిక ప్రదర్శనం జరుగుచున్నదట, వెళదాం రండి" అన్నారు. నేను వారితో వెళ్లి 9 గంటల వరకు గడపి, ఇంటికి చేరుకొన్నాను. ఇంటికి వచ్చేటప్పటికి డాక్టరు రామచంద్ర రావుగారు మా బంగళాలో భోజనం ముగించుచున్నారు.

నేనంతకు రెండు రోజులు ముందు, వారిని ఆ రాత్రి భోజనానికి ఆహ్వానించాను. వారంగీకరించారు. డాక్టరు రామచంద్ర రావుగారు నేనుండుచుండిన బంగళా యజమాని కానన్ అనంతంగారి కుమారులు. విద్యాధికులు. ఇంగ్లండులో చదువుకొన్నారు. ఇ. యన్. టి. వైద్యంలో నిపుణులు. పైగా మిక్కిలి పెద్దమనిషి. నిజాయితీ పరులు. సాత్విక స్వభావం. సేవానిరతి కలవారు. నేను ఆఫీసుకు బయలుదేరేముందు, నా భార్యతో సంప్రదించి, వంటవానితో ఏమేమి వంటకాలు చేయాలో చెప్పి, పెందలకడనే తిరిగి వస్తానని చెప్పి వెళ్లాను. కాని, ఆ విషయం మరచిపోయి శ్రీ రామస్వామి అయ్యంగారితో వస్తుప్రదర్శనంలో కాలం గడపాను. తీరా భోజనం చేస్తున్న డాక్టరు రామచంద్రరావుగారిని చూచిన గాని, నా మరపు తెలియలేదు. డాక్టరు రామచంద్రరావుగారికి క్షమాపణలు చెప్పుకొన్నాను. నా భార్య మందలింపులకు తలొగ్గాను. డాక్టరు రామచంద్రరావుగారు చిరునవ్వుతో, ఇటువంటివి సంభవిస్తుంటవని, తన దగ్గరబంధువురాలు శ్రీమతి సుబ్బారాయుడుగారొకసారి ఈ విధముగానే విందునకు పిలిచి, మరచి

పోయింది. తీరా ఆహ్వానితులు వచ్చేవరకు జ్ఞాపకంరాలేదు, అని నన్ను ఆశ్వాసించారు. కాని వారిని తీసుకొనివచ్చిన వారి ముస్లిం కాంపౌండరు కోపం పట్టలేక, "ఎప్పుడైనా, ఎవరికైనా విందుచేసినట్లుంటే, ఈ విధంగా జరగ" దని అన్నాడు. నేను లజ్జతో తల వంచుకోవలసి వచ్చింది. మరునాడు శ్రీ అయ్యం గారితో జరిగింది చెప్పాను. వారు విచారం వ్యక్తపరచారు.

ఈ సందర్భంలో నాకు కలిగిన ఒక అనుభవం గుర్తుకు వస్తున్నది. నే నొకసారి ఒక బారిష్టరు గారిని, వారి భార్యను విందుకు పిలిచాను. వారు వైశ్యులు. వారి భార్య కాపు, లేక బలిజ కులస్తురాలు. వారి భార్య అనుమానంగా చెప్పిందిగాని, మొత్తంమీద ఇద్దరూ వస్తారనే ఘనంగా వంట చేయించాను. ఉదయం 11 గంటల నుండి, వారు వస్తారని ఎదురుచూచు చుండి నాను. 12 గంటలు దాటింది. 1 గంట దాటింది. 2 గంట లైంది. వారు రాలేదు. వారి కోసం నౌకరుని పంపాను. వా రెక్కడకో భోజనానికి వెళ్లారట అని, అతడు వచ్చి చెప్పాడు. చేసిన భోజన పదార్థాలు పస చెడటమేగాక, నేను కడుపు మాడ్చుకోవలసి వచ్చింది. వృథా ఖర్చు. వేళమించిన భోజనం వల్ల అనారోగ్యం. నిజానికి విందుకు వస్తానని రాకపోవటం, ఏ పెద్ద మనిషి చేయవలసిన పనికాదు. తీరా రాలేకపోతే, సకాలంలో కబురు చేయాలి. అతిథేయుణ్ని మాడ్చకూడదు.

నేను డాక్టరు రామచంద్రరావుగారి యెడ చేసిన అపచారం, నా భార్య దగ్గరుండి, వారిని భోజనం చేయించింది కాబట్టి, కొంత వరకు ఉపశమనమైంది.

నా ఆఫీసులో, బరంపురంలో ఇన్‌స్పెక్టర్ (అసిస్టెంటు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు) గా నావద్ద పనిచేసియుండిన శ్రీ కె. సూర్యారావు హెడ్ క్లార్కుగా కొంతకాలం ఉండినారు. ఆయన సెలవుమీద వెళ్లగా, వారి స్థానంలో పరసనల్ క్లార్కు అమీ రుద్దీనును హెడ్ క్లార్కుగా నియమించి, టైపిస్టుగా వున్న శ్రీ ఇమ్మానేని వెంకటేశ్వరరావును పరసనల్ క్లార్కుగా నియ

మించాను. శ్రీ వెంకటేశ్వరరావు తన కదే ప్రథమ ప్రమోషనని చాలా సంతోషించాడు. ఆయన భార్య మా యింటికి వచ్చి, నా భార్యకు కృతజ్ఞత తెల్పి వెళ్లింది. ఆ రోజుల్లో కొలదికాలానికే అనుకోండి. ఆఫీసరు మాత్రమే అయిన నేను, హెడ్ క్లార్కు ప్రమోషను ఇవ్వగలిగాను. ఈరోజుల్లో కమిషనరైనా, చివరకు ఒక్క జవానునుకూడా, తనంతట తాను నియమించలేడు. ఒకనిని జవానుగా తీసుకోవాలంటే, దాని కేదో కమిటీ వుంది. అలాగే గుమాస్తాలను, ఇన్‌స్పెక్టర్లను నియమించటానికి వేర్వేరు కమిటీ లున్నవి. ఆ స్వేచ్ఛ, ఆ అధికారం ఈరోజుల్లో సున్న.

శ్రీ ఇమ్మానేని వెంకటేశ్వరరావు పెద్ద స్థాయి కుటుంబానికి చెందినవాడు. ఆయన పితామహుడు శ్రీ సీతారామస్వామి నాయుడుగారు ఆ రోజుల్లో డిప్యూటీ కలెక్టరైనారు. తండ్రి శ్రీ నరసింహారావునాయుడుగారు కూడా, డిప్యూటీ కలెక్టరు ఉద్యోగం చేశారు. వారి తల్లి, రావు బహదర్ శ్రీ పాకల శ్రీకృష్ణపాత్రుడు గారి కుమార్తె. వారి భార్య, రావు బహదర్ శ్రీ పి. నారాయణరావుపాత్రుడుగారి ఏకైక సంతానం. ఆయన బి. ఎ. డిగ్రీని పొంది లెక్కలలో ఒక పరీక్ష పాసయినాడు. కొన్ని సంవత్సరాల తర్వాత, శ్రీ వెంకటేశ్వరరావునాయుడు (ఇ. వి. రావునాయుడు) అసిస్టెంటు కమిషనరుగా కటక్ మొదలైన చోట్ల ఉద్యోగధర్మం నిర్వహించి, రిటైరై, బరంపురంలో స్థిర నివాసమేర్పరచుకొని ఈమధ్యనే చనిపోయారు. నేను వారికి ప్రథమ ప్రమోష నిచ్చానని, ఎల్లప్పుడు కృతజ్ఞత చూపుచుండే వారు. నా ఉద్యోగ విరమణానంతరం, నేను భువనేశ్వరం సమీపంలో నున్న బరాంగులోని ఒరిస్సా ఇండస్ట్రీస్ లిమిటెడ్ కంపెనీకి ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా నామినీ డైరెక్టరుగా 1962-64 సంవత్సరాలలో వుండినప్పుడు, చివర సంవత్సరం, 1964 మార్చిలో వారిని కటక్ వెళ్లి చూచాను. వారి సతీమణి విదుషీమణి, కవయిత్రి. వా రుభయులతో కొన్నిగంటలు గడిపాను. చురుకైన అందంగల వా రిద్దరి కుమార్తెలను చూచి సంతోషించాను. తరువాత వారిని కలసికొనలేదు.

అంతకుముందు వారి పెద్ద కుమార్తె వివాహం హైదరాబాదులో జరిగినప్పుడు, అప్పు డేపనిమీదనో హైదరాబాదులో ఉండినాను. ఆ సందర్భంగా చాలా సంవత్సరాల నుండి చూడని, శ్రీ సయ్యాద్ గారిని పెండ్లి జనసందోహంలో దూరమునుండి చూచాను. వెళ్లి కలుసుకోందా మనుకొను చుండగా వారు లేచి వెళ్లిపోయారు. కొంతమంది ప్రాత పరిచయులను, పెద్ద ఉద్యోగులను కలసికొన్నాను. వారిలో రివిన్యూబోర్డు ప్రథమ సభ్యుడుగా వుండిన, శ్రీ ఉన్నితన్, ఐ. సి. యస్. గారిని చాలాకాలానికి చూచి వారితో పరిచయాన్ని పునరుద్ధరించుకొన్నాను. శ్రీ వెంకటేశ్వరరావు వియ్యంకుడు, శ్రీ అప్పారావు ప్రభుత్వ సెక్రటేరియట్‌లో, అండర్ సెక్రటరీగా పని చేసి యుండినారు. అందువల్ల ప్రభుత్వోద్యోగులు చాలామంది హాజరైనారు.

పరసనల్ క్లార్కు శ్రీ అమీరుద్దీను మొత్తంమీద విశ్వాసంతో వుండేవాడు. కొంత అభిమానం కూడా వుండేది. ఏదైనా స్వంతపని చెప్పితే చేసిపెట్టేవాడు. అయితే అసిస్టెంటు కమిషనరు మహమ్మదీయుడైనందున, కొంత డంబం వుండేదేమో అని ఒకటి రెండు సార్లు నాకు తోచింది.

కొలదికాలానికే శ్రీ ఇ. వెంకటేశ్వరరావు బదిలీ అయి వెళ్లిపోయాడు. రంగనాయకులనే అతను, టైపిస్టుగా వచ్చాడు. ఇతడు కాపు కులస్తుడు. పని సుమారుగా వుండేది. కాని, వట్టి దురహంకారి. ఎదురు తిరగటానికి సిద్ధంగా వుండేవాడు. అతనిని సహనంతో, మెలకువతో జాగ్రత్త పెట్టవలసి వచ్చేది. మొదట దురుసుగా నడచుకొన్నా, తర్వాత త్రోవకు వచ్చాడు. ఎక్కడో కనపడగా అతి మర్యాదగా, అభిమానం కలవాని వలె యోగ క్షేమాలు అడిగాడు.

జవానుల్లో ముత్రాసి కులస్తుడు వెంకట్రామయ్య పెద్ద మనిషి తరహా. సేవాధర్మం బాగా తెలిసినవాడు. ఏ పని నే విధంగా చేయాలో గ్రహించే తెలివితేటలు కలవాడు. నా కెప్పుడూ లోటు చేయలేదు. అతడు పెద్ద జవాను. కడమ జవానులు

చాకలి శ్రీరాములు, క్రిస్టియన్ మరియప్ప, ఒక మహమ్మదీయుడు (పేరు గుర్తుకురావటంలేదు) ఉండేవారు. ఈ నలుగురిలో శ్రీరాములు నాకు మిక్కిలి దగ్గరవాడైనాడు. వినయ విధేయతలు మూర్తీభవించిన వ్యక్తి. ఏ పని చెప్పినా, ఒప్పు తప్పు లేకుండా పత్యక్ష్యమయ్యేవాడు. చాలా మంచివాడని చాలాసార్లు అనుకొన్నాను.

పాపం వెంకట్రామయ్య, మరియప్ప నేను బెజవాడ విడిచిన కొలది సంవత్సరాలకే గతించారు. శ్రీరాములు రిటైరై వున్నాడు. ఈమధ్యనే వానిని విజయవాడలో చూచాను. నా తమ్ముడు అల్లుడు ఇన్‌స్పెక్టరుగావున్న పొట్లూరి జనార్దనరావు కొరకు నేను ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసుకు ఫోనుచేయగా, ఆయ నక్కడ లేడని ఫోనులో జవాబు వచ్చింది. జవాబు చెప్పిన వారిని, "మీరెవరు? నేను ఫోను చేసినట్లు చెప్పండి" అనగా, "చెప్తానండి. నేను జవాను శ్రీరాములు కొడుకు నండి. నే నిక్కడ జవానుగా ఉంటున్నానండి" అని చెప్పాడు. "నీ తండ్రి ఎక్కడున్నాడు?" అనగా, "ఊళ్లోనే వున్నాడు. వచ్చి మీదర్శనం చేస్తా" నన్నాడు. తరువాత కొన్నిగంటలకు, నేను హోటల్ మనోరమలో ఉండగా శ్రీరాములు వచ్చి చూచాడు. "పెడసనగల్లు రారా" అంటే, "తప్పకుండా వస్తాను. వట్టి చేతులతో రాను. మంచి పండుగప్ప చేప దొరికినప్పుడు పట్టుకొని వస్తా" నన్నాడు. పండుగప్ప చేపంటే నాకు మిక్కిలి ఇష్టమని వానికి తెలుసు. ఇదివరకు ఒకసారైనా పెడసనగల్లుకు పట్టుకొనివచ్చి యిచ్చి వెళ్లాడు.

నేను బెజవాడకు 6-5-1940 లో వెళ్లినప్పుడు, సూర్యారావు పేట మిషన్ రోడ్డులో వున్న కానన్ అనంతంగారి బంగళాలో ప్రవేశించాను. కానన్ అనంతంగారు బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. వారి తండ్రిగారో, వారో క్రైస్తవ మతం పుచ్చుకొన్నారు. వారుత్తములు. అప్పటికి వృద్ధులు. పదవీ విరమణ చేసివున్నారు. వారి కుమారులే పైన చెప్పిన, డాక్టరు ధన్వాడ

రామచంద్రరావుగారు. బంగళా అంత పెద్దది కాదు. బారక్ వలె పొడుగ్గా వుండింది. అయితే, ముందు వెనుక, విస్తీర్ణమైన స్థలం. ముందు చెట్లు వుండేవి. వెనుకకూడా వుండేవి కాని, అవి తక్కువ. ఖాళీ స్థలం హెచ్చు. అక్కడ ఏవైనా పాకలు వేయటానికి అనుకూలం. ఆ ఖాళీ స్థలాన్ని చూచో లేక నాకు సహజంగా వున్న కోరికో, కోళ్లను పెంచాలని, అందులో గుడ్లకు, మాంసానికే గాక, పందాలకు పనికివచ్చే పుంజులను పెంచాలని బుద్ధి పుట్టింది. కొంత ప్రోత్సాహం క్యాంపులో అక్కడక్కడ మంచి పుంజులను చూడటంవల్ల కలిగియుంటుంది. పైగా జవాను శ్రీరాములు కోడి పందాలంటే పడిచస్తాడు. వాని హుషారు, ప్రోత్సాహం కూడా వుండి వుండవచ్చును. రాజు తలచుకొంటే దెబ్బలకు కొదువేమని ధారాళంగా పుంజులను కొనటం మొదలుపెట్టాను. వెనుక దొడ్లో 2 పాకలు వేయించాను. కొన్ని ఊతలు కొన్నాను. బెజవాడలో సంపాదించినవేగాక, జగ్గయ్యపేటకు 7 మైళ్ల దూరంలో వున్న పేర్ మహమ్మద్ పేటలో ఒక రసంగిని, దానికి సమీప గ్రామంలో ఒక తుమ్మెదరెక్కల కాకిని, తిరువూరుకు సమీప గ్రామంలో ఒక డేగను సంపాదించాను. ఈ మూడూ మిక్కిలి గట్టివి. రసంగి కొన్ని పందాలు గెలిచింది. చివరకు కాలు మూదయి చనిపోయింది గాని, పోట్లాటలో ఓడిపోలేదు. దాని ప్రత్యేకత, కత్తికట్టి బరిమీద విడిచిపెట్టగానే, అమాంతంగా ఎదుటి పుంజుమీద పడి, దానిని ఊపి రాడనివ్వకుండానే దులిపివేయటం. ఇది తేలికైన పొట్టి కోడి. ఈనెలు జాస్తి. మిక్కిలి వేగంగా ఎగిరి, పోట్లాడి, ఎదుటిదాని అంతం చూచేది. తుమ్మెదరెక్కల కాకి గాని, డేగ రంగుది గాని పందాలకు వెళ్లలేదు. మొదటిది చక్రాలవంటి కళ్లు, మంచి డేగముక్కు, తేజస్సైన ఈకలు, చురుకైన ముఖంతో మిక్కిలి ఆకర్షణీయంగా వుండేది. దాని పోకడ చూడటానికి విడి కాళ్లతో ఇంకొక పుంజుతో పోట్లాడించగా, చక్కగా నేర్పుగా పోట్లాడింది. దాని నెవరి వద్దకో పంపగా, రోడ్డుమీదకు వచ్చి బస్సుక్రింద పడి చచ్చిం దన్నారు.

తిరువూరువద్ద కొన్న డేగరంగుపుంజు పోట్లాట మిక్కిలి ఆహ్లాదకరంగా వుండేది. సామాన్యంగా ఎగురుకు ఒకటి గాని, రెండు గాని దెబ్బలు కొడతవి. ఈ పుంజు మద్దెలమీద కొట్టినట్లు మూడు దెబ్బలు కొట్టేది. కత్తికోడి అనుకొన్నా అసీల్, అనగా విడి కాళ్లతో పోరాడే పుంజు వలె పోట్లాడేది. జవాను శ్రీరాములు ఎవరో బాగా మేపి తయారు చేస్తాడని చెప్పగా ఇచ్చాను. తిరిగి ఆ పుంజు నాకు కనపడలేదు. దొంగ లెత్తుకు పోయారని శ్రీరాములు చెప్పాడు. ఎంతవరకు నిజమో!

అయితే ఆరంభంలో వున్న ఉత్సాహం తగ్గిపోయింది. నాకు 1941 డిసెంబరులో ఎక్కువగా జబ్బుచేసింది. కోళ్లమీద విరక్తికలిగి వాటిని చాలా భాగం వదిలించుకొన్నాను. పాకలను ఖాళీ చేయించి తర్వాత తీసివేయించాను. ఈ మనోస్థితిలో కాకి, డేగల విషయమై పట్టించుకోలేదు. ఒకటి చనిపోయిందని, రెండో దానిని దొంగ లెత్తుకుపోయారని చెప్పిన దానిలో నిజం ఎంతు న్నదో నేను అజ తీయలేదు.

అయితే 1941 సంక్రాంతి పండుగకు ముత్యాలంపాడు తోటలో పెద్ద ఎత్తున జరిగిన కోడి పందాలకు నా యిద్దరు చిన్న కొడుకులతో, శ్రీరాములు వగైరా జవానులతో నా కారులో వెళ్లాను. ఒకటి రెండు పుంజులను తీసుకొని వెళ్లాను. రసంగి పందెం కొట్టింది.

తరువాత ఇంకా రెండు సంక్రాంతులకు బెజవాడలోనే వున్నాను గాని, తిరిగి ముత్యాలంపాడుకు వెళ్లలేదు.

ఎప్పుడో ఒకప్పుడు బెజవాడ సమీపంలోని గొల్లపూడిలో భారీ ఎత్తున పందాలు వేస్తున్నారని శ్రీరాములు చెప్పగా ఉత్సాహంతో ఒకటి రెండు పుంజులను తీసుకొని వెళ్లాను. ఆ రోజు ఆదివారమై యుండును. శ్రీరాములు మాట నమ్మి ఒక నెమలి మిక్కిలి గట్టిదనుకొన్నాను. ఆ అభిప్రాయాన్ని బరిలో వెలువ రించాను. "ఆయన ఆఫీసరు, వట్టి దెందుకు చెప్తా" డని నమ్మి కొందరు దానిమీద పందెంకాసి పోగొట్టుకొన్నారు. అది చచ్చి వూరుకుంది.

నేనెన్నడు పై పందెం కాయలేదు. పై పందెం కాయక పోతే కోడి పందెం తప్పుకాదని నా అభిప్రాయం. అది జూదం క్రింద రాదు. పైగా ప్రజలు తిరిగే ప్రదేశంగాక ఎక్కడో తోటలోనో, బంగళా ఆవరణాలలోనో, ఇంకొక ప్రైవేటు ప్రదేశం లోనో సరదాకు వేసుకొనే పందాలను నిషేధించట మట్లుండి, నిరసించకూడదని నా అభిప్రాయం. క్లబ్బులని పేరుపెట్టి, రాత్రి ప్రొద్దుబోయేవరకు చీట్లపేక, జూదం ఆడినదానికంటె పట్టపగలు కోడి పందాలు వేసి వినోదించటం మెరుగని నా ఉద్దేశం.

పాటకజనాని కిదొక సరదా. సినిమాలు వచ్చిన తర్వాత శ్రమజీవుల వినోదానికి క్రొత్తమార్గ మేర్పడింది గాని, వాళ్ల జీవితంలోని విసుగుకు, నిరుత్సాహానికి, అలసటకు కోడి పందాల వంటి సరదాలు కొంత విరుగుడు. అందులో సంక్రాంతి వంటి పండుగల్లో, ఇట్టివి వారి కుత్సాహాన్ని కలిగించి జీవితంలో సుఖ సంతోషా లున్నాయని తోపిస్తవి. కాబట్టి కోడి పందాలను గాని, గొఱ్ఱెపోతు పందాలను గాని, ఈ రకం ఇతర సరదాలను గాని నిషేధించకూడ దని నా నమ్మకం.

నేను పందెం పుంజులను పెంచటం మానినా చాలాకాలం వరకు నాకు కోడి పందాలమీద మోజే. ఈ మోజు నాకు చిన్నతనంలోనే కలిగింది. నా పెదతండ్రి కుమారులు, ముఖ్యంగా ఇద్దరు పెద్ద ఎత్తున పందాలు వేసేవారు. ఒకరు మిక్కిలి సమర్థ వంతమైన కత్తి కోళ్లను సాకేవారు. వారి కనేక పుంజు లుండేవి. కాని, అందులో ఒకటి నాకు మరీ గుర్తు. అది 22, 23 పందాలు గెలిచింది. కాకిడేగ బాగుగా ఉండేది. దాని విశేషం బరిలోకి విడిచిపెట్టినప్పుడు తారస లాడేది. వెనక వెనక్కు పోయేది. అవతల కోడి తనమీదకు వచ్చి ఎగిరినప్పుడు, పొట్టమీద కొట్టేది. ఇది ముందు ఎగిరేదికాదు. అవతలి కోడి మూడు నాలుగు సార్లెగిరి, ఈ పుంజు కత్తిపోటులు తిని, ఓడిపోయేది.

సంక్రాంతి పండుగకు, మా బొమ్మలూరు సమీప గ్రామం సిద్ధాంతంకు అడ్డదారిలో, దానికి సమీపంగా చెరువున్నది. చెరువు అంచులు విశాలంగా నాలుగుప్రక్కల పచ్చికతో చాలా

ఖాళీగా వుంటవి. ఆ ఖాళీలో కోడి పందాలు జరుగుచుండేవి. నావంటి కుర్రవాళ్లు ఉత్సాహంతో మధ్యాహ్నం 2 గంటలకే అక్కడకు చేరుకొనేవాళ్లం. బొప్పాయిగుండు వగైరా ఆటలు ఆడేవాళ్లు, చిత్తు, బొంకు ఎగరేసే వాళ్లు, రక రకాల మిఠాయి, సెనగలు, బఠాణీలు వగైరా అమ్మేవాళ్లు, పందాలు వేసేవాళ్లు, చూడటానికి వచ్చినవాళ్లు క్రిక్కిరిసి ఉండేవాళ్లు. చుట్టుప్రక్కల కట్టివేసియున్న పుంజుల కొక్కొరో కూతలు ఇంపైన రొదగా వుండేవి. మా కుర్రకారుకు, ఇవన్నీ ఎగిరి గంతులువేసే సంతోషాన్ని కలిగించేవి. మా పెద్దలు విముఖత్వాన్ని చూపినా, చూచి చూడ నట్లుండేవారు.

ఆ ఐదవ పెద తండ్రి, రామశేషయ్యగారి కుమారుడు నాగభూషణంగారికి కోడిశాస్త్రంకూడా తెలుసు. ఏదో తాటాకు గ్రంథం తనవెంట తెచ్చుకొని, మాటి మాటికి దానిని సంప్రదించుచుండేవారు. ఏమాత్రం తొందరపడేవారు కాదు. ఓపికతో, సావకాశంగా మరీ మరీ ఆలోచించి తన కోడి జాతి, రంగును బట్టి జయ కాలాన్ని నిర్ణయించి, బరిలోకి దింపేవారు. మొత్తంమీద నూటికి 70 పాళ్లైనా ఆయన కోళ్లు గెల్చేవి.

ఇంకొక పెద తండ్రి, నాలుగవ వారు వెంకట శివుడుగారి కుమారుడు సీతారామాంజనేయులు నాకంటె సంవత్సరంలోపే పెద్ద. ఆయన వయస్సువచ్చిన తర్వాత పెద్ద పందెగాడైనారు. కత్తిపుంజులనేగాక, అసీల్స్ అనగా కత్తులకు బదులు తమ ఆరుల నుపయోగించే పుంజులనుకూడా పెంచి, పంగిడిగూడెం జమీందార్ల వంటివారితో పందాలు కట్టేవాడు. గొఱ్ఱెపోతు పందాలు కూడా వేసేవాడు.

అనగా మా కుటుంబ రక్తంలో కోడి పందాలు, గొఱ్ఱె పందాలు వేసే పిలుపున్నదన్నమాట. ఆ పిలుపు వల్లనే, నే నుద్యోగంలో వుండికూడా ముత్యాలంపాడు, గొల్లపూడి పందాలకు వెళ్లటం జరిగింది. ఇంకొక విశేషం, నేను తిరువూరు క్యాంపులో

ఒకసారి కోడి పందాలు వేయించాను. తిరువ్వూరు జమీందారు గారికి కోళ్లు మిక్కిలి సరదా. వారు వస్తాదు కోళ్లను పెంచటంలో నిపుణులు. పందెపు కోళ్లలో సుప్రసిద్ధమైన కొన్ని జాతు లున్నవి. సేజాలు, టీకర్లు, కారానీలు వగైరా. తిరువ్వూరు జమీందారుగారి అభిమానం 'రాముడు' అనే రకం కోళ్లు. ఈ కోళ్లు పెద్ద రకమవి. ఎత్తుగా, పొడుగ్గా వుంటవి. వీని ప్రత్యేక లక్షణం తల చిన్నది. మిక్కిలి చురుకుగా పోట్లాడుతవి. వీని రంగు సామాన్యంగా డేగరం గనే రంగు. కాకి డేగలు కూడా వుంటవి. ఇతర రంగులు కూడా ఉండవచ్చు ననుకొంటాను. జమీందారు గారు వీనిని అధికంగా పెంచేవారు. వీని కొరకు వీరు రెండు పొడుగుపాటి కొట్టాలను కట్టించారు. ఇటికగోడలు. కప్పు పెంకుతో కప్పబడింది. చావిళ్ల వంటివి. ఒక్కొక్క కొట్టంలో ఒక్కొక్కప్రక్క పది కానాలు (గదులు). అనగా రెండు కొట్టాలలో 40 గదులు. 40 కోళ్లు వుండే వసతి. నేను వారిని చూడటానికి వెళ్లినప్పుడు, ఆ 40 గదులు ఇంచుమించుగా నిండి వున్నవి. పెద్ద పెద్ద పుంజులు గుర్రాలవలె వుండినవి. ఇవిగాక జమీందారుగారి నివాస గృహావరణలో ప్రత్యేక శ్రద్ధవహించ వలసిన పుంజులను ఊతల్లో వుంచారు.

వీరి సాయంతో, జవాను శ్రీరాములు ఉత్సాహంతో క్యాంపు చేస్తున్న రహదారి బంగళాలోనే, ఆదివారంనాడు పందాలు పెట్టించాను. పోలీసులు కూడా వచ్చారు. అయితే పై పందెం కాయగూడదని హుకుం జారీచేశాను. హుషారుగా, ఎట్టి గలబ లేకుండా పందాలు జరిగిపోయినవి. ఆ మరునాడు క్యాంపుకు వచ్చిన ఒక ఆఫీసరు ఈ సంగతి విని, నిరసనభావం వెలిబుచ్చ ప్రయత్నించారు గాని, నేను ఖాతరు చేయలేదు.

ఇంకొక దఫా క్యాంపు చేస్తున్నప్పుడు, జమీందారుగారు పది, పన్రెండు మైళ్ల దూరంలో పందాలు ఏర్పాటుచేశారు. దానికి హాజరై ఒక పుంజుమీద మోజుపడగా, దాని నిప్పించారు,

అది మంచి పందెంపుంజు కాదని తర్వాత తెలిసింది. దాని ఈక పోకు, హొయలు నన్నాకర్షించినవి. సరదా వుండినదిగాని, నాణ్యం అంతగా తెలియదు. నాసిరకం కోడిని మెచ్చుకొన్నందుకు జమీందారుగారు బహుశా తమలో తాము నవ్వుకొని యుందురు.

ముఖ్యంగా వెలమవారికి కోడిపుంజులన్న అభిమానం. తమవంటి పౌరుష జాతి అని, శౌర్యముతో పోట్లాడుత వని వారి అభిప్రాయం అనుకొంటాను. పిఠాపురం వంటి జమీందారుల దేవిళ్ల ముందర కోళ్లను కట్టేసేవారు. బొబ్బిలి, విజయనగరం రాజాల వివాదం సంగతి మనకు తెలిసిందే.

పేర్‌మహమ్మద్‌పేట అనే చిన్న గ్రామం, జగ్గయ్యపేటకు 7 మైళ్ల దూరంలో వున్నది. ఇక్కడ కూడా రహదారి బంగళా వున్నది. దీనికి 6, 7 మైళ్లలో పాలేరునది వున్నది. ఈ నది కవతల ప్రక్క నిజామ్ ప్రభుత్వ పరిపాలన. అందువల్లనే జగ్గయ్యపేట కనతిదూరంలో, చిన్న పల్లెటూరులో రహదారి బంగళా వుండటం. నే నక్కడ మొదటిసారి (చివరిసారి కూడా) 1941 డిసెంబరులో క్యాంపు చేశాను. అక్కడ మలేరియా దోమలు కుట్టియుండును. క్యాంపునుండి తిరిగి వచ్చిన కొలది రోజులకే, మలేరియాజ్వరం ప్రారంభమై, తీవ్ర స్థాయికి చేరు కొన్నది. ఒక రిద్దరు వైద్యులు చూచారు గాని తగ్గుముఖం పట్ట లేదు. అప్పుడు రైల్వే డాక్టరుగా వున్న డాక్టరు ఇ. సోమశేఖరం గారికి కబురు పంపగా వారు వచ్చి, మందులిచ్చి, "ఈ జ్వరానికి ప్రత్యేకమైన మందు లిప్పుడు వచ్చాయి. ఇవి బెజవాడలో దొరకవు. మద్రాసులో దొరుకుత"వని, ఎవరో స్నేహితుని ద్వారా తెప్పించి, వాడి, రహితంచేశారు. వా రప్పుడా మందులు తెప్పించి ఉపయోగించకపోతే, ఎన్ని రోజులు తీసుకోవలసి వచ్చేదో. పూర్తిగా రహిత మయ్యేది కాదేమో! అప్పటికి యిప్పటికి నాకు మలేరియాజ్వరం తగలలేదు.

విచిత్ర మేమి టంటే, దూరప్రదేశాలగు చిత్తూరు, బరంపురం, అనంతపురం సర్కిల్సులోగల ఏ క్యాంపులోను ఇట్టి జ్వరం తగులలేదు. బరంపురం సర్కిల్‌లో కొన్ని మకాంలు మలేరియా పుట్ట. ప్రత్యేకించి ఉదయగిరి, టిక్కాబలి, బల్లిగూడా

ఏజన్సీవంటి మన్య ప్రదేశాల్లో క్యాంపులు చేసినా, మలేరియా జ్వరం నాకు సోక లేదు. కాని స్వంతజిల్లా కృష్ణాజిల్లాలో ఈ వ్యాధికి గురి అవటం ఆశ్చర్యమే. నా కప్పు డప్పుడు ఇన్ ఫ్లూఎంజా జ్వరం తగులు తుండినది. దానిని సంబాళించుకొనటం తేలిక. అదృష్ట వశాత్తు మలేరియాజ్వరం బారిని పడింది ఈ ఒక్కసారే.

మా యింటికి అనతిదూరంలో కాపుర ముండుచుండిన, ఆయుర్వేద వైద్యులు శ్రీ కంభంమెట్టు విష్ణువర్ధనరావుగారు, కొంతకాలానికి మా కుటుంబ వైద్యు లయ్యారు. మాకు ఏ చిల్లర మల్లర జబ్బులు వచ్చినా, వారు శ్రద్ధ వహించి చికిత్స చేసేవారు. వారు వైద్య నిపుణులు, రక్తం, నీరుడు వగైరా పరిశోధనాలయం యజమాని. కాంగ్రెసు రాజకీయ నాయకుడుగా పేరొందిన వారు, సజ్జనుడు, స్నేహశీలుడు డాక్టరు టి. వి. యస్. చలపతి రావుగారికి దగ్గరగా వుండేవారు. అవసర మనుకొన్నప్పుడు, వారి సలహా తీసుకొనేవారు. మేము బెజవాడ విడిచిపెట్టేవరకు సహాయకారిగా వుండేవారు.

డాక్టరు చలపతిరావుగారు యల్లోపతిక్ వైద్యులు. సరసులు. వారిని నేను బెజవాడలో బాగా ఎరుగకపోయినా, తర్వాత వారి పరిచయమై, మేము కలసికొన్నప్పుడు ఎంతో ఆదరణతో మాట్లాడుకొనుచుండేవారము. నేను ఉద్యోగ విరమణ చేసిన కొద్దికాలానికి, నేను బెజవాడ వెళ్లియుండగా, తలతిరుగుడు వగైరా సుస్తీచేయగా, నాతో ఉండిన మా ఊరు (పెదసనగల్లు) వాడు, బంధువర్గంలో చేరినవాడు సూరపనేని గోపాలకృష్ణయ్య నన్ను డాక్టరు చలపతిరావుగారివద్దకు తీసుకొని వెళ్లినాడు. గోపాలకృష్ణయ్య కూడా, రాజకీయ ఖైదీగా వుండినాడు. డాక్టరు చలపతిరావుగారితో పరిచయం జైలులోనట. అప్పటికి కొద్దో గొప్పో, డాక్టరుగారు నన్నెరిగియుండిరి. ఈ రెండు కారణాలవల్ల నైతేనేమి, వారికి సహజమైన మంచితనముచేత నైతేనేమి నన్ను మిక్కిలి ఆదరించి, చికిత్స చేశారు. నే నింటికి తిరిగి వచ్చిన తర్వాత, కృతజ్ఞత తెలుపుచు వ్రాశాను. వెంటనే జవాబిస్తూ చికిత్స విషయం వ్రాసి, "అవసర మనుకొంటె ఇంకొకసారి వచ్చి చూపించండి" అని వ్రాశారు.

ఒక ఉదయం నేను ఆఫీసుకు వెళ్లబోవుచుండగా, నా దగ్గర బంధు వొకరు జట్కాలో ఒక యువతిని, మాయింటికి తీసుకు వచ్చారు. ఆమె కమ్మ కులస్తురాలనియు, తోట్లవల్లూరుకు చెందిన దనియు, భర్త హింసకు తట్టుకొనలేక పారిపోయివచ్చి, తానున్న యింటికి దగ్గరగా ఆమె బంధువుల యింటికి చేరుకొన్నదనియు, తన భర్త వచ్చి, ఎక్కడ లాక్కుపోతాడో అని తన రక్షణ కోరిన దనియు, తనఇంట్లో పెట్టుకొనుట కవకాశం లేదనియు, అందువల్ల దూరంగా నుండుటవల్లను, పైగా నేనాఫీసరు నగుటవల్లను భద్రం కొరకు ఇక్కడకు తీసుకొని వచ్చినాననియు చెప్పి, తాత్కాలి కంగా ఒకటి రెండు, రోజు లిక్క డుండ నిమ్మని కోరాడు. దీనస్థితిలో వున్నదని చెప్పినందున కాదనలేకపోయినాను. అప్పుడు నా భార్య, పిల్లలు పెడసనగల్లుకు వెళ్లియుండినారు. అందువల్ల మా వంటమనిషి రామన్ నాయరుతో, ఆమెకు భోజనం వగైరా ఏర్పాటుచేసి, జాగ్రత్తగా చూడమనిచెప్పి, ఆఫీసుకు వెళ్లిపోయాను.

సాయంత్రం తిరిగి వచ్చినతర్వాత, నాయరును అడిగి, ఆమె భోజనంచేసి సుఖంగానే వున్నదని తెలిసికొన్నాను. ఆమెతో ఇబ్బంది లేదుకదా! స్థిమితంగా వుండవచ్చు నన్నాను. దిగవిడిచి వెళ్లిన బంధువు వస్తాడేమో అనుకొన్నానుగాని, ఆయన రాలేదు. నేను యథాప్రకారంగా రాత్రి భోజనంచేసి మేడపైకి వెళ్లూచూ, క్రింద హాలు ప్రక్కగదిలో వుండిన ఆమెను పలకరించి, "నేను ఇక క్రిందికి ఉదయంగాని రాను. నీవు భోజనం చేసి, సుఖంగా నిద్రపో. రేపుదయం మాట్లాడుదాం" అనిచెప్పి మేడమీదికి వెళ్లిపోయాను. ఉదయం క్రిందకు వచ్చేటప్పటికి వంటవాడు, "చీకటిలోనే ఎవరో ఒకామె వచ్చి గుసగుసలాడి జట్కాలో ఆమెను తీసుకొని వెళ్లింది. తెచ్చుకున్న సంచిని కూడా తీసుకు వెళ్లారు" అని చెప్పాడు. చెప్పకుండా వెళ్లిపోయిందేమని నే నాశ్చర్యపడి, "వచ్చిన మనిషెవరు? ఎక్కడకు వెళ్లారు" అని అడి గాను. "నాకు తెలియదు. బహుశా వచ్చినామె తనయింటికి తీసుకొని వెళ్లి ఉంటుం"దని నాయరు చెప్పాడు. సరే, మన బాధ్యత

కొలగించదనుకొని, యథాప్రకారం భోజనానంతరం ఆఫీసుకు వెళ్ళిపోయాను.

సాయంత్రం నేను తిరిగి వచ్చినప్పుడు వంటవాడు, "ఎవరో వచ్చి ఆ అమ్మాయి సంగతి అడిగారు, వెళ్ళిపోయిందని చెప్పాను" అన్నాడు. బాగా చీకటిపడిన తర్వాత, ముగ్గురు మగవాళ్లు వచ్చారు. ఆ పిల్లసంగతి అడుగగా, విషయం తెలియజెప్పాను. అందులో ఒకడు విశ్వబ్రాహ్మణ కులస్థుడు. వకీలట. ఆయన నన్ను నిశితప్రశ్న లడిగాడు. నాకు చికాకువేసి, గట్టిగా జవాబిచ్చాను ఆ వకీలు ధోరణి, నేను దుర్బుద్ధితో ఆ యువతిని నా యింట దాచా నని. ఇక లాభం లేదనో, నేను చెప్పింది నిజమనో వారు వెళ్ళిపోయారు. నాకు నిజం చెప్ప లేదుగాని, ఆ వచ్చినవారిలో ఆ స్త్రీ భర్త వుండవచ్చును. వకీలును సాయం తెచ్చికొని యుండవచ్చును. నా వద్ద దిగవిడచిపోయిన బంధువు తిరిగి కొంత కాలానికి గాని కనపడ లేదు. ఈ ప్రస్తావన నేను తేగా, తనకు పట్టనట్లే కనిపించాడు. ఈ బంధువు వట్టి బాధ్యత లేని మనిషిగా వర్తించాడని అనక తప్పదు.

నిజానికి ఆ యువతి జారిణి అయి వుంటుంది. వంటవాడు ఆమెను దువ్వి, సంగతి సందర్భాలు తెలుసుకొన్నట్లున్నాడు. నాతో వాడు, "మీరు కావాలంటే, ఆ పిల్ల మీ ప్రక్కలోకి వచ్చేది. మీరు నిర్లక్ష్యంచేసి పైకి వెళ్లకపోతే ఈ యింట్లోనే వుండేది. మీరు కోరుకుంటారేమో అని ఎదురుచూచింది. మీ కట్టి బుద్ధి లేదని తెలుసుకొని, ఇక్కడుండిన లాభం లేదని వెళ్ళిపోయింది" అన్నాడు.

ఆ పిల్ల చౌకబారు వ్యభిచారిణి కాకపోయినా, కామోద్రేకం గలదై, పర పురుష వాంఛాపరురాలు కావచ్చును. ఆమె నా ఆహ్వానానికి ఎదురుచూచి యుండవచ్చునని నాకు తర్వాత తోచింది. ఆమెను నేను ఆ రాత్రి మేడమీదకు వెళ్లుచు పలకరించినప్పు డామె హావభావములు జ్ఞప్తికి రాగా అట్లనుకున్నాను. నా దగ్గరబంధువు నన్ను నమ్మి ఆ యువతిని నా యింట దిగవిడచి వెళ్లినాడు. భయస్థురాలై ఆమె నా యింటికి వచ్చింది. వారి

నమ్మకాన్ని నేను వమ్ము చేయకూడదు. ఆ దీనురాలికి నే నెట్టి అపచారం చేయకూడదు. ఆమెను జాగ్రత్తగా కాపాడి, తీసికొని వచ్చినవారికి తిరిగి అప్పజెప్పివేయాలి. ఇదే నా దృష్టి. ఆమెను ఒక ట్రస్టుగా ఎంచుకొన్నాను. ఆమె అందమైనది. మంచి వయస్సులో వున్నది. వయస్సు 20, 21 సంవత్సరాలకంటె ఎక్కువ వుండదు, నాకూ మంచి వయస్సు వున్నది. స్త్రీమీద బుద్ధి లేనివాడనుకాను. పై భావంవల్ల ఆ ఆలోచన నాకు పోలేదు.

లావు పిచ్చయ్య అనే అతను, మా నాయనమ్మ చినబాపమ్మ అక్క పెదబాపమ్మ కొడుకు అప్పయ్యగారి కొడుకు. అందువల్ల తమ్ముడు వరుస. వాళ్లది పురుషోత్తపట్నం. వాళ్ల సంసారం చాలా సామాన్య పరిస్థితుల్లో వుండేది. అందువల్ల చిన్నతనం లోనే బెజవాడకు చేరుకొని, ఒక పెట్రోలు బంకులో చేరి, 20 సంవత్సరాలు పనిచేసి, మానుకొని మోటారు సామానుల కొట్టు పెట్టుకొన్నాడు. ఒక లారీని, గోపాలం అనే ఇంకొకరితో కలసికొని, అర్థభాగానికి అధిపతి అయినాడు. ఈ పరిస్థితుల్లో నేను బెజవాడకు 1940 మే నెలలో ఆఫీసరుగా చేరిన తర్వాత, పరిచయం ఎక్కువ చేసుకొన్నాడు. 1941 సంవత్సరంలో నావద్దకు వచ్చి, "కృష్ణ లంకలో మెట్టపొలం అమ్మకానికి వచ్చింది, అది బందరు కాలువ పెద్ద గట్టుకు దగ్గరగా పెద్ద తోట నానుకొని వున్నది. త్రోవ కృష్ణకు వెళ్లే విశాలమైన డొంక. దాని కెప్పటికైన ఇళ్లస్థలంగా ధర పెరుగుతుంది. ఇప్పుడు సరిగా పండని మెట్టపొలంగా వుండి, చౌకగా వస్తుంది. దానిని నలుగు రైదుగురం కలసి కొనాలను కొంటున్నాము. మీకు కూడా అందులో భాగం ఇవ్వాలని వుంది. మీ రొప్పుకోవలసిం" దన్నాడు. సరే అన్నాను. అమ్మకానికి వచ్చింది 2 ఎకరాల లోపు. ధర ఎకరం 1కి 1,900 రూపాయల చొప్పున నిర్ణయం. నా ప్లాటు 2,086 చదరపు గజాలు. ఖర్చులతో 900 రూపాయలు అయింది. అమ్మినవారు పటమట కాపురస్తుడు, రామినేని కోటయ్యగారు.

ఆ స్థలాన్ని ప్లాట్లుగా వేశాం. ప్లాట్ల మధ్య త్రోవకోసం కొంత స్థలం విడగొట్టాం. ఆ ప్రైవేటు బాటను కలుపుకొని,

ఆ ప్లాటులకన్నిటికి, 'వీరభద్రపురం' అని పేరుపెట్టి ఆ తోటకు వేరే ఉమ్మడి దస్తావేజు వ్రాయించుకొన్నాం.

ఇప్పుడా ప్లాటుదారు లక్కడ లేరు. వారిలో కొంతమంది అమ్ముకు పోయారు. నా ప్లాటులో 27 కొబ్బరి మొక్కలు, 2 మామిడి మొక్కలు, 3, 4 బత్తాయి, నారింజ మొక్కలు వగైరా పెట్టాను. ఒక పాకవేసి, కూకట్ల బుచ్చయ్య అనే కాపలాదారుని పెట్టాను. ఇప్పుడు రెండు కొబ్బరిచెట్లు, రెండు మామిడిచెట్లు మాత్రం మిగిలియున్నవి. నాలు గైదు సీమతుమ్మ చెట్లున్నవి. పాక వున్నది. బుచ్చయ్య కుటుంబంతో సుఖంగా వుంటున్నాడు. 1970 సంవత్సరం మార్చిలో వెళ్లి చూచాను. నానా గలీజుగా వున్నది. విశాలమైన డొంకలో ఒకప్రక్క, వాళ్లు వీళ్లు ఆక్రమించుకొని, ఇటికగోడలతో ఇళ్లు కట్టుకొని, కాపురం వున్నారు. వీళ్లందరు కలసి నాపేరు మాపుచేసి, 'స్వరూప నగర్' అని పేరు పెట్టుకొన్నారట. క్రమేణా మా స్థలాలు కూడా కొంతైనా కలుపుకొంటారేమో అనిపిస్తున్నది. ఈ స్థలాన్ని నా రెండో కూతురు, సౌభాగ్యవతి వెలమాటి కమలకుమారికి, ది 25-3-1970 తేదీన దఖలు వ్రాసి యిచ్చాను.

నేను బెజవాడకు చేరుకొనిన కొలది రోజులకే నా భార్య అక్క కూతురు జగదాంబ మావద్దకు వచ్చింది. నా పెద్ద కుమార్తె మలినేని వజ్రాంబ ఏకైక సంతానం వీరభద్రరావు కూడా మాతో వుండినాడు. వీళ్లను సెంట్ యాన్ కాన్వెంటులో చేర్పించాను. 1942 వేసవిలో జగదాంబ వివాహం తలపెట్టారు. చల్లపల్లి వద్ద కెప్తాన్‌పాలెం కాపురస్థుడు, శ్రీ కొర్రపాటి శివరామయ్యగారి కుమారుడు సత్యనారాయణ వరప్రసాద్‌కు ఖాయం చేసుకొన్నారు. పెళ్లికూతురు చూపులు వగైరా మా యింటివద్దనే జరిగాయి. పెళ్లి పెడసనగల్లులో సలక్షణంగా జరిగింది. కొన్ని మర్యాదలు మేమూ చేశాము.

పెండ్లికుమారుని తాత సుబ్బయ్యగారు కొంతకాలం చల్లపల్లి ఎస్టేటుకు మానేజరుగానో, దివానుగానో వుండినారట. అందు వల్లను, భూస్వాములైనందునను కొంత రాచ మర్యాదలు, పలుకుబడి వుండేవి. శివరామయ్యగారంత సమర్థులైనట్లు కనపడరు.

కాని వారి భార్య అంకమ్మగారు మిక్కిలి ధాటిగల మనిషట. ఆమె కాంగ్రెసువాది అని, ఖద్దరు బట్టలు ధరించే దని, రాజాగారి కోట ప్రవేశం ఆమెకు ధారాళ మని, కోటలోని రాజ బంధువులు శ్రీ చిరుమామిళ్ల నాయుడమ్మగారివంటి పలుకుబడిగలవారు కూడా ఆమెకు ఎదురు చెప్పేవారుకా దని విన్నాను. ఆ ధాటి, ఆ పలుకుబడి శ్రీ అంకమ్మగారితోనే పోయింది. కొడుకు చిరంజీవి సత్యనారాయణవరప్రసాద్ కు, సౌభాగ్యవతి జగదాంబతో పెండ్లి జరిగినప్పుడు, 110 ఎకరాల మాగాణిభూమి వున్నట్లు తెలిసికొన్నాం. ఆయన బస్సుల కంపెనీ పెట్టి చాలా నష్ట పోయాడు. వానికి, వీనికి చాలా వృధా ఖర్చు పెట్టాడు. పిత్రార్జితం చాలావరకు పోగొట్టుకొన్నాడు.

నేను బెజవాడ ఉద్యోగానికి, 6-5-1940 సంవత్సరంలో వెళ్లి నప్పుడు కానన్ అనంతంగారి బంగళాలో దిగానని పైన చెప్పాను. అక్కడ ఒక సంవత్సరం మాత్రమే వున్నాను. ప్రక్కవీధి, కాళేశ్వరరావు వీధిలో వున్న శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు గారి ఇంట్లోకి 15-6-1941 తారీఖున మారాను. అప్పటి కది డాబా యిల్లు. శ్రీ సత్యనారాయణరావుగారిని ముందుగానే కోరగా, పైన మేడ కట్టిస్తా నన్నారు. ఆ అంగీకారంతోనే, మేడ ప్రారంభించకముందే ఆ యింటిలో చేరాను. ఒక నెలలో పూర్తిచేసి యిస్తా మన్నారు గాని, 3 మాసాలకు గాని అది పూర్తికాలేదు. పైగా మేడ నేలను గచ్చు చేయించలేదు. నేను వెదురు చాపలు అల్లించి, అమర్చుకొన్నాను. అద్దె, డాబాకు నెల 1కి 55 రూపాయలు. మేడ నాక్రమించుకొన్నప్పుడు ఇంకొక 10 రూపాయలు ఎక్కువ అద్దె ఇచ్చేటట్లు, మేడపైన ఒక సీలింగు ఫాను అమర్పించేటట్లు ఏర్పాటుచేసుకొన్నాం.

మేడను నే నాక్రమించుకొనకపోయినా, నేను డాబాలో చేరిన 15-6-1941 నుండి 65 రూపాయలు అద్దె ఇవ్వాలని శ్రీ సత్య నారాయణరావుగారు కోరారు, మేడలో సీలింగు ఫాను ఎక్కువ

ఖర్చు అవుతుం దనే అభిప్రాయంతో, "పోనీలే, టేబుల్ ఫానైనా యివ్వం"డని వ్రాశాను. అది కూడా వీలు లేదన్నారు. మేడలో ఫాను కావాలంటే, క్రింద వుండిన రెండు ఫానులలో ఒక దానిని తీసి పైన పెట్టుకోండని అన్నారు. ఈ రెండు విషయాలను వారు తమ 7-9-1941 ఉత్తరంలో వ్రాశారు.

నా కాశ్చర్యం వేసింది. శ్రీ సత్యనారాయణరావుగారు సుప్రసిద్ధ న్యాయవాది. తర్వాత హైకోర్టు జడ్జీ అయ్యారు. పైగా లాకమిషన్ అధ్యక్షులుగా చాలా సంవత్సరాలు అనేక చట్టాలను సవరించి, క్రోడీకరించారు. 1941 సెప్టెంబరునాటికి ఉన్నత పదవుల నధిష్ఠించకపోయినా, అప్పటికే పేరు ప్రతిష్ఠలు సంపాదించి వుండినారు. వా రిట్లు వ్రాయటం, నన్ను చకితుణ్ణిచేసింది. నేను మరునాడు ( 8-9-1941 ) జవాబు, వా రప్పుడుండుచుండిన 32, ఎడ్వర్డ్సు ఇలియట్సు రోడ్డు, మైలాపూర్, మద్రాసుకు వ్రాస్తూ, "మేడను పూర్తిచేసి, నాకు స్వాధీనపరచకుండానే దానికి కూడా అద్దె ఇవ్వాలనటం సబబుకాదు. మరిన్ని క్రింద రెండు ఫానులే వున్నవి కదా! ఒకటి హాలులో ( డ్రాయింగు రూములో ), ఇంకొకటి పడకగదిలో. హాలులోని ఫానును తీసివేస్తే, నన్ను చూడటానికి వచ్చిన వారికి గాలిలేకుండా పోతుందికదా! పడకగదిలోనిది తీసివేస్తే, పిల్లలకు నిద్రపట్టదుకదా!" అని జవాబు వ్రాశాను. ఇంకొకటి కూడా వ్రాశారు. ఒకనెల అద్దె ముందు ఇవ్వాలని. నాకు చిరాకు వేసింది. "నేను విద్యార్థి దశనుండి ఇప్పటి వరకు ఇంగ్లండులోగాని, మద్రాసులోగాని ఎక్కడా అడ్వాన్సు అద్దె ఇవ్వలేదు. బెజవాడలో కూడా ముందున్న ఇంటి యజమాని, కాసన్ అనంతంగారు నన్ను అడ్వాన్సుఅద్దె అడగలేదు. మీరు నన్ను చాలాకాలం నుండి ఎరుగుదురు. పైగా మీ జిల్లావాడిని. నన్ను మీరు అడ్వాన్సుఅద్దె ఇవ్వమనటం నన్ను నమ్మనట్లు. ఈ అపనమ్మకం నాకు గిట్టదు" అని వ్రాశాను.

"ఇంకొకటి. మీ కోర్కెలను నెరవేర్చటం అసాధ్యంగా కనపడుచున్నదని వ్రాశారు. ఈవిధంగా నన్నన్నది మీరొక్కరే. నేను ఏ ఇంటి యజమానికి ఎట్టి ఇబ్బందిని కలగజేసే స్వభావం కలవాడనుకాను. మేడ నేలను కచ్చాగా తాపీవాళ్లు వదలివేయకుండా చూడవలసిన బాధ్యత దగ్గరుండి కట్టించిన మీ మనిషిది. అయినా, గచ్చుచేయించండని మిమ్ము బాధించకుండా, నేను మేదర చాపలు కప్పించుకొన్నాను. సీలింగు ఫాను మీ రిస్తాననన్నదే" అని జవాబిచ్చాను.

మా పెదనాన్న శ్రీ ఆదినారాయణగారు శ్రీ సత్యనారాయణ రావుగారి తండ్రిని ఎరుగుదురు. ఆయన తేలప్రోలు జమీలోని సూరవరం గ్రామ కరణం. జమీందారుగారిమీద చాలాకాలం వ్యాజ్యం నడిపాడు. మాటల సందర్భంలో మా పెదనాన్న వారిని గురించి "తెలివితేటలుగల వ్యాజ్యాలకోరు" అని అన్నాడు. చివరకు మేడలో పంకా లేకుండానే కాలం గడచిపోయింది.

మే ముండిన (శ్రీ) సత్యనారాయణరావుగారి ఇంటికి వెనుక ఆవరణ ఉండినది. కొనుక్కొన్న పాలు ఎంత ఎక్కువగా కొన్నా, ఎంతమంచి వైనా స్వంత పాడికి చాలవుకదా! గడ్డి, జనపకట్ట 30 మైళ్లలోవున్న పెడసనగల్లునుండి, స్వంత బళ్లమీద తెచ్చుకో వచ్చును. అందువల్ల ఒక గేదెను కొన్నాము. పై జెప్పిన లావు పిచ్చయ్య అన్న లక్ష్మీనారాయణ అక్కడక్కడ తిరిగి, మంచి గేదెను కొనుక్కొని వచ్చాడు. అప్పు డిచ్చింది 165 రూపాయలే. ఇప్పటి ధరల ప్రకారం అది ఏ డెనిమిది వందల ఖరీదు కలదే. ఉదయం, సాయంత్రం 6, 7 శేర్ల పాలిచ్చేది. ఇది ఈని నప్పుడు, పాలు పడతవని నౌకరు చాలా జాస్తి జొన్నపిండి పెట్టాడు. జబ్బు చేసింది. పశువుల ఆస్పత్రిలో చికిత్సచేయించాను. అయినా పాలు తగ్గిపోయినవి. పాలు తగ్గిపోయినా, గ్రామంలో ఇబ్బంది లేదుగాని, పట్టణంలో నష్టం. కాబట్టి దానిని పెడసనగల్లులో ఒకరికి ఎక్కువ ధరకే అమ్మివేశాము. మొదటి పెయ్యదూడ పెరిగి, మేలైన పడ్డగా పెడసనగల్లులో తయారైంది. కాని ఎవరి దొడ్లోకో వెళ్లిందట. ఆ పుణ్యాత్ముడు గడ్డపలుగుతో

దాని మానంలో పొడిచాడట. తీసుకు చచ్చిపోయింది. తరువాత బెజవాడదగ్గర పోరంకిలో నేను వెళ్ళి స్వయంగా చూచి, (80 రుపాయల కని గుర్తు,) ఒక గోధుమవర్ణంగల గేదెను కొన్నాను. చూడటానికి సామాన్యగేదెవలె వుండినా, పాలు బాగానేయిచ్చేది. ఒక మధ్యాహ్నం జవాను వచ్చి, "అయ్యా, మన గేదె హఠాత్తుగా చనిపోయిం"దని ఆఫీసులో చెప్పాడు. "సరే, మాదిగవానిని పిలిచి తీసుకుపొమ్మనిచెప్పు. నే నింటికి వచ్చేసరికి, చచ్చింది నాకు కనపడకూడదు" అని చెప్పాను. అట్లే జరిగింది.

మూడో గేదెను మా వదినె రెండో కొడుకు సీతారామా రావు తోలిపెట్టాడు. దానిని అతడు తోట్లవల్లూరులో కొని యున్నాడట. అది చాలా చక్కని గేదె. మంచి వయస్సు వున్నది. కాని, తగాదాకోరు. పాలు సరిగా యిచ్చేదికాదు. పైగా నాలుకలు కోరుతుండేది, అనగా, ఎల్లప్పుడూ నాలుక బయటికి, లోనికి త్రాచుపామునాలుక వలె ఆడించేది. అది దుర్గుణ మని నా పెదతండ్రి కొడుకు నారాయణరావు బొమ్మలూరు నుండి, గుడ్లవల్లేరు సంతకు తోలుకొనిపోయి అమ్మివేశాడు. ఇంతటితో బెజవాడ గేదెల పాడి సమాప్తం.

మొగల్రాజపురం కాట్రగడ్డవారు పశువులను, తోటలను పెంచటంలో శ్రద్ధ కలవారు. వా రన్నదమ్ములలో భవాని శంకరం గారు మిక్కిలి నిపుణులు. వారివద్ద అసలైన ముర్రాజాతి దున్న పోతు లుండేవి. ఎదకు వచ్చిన మూడో గేదెను పొల్లకానికి, మొగల్రాజపురం తోటకు పంపాను. గేదెను దున్న దాటియే యుండును. అయినా గేదె వెంట దున్న మా యింటికి వచ్చింది. దున్నకు కూడా అందం కావలసివచ్చింది కాబోలు. అందానికి, అదికూడా సమ్మోహితం అయింది కాబోలు. వారి దున్న మా యింటికి మా గేదె వెంట రావటం ప్రస్తావనకు తెచ్చి, బావ వరుసను, భవానిశంకరంగారు చాలాకాలం హేళన చేస్తూండే వారు.

పెదసనగల్లుకు సమీపంలో వుండిన నరసంపాలెం వాస్తవ్యుడు శ్రీ కొల్లి వెంకట కృష్ణయ్యగారికి, బెజవాడ సమీపం

లోని జక్కంపూడిలో భూము లుండేవి. వారు కోడెదూడ తల్లిని, ఒక పెద్ద ఆవును పాడి కని తోలిపెట్టారు. దానిని కొంతకాల ముంచుకొని ఆవు, దూడను వారికి తిరిగి తోలిపెట్టాను. తల్లికి, దూడకు జబ్బుచేయగా, పశువుల ఆస్పత్రిలో రహితం చేయించాను.

శ్రీ కొల్లి వెంకట కృష్ణయ్యగారు మంచి సమర్థులు. తెలివి తేటలు కలవారు. పైగా స్నేహభావం, ఉదారత్వం కలవారు. వారు తర్వాత తర్వాత, నాకు మిక్కిలి సన్నిహితులైనారు. 1957 జూన్‌లో నన్ను చల్లపల్లి షుగర్సువారు, డైరెక్టరుగా తీసుకొన్నారు. అంతకు ముందునుండి వెంకటకృష్ణయ్యగారు డైరెక్టరు. అప్పుడు మా స్నేహం వృద్ధిపొందింది.

వారు హఠాత్తుగా చనిపోయారు. నేనెందుకో బందరు వెళ్లియుండగా, వా రక్కడ బస్సుస్టాండులో కలశారు. మేము కూచిపూడి సెంటరులో బస్సు దిగాము. నే నింటికి బయలుదేరగా, "రండి, కాఫీ తీసుకొని వెడదాం" అన్నారు. "నేను తీసుకో"నండి అంటే, "పోనీలే, మీరు వచ్చి కూర్చొని పోం" డన్నారు. సరే అని వారు కాఫీ, టిఫిన్ తీసుకొన్న తర్వాత వారు నరసంపాలెం వెళ్లారు. నేను పెడసనగల్లుకు వెళ్లాను. వా రింటికి వెళ్లేటప్పటికి సాయంత్రం ఏ ఆరుగంటలో అయి వుంటుంది. రాత్రి పదిగంటల కల్లా పరలోకప్రాప్తి చెందారు. వారి మృతివల్ల ఒక మంచి స్నేహితుణ్ణి పోగొట్టుకొన్నవా డనైనాను.

బెజవాడ సర్కిల్‌లో చెప్పుకోవలసినంత పెద్ద కేసులేమీ వుండేవి కావు. వడ్లను బియ్యంచేసే రైసుమిల్లులు తప్ప, వేరే పరిశ్రమలు లేవనే చెప్పాలి. సిమెంటు ఫ్యాక్టరీకి, ఉయ్యూరు పంచదార కె. సి. డి. లిమిటెడ్‌కు రిజిస్టర్డ్ ఆఫీసులు వేరేచోట్ల ఉండడంవల్ల వానికి పన్ను విధించే బాధ్యత, బెజవాడ ఆఫీసరు కుండేది కాదు. అయితే మధ్యరకం కేసులు ఎక్కువగానే వుండేవి. మొత్తంమీద బెజవాడ సర్కిల్ ముఖ్యమైన వానిలో ఒకటిగా తలంచబడేది. ఆ కాలంలో గుడివాడ కూడా, బెజవాడ

సర్కిల్‌లో వుండేది. అక్కడి రైస్‌మిల్లులు కొంత ప్రాముఖ్యం గల వ్యాపారం.

బెజవాడ సర్కిల్‌లో క్యాంపులుకు వెళ్లేవి, నేను వెళ్లినవి: 1. కంచికచర్ల, 2. నందిగామ, 3. జగ్గయ్యపేట, 4. షేర్ మహమ్మదుపేట, 5. కంకిపాడు. 6. ఉయ్యూరు. 7. వీరంకిలాకు. 8. గుడివాడ, 9. గన్నవరం. 10. నూజివీడు. 11. మైలవరం, 12. తిరువూరు. 13. విస్సన్నపేట. ఇందులో కంచికచర్లకు, షేర్‌మహమ్మదుపేటకు, విస్సన్నపేటకు, మైలవరంకు నేను బెజవాడలో వున్న 3 సంవత్సరాలపైచిలుకుకు, ఒక్కొక్క క్యాంపే వేశాను. చివరి సంవత్సరం వేసవిలో ముక్త్యాలకు కూడా వెళ్లి యున్నాను. నేను బెజవాడనుండి కాకినాడకు ట్రాన్స్ఫరయి 21-7-1943 తారీఖున వెళ్లిపోయాను. అనగా నేను బెజవాడలో 3 సంవత్సరాల 2 మాసాల 15 రోజు లుండి నా నన్నమాట.

కంచకచర్ల గ్రామం వంటిది. ఇక్కడి రహదారి బంగళా చిన్నది. కేసులు చాలా కొద్ది, చిన్నవి. ఒకసారి రెండు, మూడు రోజులు మాత్రం మకాం చేశాను. మామూలుగా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు క్యాంపు వేయవలసిన ప్రదేశంకాదు. మెట్ట గ్రామం. వరిసాగు చెప్పుకోతగ్గదికాదు.

ఈ కుగ్రామం ఈమధ్య పదిమంది నోళ్లలో పడ్డది. దేశ పత్రికలన్నీ వార్తలు వేశాయి. రకరకాల రాజకీయవాదులు పోటీపడి విమర్శించారు. కేంద్ర విధాన సభల్లోకి కూడా ఎక్కింది. కారణం, దొంగతనంచేసిన ఒక హరిజనుని, గ్రామరైతులు కొందరు హింసించారట. హరిజనుడై పుట్టితేనే చాలు ఈ రోజుల్లో. అన్ని దొంగతనాలు, చెడ్డపనులు చేయవచ్చు. ఇదేమి అనటానికి వీల్లేదు. గ్రామపెద్దలు కలగజేసుకొని. మంద లించకూడదు. మరల మనది పంచాయతీ రాజ్యం. ప్రజాతంత్ర రాజ్యం. కంచకచర్లలోవలె చెట్టుకు కట్టి, నిప్పంటించమని కాదు. నిప్పంటించటం పరమ దుర్మార్గమే. అయితే దహించాలని చేసి నట్టిది కాదు. ఎంత మూర్ఖులైనా, దురహంకారులైనా పట్ట పగలు రైతులు దొంగతనానికి సజీవ దహనం చేయరు. ఎవరో భయపెట్టాలని చేసిన పని. అయితే, ఆ పిన్నవయస్కుడు త్రాళ్లు

త్రెంచుకొని, చేల కడ్డంగా పడి పరుగెత్తి, గుండె ఆగిపోయి మరణించాడు. ఇక చూచుకో గగ్గోలు. మనిషిని హింసించారని కాదు. దొంగతనం చేసినందుకు భయపెట్టటానికి నిష్పంటించారని కాదు. ఒక హరిజనుని దండించారని. అతడు దొంగైనా సరే, మానభంగంచేసినవాడైనా సరే, హంతకుడైనా సరే హరిజను డైతే చాలు. ఏమీ అనకూడదు. చేయి అంతకుముందే చేసుకో కూడదు. పూర్వం ఈ హక్కు బ్రాహ్మణున కుండేది. ఇప్పుడు హరిజనునకు సంక్రమించింది. కమ్యూనిష్టులు, హరిజననాయకులు, కూలీల పేరుతో నాలుగు రాళ్లు గుంజుకునేవాళ్లు తమని అభివృద్ధి నిరోధకులని, ధనవంతులదాసు లని అంటారని భయపడి, "ఎంత దారుణం" అనిన రాజకీయవాదులు, అలా అనకపోతే ఏమి పుట్టి మునిగిపోతుందో అని భయపడే పెద్దమనుష్యులు, "గ్రామాల్లో హరిజనులను, రైతులు హింసించుచున్నారు, ఇది ఆగాలి" అని ఘోషించుచున్నారు.

పై సంఘటన తర్వాత, ఎక్కడ ఏ కూలివానిని చివాట్లు పెట్టినా, "అదిగో అక్కడి రైతులు, హరిజనులను హింసించు చున్నా"రని ప్రచారం మొదలు పెడుతున్నారు. పల్లెటూళ్లలో రైతులు కూలీలవల్ల ఎంత సతమతమాతున్నారో ఎవరికీ పట్టదు. ఒక్క హరిజనులేకాదు కూలీలు. ఈరోజుల్లో అన్ని కులాల్లోనూ కూలీ లున్నారు. వాళ్లుపెట్టే రభసలు, ఎక్కువకూలిని దౌర్జన్యంగా పుచ్చుకోవటం, తక్కువ పని చేయటం, నౌకరులు కనపడినదల్లా ఎత్తుకుపోవటం, పని సమయాల్లో ఎగగొట్టటం వంటి వ్యవసాయ నిరోధక పనులు చేయటం ఎవరికీ బుర్రకెక్కేటట్లు కనపడదు.

## నందిగామ

ఇది నందిగామ తాలూకా కేంద్రం. నందిగామ చిన్న పట్టణం. ప్రముఖ న్యాయవాదిగా విశేష ధనార్జన చేయుచుండి, మహాత్మాగాంధీ పిలుపు ననుసరించి వృత్తిని వదలుకొని, స్వాతంత్ర్య సంగ్రామములో మనస్ఫూర్తిగా పాల్గొని, పోలీసువారిచే దెబ్బలుతిని జైలులో కొన్నిసార్లు మగ్గిపోయిన త్యాగధనుడు, పుణ్యశ్లోకుడు, సహృదయుడు, కులభేదములను పాటించని విజ్ఞుడు

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి జన్మస్థాన మీ నందిగామ. సుప్రసిద్ధ ఇంజనీయరు, ఇప్పుడు జల విద్యుచ్ఛక్తిశాఖకు కేంద్ర మంత్రిగా వుండుచుండిన శ్రీ కె. యల్. రావుగారి జన్మస్థలం కూడ ఈ నందిగామయే. గ్రామం చిన్నదైనను, వర్తకం సామాన్యమైనను, పరిశ్రమలు ఏమియు లేకుండినను, ఈ పట్టణమునందలి వర్తకులనుండి వచ్చు ఆదాయపుపన్ను స్వల్పమైనను ఇది తాలూకా కేంద్రము కాబట్టి, పరిసర గ్రామములలో నివసించు వర్తకులవి, వడ్డీ వ్యాపారస్తులవి లెక్కలు చూచుటకు అనువుగానుండును కాబట్టి ఇక్కడ సంవత్సరమున కొక సారి క్యాంపు చేయటం కలదు.

ఈ గ్రామాన్ని గురించి ఒక కథ గలదు. పూర్వమెప్పుడో ఒక మహానుభావుడు ఈ ప్రాంతానికి సమీపాన నివసించుచుండేవాడట. తపస్సులో వున్న అతని వద్దకు ప్రతి నిత్యము ఒక గోవు వెళ్ళి, ఆయనకు పాల నందించేదట. ఈ చర్యకు కృతజ్ఞుడైన ఆ ఋషి అక్కడ విస్తారముగా నుండిన ఆవుమందల సంతానమును వృద్ధిపరచుటకుగాను, అన్ని లక్షణములతో కూడిన ఒక శిలానందిని అక్కడ ప్రతిష్ఠించినాడట. గోవులు ఆ ప్రదేశమున తిరుగాడుచు, తమ ఋతుకాలములో ఆ నందిని రాచుకొని పోయేవట. అందువలన శ్రేష్ఠమైన దూడలు పుట్టేవట. ఇందులో నిజ మెంత వున్నదో కాని, వినుట కీ కథ హృదయ రంజకంగా వున్నది.

## జగ్గయ్యపేట

ఇది గ్రామీణ ప్రాంతములలోనుండు పట్టణములలో చెప్పుకో తగ్గది. గుంటూరు జిల్లా అమరావతి ప్రాంతమును ఇంచుమించు స్వతంత్రుడుగా పరిపాలించిన శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారి తల్లిదండ్రుల పేర్లు జగ్గయ్య, అచ్చమ్మలట. తండ్రిగారి పేరున జగ్గయ్యపేటను, కృష్ణానదికి అవతల ప్రక్కన అచ్చంపేటను వారు నిర్మించినారట. జగ్గయ్యపేట సువిశాలమైన రాజ వీధులతో విస్తరించియుండి, దాని పూర్వ ఔన్నత్యాన్ని కొంతవరకైనను సూచించుచున్నది. ఒకప్పు డది పెద్ద వ్యాపార కేంద్రమై వుండేదట.

హైదరాబాద్, వరంగల్లు వంటి తెలంగాణా ప్రముఖ ప్రదేశాలతో వ్యాపారం విరివిగా సాగిస్తూ కూడలిగా వుండేదట. ఇప్పుడా వైభవం లేకపోయినను, ఆ మెట్ట ప్రాంతాలలో పెద్ద వ్యాపార స్థలంగానే ఎంచుకోవచ్చును. మాగాణి తక్కువ. విరివిగా జొన్నలు, సజ్జలు వగైరా మెట్ట ధాన్యాలను పండిస్తారు. ఇక్కడ పన్నులు విధించు ఆదాయముగల వర్తకులు మొదలైనవారు కొంత హెచ్చుగానే వుండిరి. సంవత్సరమున కొక సారి క్యాంపు.

## ముత్యాల

చివర సంవత్సరం అనగా 1953 జూలై మాసంలో నేను కాకినాడకు బదిలీ అయి వెళ్లే ముందు, ఈ పట్టణమునకు 7 మైళ్ల దూరములో నుండిన, ముత్యాలరాజాగారి మేడలో 2, 3 రోజులు క్యాంపుచేసి, పరిసర ప్రాంతపు కేసులను విచారించాను. ముత్యాలరాజావారు శ్రీ శ్రీ వాసిరెడ్డి చంద్రమహాళేశ్వర ప్రసాద్ బహద్దర్ వారు అమరావతి పాలకులు శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి తమ్ముడు చినవెంకటాద్రినాయుడుగారి వంశస్థులు. శ్రీ వెంకటాద్రినాయుడుగారికి, తమ్మునకు, మనస్పర్థలు కలిగి, చినవెంకటాద్రినాయుడుగారు, కృష్ణ దాటి ఇవతల ప్రక్క నివాస మేర్పరచుకొనిరట. అమరావతి గుంటూరు జిల్లాలోనిది. ముత్యాల కృష్ణా జిల్లాలోనిది. మధ్య కృష్ణానది. ముత్యాల కెదురుగా నది కవతల ఒడ్డున చిన్న కొండ వున్నది. అన్నదమ్ముల మధ్య విరోధం తీవ్రమై, యుద్ధము చేయునంతవరకు వచ్చినదట. వెంకటాద్రినాయుడుగారు ముత్యాలకు ఎదురుగా నున్న కొండమీాద ఫిరంగుల నెక్కించి తమ్ముని మీాద కాల్పులు జరిపించారట.

నేను ముత్యాలలో క్యాంపు చేయుచున్నప్పుడు, రాజాగారి కుమారులు శ్రీ శ్రీ రామగోపాలకృష్ణమహేశ్వరవరప్రసాద్ గారు (కుమారరాజా అని పిలువబడేవారు) నాకు కొండను చూపించి పై విషయములను చెప్పారు. తరువాత, దగ్గరలో నున్న తమ భూములకు తీసుకొని వెళ్లి, 3, 4 వందల ఎకరముల విస్తీర్ణముగల ఖండమును చూపి, జీవనది కృష్ణానది ఆ ఖండము

ప్రక్కనే ప్రవహించుచున్నను ఖండము, నదికంటె చాలా ఎత్తైన ప్రదేశమగుటచేత నదీ జలమును వుపయోగించి వరి సాగుచేయుటకు, మాగాణీ పంటలను పండించుటకు వీలులేని విషయం అని చెప్పారు. ఉత్తరోత్తర నీటిని ఇంజనులతో పైకి తోడి, సాగుచేయుట కవకాశముండునేమో ప్రయత్నించ వచ్చునన్నాను. ఇప్పుడా విధముగానే చేయుచున్నారని విన్నాను.

కుమారరాజావారి పరిచయము, నేను బెజవాడకు వెళ్లిన మొదటి సంవత్సరములో కలిగినది. తరువాత రెండు మూడు సార్లు వారిని కలసికొనటం వారు మాయింటికి ఒకటి, రెండుసార్లు వచ్చి పోవటం జరిగింది. ఒక సందర్భములో అప్పటికి 2, 3 ఏండ్లు వున్న నా రెండవ కుమార్తెకు కొన్ని కొండపల్లి బొమ్మలను బహూకరించారుకూడా. శ్రీ కుమారరాజావారు (పెదరాజా వారు పరమపదించిన తర్వాతకూడా, వీరిని కుమారరాజాగారే అంటున్నారు) మిక్కిలి సరసులు, స్నేహశీలురు. నిగర్వి. బాగుగా చదువుకొన్నవారు. తెలుగులో పండితులు. వీరు మిక్కిలి సుస్పష్టంగా మాట్లాడుతారు, ఉపన్యసిస్తారు. వీరి స్వచ్ఛమైన ఉచ్చారణశక్తి గొప్పది, ఒక్క దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే వీరికీ విషయంలో సరితూగుతారు. పెద్దరాజావారు కవి పండిత పోషకులు. వారి సజ్జనత్వం, సౌహార్దతతోబాటు వారి పాండిత్యం, ఉదారత్వం, దానశీలత, భాషాభిమానం మిక్కిలి ప్రశంసనీయం. పూర్వరాజులతో పోల్చవచ్చును. వీరు కొంతకాలం కవి సార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి కాశ్రయులై, వారిచేత శ్రీకృష్ణభారతాన్ని వ్రాయించారు.

వీరికి ఆయుర్వేదమునందు మిక్కిలి అభిమానం. ఆర్ష రసాయనశాలను స్థాపించి, ప్రసిద్ధికెక్కిన ఆయుర్వేద మందులను తయారుచేయించి, బీదసాదలకు ఉచితంగా పంచిపెట్టించేవారు. సుప్రసిద్ధ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కుటుంబీకుడు శంకర శాస్త్రిగారు ఆ ఆర్షరసాయనశాల నిప్పటికిని నడుపుచున్నారు. శ్రీ కుమారరాజాగా రొకసారి కొన్ని వసంతకుసుమాకరం

మాత్రలు, "మీ మధుమేహవ్యాధిని పోగొట్టుతా"యని తెచ్చి యిచ్చారు.

పెద్దరాజాగారికి దృష్టి తక్కువై యుండినందునను మరియు పూజా పునస్కారములలో ఎక్కువకాలము గడుపుచుండుట చేతను నేను వెళ్లిన కొన్ని గంటల తర్వాత వారిని దర్శించి, వారి వాత్సల్యపూరిత సరస సంభాషణలకు, విజ్ఞతకు, దయార్ద్రబుద్ధికి మిక్కిలి సంతోషించాను. క్యాంపును ముగించుకొని వెళ్లేటప్పుడు తిరిగి వారిని దర్శించి, సెలవు తీసుకొన్నాను.

కుమార రాజావారు భోజన, మజ్జన, శయనాదులలో నన్ను మిక్కిలి సత్కరించారు. రాజావారి ప్రాసాదం ఇంచుమించు కృష్ణవేణి ఒడ్డున కట్టబడినది. అంత విశాలమైన భవనము కాదు గాని, పెద్ద ఆవరణ లేదుగాని చక్కని భోషాణం వంటిదని, చిన్న కోటవంటిదని తోచింది. జమీందారుగారి హోదాకు తగినదే. నేను వెళ్లినప్పుడు మర్యాద లాంఛనంగా సైనిక వేషములు ధరించిన వారి నౌకర్లు నాకు స్వాగత మిచ్చారు.

నేను బయలుదేరి రాకముందు, ఒక ఉదయం శ్రీ కుమారరాజావారు వారి యిష్టదైవ మగు వేదాద్రి నరసింహ స్వామివారి దేవాలయానికి తీసుకువెళ్లారు. ఆ దేవాలయం ముత్యాలకు కొలది మైళ్ల దూరములో, చిన్న కొండవంటి ఎత్తైన ప్రదేశంలో వున్నది. మిక్కిలి ప్రసిద్ధమైనది. ఆ దేవాలయ సరస్సులో స్నానమాడి, దేవాలయము చుట్టు ప్రదక్షిణంచేసి, స్వామివారిని దర్శించుకొన్నవారికి బిడ్డలు కలుగుతారని నమ్మకం. అక్కడొక అశ్వద్ధవృక్షముకూడా వున్నది. అశ్వద్ధ వృక్షాన్ని పూజించిన, దాని చుట్టూ ప్రదక్షిణంచేసిన బిడ్డలు కలుగుటలో తోడ్పడునని నమ్మకము కూడా వున్నది. బిడ్డల కొరకు వెళ్లినవారు అక్కడ 3 రోజులు ఉపవాసముండి, స్వామి పూజ చేయవలెనట.

ఆ దేవాలయ పరిసరములలో సిమెంటు ఉత్పత్తికి పనికి వచ్చే రాళ్ల దిబ్బలున్నవి. ఈ రాతి త్రవ్వకమునుండి రాజాగారికి కొంత రాయల్టీ వచ్చును.

## షేర్‌మహమ్మదుపేట

ఇది కుగ్రామం. ఇదివరలోని నిజాం రాష్ట్ర సరిహద్దు. ఒకదఫా మాత్రం క్యాంపు చేశాను. దోమల పుట్ట. ఇక్కడి క్యాంపులోని దోమకాటు వల్లనే నాకు ప్రథమం మలేరియాజ్వరం వచ్చిందని, ఇక్కడనే మంచి కత్తి కోడి రసంగి పుంజును కొన్నానని పైన చెప్పాను. అంతా మెట్ట భూములు. కేసులు కొలది, చిన్నవి.

## కంకిపాడు

ఇది బెజవాడ—బందరు ట్రంకు రోడ్డుమీద 12 మైళ్ల దూరంలో వున్న పెద్ద గ్రామం. బంగళా చిన్నది. కేసులు అల్పము, స్వల్పము. క్యాంపు 3, 4 రోజులకంటె హెచ్చు వుండదు.

ఇక్కడ జరిగిన రెండు సంఘటనలు గుర్తుకు వస్తున్నవి. ఏ కారణంవల్లనో (బహుశా రిపేర్ కిచ్చి యుండవచ్చును) నా మోటారుకారు నావద్ద లేదు. తిరిగి వెళ్లునప్పుడు బస్సులో ప్రయాణం చేయవలసివచ్చింది. నా కప్పుడు వ్యాధివల్లనో, లేక కాలుజారి పడినందువల్లనో ఒక మోకాలు వాచి, నొప్పిగా వుండినది. అప్పు డన్నియు ప్రైవేటు బస్సులే. ఇప్పటి బస్సులవలె గాక, అవి పెద్ద జీపుల వంటివి. 3, 4 వరుసలు దగ్గరగా సమర్చ బడిన ఇరుకు సీట్లు. రెండుప్రక్కల పట్టుకొనుటకు ఇనుప చువ్వలు తప్ప, కొయ్య చెక్కలతో మూయబడి వుండలేదు. నేను ఒక సీటులో కష్టముమీద కూర్చుండినాను. అటు నిటు ప్రయాణీకులను రాచుకొనుచు, తిరుగుచు వచ్చి నా ప్రక్కన కూర్చుండిన కండక్టరుతో, "అబ్బాయీ, నా కాలు నొప్పిగా వున్నది. దాని మీద నీ బరువు ఆనించవద్దు" అని చెప్పాను. అతడు నిర్లక్ష్యము చేసి కొంత బాధ కలిగించాడు. ఆ విషయం ఆ బస్సు యజమాని కంభంపాటి గోపాలకృష్ణమూర్తిగారికి తెలియజేయగా వారు ఆ కండక్టరును గట్టిగా మందలించారట. అక్కడి ఇంకొక క్యాంపులో, అక్కడినుండి బస్సులో ప్రయాణముచేయవలసి

వచ్చినప్పుడు, నేను ముందుగా కబురు పంపినా నన్ను, నా సామానును ఎక్కించుకొనకుండా, దులపరించుకొని పోయిన బస్సుమీద, బస్సు యజమానుల సంఘాధ్యక్షునకు ఫిర్యాదు చేయవలసి వచ్చింది. కాంగ్రెసు ప్రచార ప్రభావంవల్ల కాబోలు, ప్రజాసామాన్యానికి ఆఫీసర్లయందు కొంత ధిక్కార భావం ఏర్పడి వుండినది. చదువు సంధ్యలు లేని, బాధ్యతలు గుర్తెరుగని బస్సు డ్రైవర్లు, కండక్టర్ల వంటి చిన్నతరహా వ్యక్తులకు, స్వాతంత్ర్యోద్యమంవల్ల ధిక్కార భావం పెరిగి యుండవచ్చును. చదువు కొన్నవారు, మంచి చెడులు తెలిసినవారు ఇట్టి నిర్లక్ష్యమును, మూర్ఖత్వమును చూపియుండినట్లు నాకు గుర్తు లేదు. పరదేశస్థుల నిరంకుశపాలననుండి ప్రజలకు విముక్తి కలిగి, వారు స్వేచ్ఛా వాయువులను పీల్చుట, స్వతంత్ర ప్రతిపత్తితో వ్యవహరించుట సంతోషించవలసిన విషయం. సామాన్య ప్రజలు కొంత స్వేచ్ఛతో, నిర్భీతితో వ్యవహరించ గలుగుట మంచిదే కాని, అమర్యాదగా, "ఆఫీసరనుకొంటున్నాడు. వీని తిక్క వదలించా" లనే దురహంకారంతో ఉద్యోగిని, గవర్నమెంటు రికార్డులను బస్సులో ఎక్కించుకొనకపోవటమే నా కాశ్చర్యాన్ని, బాధను కలిగించింది.

## ఉయ్యూరు

ఇది కంకిపాడుకంటె పెద్దదైన జనస్థలి. ఇక్కడి విశేషం, కె. సి. పి. లిమిటెడ్ అనే పెద్ద పంచదార మిల్లు. ఇది 1917 సంవత్సరంలో సహకారమిల్లుగా ప్రారంభింపబడి, తరువాత శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, శ్రీ వెలగపూడి రామకృష్ణ మొదలైన ప్రముఖులచేత అభివృద్ధిచేయబడి, ఆ రోజుల్లో అది రోజుకు 1,500 టన్నుల చెరుకును ఉపయోగించుకొను శక్తి గలదై వుండేది. ఇప్పుడది మిక్కిలి హెచ్చుగా విస్తరింపబడి, రోజుకు 4,000 టన్నుల చెరుకు వరకు ఆడుచున్నది. ఇప్పుడున్న ఇంకొక సంస్థ కె. ఇ. సి. లిమిటెడ్. అప్పుడదున్నట్లు నాకు గుర్తు లేదు. ఈ రెండవది చిన్నది. దీనిలో సోడాగ్యాసు మొదలైన వాని నుత్పత్తి చేస్తారు. పంచదార ఫ్యాక్టరీవల్లను, తరువాత

ఈమధ్య వరకు అక్కడుండిన టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్ వల్లను, ఉయ్యూరుకు ప్రాముఖ్యం వచ్చింది. ఫ్యాక్టరీ సిబ్బంది, ఇన్‌స్టిట్యూట్ అధ్యాపకులు, విద్యార్థులే గాక పరిసర భూములలో చెరుకు పండించువారు కొంద రక్కడకు చేరి, వసతు లేర్పరచు కొన్నారు. అందువలన జనాభా పెరిగి, ఉయ్యూరిప్పుడు చిన్న పట్టణంగా తయారైంది. అప్పుడది పెద్ద గ్రామంగా మాత్రమే వుండేది. చిల్లర వ్యాపారం ముఖ్యం. ఇక్కడి క్యాంపులో రెండు పెద్దవడ్డీవ్యాపారస్తుల కేసులను విచారించేవాడను. వారు బయటి ఊళ్ళవారు. పంచదార మిల్లు రిజిస్టర్డు ఆఫీసు మద్రాసు. అందువల్ల దాని పన్ను విచారణ నేను జరిపియుండ లేదు.

## వీరంకిలాకు

ఇది బందరుకాలువ మీద కట్టబడిన నీటిపారుదల రెగ్యు లేటరు కూడలి. బంగళా కిరుప్రక్కల ప్రవహించే కాలువల వలన, బంగళా ఆవరణాంతయు చెట్లతో నిండియుండుటవలన వేసవి కాలములో అక్కడ కొంతకు గొంత చల్లగావుండును. సంవత్సర మున కొకసారి వేసవిలో 3, 4 రోజులు క్యాంపుచేసేవాడను. ఆ ప్రదేశమును చేరుటకు ముందు 2, 3 మైళ్లలో కపిలేశ్వరపురమనే పెద్దగ్రామ మున్నది. రెండో ప్రక్క మేడూరు గ్రామ మున్నది, లాకుకు దగ్గరగా రెండు రైసుమిల్లు లుండినవి. అందువల్ల నేనుండిన 3, 4 రోజులు పని పుష్కలముగానే వుండేది. కాని, శ్రమనిచ్చే కేసులు మాత్రము కావు. రైసుమిల్లులు కూడా మిక్కిలి చిన్నవి. వ్యాపారస్తులు తక్కువ. చిన్నఅంతస్తు కలవారు. అప్పులమీద వడ్డీవచ్చువారు చిన్నతరగతిలో కొద్దిగా వుండేవారు. కాబట్టి కేసులు తగినన్ని వుండినను పని సులభముగానే జరిగిపోయేది. పెడసనగల్లు గ్రామం, వీరంకిలాకుకు 5 మైళ్లలోవున్నది. కాబట్టి మావాళ్లు వచ్చి నన్ను చూచిపోవటంకద్దు. నేను నా కారులోనే క్యాంపుకు వచ్చేవాడను. తిరిగి వెళ్లేటప్పుడు, నాగులేరు కాల్వ వెంట అయినంపూడి రేవువరకు వచ్చి, భట్లపెనుమర్రు మలుపు తిరిగి, అయినంపూడి—పామర్రు రోడ్డువెంట భట్లపెనుమర్రుకు రెండు మైళ్ల దూరములోవున్న పెడసనగల్లుకు చేరుకొనేవాడను.

కొన్ని గంటలు ఇంటివద్ద ఆగి, భోజనం చేసి సాయంత్రానికి బెజవాడ చేరుకొనేవాడను.

పైన చెప్పిన రెండు రైసుమిల్లుల యజమానులు వీరమాచనేని శోభనాద్రిగారు, కోనేరు వెంకట్రామయ్య, కోనేరు రామయ్యగార్లు ఎక్కువ పరిచయమైనారు. మొదటివారొక మిల్లుకు పూర్తి యజమానులు కాగా, వెంకట్రామయ్య, రామయ్య గార్లు భాగస్థులు. శోభనాద్రిగారు దూరపు బంధువులైనందున ఎక్కువ చనువుగా వుండేవారు. వారు రెండో మిల్లువారిని, వెంకట్రామయ్య ఈరామయ్య అని చమత్కరించేవారు.

## నూజివీడు

ఇది బెజవాడకు 40 మైళ్ల దూరములో వున్నది. గన్నవరం మీదుగా హనుమాన్ జంక్షన్‌కు వెళ్లి ఎడమప్రక్క రోడ్డు ద్వారా నూజివీడు చేరుతాము. ఈ మధ్యరకం పట్టణం ప్రసిద్ధిగన్న మేకా వంశం రాచవెలమ జమీందారులకు నివాస స్థలం. శూరులుగా, వీరులుగా ఇప్పటివారి పూర్వీకులు యుద్ధములలో పాల్గొనుచుండే వారు. సేనానాయకులుగా తమ పూర్వీకులను ప్రస్తుతపు జమీందారులు, వారి కుటుంబీకులు అనుసరింపక పోయినా, పేరు ప్రఖ్యాతులతోనే వుండినారు. ఈ జమీందారీలు అవిభక్త ఎస్టేట్లు కాకపోవటంచేత పెద్ద ఎస్టేట్లు విభజింపబడి, చిన్న ఎస్టేట్లుగా రూపొందినవి. ఉయ్యూరు జమీందారుగారు, మీర్జాపురం జమీందారుగారు, ఎలమర్రు జమీందారుగారు, తేలప్రోలు జమీందారుగారు, గన్నవరం జమీందారుగారు బాగుగా ఖ్యాతికి వచ్చుచున్నారు. ఉయ్యూరు జమీందారుగారి సోదరి పిఠాపురం రాజావారి ధర్మపత్ని. వీరు (ఉయ్యూరు జమీందారుగారు) విద్యా వంతులు. కవి పండిత పోషకులు. సరసులు. రసికులు. వారు జయదేవుని గీతగోవిందం, అష్టపదులను ఆంధ్రీకరింపించినారు.

ఈ జమీందారుగారికి ప్రసిద్ధిచెందిన మామిడితోట లుండినవి. బహుశా వీరికే ఎక్కువ విస్తీర్ణంగల తోటలుండే వనుకొంటాను. వీరి తోటల్లోని పెద్దరసాలు మిక్కిలి పేరుబడ్డవి. నా క్యాంపు వేసవిలో వారి దివాన్ శ్రీ భైరవేశ్వరరావు

గారు మిక్కిలి మర్యాద, వినయప్రపత్తులు గలవారు. బెజవాడకు కొన్ని పండ్లు పంపేవారు.

వీరి పెద్దకుమారులే శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారు. శ్రీ అప్పారావుగారు సౌజన్యమూర్తి. స్నేహశీలురు. మిక్కిలి మర్యాదస్తులు. విద్యాధికులు. సాత్విక సంపన్నులు. వీరు ఆంధ్ర ప్రదేశ మంత్రిగా వుండి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి మూలస్తంభమై ప్రబంధములను, ఇతర ఉత్తమ కావ్యములను అకాడమీ తరఫున ముద్రింపించి మిక్కిలి చౌకగా అమ్మించారు. వారు మంత్రిపదవినుండి తొలగినా, వారేర్పరచిన ప్రణాళిక సాగుచున్నది. సాహిత్యంలోనేగాక సంగీత, నృత్య, నాటక కళలలో అభిరుచి కలవారు. ముఖ్యముగా నాటకకళను ప్రోత్సహించటం, వృద్ధిపొందించటం వారి ధర్మంగా ఎంచుకొంటారు.

క్యాంపుకు వెళ్లినప్పుడు శ్రీ రాజావారి దర్శనం ఒకటి రెండుసార్లు చేసుకొన్నాను. అప్పటికింకను యువకులుగానుండి, అప్పుడే విద్యార్థిదశను దాటిన శ్రీ అప్పారావుగారి నొకసారి దర్శించాను. తర్వాత సంవత్సరాలలో శ్రీ రాజాగారిని నేను కలసికొనలేదుగాని, శ్రీ అప్పారావుగారిని అప్పుడప్పుడు కలసి కొనుట తటస్థించుచున్నది. ఈమధ్య 5, 6 సంవత్సరముల నాడు వారు సతీమణితో, ఈ ఊరిలో శ్రీ కలగర సుబ్బారావు గారు జరిపిన క్రీస్తు జన్మదినోత్సవానికి వచ్చినప్పుడు, నా ఆహ్వానం మీద సతీమణితో మా యింటికివచ్చి 10 నిమిషములుండి వెళ్లారు.

మీర్జాపురం జమీందారుగారు నాకంత పరిచయులుకారు. ఒకటి రెండుసార్లు కలసికొనుట తటస్థించింది. వారు కొన్ని ఏండ్లు కృష్ణా జిల్లా బోర్డు అధ్యక్షులుగా వ్యవహరించారు. తరువాత సినిమారంగములో ప్రవేశించి కొంత శ్రమించారు.

ఎలమర్రు రాజావారు మీర్జాపురం జమీందారుగారి సోదరులే. వారి నొకసారి చూచియుంటినిగాని సంభాషించలేదు. వీరివద్ద నగదు జాస్తిగా వుండేదని వాడుక. మితవ్యయంతో అతి జాగ్రత్తగా ధనమును పెంపొందించారట. వీరిని గురించి కథొక

టున్నది. ఒకసారి వారితో ఏదో పనుండి గొప్ప భూస్వామి, ఒకటి, రెండు అగ్రహారాల యజమాని రంగాపురం జమీని కొని రంగాపురం జమీందారుగా పేర్వడ్డవారు, ఉయ్యూరు పంచదార మిల్లును వృద్ధిలోకి తెచ్చిన ప్రముఖులలో ఒకరు శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు వారి భవంతికి వెళ్లారట. కబురువెళ్లిన కొంతసేపటికిగాని, జమీందారుగారి నుండి, రమ్మని పిలుపు రాలేదట. గోపాలకృష్ణయ్యగారు లోపలకు వెళ్లగా, లోపలి వరండాలోనో, హాలులోనో జమీందారుగా రటు ఇటు పచారు చేస్తున్నారట. ఆ విధముగా పచారుచేస్తూనే, గోపాలకృష్ణయ్య గారితో అరగంటపైచిలుకు మాట్లాడి పంపించివేశారట. గోపాల కృష్ణయ్యగారిని కూర్చోమనలేదు. వారిని కూర్చోబెట్టవలసి వస్తుందని తాను కూర్చోలేదు. గోపాలకృష్ణయ్యగా రెంత భూస్వామిఅయినా, ఆయనొక కమ్మ రైతే, తాము రాచవెలమ జమీందారు. కాబట్టి గోపాలకృష్ణయ్యగారిని ఘనంగా చూడ కూడదు అనే భావంవల్ల ననుకొంటాను, పలుకుబడిగల అంత పెద్ద భూస్వామికాకపోతే, జమీందారుగారు ఆసీనులై, వచ్చిన వారిని నిల్చోబెట్టి, దర్జాగామాట్లాడి పంపించేవారు. రాచవెలమ కులంవారు ముఖ్యంగా జమీందార్లు అంత నిక్కుగా ఉండేవారు. అయితే, అప్పటికి గోపాలకృష్ణయ్యగారు రంగాపురం జమీందారు అయివుండక పోవచ్చును. కాని, అప్పటికే మందపాడు, కొయగూరపాడు అగ్రహారాలను, విస్తీర్ణమైన భూములను, రెండు పెద్ద రైసుమిల్లులను సంపాదించి యున్నారు.

నూజివీడు జమీందారు లందరు అంత నిక్కుగలవారు కాదు. నిజానికి, ఉయ్యూరు జమీందారుగారు మిక్కిలి మర్యా దస్తులు. ఎలమర్రు జమీందారుగారి సోదరుడు మీర్జాపురం జమీందారుగారు కూడా, ఇట్టి అగౌరవమును చూపించేవారు కాదు. శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారి విషయం చెప్పనక్క రయేలేదు. వారి మర్యాద, మన్ననలు మేలైనవి.

తేలప్రోలు జమీందారుగారికి, కోడిపుంజుల పెంపకం సరదా. నేను బెజవాడకు వెళ్లిన మొదటి సంవత్సరం, నూజివీడు

క్యాంపులో, వారివద్ద మంచి పుంజు లున్నవని వారిని దర్శించాను. మాటల సందర్భంలో గన్నవరం తాలూకా అంపాపురం కాపురస్థుడు, మా పెదతండ్రి ఆదినారాయణగారి కుమారుడు అంజయ్యగారి భార్య సోదరుడు శ్రీ నందిగం వెంకట సుబ్బయ్య పేరెత్తాను. వెంకట సుబ్బయ్యగారు మంచి పుంజులను పెంచి వెలమవారితో పోటీపడేవాడు. ఒక సందర్భంలో తేలప్రోలు జమీందారుగారి సిబ్బందితో కోళ్లపుంజుల విషయమై తగాదా పడ్డాడట. ఈ సంగతి నా కప్పుడు తెలిసియుండలేదు. నేను వెంకట సుబ్బయ్యగారి పేరు ఎత్తగనే రాజాగారికి కోపము వచ్చిన ట్లున్నది. కొంచెం భీష్మించి, "నావద్ద పుంజులు లే"వని చెప్పేశారు. వెంకట సుబ్బయ్యగారి పేరెత్తకపోతే ఒకటి, రెండు పుంజులను తెచ్చుకొనేవాడను.

రెండో విషయం. నేను బెజవాడ వెళ్లిన క్రొత్తలో ఎవరో నూజివీడు జమీందారులు వారి అడవులను ఎకరానికి 10 రూపాయల లోపు ధరలో అమ్మివేస్తున్నారు, ఆ అడవిభూములను మామిడితోటల కుపయోగించుకోవచ్చు నన్నారు. నాకు తోటలు, అందులో మామిడి తోటలు చాలా యిష్టం. అందువల్ల చౌకగా వస్తున్నవికదా, 20, 30 ఎకరాలు కొందామనుకొన్నాను. తేలప్రోలు జమీందారుగా రప్పుడమ్ము చున్నారన్నారు. సరే అని, జమీందారుగారిని సందర్శించినప్పు డడిగాను. వా రిప్పు డమ్మేవేమీ లేవన్నారు.

గన్నవరం జమీందారుగా రమ్ముతారని, వారి మానేజరు చెప్పాడు. రండని అనతిదూరంలో వుండిన ప్రాంతాలకు తీసుకు వెళ్లాడు. బూరుగుల దొడ్డి అని, 40 ఎకరాల విస్తీర్ణంగల అడవి భాగం చిన్నది. అది నాలుగు ప్రక్కల కంచెతో చూడటానికి మంచిదే అనిపించింది. కాని ఎకరానికి నూరు రూపాయ లుందని, మానేజరుగారు చెప్పారు. చాలా హెచ్చని నే ననగా క్రింద పైన చూచి, డెబ్బై రూపాయల కిప్పిస్తా నన్నారు. అయినా నేను వినియుండిన పదిరూపాయలకు, డెబ్బై రూపాయలకు పొంతన కుదర

లేదు. పైగా అది రాళ్ల పుట్ట. తుప్పలు వగైరాతో నిండివుండింది. దానిని చెలిగించి, రాళ్లు గట్రా తొలగించి, తోట వేసుకొనటానికి అనుకూలంగా మిట్టపల్లాలు సమం చేయించటానికి చాలా ఖర్చు అవుతుంది. పైగా నీళ్ల సమస్య. ఆ రోజుల్లో ధాన్యం ధర చాలా తక్కువ. నేను 1940 మే నెలారంభంలో బెజవాడకు వెళ్లే ముందు బస్తా 1కి 4 రూపాయల 25 పైసలకు అమ్మి వెళ్లాను. నాదగ్గర డబ్బు నిల్వ లేదు. జీతం హెచ్చుగానే వచ్చినా, నా దుబారా ఖర్చులతో ఏమీ మిగిలేది కాదు. అందువల్ల ఆ ప్రయత్నం మానుకొన్నాను.

తేలప్రోలు జమీందారుగారు నిండైన విగ్రహం. కొంత కళాపిపాసికూడా. వారొక దర్బారు హాలు నిర్మించి యుండినారు. దానిలో వెండి వగైరాతో నగిషీ చేసి, ముఖమల్ గుడ్డతో కప్పించిన కుర్చీలు, తివాచీ లున్నవి. హాలు మిక్కిలి సుందరంగా వుంటుందని విని, నేను 1929 సంవత్సరంలో ఉద్యోగంలో ప్రవేశించక పూర్వం శ్రీ ఈద్పుగంటి రాఘవేంద్రరావుగారు దానిని చూడాలని తలంచగా, వారితో నూజివీడు వెళ్లియుండిన నేనుకూడా చూడటం తటస్థించింది. ఈవిషయం ఇదివరలో పైన చెప్పియే యున్నాను. శ్రీ రాజావారు విగ్రహంతోపాటు గంభీరత్వం, దర్జా కలవారు. వారిని తిరిగి కలసికొనలేదు. కాని, వారి కుమారుడు సూరవరం జమీందారుగారిని ఇంకొక క్యాంపులో చూచాను. పైన చెప్పినట్లు నూజివీడు ఎస్టేట్లు అవిభక్తపు ఎస్టేట్లు కావు. కాబట్టి, తేలప్రోలువారి కుమారుడు తన భాగానికి సూరవరం వగైరా గ్రామాలు పొంది సూరవరం జమీందారులైనారు. ఆయన నప్పటికి యువకులు.

సూరవరం పేరు వచ్చినప్పుడు శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారి తండ్రిని గురించి, మా పెదతండ్రి ఆదినారాయణరావుగారు చెప్పిన విషయం పైన చెప్పాను. వారు సూరవరానికి కరణమట. మంచి తెలివి తేటలు, సమర్థత కలవారట. వారు తేలప్రోలు జమీలోని కొన్ని భూములను ఆక్రమించుకొనో, రైతులచేత ఆక్రమణ జరిపించో జిరాయితీ భూము

లని, తగాదా పెట్టాడట. అందుమీద చాలా సంవత్సరాలు జమీందారుగారికి, ఆయనకు దావాలు నడచినాయట. చివరకు జమీందారుగారే గెలిచారట.

గన్నవరం జమీందారి చీలిపోయి చిన్నదైనది. నేను చూచినప్పటికి ఇద్దరన్నదమ్ములు కలసి, సామాన్య భవనంలో వుండేవారు.

ఇక్కడి కేసులు చెప్పుకోతగ్గవి కావు. ఎస్టేట్ల కేసులు కూడా పెద్ద ఆదాయం చూపించేవి వుండేవికావు. వ్యవసాయపు భూములు, తోటలు వగైరా ఆదాయంమీద పన్ను లేదుకదా.

1941, '42 సంవత్సరములలో కిరసనాయిలు కరువు వచ్చింది. ఇంటి వాడకాని కటుంచి, పెండ్లి పేరంటాల్లో వెలిగించే గ్యాసు లైట్లకు కిరసనాయిలు లభ్యమయ్యేదికాదు. మా దగ్గరబంధువుల ఇండ్లలో పెళ్లిళ్లు వచ్చినవి. నన్ను అర్థించగా, ఆ వేసవి నూజివీడు క్యాంపులో 2, లేక 3 డబ్బాలను సేకరించి, వారికి అందచేశాను. కిరసనాయిలు అమ్మే వర్తకులు వానిని చాటుచేసి, మిక్కిలి ఎక్కువధరకు లోపాయికారిగా అమ్ముకొనుచుండేవారు. వారి లెక్కలను నేను తనిఖీ చేస్తాను. అకస్మాత్తుగా వెళ్లి తనిఖీ చేసే అవకాశమున్నది. అందువల్ల మామూలు మార్కెట్టు రేటుకే ఆ కిరసనాయిలు డబ్బాలను నాకమ్మినారు.

నూజివీడుకు రెండు మూడు మైళ్ల దూరములో వున్న ఎలమందల గ్రామములో నివసించుచుండిన, నా పెదతండ్రి రామ శేషయ్యగారి కుమారుడు నాగభూషణంగారి పెద్ద కుమారుడు, వీర భద్రయ్య ఇంటికి వెళ్లి అతనిభూములను, తోటలను చూచి, ఒక పూట గడపి సుఖభోజనం చేశాను. ఎలమందల గ్రామంలో మంచి మామిడితోట లున్నవి. ఆ యూరి మామిడిపండ్లలో, ఒక ప్రత్యేకరక మున్నది. అది ఎలమందల తియ్యమామిడి. ఈ కాయ మిక్కిలి పెద్దదిగా, ఇంచుమించు, గుండ్రముగా వుంటుంది. ఇది పక్వానికివచ్చినప్పుడు కూడా, దీని తోలు ఆకుపచ్చగానే వుంటుంది. కండపుష్టిగల ఈ పండు ముక్కలు, కొబ్బరిముక్కల వలె బిరుసుగా వుంటవి. కాని, తియ్యగా, రుచిగా వుంటవి.

నూజివీడు క్యాంపుకు వెళ్లే సందర్భంలో ఒకటి రెండుసార్లు త్రోవలోవున్న అంపాపురానికి వెళ్లి, నందిగమ సుబ్బయ్యగారిని కలసికొని కొన్ని నిమిషాలు ఇష్టాగోష్ఠిగా గడపి, బెజవాడకు వెళ్లాను. ఒక దఫా వారింటిలో భోజనంచేసిన గుర్తు. సుబ్బయ్యగారు వయస్సులో మిక్కిలి అందంగా, రాజఠీవితో వుండేవారు. ఆర్థికయిబ్బందులవల్ల క్షీణించిపోయారు. బెజవాడకు వచ్చినప్పుడు మా యింటికి రావటం, ఒకటి రెండుసార్లు భోజనానికుండటం జరిగింది. వారొక పెద్ద పుంజు నిచ్చారు. దానిని ఒక నెల తర్వాత తిరిగి పంపివేశాను.

## మైలవరం

ఇక్కడొక సంవత్సరమే క్యాంపు చేశాను. ఇది పట్టణము కాదు సరికదా, మరీ పెద్దగ్రామంకూడా కాదు. ఇది రాచ వెలమవారగు మైలవరం జమీందార్ల ప్రధాన స్థానం. ఈ ఎస్టేటు కూడా విభక్త ఎస్టేటే. అందువలన మొదట ఒక జమీగా వుండిన ఎస్టేటు 3 భాగాలుగా విభజింపబడి, మైలవరం-1, మైలవరం-2, మైలవరం-3 జమీలుగా వెలసినవి. ఇక్కడవున్న 3, 4 రోజులలో ఏ జమీందారునుగాని నేను కలసికొనలేదు. అప్పటికే ఈ జమీందారీలు చితికివున్నవి.

ఈ ముగ్గురులో ఒక జమీందారుగారు, మైలవరం-2, అనుకొందును, మైలవరం నాటకసమాజం అనుపేరుతో, నాటక కళను కొంతకాలం పోషించారు. వారి ఆధ్వర్యంక్రింద బెజవాడలో నేను బెజవాడ సర్కిల్‌కు వచ్చేముందు కొన్ని సంవత్సరాలక్రితమే చాలా నాటకాలు ఆడించారు. వానిలో ఒకటి రెండు ప్రదర్శనాలను చూచి, ఆనందపరవశుడనైనాను.

సుప్రసిద్ధ సురభి నాటకములలో ప్రదర్శించు తీరున సుందరమైన తెరలు, మనోజ్ఞమైన సెట్టింగులు, త్వరితగతిని మార్చే సీనులు, ఒక రంగం ముగియగానే వెంటనే అందుకొనే ఇంకొక రంగం మిక్కిలి వేడుక పుట్టించి, హృదయ స్పందనను కలుగజేసేవి. నటులు ప్రత్యేకానుభవం, నేర్పు కలిగినవారు. వీరిలో నరసింహంనాయుడు అనేవారు సుప్రసిద్ధులు. సావిత్రి నాటకములో

వారి యముని వేషం, నటన ఎప్పటికిని మరపురా నటువంటివి. భీముడు మొదలైన గంభీర, వీర, రౌద్ర పాత్రలను నటించు టలో నరసింహానాయుడుగారు సిద్ధహస్తుడు. ఆ పాత్రపోషణ నేను తిరిగి చూడలేదు. వీరు నా బాల్యములో, నా మాతా మహుని స్థానమగు అంగలూరు గ్రామములో నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రులుగారికి, వారి పెదతండ్రి కుమారులు గోపయ్య, జానకి రామయ్యగార్లకు, దుగ్గిరాల పూర్ణయ్యగారికి, దుగ్గిరాల చిన్నశివయ్యగారు మొదలైన వారికి నాటకప్రదర్శ నములో తర్ఫీదిచ్చి, వారిచేత గయోపాఖ్యానము, తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగము, పాండవ ప్రవాసము, పాండవ విజయము మొదలైన నాటకములను ప్రదర్శింపచేసేవారని, ఇదివరకు చెప్పియున్నాను.

వీరి నాటక ప్రదర్శనాభిమానము, దీక్షను గురించి ఒక విషయం చెప్పుదురు. బందరులో ఒక నాటకములో వీరు పాత్ర నొకదానిని ధరించవలసి యుండినది. నాయుడుగారి ఉనికి బందరే. ఆరోజున వారి కుమారునకు సుస్తీచేసినదట, అది సాయంత్రము నకు తీవ్రమైనది. కాని, నాటకప్రదర్శనమునకు భంగము వచ్చు నని వారు వేషము వేసుకొని నటించుచుండగా, కుర్రవాడు చని పోయినాడని ఇంటివద్దనుండి వార్త వచ్చినదట. ఆ వార్తను విన నట్లే నాయుడుగారు తన పాత్రను నిర్వహించిన తరువాత గాని, ఇంటికి వెళ్లలేదట. అట్టి ధీరచిత్తుడు, కళాభిమాని, ఉత్తమ నటుడు శ్రీ నాయుడుగారు.

ఈ క్యాంపులో ఏవో కొన్ని చిన్నకేసులను పూర్తిచేసు కొని తిరువూరు క్యాంపుకు వెళ్లిపోయాను.

## తిరువూరు

ఇక్కడ గన్నవరము జమీందారుగారి అల్లుడు తిరువూరు జమీందారుగారుండినట్లు, వీరికి కోడిపుంజుల పెంపకం, పందె ములు మిక్కిలి సరదా అయినట్లు, వీరివద్ద రాముడు కోళ్లు వుండి నట్లు మొదలైన సంగతులను ఇదివరకే చెప్పాను. ఒక సంవత్సరం,

క్యాంపులో స్నేహితులు ఆహ్వానించగా, దగ్గరగా వున్న రంగాపురమను గ్రామమునకు ఒక రాత్రి వెళ్లి ఆహ్వానించిన వా రిచ్చిన విందులో పాల్గొన్నాను. ఉయ్యూరు జమీందారుగారివద్దనుండి అనుకొంటాను, రంగాపురం అనే చిన్న ఎస్టేటును అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు కొనియుండినారు. ఈగ్రామస్థులు కాక, అక్కడకు చేరిన కొందరు కమ్మరైతులు పొగాకు పండించు చుండినారు. వా రేదో సందర్భంగా కొందరు ఆఫీసర్లకు విందు చేస్తూ సమీపంలో క్యాంపు చేస్తున్న నన్నుకూడా ఆహ్వానించారు. పదిమందితో కలసి, పులావుతోకూడిన ఆహారాన్ని తృప్తిగా భుజించాను. నా కిప్పటివరకు మాంస మత్స్యాదులు ఇష్టం. పులావు వంటి విందును తిరస్కరించేవాడను కాదు. వృద్ధాప్యంవచ్చినందున, వాని మోజు చాలావరకు తగ్గిపోయింది. ఆ రోజుల్లో పిలవందే పాపం.

తిరువూరుకు కొలదిదూరములోనే నైజాము రాజ్యం సరిహద్దు. తిరువూరుకు కొన్నిమైళ్లలో ఒక పెద్ద చెరువున్నది. అక్కడ మందలు మందలుగా పరంజా (టీల్సు) బాతు లుంటాయని విని, తిరువూరు వేటగాడిని తీసుకొని తెల్లవారుఝామున కారులో బయలుదేరి మసక చీకటుండగనే ఆ తటాకం చేరాను. ఆ చెరువు మిక్కిలి పెద్దది. గుంపులు గుంపులుగా పరంజా బాతు లున్నమాట నిజమే. కాని ప్రొద్దెక్కువరకు ప్రయత్నించినా, ఒక బాతు కూడా దొరకలేదు. ఈ బాతులు మిక్కిలి జాగరూకత కలవి. ఏమాత్రం సవ్వడైనా ఎగిరిపోతవి. మేము చేరిన ప్రక్క కవతలి ప్రక్క నుండినవి బాతులు. వేటగాడు, బాతులున్న ప్రక్కకు ఒదిగి ఒదిగి వెళ్లినప్పటికి, ఏ విధముగా వాని రాకను గ్రహించినవోగాని, తుర్రున ఎగిరిపోయి ఇంకొక ప్రక్కకు చేరినవి. ఆ ప్రక్కకు తిరిగి ప్రయత్నించగా, ఇంకొక ప్రక్కకు పోయినవి. ఈ విధముగా 3, 4 సార్లు జరిగిన తరువాత అవి లేచి, ఎక్కడికో వెళ్లిపోయినవి.

ఈ చెరువు తిరువూరుకు 10 మైళ్లలో నున్నట్లు గుర్తు. ఇం కెక్కడనైన బాతులుగాని, ఇతర పిట్టలుగాని దొరుకునేమో

యని ఇంకొక పది మైళ్లు వెళ్లాము. అక్కడకూడా చుక్కెదురైంది. ఇక లాభంలేదని, నిస్పృహతో తిరిగి వచ్చాము.

ఆ క్యాంపులో విచారించవలసిన కేసులు చిల్లర మల్లర కేసులు మాత్రమే. చుట్టుప్రక్కలనుండి వచ్చిన కేసులు అరుదు. గంపలగూడెం జమీందారుగారి కేసు మాత్రం కొంచెం పెద్దది.

## విస్సన్నపేట

ఇది నిజంగా కుగ్రామం. ఇత్తడి, రాగి మొదలైన పాత్రలను చేయు కంచర్లు ఉండే రమణక్కపేట దీనికి సమీపం. ఈ రమణక్కపేట కేసులు తప్ప చెప్పుకోతగిన కేసు లిక్కడలేవు. ఒకసంవత్సరముమాత్రం 2, 3 రోజులు క్యాంపు చేశాను. ఈ ప్రదేశమంతయు మెట్ట. చిన్న చిన్న తోపులతోకూడిన మైదానం వంటి ప్రదేశం.

నేను క్యాంపులకు వెళ్లినప్పుడు సాధారణముగా ఎక్కడ ఏ అడవి జంతువులు, పిట్టలు దొరుకునో అని ప్రయత్నించేవాడను. జంతువులను, పిట్టలను వేటాడువారికి కబురంపి, వారికి బాగా డబ్బిచ్చి ప్రోత్సహించి, తెప్పించుకొనుట అలవాటు. ఆ విధముగానే ప్రయత్నించగా ఒక వేటగాడు ఒక చిన్న పిట్టను కొట్టి తీసుకొని వచ్చాడు. సగంప్రాణముతోవుండిన ఆ పిట్ట మిక్కిలి చక్కగావున్నది. దానికి తగిలిన గాయమునుండి ప్రవహించిన రక్తము చిక్కని ఎరుపురంగులో కాంతివంతముగా కనపడినది. అట్టి చక్కని పిట్టను చంపినందుకు విచారపడినను దానిని మిక్కిలి తృప్తిగానే భుజించాను.

## గుడివాడ

ఇది నా స్వగ్రామమగు బొమ్ములూరుకు 2 మైళ్లలో వున్నది. ఇది ఆ రోజులలో ఒక సామాన్య పట్టణం. ఇప్పుడది విస్తృతమై అనేక విధములుగా అభివృద్ధిచెంది, సినిమా హాలులతోనూ, లారీ, బస్సు, మోటారుకారుల కూడలిగానూ, కర్మాగారములతోనూ, వర్తక వ్యాపారముల సమృద్ధితోనూ, మొదటి

తరగతి కాలేజితోనూ విరాజిల్లుచున్నది. కాని అప్పుడు కూడ 14, 15 రైసుమిల్లు లుండేవి. గుడివాడ, తాలూకా కేంద్ర మగుటచేతను, డిప్యూటీ కలెక్టరు, డిస్ట్రిక్ట్ మునిసిఫ్, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు వంటి అధికారుల స్థానమగుటచేతను కొంత ప్రాముఖ్యమును కలిగి యుండినది. కొంత పేరును సంపాదించిన న్యాయవాదు లుండేవారు. వారిలో కొందరు కరెడ్ల రామయ్యగారివంటివారు బాగుగా సంపాదించి, విరివిగా భూములు కొని భూస్వాములైరి. ఉప్పలూరి ఆదినారాయణరావుగారు, ఉప్పలూరి మల్లికార్జునరావుగారు, కరెడ్ల నరసింహంగారు, శ్రీ టి. యస్. ప్రసాదరావు మొదలైనవారు ప్రముఖులుగా వుండినారు. డాక్టరు అడుసుమిల్లి నారాయణరావుగారు, డాక్టరు తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారు, డాక్టరు శివరావుగారు వంటి సమర్థులైన వైద్యు లుండిరి. హోమియోపతిని అభివృద్ధిపరచిన డాక్టరు గురురాజుగారు ప్రాముఖ్యమునకు వచ్చుచుండిరి. మొత్తంమీద 1940 లో కూడా గుడివాడ పట్టణం ఎన్నదగినదిగానే యుండేది. ముఖ్యకారణం గుడివాడ తాలూకా గ్రామాలు భూవసతి బాగుగాగల రైతులు ( ముఖ్యంగా కమ్మరైతులు ) గల గ్రామాలు, భూములు వరిధాన్యం బాగుగా పండే మాగాణి భూములు. కమ్మవారు పెండ్లిండ్లకని, పేరంటాలకని విరివిగా ఖర్చుపెట్టేరకం. అప్పులు చేయటం కూడా హెచ్చే. అందువల్ల రైసుమిల్లులతోబాటు వర్తకం, వడ్డీవ్యాపారం బాగా సాగుచుండేవి. పన్నువిచారణ కేసులు విరివిగా వుండేవి. వారంరోజుల క్యాంపులో తీరుబడివుండేదికాదు.

మొదటి సంవత్సరం మా బంధువులు కొందరు వచ్చి చూచి పోయారు. నా తమ్ముడు సత్యనారాయణ బొమ్ములూరునుండి బియ్యము, పాలు, నెయ్యి, పెరుగు మొదలగునవి పంపిస్తానని, మొదటి క్యాంపులో చెప్పాడు. నా మామూలుప్రకారం నా యింటివద్దనుండి బియ్యము, పప్పు, నెయ్యి మొదలైనవి తెచ్చుకొన్నాను. నాకు ముందు వచ్చిన ఆఫీసర్లు, పాలను రహదారి బంగళాదగ్గరనే కొనుక్కొనుటకు ఏర్పాటుచేసుకొని యుండి

నారు. మా జవానులకు ఎక్కడ తెచ్చుకోనేది తెలుసును. కట్టెపుల్లలు, కూరగాయలు మొదలైనవి బజారులో దొరుకును కదా. కాబట్టి శ్రమపెట్టుకోవద్దని నా తమ్మునకు చెప్పాను.

రహదారి బంగళా ఎత్తైన పాటిదిబ్బ మీద వున్నది. గుడివాడలో కూడ బౌద్ధ స్థూప సంబంధమైన పెద్ద పాటిదిబ్బ వుండేది. ఆ పాటిమట్టిని రైతులు కొనుక్కొని, తమ భూములకు తోలుకొని పోయారు. మా లింగం కుటుంబమువారే చాలా భాగం ఆ దిబ్బను త్రవ్వి తీసుకొనిపోయారు. రహదారి బంగళా దిబ్బ మాత్రం మిగిలి వుండింది. బంగళా తగిన వసతులు కలది. ఇతరచోట్లవలెగాక ఆఫీసులకు, దుకాణాల బజారుకు, కూర గాయల మార్కెట్టుకు దగ్గర. అందువల్ల అక్కడి క్యాంపు సౌకర్యంగానే వుండేది

నా సర్కిల్‌లో బెజవాడ తరువాత గుడివాడయే ముఖ్యం. రైసు మిల్లులవల్లను, వర్తక వ్యాపారముల వల్లను ఆదాయం పన్ను హెచ్చుగానే వచ్చేది. న్యాయవాదులు కొందరైనను స్వయముగా వచ్చి, లెక్కలను చూపించుకొని వెళ్లేవారు. డాక్టర్లుకూడా అట్లే.

నా మొదటి క్యాంపులో మా తండ్రిగారికి నమ్మిన పాలేరును, మా బొమ్ములూరుకు 3 మైళ్లు దూరములో వున్న బిళ్లపాడులోని మా 40 ఎకరాల మాగాణి భూమిని కనిపెట్టుకొని వుండేవాడును, హరిజనుడు (మాల) బండి చింతడు అనే వానికి కబురు పంపి వానికి సుష్టుగా భోజనము పెట్టించి, వస్త్రములు బహూకరించి, కొంత నగదు పారితోషికమిచ్చి సంతోషపడ్డాను. అంతకుముందు కొన్ని సంవత్సరాలనాడే, మా బిళ్లపాడు భూమి 40 ఎకరాలు అమ్మివేసి వుంటిమి. చింతడు మా పనిలో లేడు. అయినను ఋజువర్తనము, యజమానియందు భక్తి తాత్ప ర్యములు కలిగియుండి, జాగ్రత్తగా మా భూములను కావలికాచి మాకు తోడ్పడినాడు. కాబట్టి, నాకు వానియందు మిక్కిలి అభిమానం వుండింది. ఆ అభిమానాన్ని ఆ విధంగా వ్యక్తం

చేశాను. చింతడుకు కుమారులు లేరు. ఒక రిద్దరు కుమార్తె లుండేవారు. వాని పెద్ద అల్లుణ్ణి బాగా ఎరిగి వుంటిని. చింతడు బిళ్లపాడు వాస్తవ్యుడే. వానితోబాటు వాని అల్లుడు, ఇద్దరు ముగ్గురు బిళ్లపాడు హరిజనులు పాలేరులుగా వుండేవారు. వాళ్లను గురించి ఒక విషయం బాగుగా గుర్తుకువస్తున్నది. బిళ్లపాడులోనో, దాని సమీప గ్రామంలోనో ఒక చిన్న క్రీస్తుమత దేవాలయ ముండేది. తిండికి లేనప్పుడు, కొంతమంది మాలలు ఫాదరీని ఆశ్రయించి, క్రీస్తుమతమును పుచ్చుకొన్నామని చెప్పి గుడికి పోయేవారట. ఫాదరీ ధాన్యమో, డబ్బో యిచ్చేవాడట. అప్పుడు బొట్టు, గిట్టు లేకుండా పనిలోకి వచ్చేవాళ్లు. బొట్టు లేదేమని అడిగితే,"మేము మతం పుచ్చుకొన్నాంకదా!" అనేవాళ్లు. 15, 20 రోజులు గడచిన తర్వాత తిరిగి బొట్టు పెట్టుకొన్నారేమిటని అడిగితే, "మతాన్ని వదలుకొన్నాం" అనేవాళ్లు. అలా తరచు క్రైస్తవు లగుట, తిరిగి హిందువు లగుట జరుగుచుండేది. ఫాదరీ డబ్బు యిచ్చినప్పుడు క్రైస్తవుడు, ఆయనగారు విసుగుకొని డబ్బు యివ్వనప్పుడు హిందువు.

ఆ రోజుల్లో పెద్దపాలేరుకైనా ఇచ్చే జీతం చాలా తక్కువగా వుండేది. పాలేరుకు పెళ్లాం, బిడ్డలు వుంటే, వాళ్ల కూలి సంపాదన కొంతవరకు అక్కరకు వచ్చినా త్రాగుడు మొదలైన దుర్వ్యసనాలవల్ల, నాగాలవల్ల జీతం చాలేదికాదు. ఈరోజుల్లో వలె పెంటకల్లాలుగాక, కల్లాల్లో గింజలు దొరికేవి. పైగా కోత సమయంలో పన పెట్టేవారు. అయినా త్రాగుడువల్ల, సోమరితనంవల్ల కొందరు నౌకర్లకు, ఎప్పుడూ కరువుగానే వుండేది అందువల్ల ఫాదరీ సాయం వీళ్లు పొందవలసి వచ్చేది. నాగాలు లేకుండా పనిచేస్తే, జీతం గింజలు తిండికి సరిపోకపోలేదు. పైగా, ఆ రోజుల్లో ఇప్పటివలె సినిమాలు, షోకులు తక్కువ. అందువల్ల త్రాగుడు లేకపోతే, ఆ తక్కువ జీతంలోనే తిండి కిబ్బంది పడవలసిన అవసరం ఉండేదికాదు.

మొదటి క్యాంపులోనే అనుకుంటాను, మా బంధువుల్లో ఒకరు మంచి వ్యవహర్త అని పేరు పొందినవాడే, వయస్సు

ముదిరినవాడే మాటలసందర్భంలో నా భార్యను గురించి, నిర సనగా మాట్లాడాడు. నాకు, నా భార్యకు మనస్పర్థలు వచ్చిన రోజుల్లో, నేను తిరిగి పెండ్లిచేసుకోవాలని ప్రయత్నించినప్పుడు, ఆమె మూర్ఖత్వాన్ని నేను నిందించేవాడను. దానిని సాకుగా తీసుకొని ఆ పెద్దమనిషి చులకనగా మాట్లాడాడు. ఆమె, నేను తిరిగి సంసారం మొదలుపెట్టి పదిసంవత్సరాలు దాటినవి. తరువాత ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె ఆమె వల్ల కలిగారు. 1940 లో భార్యాభర్తల మిద్దరం అనుకూలంగానే వ్యవహరించు కొనుచుండినాము. పైగా, ఎవరి భార్యను వారు నిందించినా, ఇతరులు చుల్కన చేయటం, అభిమానం గల ఏ భర్తా సహించడు. అందువల్ల ఆయనవంక తీక్షణంగా చూచి "ఎంత పిచ్చిదైనా, రాజు భార్య రాణీ కదా" అంటిని. నా భావం గ్రహించిన ఆ పెద్ద మనిషి మారుమాటాడక లేచిపోయాడు.

ఇంకొక విశేషం. నా సోదరులుగాని, నా పెదతండ్రుల కుమారులుగాని, మరి ఏ యితర బంధువులుగాని, స్నేహితులుగాని నా ఉద్యోగ విధుల నిర్వహణలో సిఫారసులు మొదలైనవి చేసి, జోక్యమే మాత్రము కలిపించుకొనలేదు. అట్టిది మిక్కిలి ప్రశంసనీయముకదా!

ఇంకొక చిన్న క్యాంపున్నది. ఇది గన్నవరం. ఇక్కడ రెండో సంవత్సరమో, మూడో సంవత్సరమో నూజివీడు చేరుకొనే ముందు, రెండు మూడు రోజులు క్యాంపుచేశాను. ఇప్పుడది, ఏరోడ్రోమ్ ముండబట్టిగాక, విజయవాడ – హైదరాబాదు సంయుక్త పాలపథకంక్రింద ఏర్పరచిన సమీకృత పశువుల ఆహారోత్పత్తినిచేయు ఫ్యాక్టరీని కలిగి, పశువుల కృత్రిమ సంపర్కం కొరకు మంచి ఆబోతుల శుక్లాన్ని సరఫరాచేసే కేంద్రంగా అభివృద్ధిచెందింది. మరిన్ని, దగ్గరలోనే పందులను పెంచి, వాని మాంసాన్ని రకరకాలుగా సరఫరాచేసే ఫ్యాక్టరీ, పశుకళేబరాలను కోళ్లు మొదలైనవాని కాహారంగా పనికివచ్చునట్లుగాను, తోళ్లు, కొమ్ములు, బొమికెలు తగిన విధముగా ఉపయోగించుకొనునట్లుగా

తయారుచేయు కార్ఖానా కలిగియున్నది. ఆ రోజుల్లోకూడా పరోగ్రోమున్నా, దానివల్ల గన్నవరానికి చెప్పుకోతగ్గంత ప్రాముఖ్యత రాలేదు. వర్తక వ్యాపారాలు మిక్కిలి కొద్ది. పన్ను ఇచ్చేవాళ్లను వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చును. పేరు కీర్తులు సంపాదించి వైద్యవృత్తియందేగాక, వ్యవసాయంలోనూ, ప్రజలకు మేళ్లు సమకూర్చుటలోనూ నిపుణులైన, సి. యల్. రాయుడుగా రప్పు డుండవచ్చునుగాని, నా అజలోకి రాలేదు.

క్యాంపులను గురించి ఇంతటితో సరి. బెజవాడ సర్కిల్ ఉద్యోగాన్ని గురించి ముగించే ముందు, నాతో ఎక్కువ స్నేహం జరిపినవారి విషయమై కొంత చెప్పకపోతే, అసంపూర్తిగా వుంటుందని తలుస్తాను.

కాట్రగడ్డవారు బెజవాడ శివారు మొగల్రాజపురం గ్రామస్థులు. వీ రన్నదమ్ములు ఎనమండుగురు. పెద్దవారు నే నింగ్లండుకు వెళ్లియున్న 1920 సంవత్సరమునకు పూర్వమే ఇంగ్లండుకు వెళ్లి, చదువుచూ అకాలమరణమొందారు. బహుశా సుప్రసిద్ధ దేశభక్తుడు, కీ. శే. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి సమకాలికు డనుకొందును. వీరి తరువాత పిచ్చయ్యగారు, రఘురామయ్యగారు, మధుసూదనరావుగారు, నారాయణరావు గారు, మాధవరావుగారు, భవానిశంకరంగారు, శ్రీనివాసరావు గారు. వీ రందరిలో రఘురామయ్యగారితో నా కెక్కువ స్నేహం. ఇప్పటికిని అది కొనసాగుచున్నది. తతిమ్మావారితో స్నేహం కంటె, మంచి పరిచయం అని చెప్పవలసియున్నది. అయితే భవానిశంకరంగారు, నేను అప్పుడప్పుడు కలసికొంటూ వుండే వారం. కారణం వారు మంచి ముర్రాజాతి బర్రెలను పెంచే వారు. నాకు పశువులంటే సరదా. 1958 సంవత్సరంలో కృష్ణా జిల్లా పశు సంక్షేమ అధికారి శ్రీ మల్లాది కామేశ్వరరావుగారి ప్రోత్సాహంవల్ల కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘం ఏర్పడింది. ఆ సంఘ కార్య కలాపాల్లో శ్రీ భవానిశంకరంగారు ఆసక్తిదాయ కంగా పాల్గొనేవారు. నే నా సంఘానికి ఉపాధ్యక్షుడ నైనందున, తరుచు మాట్లాడుకొనే అవకాశం కలిగేది. నారాయణరావుగారు

కొంతకాలం మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులుగా వుండేవారు. శ్రీనివాసరావుగారు విద్యాధికుడు. వీరు మృదుభాషి. మంచి మర్యాదలు చూపించే మనస్తత్వం. అప్పటికి వారు పిన్న వయస్కులు. నేను పెద్దవాడననే భావంతో చాలా గౌరవం కనపరచేవారు. చాలా సంవత్సరాలనుండి, నవయుగ ఫిలిమ్సు అనే సినిమా ఫిలిమ్సును పంపకంచేసే కంపెనీలో ప్రముఖపాత్ర వహించుచున్నారు. ఇప్పుడు కేంద్ర రాజ్యసభ సభ్యులు.

ఈ ఏడుగురు అన్నదమ్ములలో ఇన్‌కమ్‌టాక్సు ఇచ్చే వ్యాపారంకలవా రొక్క పిచ్చయ్యగారే. వారికి ఇటుకలను తయారుచేసే బట్టీ లొకటి రెం డుండేవి. కొద్ది వ్యాపారం. పైగా లాభాలు చెప్పుకోతగ్గవిగా వుండేవికావు.

కాట్రగడ్డ కుటుంబం, తండ్రి తాతలనుండి మిక్కిలి సంపన్న కుటుంబం. విస్తారమైన భూములేగాక, చాలా డబ్బుండే దట. వీరి తండ్రులు పంచుకొన్నప్పుడు రూపాయలను (ఆ రోజుల్లో కాగితం రూపాయలు లేవు, అన్నీ వెండిరూపాయలే) లెక్కించక, కుంచాలతో కొలిచి పంచుకొన్నారట. మొగల్రాజపురంవైపు బెజవాడ భూములలో చాలా భాగం వీరి కుండేవి. ఆ రోజుల్లో చదరపు గజము 1కి పావలా (ఇప్పటి 25 పైసలు) చొప్పున అమ్మి వేశారట. అవన్నీ ఇండ్ల స్థలాలుగా మారి, ఇప్పుడు చదరపు గజము 1కి రూ. 50 నుండి, రూ. 100 వరకైనా ధరున్నది.

పచ్చవ పాపయ్యగారు జీవితాన్ని స్వల్ప స్థాయిలో ప్రారంభించారు. వీరి దసలు నెల్లూరు జిల్లా, ఉదయగిరి తాలూకాలోని ఒక గ్రామం. పిన్నవయస్సులోనే బెజవాడకు వలసవచ్చారు. ఆదిలో బెజవాడదగ్గర కొరుకొండలో సున్నంబట్టీలు పెట్టి, బెజవాడలో సున్నం గానుగలు ఆడించేవారు. తర్వాత రాక్షసి బొగ్గు ఏజన్సి సంపాదించి, వర్జీనియా పుగాకును అమ్మకానికి తయారుచేసే బారెన్లకు సప్లయిచేసేవారు. మరిన్ని రసాయన ఎరువులను అమ్మేవారు. ఈ విధముగా వ్యాపారాన్ని వృద్ధిచేసుకొని, బెజవాడ పురప్రముఖుల్లో హెచ్చు అంతస్తు కలవారైనారు. గవర్నమెంటుకు, అధికారులకు ఇష్టులుగా వుండేవారు.

బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో వీరికి రావు సాహెబ్ బిరుదు వచ్చింది. స్వతంత్ర భారతంలో పద్మశ్రీ వచ్చింది.

శ్రీ పచ్చవ పాపయ్యగారు మిక్కిలి ఆకర్షణీయమైన వ్యక్తి. మంచితనం మూర్తీభవించినట్లుండేవారు. మిక్కిలి మర్యాదస్తులు, సరసులు, స్నేహశీలురు, దానశీలురు. నాకు తెలిసి నంతవరకు ఎవరిని నొప్పించినట్లు కనపడదు.

1931 వేసవిలో నేను గుంటూరు రెండవ సర్కిల్‌కు ఆఫీసరుగా వుండినప్పుడు, మొట్టమొదటిసారి పచ్చవ పాపయ్య గారిని చూచాను. అప్పు డాయన ఆదాయం మిక్కిలి చిన్నది. కోరుకొండ సున్నంబట్టీలనుండి మాత్రమే అని గుర్తు. తాము స్వయంగా లెక్కలు తెచ్చి చూపించారు. అప్పుడు తల గుడ్డ, కోటుతో రివిగా వున్నా సామాన్య ఆసామివలె నిలుచుండి, లెక్కలు చూపించి వెళ్లిపోయారు. నేను బెజవాడకు వచ్చి నప్పుడు వారి అంతస్తు చాలా పెరిగి వున్నది. అప్పటికే ఖద్దరు బట్టలు ధరించటం ఆరంభించారు. అయితే, జిల్లా అధికారుల ప్రాపకం ఉండేది. దాన ధర్మాలవల్ల, ఎవరిని ఎట్లాదరించవలెనో, ఏ కార్యానికి ఏవిధంగా సాయపడవలెనో, ఏ నిధికి ఏ విరాళా లివ్వవలెనో తెలిసి మంచితనంతో వ్యవహరించేవారు గనుక, అటు ప్రభుత్వోద్యోగులలోనూ, ఇటు ప్రజలలోనూ పలుకుబడి ఉండేది. తోటి వ్యాపారస్తులచేత గౌరవింపబడేవారు.

నేను బెజవాడలో వున్నప్పుడు 1941 లోనో, 1942 లోనో ఏదో సందర్భంగా ఆఫీసుకు వచ్చి మాటలవరుసను, "బొగ్గును కొన్నవారి బాకీలు చాలా నిలిచిపోయిన" వన్నారు. అంటూనే, ఈ మధ్యే నాలుగువేల చదరపు గజాలు, గజము 1కి 11 రూపాయల చొప్పున కొన్నా నన్నారు. "మీ రొక ప్రక్క వ్యాపారం సరిగా జరగటంలేదు, బాకీలు రావటంలేదని అంటూనే, 44,000 రూపాయలు పెట్టి స్థలం కొనటమేమిటి? మీ మూలధనం తగ్గించుకొని, వ్యాపారాని కందకుండా చేయుట మేమి"టని మందలించాను. "ఏదో కొన్నాలెండి" అన్నారు. ఇప్పుడు దానిని చదరపు గజము 1కి 200 రూపాయలన్నా ఎగనెత్తుకు

పోతారు. అది ఏలూరు కాలువ దగ్గర విస్తరించిన వ్యాపార కూడలిలో, రైల్వే స్టేషన్‌కు వెళ్లే రోడ్డు ప్రక్కన ఉన్నది. అలంకార్ వంటి ప్రముఖ సినిమా హాలును ఆ స్థలం ఒక భాగంలో కట్టారు.

అభివృద్ధిచెందుచున్న పట్టణాలలో అవకాశాన్నిబట్టి, నివేశన స్థలాల ధరలు పెరుగుచుండును. అయితే గవర్నరుపేట, గాంధినగరం, పూర్ణానందంపేట, ఈ అలంకార్ సినిమాప్రదేశం, ఏలూరు రోడ్డు ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. అలంకార్ సినిమాహాలున్న ప్రదేశమంతా, వర్తక వ్యాపారంతో మునిగిపోయి యున్నది. నిజానికి బిసెంటురోడ్డు జంక్షన్ దాటి, ఏలూరురోడ్డు కాలువ వంతెనవరకు క్రిక్కిరిసిన దుకాణాలు, నేను 1932-36 సంవత్సరములలో బరంపురంనుండి ఇంటికి వెళ్లుచు, బెజవాడలో దిగినప్పుడు రైల్వేస్టేషను నుండి, బిసెంటురోడ్డు వరకు ఇంచు మించుగా బహిరంగప్రదేశమే. జట్కాబండిలో వెళ్లు చున్నప్పుడు, నిర్జన ప్రదేశంగుండా వెళ్లుతున్నట్లుండేది. మాట వరుసకు, ఆ రోజుల్లో బేరమాడి జట్కా బండికి మూడణా లిచ్చేవాళ్లం.

నేను 1952 మార్చిలో బెజవాడకు అసిస్టెంటు కమిషనరుగా వచ్చినప్పుడు, ఏదో మాటల సందర్భంలో పాపయ్యగారు, "మీరు, నేను బెజవాడ సమీపాన, గుణదలవంటి ప్రాంతాల్లో, స్థలాలు కొని వున్నట్లయితే, ఇప్పుడు మీరు ఉద్యోగం చేయువలసిన అవసరముండేదికాదు, నేను వ్యాపారంతో సతమత మవవలసిన పనివుండేదికా"దన్నారు. నిజమే. దేనికీ అదృష్టముండాలికదా! కొంతవరకైనా, వారికి అలంకార్ సినిమా హాలు ప్రాంతం లాభించింది. నా విషయం. నేను 1941 సంవత్సరంలో కృష్ణలంకలో కొన్న స్థలం విలువపెరిగిందిగాని, అక్కడ హెచ్చుధర కిమ్మనవారు లేరు. పైగా స్థలం చిన్నది. ఈమధ్యనే దాన్ని నా రెండో కూతురు సౌభాగ్యవతి వెలమాటి కమలకుమారికి దఖలుప్రాసి యిచ్చాను.

పాపయ్యగారితో స్నేహభావంతో వున్నా, "ఎక్కడైనా బావగాని, వంగతోటవద్ద బావ కాద"న్నట్లుండేవాడను. వాడు

కూడా మిక్కిలి నిజాయితీపరులు. లెక్కలు పకడ్బందీగా వుండేవి. ఎవరో గుమాస్తా వచ్చి, లెక్కలు చూపించి వెళ్లేవాడు.

నేను 1953 సంవత్సరంలో రిటైరైన తర్వాత, వారి కోరికమీద రెండు మూడు సార్లు వారింటిలో ఒకటి రెండు రోజులుండటం సంభవించింది. ఎంతో ఆప్యాయతతో చూచేవారు. వారి భార్య, పిల్లలు, వారి బావమరది ముప్పా నారాయణరావుగారెంతో మర్యాద చేసేవారు. పాపయ్యగారికి కొడుకులు లేరు. ముగ్గురు కూతుళ్లు. పెద్దకూతురును శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావుకు, రెండో కూతురును శ్రీ పర్వతనేని భూషయ్యగారి కుమారుడు చంద్రశేఖరరావుకు, మూడవకుమార్తె సౌభాగ్యవతి చంద్రవదనను తన భార్య సోదరుడు పైజెప్పిన శ్రీ ముప్పా నారాయణరావుకుయిచ్చి, వైభవంగా వివాహాలుచేశారు. ముగ్గురు కూతుళ్లలో సౌభాగ్యవతి చంద్రవదన నా అభిమానాన్ని ఎక్కువగా పొందిన పిల్ల.

1931 సంవత్సరంలో నా పెద్దకుమార్తె వజ్రాంబ వివాహం జరిగింది. నా పెద్ద కుమారుడు పూర్ణచంద్రరావు అవివాహితుడుగానే, 1938 సంవత్సరంలో చనిపోయాడు. నా రెండో కుమార్తె (జననం 24-9-1939) వివాహం 1958 మే నెల 28-వ తారీఖున, అనగా నేను రిటైరైన 5 సంవత్సరాలకు జరిగింది. ఈ పెండ్లికి పచ్చువ పాపయ్యగారు స్వయంగా వచ్చారు. వారు, పెండ్లికి ముందు ప్రదర్శింపబడిన కూచిపూడి భాగవతుల ఉషాపరిణయ నాటకాన్ని శ్రద్ధగా, ఓపికతో చూచి సంతోషించారు. తరువాత 1960 సంవత్సరంలోనూ, 1961 సంవత్సరంలోనూ జరిగిన వివాహాలకు వారు గాని, వారి బావమరది, అల్లుడు ముప్పా నారాయణరావుగారు గాని హాజరయ్యారు. శ్రీ ముప్పా నారాయణరావు బెజవాడకు వచ్చినప్పటినుండి పాపయ్యగారింటిలో కుటుంబ సభ్యుడుగా వుంటూ వుండేవారు. నేను పాపయ్యగారి కుమార్తెల వివాహాలకు హాజరయ్యాను.

పాపయ్యగారు కొన్ని సంవత్సరాలక్రితం స్వర్గలోకప్రాప్తులైనారు. వారి చక్కని మేడ వారి మూడవ కుమార్తె శ్రీమతి చంద్రవదన, ఆమె భర్త శ్రీ నారాయణరావుగార్ల క్రింద వున్నది. ఈమధ్యనే తిరిగి ఆ యింటికి వెళ్లి వారిచ్చిన విందు నారగించాను. వారి చక్కని కోడలు సౌభాగ్యవతి సౌజన్యను, ఆమె ముద్దులొలుకు పసికొడుకును చూచి ఆనందించాను.

శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణగారి ప్రస్తావన ఇదివరకు తెచ్చాను. గుడివాడ తాలూకా, గురజ వీరి స్వగ్రామం. పిన్న వయస్సులోనే వ్యాపారం కొరకు బెజవాడలో నివాస మేర్పరచుకొన్నారు. పైన చెప్పినట్లు 1919 లో గుడివాడ తాలూకా పసుమర్రు గ్రామ నివాసి శ్రీ కాజ రంగయ్యగారిద్వారా శ్రీ లక్ష్మీనారాయణగారితో పరిచయ మేర్పడి, క్రమేపి గాఢ స్నేహంగా రూపొందింది. వీరి రెండో వివాహానికి వధువు కోసం, హైదరాబాద్‌కు వెళ్లటం వగైరా మొదటిభాగంలో వ్రాశాను. 1920 లో నే నింగ్లండుకు వెళ్లేటప్పుడు బొంబాయి వరకు తోడు వచ్చి నన్ను స్టీమరులో ఎక్కించి సాగనంపిన ముఖ్యులలో లక్ష్మీనారాయణగా రొకరు. 1923 జూలై నెలలో స్వదేశానికి తిరిగి వచ్చి, రెండోసారి ఇంగ్లండుకు వెళ్లుతుంటే, భార్యాభర్తలిద్దరు బొంబాయికి వచ్చి వీడ్కోలు చెప్పారు. ఇంగ్లండులో విద్య పూర్తిచేసుకొని 1927 ఫిబ్రవరిలో ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత, కొన్నిరోజులు వారింట్లో మకాం చేశాను. నేను బరంపురంలో ఉద్యోగంచేస్తూ పెడసనగల్లుకు వెళ్లేటప్పుడు రాత్రి 9 గంటలకు రైలుస్టేషనులో నన్ను కలిసికొని, జట్కాలో నెక్కించుకొని, బిసెంటు రోడ్డులోని తమ నివాస గృహానికి తీసుకొని వెళ్లి భోజనం చేయించి ఆదరించేవారు. 1938 నవంబరులో నా పెద్దకొడుకు చనిపోయినప్పుడు ఆదుకొని ఓదార్చిన వారిలో ముఖ్యులు. 1946 లో మేము గృహ నిర్మాణానికి పూనుకొన్నప్పుడు కలప వగైరాతో కొంత తోడ్పడినారు.

నేను 1940–'43 మధ్య బెజవాడలో ఆఫీసరుగా వున్నప్పుడు, ఉద్యోగ స్వభావాన్నిబట్టి అరుదుగా కలిసికోవటం, కొంత

ముభావంగా వర్ణించటం జరిగింది. ఎప్పుడో ఒకటి, రెండు సార్లు తప్ప నా భార్య వా రింటికి వెళ్లలేదు. నా చిన్నబిడ్డలకు వా రిల్లు పరాయి ఇల్లే,

నేను బెజవాడకు వచ్చునప్పటికి వా రుచ్ఛదశలో వున్నారు. శ్రీ లక్ష్మి జ్యూయలరి కంపెని అనే పేరుతో విరివిగా బంగారు నగలను, వెండి వస్తువులను అమ్ముచుండేవారు. వెండి సామాను లను మిక్కిలి నైపుణ్యంగా తయారుచేసే రెండు మూడు కుటుం బాలను మద్రాసునుండి తీసికొనివచ్చి, వారికి వసతి ఏర్పరచి, స్వయంగా అజమాయిషీతీసుకొని మిక్కిలి సొగసైన, నాణ్యం గల భోజన పళ్లాలను, మంచినీళ్ల గ్లాసులను, మరచెంబులను, నేతిగిన్నెలను, ఉపాహారాని కుపయోగించే చిన్న పళ్లాలను తయారుచేయించేవారు. వారి నేతిగిన్నెల్లోను, ఉపాహార పళ్లా ల్లోను ప్రత్యేకత కొట్టవచ్చినట్లుండేది. మరిన్ని కలప వ్యాపారం మొదలుపెట్టారు. భాగస్థులతో కలసి పిఠాపురం రాజాగారి సంబంధమైన కొన్ని కలప తోపులను తీసుకొని వానిని కొట్టించి కలపను రాజమండ్రిలోను, బెజవాడలోను అమ్మే వారు. ఇవిగాక కొన్ని స్థలాలు సంపాదించి పెద్ద వసతిగృహాలను, దుకాణం కొట్లను కట్టించారు. వీని అన్నిటివల్ల బెజవాడ వర్తకుల్లో ఎన్నదగినవారుగానే తయారైనారు.

నే నింగ్లండునుండి తిరిగి వచ్చిన తర్వాత, లక్ష్మీనారాయణ గారు ఖద్దరుబట్టలు తప్ప, ఇతరం ధరించగా నేను చూడలేదు. నిజానికి 20 నంబరు లేక 40 నంబరు నూలుబట్టలనే ధరించేవారు. ఒకొక్కప్పుడు గోనెపట్టాలవలె వారి బట్ట లుండేవి. జాతీయ భావాన్నిబట్టో, పదిమందితోబాటు కాంగ్రెసుతత్వంతోనో కాంగ్రెసు నాయకులకు అండదండగా వుండేవారు. కాంగ్రెసు వారికి భోజనం వగైరా సప్లయిచేయటంలోను, పండ్లు ఫలహారాల నందిచ్చుటలోను, జైలుకు వెళ్లేటప్పుడో, తిరిగి వచ్చేటప్పుడో రాజకీయ బాధితులకు వీడ్కోలివ్వటం, స్వాగతం చెప్పటం జరుపుచుండేవారు. మన ఆంధ్ర కాంగ్రెసు నాయకులలో

చాలామంది వారి మర్యాద, మన్నలను పొందినవారే. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి వంటి ప్రముఖ బెజవాడ కాంగ్రెసు వారితో స్నేహ ముండేది. మొత్తంమీద జాతీయవాదిగా, కాంగ్రెసు అభిమానిగా పేరు పొందారు. ఏది ఎట్లున్నా, గాంధీజీయందు భక్తి తాత్పర్యములు గల గాంధేయుడనే చెప్పాలి.

వ్యాపారం విషయంలో నిర్దాక్షిణ్యుడు. పని వాళ్లయందు కఠినంగా వర్తించటం, నిర్మొగమాటంగా వ్యవహరించటం, పరుషోక్తులాడటం సర్వసామాన్యం. తన భార్య తమ్ముడు శ్రీ జాస్తి సూర్యనారాయణరావు, తన చిన్నతనమునందే బావ గారి నగల కొట్లో చేరాడు. అతనిని బూతులు తిట్టటం నేను విన్నాను.

ఆస్తులు సంపాదించటంలో చాలా కఠినుడు. స్వార్థం మూర్తీభవించినట్టివాడు. మరిన్ని, ఆస్తి సంపాదనలో, స్నేహ ద్రోహం చేయటానికి సందేహించేవాడుకాదు. అప్పుపెట్టి, అప్పు తీసుకొన్నవాళ్లు ఇబ్బందుల్లో వున్నప్పుడు ఎవరెన్ని చెప్పినా లెక్కపెట్టక నిర్దాక్షిణ్యంగా వత్తిడిచేసి, తాను కన్నువేసిన ఆస్తులను లాక్కొనటం నేను చూచాను. రైల్వేస్టేషన్ రోడ్డులో వున్న బ్రహ్మాండమైన మేడ స్థలం, వరుస కొట్లుగల ఇంకొక బ్లాకు స్థలం, ఒక పెట్రోలు బంకు మిత్రులుగా వుండిన వారినుండి సంగ్రహించినవే. నే నింగ్లండుకు వెళ్లిన ఆదిలో నా దుబారా ఖర్చులవల్ల మా నాన్నగారు పంపిన డబ్బు అయిపోగా, వీరికి వ్రాయగా వెయ్యో, కొంచెం తక్కువగానో పంపించారు. దానికి రూపాయ వడ్డీచొప్పున బేరీజువేసి, గోల్లాడగొట్టి నాలుగువేలు పైచిలుకు నానుండి పుచ్చుకొన్నారు. వారినుండి డబ్బు తెప్పించుకొన్నది మా నాయనగారికి తెలిసి అభిమానం పొడుచుకొనివచ్చి, "లక్ష్మీనారాయణగారి డబ్బు, లక్ష్మీనారాయణ గారి కిచ్చివేస్తున్నా"నని ఆక్నె ఫర్ధుకు వ్రాయించారుగాని, వారు 1924 మార్చిలోనే చనిపోయారు. 1927 ఫిబ్రవరిలో నేను తిరిగి వచ్చిన తర్వాత, లక్ష్మీనారాయణగారి లెక్కపుస్తకాలలో వడ్డీతో పేరుకొని నామీద ఖర్చు వుండింది. నేను కాట్రగడ్డ

రఘురామయ్యగారినుండి 1949 సంవత్సరంలో కొనియుండిన సత్యనారాయణపురంలోని స్థలంలో, నేను 1952 సంవత్సరంలో అసిస్టెంటు కమిషనరుగా బెజవాడకు వచ్చియుండినప్పుడు, రెండు చిన్నయిండ్లు కట్టించాలని ప్రయత్నించాను. అయితే ఇళ్లు కట్టటానికి ముందు ఒప్పుకొన్న సీతారామప్రసాద్ కంపెనీవారిలో ప్రసాద్‌గారు, చాలా ఖర్చు అవుతుందని నిరుత్సాహపరచటం వల్ల ఆ ప్రయత్నం మానేశాను. ఇండ్లు కట్టటానికని పెడసనగల్లునుండి 6,000 రూపాయలు తెప్పించాను. ఆ ప్రయత్నం మానుకొన్నందువల్ల, లక్ష్మీనారాయణగారు అప్పుగా తీసుకొన్నారు. చాలా సంవత్సరాలు గడచినా, ఆ అప్పు వారు బ్రతికుండగా తీర్చలేదు. వారి మరణానంతరం, వారి దత్తత కుమారుడు చిరంజీవి రామకృష్ణబాబు తీర్చాడు. ఒక విషయం మాత్రం చెప్పవలసియున్నది. ఒకదఫా ప్రోనోటు వాయిదా తీరిపోయింది. వాయిదా పోయిన నోటును తీసుకొనివెళ్లి, వారు దుకాణంలో వుండగా వారి కిచ్చి నేను వెళ్లిపోయాను. వారు తిరిగి క్రొత్త ప్రోనోటు వ్రాసి పంపారు. ఎందు కిది వ్రాస్తున్నానంటే, నేను డబ్బు కక్కుర్తిపడి ఎన్నిసార్లు వ్రాసినా, జవాబిచ్చేవారు కాదు. వారికి తెమలకపోవటం అటుంచి, డబ్బును చేజారనివ్వని లోభత్వం ఉండేది.

ఈ సందర్భంగా ఇంకొకటి చెప్పవలసివున్నది. నేను బెజవాడలో ఉంటున్నాను కాబట్టి, లక్ష్మీనారాయణగారు నా స్నేహితులు కాబట్టి, మా వదినె కొడుకులు, కూతుళ్లు వగైరా నగలు నాద్వారా చేయించుకొనేవారు. ఒక్కొక్కప్పుడు తమవద్ద వుండిన బంగారం, వెండి తెచ్చి యిచ్చేవారు. లేక ప్రాతనగలను మార్పించుకొనేవారు. నేను కోరినను లెక్క చెప్పక, నేను బెజవాడ విడిచిన కొన్ని సంవత్సరాలకు ఒక పెద్ద జాబితా వ్రాసి వడ్డీతో కొన్నివందలు నా పేర బాకీ చూపారు. నగలు చేయించుకొన్నవారిపేర కాతాలు పెట్టలేదట. పద్దులన్నీ నా పేరే నమోదు చేశారట. కాలం గడచిపోయి నందున, ఎవరిని అడగటానికి వీల్లేక వచ్చినట్లు ఆ బాకీ అంతా నేనే యిచ్చుకొన్నాను.

అయితే ఈ స్థితి, లెక్కల లోపం కావచ్చును. నేను 1958 సంవత్సరంలో, నా రెండో అమ్మాయి పెళ్ళి కనుకొందును, అయిదు వందల యాభై రూపాయల వెండి సామాను వారి వద్దనుండి తీసుకొన్నాను. ఇది వారి నా ఆవర్జా ఖాతాలో లేదు. వారి దత్తత కుమారుడు ప్రోనోటు బాకీ తీర్చే సమయంలో నాకు జ్ఞప్తికి వచ్చి ఆ అబ్బాయికి చెప్పి, "ఒక వేళ డబ్బిచ్చే శానేమో పుస్తకాలు చూడు" మని హెచ్చరించాను. అతడు ప్రాత చిఠాలు తిరగవేసి ఆ పద్దును పట్టుకొన్నాడు. డబ్బిచ్చినట్లు లేదని చెప్పాడు. దానిని వడ్డీతో మినహాయించుకొని, తతిమ్మాది తీసుకొన్నాను.

నేను 1953 లో రిటైరైన క్రొత్తలో, వారి బందరు రోడ్డు మీద వున్న పెద్ద స్థలం అమ్మాలనుకొని, "మీరుకూడ కొంత తీసుకొండని ప్రోత్సహించగా, నా ప్రావిడెంటు ఫండు, పోస్టల్ ఇన్సూరెన్సు నుండి డబ్బిచ్చాను. డబ్బిచ్చిన 3 సంవత్సరాలకు, విక్రయ దస్తావేజు వ్రాసి యిచ్చారు. నే నారోజుల్లో తరుచు మద్రాసులో నెలలకొలది మా పెనాయ్ నగర్ ఇంటిలో వుండేవాడను. అందువల్ల ఉత్తరాలు వ్రాయటమే గాని, ముఖాముఖిని వత్తిడిచేయ లేక పోయాను. ఒకటి, రెండు సార్లు అడిగినా, "మీ కిప్పుడు వ్రాసి యిస్తే మునిసిపాలిటీవాళ్లు ఎక్కువ పన్ను వేస్తారు. వాళ్లతో ఇప్పటికే తగాదా వున్నది. కొంచం ఆగం"డనేవారు. మొగమాటం పడేవాడిని. స్థలం చిన్నది కాదు. 1525 చదరపు గజాలు. రేటు గజం 1కి రూ. 10. మొత్తం 15,250 రూపాయలకు దస్తావేజు వ్రాసింది. ఈ మొత్తాన్ని ముందుగానే యిచ్చాను. మూడు సంవత్సరాల కివ్వవలసిన వడ్డీ నివ్వలేదు. వ్రాసియిచ్చిందే చాలని సంతోషించాను. చివరకు దస్తావేజు వ్రాయించి యిచ్చేటప్పుడు, విస్తీర్ణం నిర్ణయించటంలో కూడా వారి స్థలాని కంటె ఎక్కువ పడిందేమో అని నా అనుమానం. బెజవాడ - బందరు రోడ్డు మార్జిన్ మా టటుంచి, ప్రక్క చిన్నరోడ్డు మార్జిన్ కొంతకలిపి, లెక్క తేల్చాడేమో అని సందేహం నా కిప్పటికిని వుంది. మొత్తంమీద భస్మాసుర హస్తం. ఈ సందర్భంలో ఇంకొకటి గుర్తుకు వస్తున్నది. ఈయనగారు ఇదిగో వ్రాసి యిస్తాను, అదిగో

వ్రాసి యిస్తాను అని కొంతకాలం గడిపిన తర్వాత రూ. 1250 లకు దస్తావేజు స్టాంపులు తెప్పించి వ్రాయించమని, నా బంధువు లావు పిచ్చయ్య కిచ్చి వెళ్లాను. ఆయన వానిని తన దుకాణం నగదు పెట్టెలో పెట్టాడట. ఒకరాత్రి దొంగలుపడి, నగదుపెట్టెను అపహరించుకొని పోయారు. చచ్చినట్లు తిరిగి స్టాంపులు కొనుక్కొన్నాను.

ఇంత నిష్ఠురంగా నేను వ్రాసినా మొత్తంమీద ఆయనంటే, ఎక్కువ అభిమానంగానే వుండేవాణ్ణి. నే నింగ్లండునుండి వచ్చిన క్రొత్తలో, ఆయన లక్ష్మీ జ్యూయలరి కంపెని అడ్వర్ టైజ్ మెంటు కూడా వ్రాసిపెట్టాను. 1928 సంవత్సరంలో నేను వ్రాసిన కథవంటి వ్యాసం, "గృహలక్ష్మి" లో కావాలని దాని పేరెత్తాను. 1943-46 మధ్య నేను కాకినాడలో ఆఫీసరుగా నున్నప్పుడు ఈయన కోరికపై, ఈయన పిఠాపురంవారినుండి కొనిన కలపతోపుల విషయంలో పిఠాపురం జమీందారుగారి దివానుతో తగవులాడవలసి వచ్చింది. ఈవిధంగా ఈయనతో స్నేహం కొనసాగించటానికి కారణం, ఈయన నే నింగ్లండు నుండి వచ్చిన క్రొత్తలో నేను సంసారికంగానూ, ఆర్థికంగాను మిక్కిలి గడ్డు స్థితిలో వున్నప్పుడు, సానుభూతిని చూపించి నన్నాదరించుటయే. వా రింటిలో కొన్నిరోజులు గడిపానని పైన చెప్పాను. అప్పుడు భార్యా భర్తలు చూపిన ఆదరణ, స్నేహం నన్ను మిక్కిలి కృతజ్ఞుణ్ణి చేసినవి. డబ్బు సాయం ఏ మాత్రం లేదుగాని, (దానిని నేనుకోరనూలేదు, వారు సూచించనూ లేదు) స్నేహం నెరపినందుకు, అండదండగా (మోరల్ సపోర్టు) వుండినందులకు వారియెడ కృతజ్ఞత వుండేది. చేతలలో ఎట్లున్నా మాటలలో చాలా స్నేహపూరితంగా వుండిన రోజులు నా కృతజ్ఞతను రేకెత్తించుచుండేవి.

ఆయనకు సంతానం కలుగలేదు, భార్య సోదరి కుమారుణ్ణి దత్తత చేసుకొన్నాడు. ఆయన కండదండగా వుండిన భార్య నాగభూషణమ్మగారు చనిపోయారు. ఈయనకు వృద్ధాప్యంతో బాటు దత్తత కుమారుని మామల సంబంధంగా కొంత చికాకు

సంభవించింది. ఆస్తులు విరివిగా సంపాదించటం, పెద్ద పెద్ద కట్టడాలు కట్టించటం, వ్యాపారం తగ్గిపోవటం, నమ్మినవాళ్లు కొంత మోసం చేయటం (పులిమీద పుట్ర అంటారుకదా) వారికి మనస్తాపం హెచ్చించాయి. చిన్నప్పటినుండి తనవద్ద విశ్వాసమైన కుక్కగా పడియుండి పగలనక, రాత్రనక వెట్టిచాకిరి చేసిన బావమరది శ్రీ జాస్తి సూర్యనారాయణరావుకు ఏమీ ముట్టచెప్పలేదే అను చింత ఆయనను క్రుంగదీసింది. రైలు స్టేషన్ రోడ్డుమీది విలువగల కొట్లను రేపు వ్రాసిద్దామనుకొని ఆ సందర్భంగా ఏదో ఏర్పాటులు చేశాడట. ఆ రాత్రే అకస్మాత్ గా చనిపోయాడు.

ఆయన మిక్కిలి కష్టజీవి. భోజన విషయంలో తప్ప, ఇతర సంతృప్తి ఎరుగడు. మండువేసవిలో తలమీద పైపంచె వేసుకొని, తన ఇంటినుండి తన వ్యాపార స్థలానికి రెండు మైళ్లైనా నడచిపోయేవాడు. మోటారుకారుమాట టటుంచి, చివరకు రిక్షాకూడా పెట్టుకొనలేదు. తాను కష్టించి సంపాదించిన సొత్తు తన వదినె కుమారుని కందించి తనదారిని తాను పోయాడు. ఆయన మరణవార్త కొన్నిరోజులకుగాని నాకు తెలియలేదు. ఆయన కర్మకువెళ్లి సానుభూతిని చూపించి వచ్చాను.

శ్రీ లావు పిచ్చయ్యను గురించి పైన చెప్పియున్నాను. ఆయన నమ్మకద్రోహం చేసి బ్రతకవలసినరోజులు చాలా వుండగానే మరణించాడు. మరణించిన కొన్నిరోజులకుగాని, నాకు ఆయన చావు తెలియలేదు. నేను ఉద్యోగ విరమణ చేసినప్పుడు, "నా కత్యవసరంవచ్చింది, లారీకొనబోతున్నాం, లారీలు వగైరా కొనుగోలుకు అప్పుపెట్టేవాళ్లదగ్గరకు వెళ్లితే, అధికవడ్డీయేగాక కమిషన్ వగైరా గుంజుకొంటారు. మీరిచ్చేఅప్పుకు రూపాయ వడ్డీతో, 12 వాయిదాలలో తీరుస్తాము" అని నమ్మకంచెప్పితే, అప్పిచ్చాను. దానిని కొంతవరకే 2, 3 సంవత్సరాలకు తీర్చాడు. తర్వాత తిరిగి 4,000 రూపాయలు పట్టుకువెళ్లాడు. ఇంకొకదఫా అడిగితే లేదన్నాను. నన్ను బలవంతపెట్టి పెడసనగల్లుకు వుత్తరం వ్రాయించుకొని వెళ్లాడు. అక్కడ మా వదినె కొడుకువద్ద అప్పుతీసుకొన్నాడు. 2,000 రూపాయలు మా వాళ్లిచ్చారు. వీనిని

కలుపుకొని అతడు మరణించేటప్పటికి 17,000 రూపాయలు నిలవ బాకీ ఉండింది. ఇప్పటికి పాతికవేలు దాటియుండును, ఈ మొత్తంలో ఒకదమ్మిడీ రాలేదు. ఇకరాదు.

అతని కొడుకులు ఇన్‌సాల్‌వెన్సి దాఖలుచేశారు. కొట్టు పోయింది. లారీ అంతకుముందే పోయింది. తిరువూరు పెట్రోలు బంకు ఉండేది. అదీ పోయింది. అక్కరకువచ్చిన పెద్ద కుమారుడు చనిపోయాడు. తతిమ్మా కొడుకులు చెల్లాచెదరై పోయారు లాగుంది. కూతురును ఎవరికో యిచ్చి పెండ్లిచేస్తే, అల్లుడు మీదకై కూర్చుండినాడు. ఇక ఆ బాకీ ప్రస్తావనే మానివేశాను.

అతడు బ్రతికివున్నప్పుడు నేనెంతో చెప్పాను. "నీవు ఇబ్బందుల్లో వుంటే, నీకు అన్ననుకదా, పైగా కొద్దో గొప్పో వున్నవాడను, కొంత పలుకుబడికూడా వున్నదికదా, నాతో నిజం చెప్పు. ఏదో విధంగా నీ బాకీలు సర్దుబాటు చేద్దాము. నీ వ్యాపారం కొనసాగిద్దాము" అని పదేపదే చెప్పినా, "ఏమీ లేదు అన్నయ్యా, అన్నీ మామూలుగానే నడుస్తున్నాయి" అని చెప్పేవాడు. ఒకటి రెండు సార్లు "మన మప్పుడు కృష్ణలంకలో 1941 లో కొన్న భూమిలో నీ వాటా భూ మున్నదికదా, ఏదో ధరకట్టుకొని, నా కది వ్రాసివ్వు. నా బాకీ పోను నేను నీకివ్వవలసివస్తే ఇస్తాను. బాకీ మిగిలితే వదులుకొంటాను" అని చెప్పాను. "మీరే మీస్థలాన్ని అమ్మాలనుకొంటున్నారుకదా. బేరంపెట్టి నా స్థలాన్ని అమ్మి మీ బాకీ తీరుస్తా"నని సమాధానం చెప్పేవాడు. నిజానికి అతడు ఆ స్థలాన్ని, తన కాపుర ముండిన తన స్వంత యిల్లును ఒకాయనకు (ఆయన రైల్వే స్టేషను మాష్టరు చేసి రిటైరై వడ్డీ వ్యాపారం చేసుకొంటున్నాడట) తాకట్టు పెట్టాడు. ఈవిషయం కమ్మిగా చేశాడు. అతని మరణానంతరంగాని ఈ సంగతులు నాకు తెలియలేదు. తరువాత, తాకట్టు పెట్టించుకొన్నవారిని కలిసికొని ఎన్నో విధాల రాజీకి ప్రయత్నించాను. ఆ ఋణదాత చాలా ఘటికుడు. కుదరలేదు. నా సొమ్ము పూర్తిగా పోయింది. నాతో నిజం చెప్పి యుండినట్లైతే, సకాలంలో చర్య తీసుకొనియుంటే నా వంటి

నమ్మిన ఋణదాతలకు మోసం జరిగేదికాదు. అతని పిల్లలు దిక్కులేని వాళ్లయ్యేవారు కాదు.

ప్రతి సర్కిల్లోను ఇద్దరో, ముగ్గురో ఎక్కువ పరిచయులుతప్ప, తతిమ్మా పన్నుదారులు నా కసలే జ్ఞాపక ముండేవారుకారు. ఆఫీసునుండి ఇంటికి వచ్చిన తర్వాత కేసులు గుర్తే వుండేవి కావు. ఫైల్సును ఇంటివద్ద చూచినప్పుడు, టైపుకొట్టిన ఆర్డర్లను చదివినప్పుడు ఫైల్సులోను, ఆర్డర్లలోను వున్న విషయం తాత్కాలికంగా తెలియటం తప్ప, వ్యక్తులను గురించిన ఆలోచ నెంత మాత్ర ముండేదికాదు. వారుండినను లేనట్లే. అందువల్ల నాబుర్ర ఖాళీగానే వుండేది. కేసులను గురించిన చింత, చీకు వుండేది కాదు. మూడు సంవత్సరాలు వరుసగా నా ఎదుటకు వచ్చి లెక్కలను తనిఖీ చేయించుకొన్నవారైనా, ఎక్కడైనా కనపడితే ఎవరో వారనుకొనేవాడను. ఈ మనస్తత్వంవల్ల ఏ పన్నుదారైనా కొంత భిన్నత్వం కనపరచినా దాని యోచన వుండేది కాదు, తరువాత జ్ఞాపక ముండేదికాదు.

కాని కొందరు పన్నుదారులు, ఆఫీసులో జరిగిన కొన్ని విషయాలు గుర్తుంచుకొంటారు. ఆఫీసరు ప్రత్యేక నడవడిని గమనిస్తారు. మరచిపోరు. ఈమధ్య నేను బెజవాడనుండి ఇంటికి వచ్చుటకు బస్సు ఎక్కాను. నాతోబాటు పెద్ద పంగనామాలాయ నెక్కి నాకు వెనుకప్రక్క కూర్చొన్నాడు. ప్రాతఃకాలమైనందున కాబోలు రామనామస్మరణ మొదలుపెట్టాడు. ఆ ధ్వని నాకు చిరాకు కలిగించింది. ఉండబట్టలేక "సంకీర్తన బస్సులోనే చెయ్యాలా, ఇంటివద్ద చేసుకొని రాలేక పోయారా" అన్నాను. ఇంతలో కొంతమంది ప్రయాణీకులు రాగా ఆయన లేచి వచ్చి, నా ప్రక్క ఖాళీ సీటులో కూర్చొన్నాడు. తా నేదో భజన సమాజంలో పాల్గొంటున్నా నని చెప్పి, "అయ్యా, మిమ్ములను నే నెరుగుదును. మీరు ఆఫీసరుగా వుండినప్పుడు మీ వద్దకు లెక్కలను తీసుకొనిరాగా, నన్ను చూచీ చూడటంతోనే, శ్రీ మద్రామానుజాయ నమః అని నవ్వుతో అన్నారు" అని చెప్పాడు. అప్పు డప్పు డిట్టి పరిహాసాలు చేస్తూ వుండేవాడను వ్యక్తులను బట్టి, వారి నడవడిని బట్టి.

బొత్తిగా అబద్ధాలకోరు మీద, దగాకోరు మీద, సొంతం తప్పుడు లెక్కలను చూపించే వారి మీద విరుచుకుపడే వాడను. "ఇంత మురదనష్టపు లెక్కలు తేకపోతే, అసలే పుస్తకాలు లేవంటే పోయేది కదా" అని చేతిలో వున్న పుస్తకాన్ని విసరికొట్టేవాడిని. అయినా కడుపుమీద కొట్టే స్వభావంకాదు నాది. పై ఆఫీసర్లు సంతోషిస్తారని, ఉన్నది లేనిది కలిపి, మాడిచి చంపేవాడను కాదు. ప్రతి చిన్న, పెద్ద కేసును సానుభూతితో చూడటం నా మూల దృక్పథం. అందువల్ల దుష్టబుద్ధితో పన్నుదారులను హింసించనని అందరికీ తెలిసివచ్చేది. ఆ కారణాన ఒకవేళ నేను తొందరపడి కోపపడినా, చికాకుపడినా, అవహేళన చేసినా పట్టించుకొనేవారు కారు.

ఇంకొక విషయం చెప్పటం అనుచితం కాదనుకుంటాను. న్యాయమనితోస్తే, మామూలుగా ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు తల పెట్టుకోసి జోక్యాలు పెట్టుకోటానికి, బాధ్యతలను వహించ టానికి సందేహించేవాడనుకాదు. ఉదాహరణకు కోలవెన్ను కాపురస్థుల కేసొకటి తనిఖీకి వచ్చింది. ఆ యింటి యజమాని కొన్ని సంవత్సరాలక్రితం చనిపోయాడు. ఆయన పెద్ద కొడుకు శ్రీ కంచెర్ల చంద్రశేఖరరావు, నేను బెజవాడ సర్కిల్‌లో చేరిన క్రొత్తలో వచ్చి చూచాడు. నిజానికి కొన్ని సంవత్సరాలకు పూర్వం ఆయన పెండ్లికి వెళ్లినవారిలో నేనొకడిని. దానికి కారణం కమ్మపెద్ద, న్యాయవాది, హుందాతనంగలిగిన పెద్దమనిషి శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారి కుమార్తె పెండ్లికూతురు కావటమే. శ్రీ గోపాలకృష్ణయ్యగారిది కూడా కోలవెన్నే. తర్వాత కొద్దిరోజులకు శ్రీ చంద్రశేఖరరావు చనిపోయాడు. చంద్రశేఖరరావు తల్లి చనిపోగా, ఆయన తండ్రి కోటమ్మ అనే ఆమెను ద్వితీయం చేసుకొన్నాడు. ఆమెకు కేశవరావు వగైరా సంతానముండినారు. శ్రీ చంద్రశేఖరరావు నన్ను బెజవాడలో కలసికొనుటకు ముందునుండి తాను, తన మారుటితల్లి సంతానం విడిపోయి వేరువేరుగా ఉంటుండినారు. పిత్రార్జితం పంచు కోవాలని పంపిణీలు వేసుకొని, దస్తావేజులుకూడా వ్రాయించు

కొన్నారు. ఇంతలో చంద్రశేఖరరావు చనిపోయాడు. చంద్రశేఖరరావు బిడ్డలు, ఆయన పెద్దత్తనుకొంటాను, సుబ్బమ్మనే వయస్సు మళ్లిన విధవామె పెత్తనంక్రింద నుండినారు. శ్రీమతి సుబ్బమ్మ, శ్రీమతి కోటమ్మ మధ్య సామరస్యం లేకపోవటమే గాక, చీటికి మాటికి గిల్లికజ్జాలు చెలరేగుచుండేవి. అందువల్ల పార్టిషన్ దస్తావేజును పూర్తిచేయించి, రిజిస్టర్ చేయించలేదు. ఈ పరిస్థితిలో, నేను కేసు విచారణకు నోటీసిచ్చినప్పుడు, పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వలి కాపురస్థుడు శ్రీ వెలమాటి సూర్య నారాయణమూర్తి అనేవారు వచ్చి నన్నాఫీసులో కలసికొన్నారు. వారు సంగతి సందర్భాలను విశదీకరించి. "కోటమ్మ, సుబ్బమ్మ గార్లకు పడటంలేదు. ఇద్దరూ భీష్మించుకు కూర్చున్నారు. పార్టిషన్ పూర్తిచేసి, రిజిస్టర్ చేయించుం డంటే వినటంలేదు. మీరు స్వయంగా వారికి నచ్చజెప్పకపోతే అన్యాయంగా హెచ్చుపన్ను పడుతుం"దని ప్రాధేయపడ్డారు. శ్రీ సూర్యనారాయణమూర్తి గారు, కోటమ్మగారి పెద్ద కొడుకు శ్రీ కేశవరావుకు పిల్ల నిచ్చి యున్నారు. అందువల్ల వారి కంత ఆదుర్దా. ఆయన చక్కగా నచ్చజెప్పగల శక్తికలవాడు. పైగా, ఆడంగుల తగాదావల్ల కుటుంబం దెబ్బతినటం అన్యాయ మనిపించింది. కోలవెన్ను కంకిపాడు నానుకొని, బెజవాడకు 12 మైళ్ల దూరం మాత్రమే. అందువల్ల నేను కంకిపాడు క్యాంపు నుండో, లేక సరాసరి బెజవాడ నుండో ఒక ఆదివారం, వా రింటికి వెళ్లి కోటమ్మగారితోను, సుబ్బమ్మగారితోను వేరు వేరుగా మాట్లాడి ఒప్పించాను. కొలది రోజులకు పంపిణీ దస్తావేజును పూర్తిచేసి, రిజిస్టర్ చేయించారు. నేను పంపిణీని అంగీకరించి, వేరువేరుగా పన్ను వేశాను.

బెజవాడ సర్కిల్‌లో ఆఫీసర్లతోగాని, పన్నుదారులతో గాని ఎట్టి అవాంతరాలు లేకుండా ప్రశాంతంగా జరిగిపోయింది.

బెజవాడలోని ఇతర ఆఫీసర్లలో కూడా నా సంబంధం పట్టీ పట్టన ట్లుండేది. ఏ ఆఫీసరుతోకూడా, ఆత్మీయత పెంచుకోలేదు. అసలు నా స్వభావం పులుముకోవటం కాదు. పైగా, హోదాను కాపాడుకొనవలెననే దృక్పథంకలవాడను. గర్వపోతును కాను. విద్యాధికుడనని అహంభావత్వం కలవాడను కాను. కలసి

కొన్నప్పుడు మిక్కిలి చనువుగా, స్వేచ్ఛగా వర్తించే పద్ధతివాడను. అయినా, కలగలపుకొని వారి ఇండ్లకు వెళ్లటం, వారిని మా యింటికి ఆహ్వానించటం, చీటికిమాటికి ఏదో నెపంమీద భాయి భాయి అనటం నా స్వభావానికి వ్యతిరేకం. అందువల్ల నేను అరుదుగా మా అసిస్టెంటు కమిషనరు చిడాగారు స్థాపించిన ఆఫీసర్ల క్లబ్బుకు వెళ్లినప్పుడు, ప్రతినిత్యం వెళ్లేవానివలె ప్రవర్తించినా, స్నేహితునిలాగా మెలగినా, అంతే, తర్వాత తిరిగి కలిసికొన్నప్పుడే ఆ మిత్రత్వం.

ఈ సందర్భంలో ఒక యువక మునిసిపాలిటి ఆఫీసరు నడవడిని గురించి చెప్పదలచాను. ఆయనది సామాన్య ఉద్యోగమే. ఆఫీసర్ల క్లబ్బులో సభ్యుడైనాడు. ఎందువల్లనో నామీద ఆయన కయిష్టత కలిగింది. నన్ను కించపరచాలని తలంచినట్లున్నాడు. నా కృష్ణలంక స్థలంలో, తోటమాలి నివాసానికి చిన్న తాటాకు పాక వేయించాను. దానిని "మునిసిపాలిటి అనుమతిలేకుండా మీరు వేశారు. దానిని పడగొట్టా"లని తాఖీదిచ్చాడు. నిజానికి మునిసిపాలిటివారు దాని ప్లానును అంగీకరించి, అంగీకరించినట్లు ఆర్డరు వేసియే యున్నారు. ఈ తొందరపాటు యువకునకు ఆ విషయం తెలిసి యుండదు. పాకను తాను చూచాడో, ఎవరైనా చెప్పారోగాని, ఆ పాకవల్ల ఎవరికీ ఏ ఇబ్బంది కలగక పోయినా, అది మారుమూలనున్న తోటప్రాంతంలోవున్నా, తానొక అధికారి, తన అధికార దర్పాన్ని చూపించాలి, ఈ ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరు తాను గొప్పవాడననుకొంటున్నాడు, నా తడాఖా, మునిసిపాలిటి తడాఖా, చూపించాలనుకొన్నాడు కాబోలు, పాకను పడగొట్టా లన్నాడు. నేను తగినట్లు చివాట్లు పెట్టుచూ, "ఇదివరకే మునిసిపాలిటి శాంక్షన్ అయిం"దని వ్రాశాను. తిరిగి కిక్కురు మనలేదు. ఆఫీసర్ల క్లబ్బులో కలసినప్పుడు ఎరగనట్లే నటించాడు.

కొందరు చిన్న ఆఫీసర్లకు, కొందరు పెద్ద ఆఫీసర్లమీద అకారణంగా అసూయ పుడుతుంది. అసూయ మానవ స్వభావంలో భాగమేమో అనుకొందును. కొందరిలో ఇది ప్రస్ఫుటంగా



విజయవాడ ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్ వీడ్కోలు 1943 — కూర్చున్నవారు : 1. శ్రీ పి. వి. నరసింహాశర్మ, 2. ఆడిటరు, శ్రీ ఉపద్రష్ట, 3. శ్రీ తుమ్మలపల్లి నారాయణరావు, 4. గ్రంథకర్త, 5. ఆడిటరు, శ్రీ పి. రామచంద్రరావు, 6. ఆడిటరు, శ్రీ వీర్రాజు, 7. ఆడిటరు. శ్రీ టి. వెంకటదాసు
నిలుచున్నవారు : 1. శ్రీ ముష్టి సేతురామయ్య, 2. శ్రీ గుప్తా, 4. ఆడిటరు శ్రీ రామచంద్రరావు, 6. ఆడిటరు, శ్రీ రామానుజరావు
7. శ్రీ కోలవెన్ను వెంకటేశ్వరరావు, 9. శ్రీ అమీరుద్దీను



కాకినాడ ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్ ఛార్జి 1943

కూర్చున్నవారు : 1. శ్రీ రంగనాయకులు, 3. శ్రీ తురగా రామచంద్రరావు, ఆఫీసరు, 4. గ్రంథకర్త, 5. శ్రీ జి. నారాయణరావు, 6. శ్రీ శర్మ

నిలుచున్నవారు : ( రెండవ పంక్తి )  1. అప్పారావు,  8. జవాను,  9. మహమ్మదీయ జవాను

కనపడుతుంది. కొందరు అసూయపడ్డా, తమ మంచి నడవడిలో దానిని కప్పివేస్తారు, బయటికి తోపనివ్వరు.

ఈ విధంగా మూడు సంవత్సరాల పైచిలుకు బెజవాడ ఇన్‌కమ్‌టాక్సు సర్కిల్ ఆఫీసరుగా ఉద్యోగం నిర్వహించి, 21-7-1943 తేదీన కాకినాడ సర్కిల్ ఆఫీసరుగా ఛార్జి తీసుకొన్నాను.

## కాకినాడ సర్కిల్ (తూర్పు గోదావరి జిల్లా)

కాకినాడ తెలుగు పట్టణాలలో పరిశుభ్రమైనదిగా వుండేది. ఇప్పు డెట్లున్నదో చెప్పలేను. వాతావరణం బెజవాడ, గుంటూరు పట్టణాలలో కంటె వేడి చాలా తక్కువ. త్రాగే నీళ్లు బాగుంటవి. సముద్రం దరిదాపులో వున్నది. అందువల్ల వాణిజ్యానికి అనుకూలం. ఇక్కడ తెల్లవారు స్థాపించిన గోదాములు, జనపనార ప్రెస్సు వగైరా వుండినవి. 1943 నాటికవి చురుకుగా పనిచేస్తున్నట్లులేదు. సముద్రం లోతు తక్కువైనందున, ఓడలు కొన్ని మైళ్ల దూరంలో వుండేవి. పెద్దగా ఓడల వ్యాపార ముండకపోయినా, ఏ కొద్ది అయినా పడవల చేరవేత వలన వుండేది.

పట్టణంలో బట్టల మిల్లు ఉండేది. ఇది కొద్ది స్థాయి మిల్లు. ముతకగుడ్డలు, దుప్పట్లు మొదలైనవి నేసేవారు. ఇప్పుడు సర్వారాయ టెక్స్‌టైల్సు అనే పెద్ద మిల్లు పనిచేయుచున్నది. ఈ పట్టణం శివారు జగన్నాయకపురంలో, ఇదివరలో కొందరు తెల్లవా రుండేవారు. అక్కడ మేలైన పొగాకు చుట్టలు ఇప్పటికిని తయారుచేస్తా రనుకొంటాను. నే నక్కడు న్నప్పుడు ఒక ఆఫీసరు కోరగా కొన్ని తయారుచేయించి పంపాను. మంచి నానురొట్టె తయారుచేసే బేకరీలు ఇప్పటికిని ఉన్న వనుకొంటాను.

జగన్నాయకపురానికి, కాకినాడ పట్టణానికి మధ్య పెద్ద బ్రిడ్జి వున్నది. సముద్రంనుండి వచ్చిన కాలువమీద బ్రిడ్జి అది. ఆ కాలువ అంచునే గోదాములు వగైరా వున్నవి. అందువల్ల, జగన్నాయకపురం కాకినాడపట్టణానికి విడిగా వున్నట్లుంటుంది.

దాని పరిస్థితులు వేరుగా వున్నట్లుంటవి. యూరోపియనులు ఎక్కువగా నివసించుచున్న కాలంలో, భేదం కొట్టవచ్చినట్లుండే దనుకొందును. అసలు జగన్నాయకపురానికి ఒక రూపిచ్చింది తెల్లవారే అనుకుంటాను.

కాకినాడ విస్తీర్ణంగానే వుంటుంది. టెంపుల్ వీధి (దేవాలయాలుండే వీధి) చెప్పుకో తగ్గది. పెద్దబజారు విశాలమైనది. ఇంకొకప్రక్క మైదానంవలె వుండేది. ఆ ప్రక్క ఆఫీసర్ల బంగళా లుండేవి. పిఠాపురం మహారాజావారు స్థాపించిన అనాథ శరణాలయం వుండేది.

కాకినాడ టవున్‌లో వర్తక వ్యాపారాలు మధ్యరకం. వాణిజ్యం చాలా తక్కువ. 1943లో నేనా స్సర్కిల్‌కు వెళ్లినప్పుడు బట్టల ధరలు విపరీతంగా పెరిగిఉండటంవల్ల, పట్టణం పన్నుదారుల నుండి వచ్చే ఆదాయం కొంతవరకు పెరిగినా, మొత్తంమీద పన్నురాబడి గొప్పగా చెప్పుకోవలసిందికాదు.

కాకినాడ తీర సముద్రం లోతు తక్కువైనందువల్ల, పైగా ఇసుక మేటలు వేయుచుండటంవల్ల, మేటల నాపటానికి లోతు లేని ప్రక్కనుండి, లోతున్న ప్రక్కకు ఇసుక దొర్లకుండా ఉండటానికి పిట్టగోడలు (గ్రాయిన్సు) కట్టారు. వానిని బలపరచి, డ్రెడ్జర్‌తో లోతు ప్రదేశాన్ని యింకా లోతు చేయిస్తే మధ్యరకం ఓడలైనా, ఆ రేవునుండి సరకులను విదేశాలకు కొనిపోగలవు. సముద్రం నుండి చేపలు ఎక్కువగా దొరికేవి కా దనుకొందును. సముద్ర తీరం షికారుకు వెళదామని నే నక్కడకు వెళ్లిన క్రొత్తలో వెళ్లాను. చాలా దూరం పోవలసి వచ్చింది. తీరం మిక్కిలి మురికిగా వుండింది. బీచి లేదు. ఛా, అని తిరిగి వచ్చేశాను. ఒకసారి కుటుంబంతో కలసి, కొన్నిమైళ్ల దూరంలో వున్న తీరానికి స్నానానికని వెళ్లాం. స్నానమైతే చేశాం గాని, మిక్కిలి అసంతృప్తిగా వుండింది.

మేము కపిలేశ్వరపురం జమీందారుగారు శ్రీ బలుసు బుచ్చి సర్వారాయుడుగారి మేడలో నివాసం పెట్టాం. జమీందారుగారు దాని నొక డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు నుండి

కొన్నారట. దాని నద్దెకు తీసుకొన్న మొదటివారు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు సింహాద్రాచార్యులు గారట. తరువాత శ్రీ టి. డి. ప్రసాదరావుగా రుండినారు. వారినుండి నాకు సంక్రమించింది. నా తరువాత వచ్చినవారు తురగా రామచంద్రరావుగారు కూడా అందులో వుండినారు. తర్వాత హైవేస్ ఇంజనీర్ దురానిగా రుండినారట. అటుపిమ్మట దాని నెవరికీ అద్దె కిచ్చినట్లు లేదు.

ఈ మేడ గాంధీనగరంలో పెద్ద దైన గాంధిపార్కుకు దగ్గరగా వున్నది. మేడ పొడుగుపాటిది. వెడల్పు తక్కువ. గదులు చిన్నవి. కాని ముందు చిన్న వరండా, ఆవరణ, ప్రహరీ గోడ. మేడ పైన, క్రింద వున్నన్ని గదులు. మొత్తంమీద అనుకూలంగా వుండినది. ఆ ప్రాంతం ఇసుక నేల. మా ఆవరణలో మంచి నాగలింగ చెట్లు రెండో, మూడో వుండేవి. మేము ప్రహరీ గేటు నుండి, ఇంటి వరండా మెట్లవరకు చప్టా వేయించాము. ఆవరణంతా పూలచెట్లు పెట్టించాము. గాంధిపార్కు సూపరింటెండెంటు శ్రీ సుబ్బరాజు మాకు తోట వేయుటకు చాలా సహాయ పడినాడు. ఇంటి ముందు చిన్న రోడ్డు. దాని మొదటిప్రక్క, పార్కుమీదుగా వెళ్లే పెద్దరోడ్డు, రెండోప్రక్క ఖాళీ స్థలం. నా భార్య ఇంటిముందు రోడ్డు సగమైనా ఊడ్పించి, కల్లాపి చల్లించేది. పెద్దరోడ్డు మార్జి నంతా, రెండోప్రక్క ఖాళీ స్థలంలో ఇంటి నానుకొన్న భాగం ఊడ్పించేది. కల్లాపి చల్లించినట్లు గుర్తు లేదు గాని, రోడ్లు ఊడ్చేవాని పనిని చాలావరకు తగ్గించేది. మేము కాకినాడలో మూడు సంవత్సరాలు సుఖంగానే ఆ మేడలో కాలం గడిపాము.

మా ఆఫీసు మా యింటికి కొంతదూరంలో, గాంధి పార్కుకు పోయే పెద్దరోడ్డు మీదనే వున్నది. అద్దెకు ఏర్పరచుకొన్న మధ్యరకం మేడ. ఆఫీసు ముందు రోడ్డు మార్జిన్ చాలా పెద్దది, అసలు మేడ ముందున్న స్థలం అంతా ఖాళీ స్థలం. మేడకు ముందు, వెనుక కొంత ఆవరణ, దానిచుట్టూ ప్రహరీగోడ. అందువల్ల పార్టీలకు వారి వాహనాలకు అనుకూలంగానే వుండేది. నా మేడ గది చిన్నదేగాని, అనుకూలంగానే వుండేది.

అక్కడింకొక విశేషం. మేడ ఆవరణలో ఒక ప్రక్కగా బంగినపల్లి మామిడిచెట్టుండేది. ఒక సంవత్సర మెలాగో, కొన్ని పండ్లు వాళ్లు వీళ్లు కోసుకొనిపోకుండా మిగిలినవి నాకు రెండో, మూడో అందినవి. అవి చాలా రుచిగా వుండినవి. లోపలి భాగంలో సింధూర రంగు వలయ ముండినది. వాని విత్తనాలు తెచ్చుకొందా మనుకొన్నానుగాని, వీలుపడలేదు. అయినా భూసారాన్ని బట్టి, అంత రుచిగా వుండివుండ వని సమాధానపరచుకొన్నాను.

ఆఫీసు గుమాస్తాలు, జవానుల విషయ మంతగా గుర్తులేదు. అవధానులు అనేవారు ఇన్‌స్పెక్టరుగా కొంతకాల ముండినారు. వారు సీనియరు. నేను 1944 ఏప్రిల్ 5-వ తారీఖు నుండి, జూన్ 16-వ తారీఖు వరకు, రెండు మాసాల పైచిలుకు సెలవుమీద వెళ్లినప్పుడు, వారు నా స్థానే ఆఫీసరుగా పనిచేశారు. ఒక లోయర్ డివిజన్ క్లార్కు యమ్. సీతారామయ్య ఉద్యోగం వదలుకొని వెళ్లిపోయాడు. తరువాత ఎవరో గట్టి సలహా యివ్వగా, తిరిగి చిన్న గుమాస్తాగా ప్రవేశించి, ఇప్పుడు అసిస్టెంటు కమిషన రయ్యాడు. శర్మ అనే అతను పరసనల్ క్లార్కుగా వుండేవాడు. మధ్యరకం తెలివితేటలు. సామాన్య సమర్థత కలవాడు. హెడ్ క్లార్కుగా శ్రీ డి. సన్యాసయ్య ఉండేవాడని గుర్తు.

జవాన్లు ముగ్గురు హిందువులు, ఒక మహమ్మదీయుడు. అప్పారావు అనే అతను మిక్కిలి అనుకూలంగా వుండేవాడు. ఒకతను మంచి సమర్థుడు. కాని తన సుఖం, లాభం చూచుకొనేవాడు. మరొకడు మిక్కిలి కిలాడి. నోటీసులు అందజేసేవాడు కాదు. ఏ బీరువాపైనో ముక్కి వుంచేవాడు. ఏ పని చెప్పినా, వినయం నటించేవాడే గాని, సరిగా సకాలంలో పనిచేసేవాడు కాదు. మహమ్మదీయుడు ఛాందసుడు. కొంత తుస్సుకలవాడు. కాని, చెప్పినది చేసేవాడు. ఏ కారణంచేతనో ఇంకొక హిందువు జవానుగా వచ్చాడు. వానికి పని చేతకాకపోవటమే గాక, మూర్ఖుడు. కపటి. చివాట్లు తరచుగా తింటూవుండేవాడు. మషాల్చి ఒక చాకలుండేవాడు. అతను చెప్పినదల్లా ఒళ్లువంచి చేసేవాడు. అందరిలో ఈ చాకలి, అప్పారావే, తృప్తి నిచ్చేవాడు.

## క్యాంపులు : రామచంద్రపురం

ఇది తాలూకా హెడ్ క్వార్టర్సు. డిప్యూటీ కలెక్టరు, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు మొదలైన ఆఫీసర్లుండే వారు. డిస్ట్రిక్టు మునిసిఫ్ కోర్టుండినది. ఇక్కడి అర్బన్ కోఆపరేటివ్ బ్యాంకు పెద్దది. కొంతకాలం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా వుండిన శ్రీ బిక్కిని వెంకటరత్నంగారు దాని అధ్యక్షులుగా సారథ్యంవహించి యుండినారు. వారు మిక్కిలి సమర్థులు. నిక్కచ్చి, నిజాయితీగల పెద్దమనిషి. వారు చాకచక్యంతో, ప్రజా రంజకత్వంతో బ్యాంకును మిక్కిలి అభివృద్ధి పరచారు. వకీళ్లలో చిగురుపాటి వీర్రాజు అనేవారు నాకు బాగా పరిచయులైనారు.

రామచంద్రపురం ఊను మధ్యరకంది. సాధారణంగా మకాంచేసే బంగళాలు ఊరి చివరో, ఒక ప్రక్కగానో వుంటవి. క్యాంపుచేసే ఆఫీసర్లు ఊరి లోపలకు వెళ్లరు. నే నెప్పుడో ఒక సారి లోపలికి వెళ్లియుంటాను. నా జ్ఞాపకం రామచంద్రపురం పట్టణం చెప్పుకోవలసిందేమీ కాదని.

క్లబ్బు వున్నది. దానిని మంచిస్థాయిలోనే నడుపుచుండినారు. బిక్కిని వెంకటరత్నంగారి వంటి పెద్దలు హాజరయ్యేవారు. సామాన్యంగా ఇట్టి క్లబ్బుల్లో చీట్లపేకాట తప్పదు. వ్యర్థ ప్రసంగాలు, వివాదాలు, ఈర్ష్య లుంటాయి. నేను మొదటి సంవత్సరం, నా మకాం బంగళాకు అనతిదూరంలో వున్నందున

క్లబ్బుకు రెండు మూడు సార్లు వెళ్లాను. ఏదో మాటల వరుసలో ఒక వకీలు తిరస్కారభావంగా మాట్లాడాడు. కొంత వివాద పడ్డాము. తరువాత సంవత్సరాలలో వెళ్లనేలేదు.

బిక్కిని వెంకటరత్నంగారంటే, క్లబ్బు గుమాస్తా వగైరాలకు భయభక్తు లుండేవి. ఒక బ్రాహ్మణ గుమాస్తా తమలపాకులకిల్లీ ( కారంకిల్లీ అనుకొంటాను ) తయారుచేసి, వారికి అతి వినయంతో అందచేయటం నేను చూచాను. క్లబ్బు సభ్యులు కూడా వారియెడ మిక్కిలి మర్యాదతో వర్తించేవారు.

కేసులు అంత క్లిష్టమైనవి కావు. చాలావరకు మధ్యరకం. అయితే, బియ్యం మిల్లులు వంటివి పెద్ద ఆదాయాన్నే ఇచ్చేవి. పెద్దకేసుగా తోచినా, క్లిష్టంగాని కేసుల్లో శ్రీ కపిలేశ్వరపురం జమీందారుగారి దొకటి. మొదటి క్యాంపులో వారి కేసు విచారణకు వచ్చింది. వారి మానేజరు చాగంటి శేషయ్యగారు వచ్చి, "అయ్యా, స్టేటుమెంటులు తయారు చేస్తున్నాం. ఎల్లుండి జమీందారుగారు ప్రోనోట్లు, తనఖా దస్తావేజులు వగైరా పట్టుకొని వస్తా"రని చెప్పాడు. నే నాశ్చర్యపడి, "రాజాగారు ఎల్లుండి కాగితాలు పట్టుకొనివస్తారా! వారు రావలసిన అవసరం గాని, నే నెల్లుండివరకు కేసు విచారణ పూర్తిచేయకపోవటం గాని దేనికొరకు?" అని అడిగాను. "అయ్యా, మీకు పూర్వం ఆఫీసరు శ్రీ ప్రసాదరావుగారి పద్ధతిప్రకారం, మేము స్టేటుమెంటులు వివరాలు వగైరా వేయుటకు కాలంపడుతుంది. వారు ప్రోనోట్లు వగైరా చూడా లనేవారు. అందువలన రాజాగారు స్వయంగా పట్టుకొనివచ్చి చూపించి వెళ్లేవా"రన్నారు. నేను నవ్వి, "మీ ఎస్టేటు లెక్కలు, ఇచ్చి పుచ్చుకొనే లెక్క పుస్తకాలున్నవి కదా! కాలవ్రయం ఎందుకు? మీరు త్వరగా, మామూలుగా వేసే స్టేటుమెంటులు పూర్తిచేయండి. ఈ సాయంత్రానికే మీ కేసు విచారణ పూర్తిచేస్తాను. రాజాగారిని రప్పించటం, వారి కొరకు కేసు నిలిపి వుంచటం నా పద్ధతికా"దని చెప్పి, సాయంత్రానికే విచారణ పూర్తిచేసి పంపించివేశాను.

చాగంటి శేషయ్యగారు మాంచి పెద్దమనిషి. మృదు మధురభాషి. ఆంధ్రవాఙ్మయాన్ని బాగా తరచినవారు. వారు తర్వాత ఆంధ్రకవుల జీవితచరిత్రలను కొన్ని సంపుటాలుగా రచించి, ప్రచురించినారట.

నాకు ముందున్న శ్రీ టి. డి. ప్రసాదరావుగారు కొన్ని ప్రాతపద్ధతుల కలవడిన వారు. రివిన్యూ డిపార్టుమెంటులో కొన్ని సంవత్సరాలు ఆఫీసరు హోదాలో పనిచేసిన మనస్తత్వం విడనాడ లేకపోయారు. వారు రోజుకు విచారణకు వేసుకొన్న ఏ డెని మిది కేసులలో చివరి రోజుకు అథమం 20 కేసు లైనా మిగిలేవి.

రామచంద్రపురం తాలూకా భాగ్యవంతమైనది. సారవంతమైన భూముల నెక్కువగా గల రైతులున్నారు. వరిధాన్యం పుష్కలంగా పండుతుంది. రైసుమిల్లు లెక్కువ. మొదటి సంవత్సరం బట్టలతోబాటు, రైసుమిల్లుల నుండి ఆదాయం హెచ్చుగా వచ్చింది. ఆ సంవత్సరం ధాన్యం నుండి బియ్యం దిగుబడి బాగా వుండింది. దానికి తోడు బియ్యం ధర పెరిగి వుండింది.

రామచంద్రపురానికి రెండుమైళ్ల దూరంలో ఒక సంపన్న గ్రామం వుండింది. ఆ గ్రామంలో రెడ్లు హెచ్చు. భూస్వామి కర్రి వెంకటరెడ్డి యువకుడు. ఒకరాత్రి భోజనానికి పిలువగా వెళ్లి, భోజనంచేసి వచ్చాను. అలాగే ఒక క్యాంపులో, కపిలేశ్వరపురం వెళ్లి చూచి వచ్చాను. దారిలో పామర్రు అనే గ్రామం వున్నది. పెడసనగల్లుకు దగ్గరగా, గుడివాడ తాలూకా పామర్రు వున్నదికదా. అక్కడి పామర్రు పేరు విని, కుతూహాల పడ్డాను. ఆ పామర్రు కమ్మటూరు. నాకు ప్రత్యేకంగా తట్టింది, ఆ గ్రామస్థులలో చాలామంది స్ఫురద్రూపులు. కపిలేశ్వరపురంలో రాజాగారి రెండవ, మూడవ కుమారులు శ్రీ చలపతిరావు, శ్రీ సత్యనారాయణరావు గార్లు ఆహ్వానించి, ఆతిథ్యమిచ్చారు. అక్కడ ఒక గంట గడపి, వారి పశువులు వగైరా చూచి, సంతోషించాను. జమీందారుగారికి పశువులపై అభిమానం హెచ్చు. మిక్కిలి జాగ్రత్తగా మేపించేవారు. వారి వద్ద సింధి, హారియానా ఆవులు, ముర్రాజాతి గేదెలుండేవి. పశువు లంటే నాకు మిక్కిలి ఆసక్తికదా!

కాకినాడ సర్కిల్‌లో నా మొదటి క్యాంపు రామచంద్రపురం. ఆ మొదటి క్యాంపులో రాత్రి నా పడక వగైరా ఏర్పాటుచేయటం కనిపించలేదు. జవానులను పిలవగా జవాబు రాలేదు. నేను వెనుక వరండాలోకి వెళ్లగా, ఒక జవాను తానొక మంచం తెచ్చుకొని, పరుపువేసుకొని సిద్ధంగావుంచుకొని, కొంచె మవతలగా చుట్ట కాల్చుకొనుచుండినాడు. రెండోవాడు అంతులేడు. గట్టిగా మందలించవలసివచ్చింది. జవాన్లు, ఆఫీసర్లను ప్రథమం ఎంతవరకు తమ ఆట సాగుతుందో అని

పరీక్షిస్తారు. ఈ జవాను జబర్దస్తీ కలవాడు. వినయం చూపుచునే మాదచ్ఛోదిగా ప్రవర్తించేవాడు.

ఒక కాపు (బలిజ) న్యాయవాది ఇంటిపేరు "బర్రె" అని విని వింతపడ్డాను.

## మండపేట

ఇ దాక పెద్ద గ్రామం. భూము లెక్కువగా ఉండిన రైతు లున్నారు. వీరిలో కొంతమంది విరివిగా ధాన్యం మిల్లులను నడపేవారు. ఇక్కడి విశేషం, మాళీగేదెలు చాలాహెచ్చు. మంచి రకం ముర్రాజాతి బర్రెలను పెంచుతారు. ఇప్పు డక్కడ వెటరినరి డిపార్టుమెంటువారు ఒక కేంద్రాన్ని ఏర్పాటుచేశారు. పశువుల వంధ్యత్వం వగైరా విషయాలలో శిక్షణ ఇస్తారు.

మన మిక్కడ బసంగి అనే ధాన్యాన్ని అక్కడ రసంగి అంటారు. ఎర్ర ధాన్యం, అక్టోబరులో కోతకు వస్తుంది.

ఊరు నల్లరేవడి. పల్లంగా వుంటుంది. వర్షాకాలంలో అంతా బురదే. ఇప్పు డేమైనా మెరకచేశా రేమో. ఈ ఊరు రామచంద్రపురానికి 10 మైళ్లలో వుంటుంది. క్రొత్తగా ఆలమూరువద్ద గోదావరినది పాయమీద నిర్మించబడ్డ పెద్ద వంతెన, ఈ యూరి కా రేడు మైళ్లలో వున్నది. ఇదివరలో మండపేట చేరా లంటే ముందు కాకినాడ, తర్వాత రామచంద్రపురం గుండా వెళ్లవలసి వచ్చేది. ఆలమూరుబ్రిడ్జీ వచ్చిన తర్వాత పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం మీదుగా, ఆలమూరు దాటి మండపేట చేరుకొనవచ్చును.

బంగళా మిక్కిలి చిన్నది. ఒక సంవత్సరం మాత్రమే మూడు, నాలుగు రోజులు మకాంచేశాను. వల్లూరు పనస రామన్న, ఏలేటి నారాయణమూర్తి వంటి పెద్ద కమ్మరైతు లుండేవారు. వల్లూరువా రింటిలో ఒక రాత్రి విందుకు హాజరు కాకుండా వుండలేకపోయాను.

# సామర్లకోట

ఇక్కడి క్యాంపు వ్యవసాయ పరిశోధనాలయములోని బంగళాలో, సంవత్సరానికొకసారి వేసవిలో. బంగళాకు ఒక ప్రక్క పెద్ద కాలువ, ఇంకొక ప్రక్క పరిశోధన సంబంధమైన అరటి తోటలు, చెరకు తోటలు వగైరా. ఎండ తాకిడి చాలా తక్కువగా వుండేది. సాయంత్రం షికారుకు వెళ్లటానికి, పరిశోధనాలయం తోటలేగాక, పరిసర ప్రాంతాలు మిక్కిలి అనుకూలం. వరివంగడములలో, అరటి, చెరకు రకాలలో, పరిశోధనలు జరుగుచుండేవి. ఫారమ్ సన్నం, సామర్లకోట 13, 15, 17 వంటి మేలైన సంకర వరి రకాలను ఈ పరిశోధనాలయంలో అభివృద్ధిపరచారు. ఇదివరలో చెరకును బెల్లం తయారు చేయుట కుపయోగించేవారు. చెరకుగడలు లావుగా వుండేవి. వాసాలు పాతి వానిని నిలబెట్టేవారు. పంచదార ఉత్పత్తి కనుకూలమైన రకాలను, వాసాలతో నిలబెట్ట నవసరములేని చెరకును పండించుటకు కోయంబత్తూరులోనేగాక, ఇక్కడ కూడ పరిశోధనలు జరుపుచుండేవారు. అయితే ముఖ్యంగా వరి, అరటి మీద ఎక్కువ పరిశోధన జరుగుచుండేది. కర్పూరచక్రకేళి విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేవారు. వరివంగడాల విషయం పైన చెప్పాను.

ఈ పరిశోధనాలయమేగాక, సామర్లకోటలో ఈస్టిండియా డిస్టిలరీస్ పేరుతో పంచదార, సారా ఉత్పత్తి చేసేవారు. ఈ ఫ్యాక్టరీ ప్యారీ కంపెనీవారి యాజమాన్యంలో నడుపబడుచుండేది. చివరి సంవత్సరంలో నేను ఫ్యాక్టరీని చూడటానికి వెళ్లినప్పుడు, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారి మూడవ కుమారుడు శ్రీ మదనగోపాల్ అక్కడుండినారు. వారి తోడుతో వివిధ భాగాలు చూచాను.

సామర్లకోట చిన్న పట్టణం. వర్తకవ్యాపారాలు మధ్యరకంగా వుండేవి. క్యాంపు 3, 4 రోజులు మాత్రమే. ఒక క్యాంపులో ఆ రీసర్చి ఫారమ్‌లో ఉద్యోగిగా నున్న సుబ్బయ్య గారిని, వారి కుటుంబాన్ని చూచాను. వారి భార్య కైకలూరు

తాలూకా, వరహాపట్టణం కామినేని పట్టాభిరామయ్యగారి ప్రథమ కుమార్తె. బాల్యములోనే వివాహమై, కాపురానికి వెళ్లకముందే భర్త చనిపోగా అప్పటికి సంఘ వ్యతిరేకమైన రెండవ వివాహం చేసుకొన్నారు.

సామర్లకోటలో చందలాడ పద్దరాజుగారనే వారు పెద్ద భూస్వామి. వారు సరసులు. ఇంగితజ్ఞులు. వ్యవహార దక్షులు. మొట్టమొదటిసారి వారిని పిఠాపురం పశువుల సంతలో చూచాను. బోళ్ల పద్దయ్యగారు, ఏలేటి పద్మరాజుగారు, ఎండ్రు సత్తిరాజు గారు మొదలైనవారు నాకు పరిచయులైనారు. వీరి పేరు చివర రాజు అని వుండినా వీ రందరు కమ్మవారే. బోళ్ల పద్దయ్యగారు మిక్కిలి సరసులు, స్నేహశీలురు. ఎంతో ఆప్యాయతతో వుండే వారు. వారి వ్యాపారం స్వల్పం. అక్కడి షుగర్ ఫ్యాక్టరీకి వస్తువులను జేరవేసే కంట్రాక్టు వారిది. వారి స్నేహభావము వలన వా రింటికి ఒకటి, రెండు సార్లు వెళ్లటం తటస్థించింది. డాక్టరు వీరరాజుగారు వీరి అల్లుడు. ఎండ్రు సత్తిరాజుగారు, ఏలేటి పద్మరాజుగారు మధ్యరకం ఆసాములు. ఏదో కొద్దిపాటి వ్యాపారం చేస్తూ వుండేవారు. ఏలేటి పద్మరాజుగారికి కట్టెల వ్యాపారముకూడా వుండినట్లు గుర్తు. ఇక్కడ, మొదటిసారి రైలుపట్టాల ప్రక్కనే మేయుచుండిన హిస్సార్ జాతి ఆవులను చూచి సంబరపడితిని.

## పెద్దాపురం

ఒకప్పు డిది మిక్కిలి ప్రాముఖ్యం వహించిన పట్టణం. పెద్దాపుర సంస్థానమనే పేరుతో పెద్దాపురం రాజధానిగా పాలించిన వత్సవాయి ఇంటిపేరుగల క్షత్రియ ప్రభువు లుండేవారు. ఇప్పు డా వంశం తాలూకు వత్సవాయి వారున్నారేమో గుర్తులేదు. నేను జమీందారువంశము వారి నెవరిని చూచిగాని, వారిని గురించి వినిగాని వుండలేదు. ఇక్కడ కొన్ని ప్రముఖ కమ్మ కుటుంబాలున్నవి. చల్లా సుబ్బారాయుడు అనేవారు ప్రముఖులలో నొకరు. వీరు పెద్దాపురా. కి మునిసిపల్ ఛైర్మన్‌గా కొంతకాల ముండినారు. ఇక్కడ చెప్పుకొనవలసిన కుటుంబం ముప్పనవారి

కుటుంబం. వీరు పద్మసాలి కులస్థులు. పట్టు వస్త్రములను నేయు మిల్లును నిర్వర్తించుచుండినారు. వీ రన్నదమ్ములు విద్యావంతులు. వ్యాపార దక్షులు. ప్రజా జీవితములో పాల్గొనుచు, సాంఘిక మర్యాదలలో ప్రముఖపాత్రను వహించుచుండినారు. ఉద్యోగరీత్యా యేగాక, స్నేహరీత్యా (సోషల్ గా) కూడా వీరితో పరిచయము కలిగింది. ఈ అన్నదమ్ములలో ఒక రిద్దరు మంచి స్ఫురద్రూపులు. ఎవరితో, ఏ విధంగా మెలగాలో తెలిసిన చాకచక్యులు. వీరి పితతండ్రిగారు మిక్కిలి సమర్థులట. వారి వల్లనే వ్యాపారం వృద్ధిపొందిందట. అప్పటికి జీవించియే యున్నారు గాని, వ్యాధిగ్రస్తులట. అన్నదమ్ములలో నొకరు తరువాతి కాలంలో మునిసిపాలిటీ అధ్యక్షులైనారు.

ఇక్కడి నేల సారవంతమైన ఎర్ర నేల. కూరగాయలు పుష్కలముగా పండుతవి. పెద్ద సైజు రామములగకాయలను, మొక్కజొన్న కండెలను రహదారి బంగళానుండి ఊరిలోనికి వెళ్లుతూ, చూచాను. భూసారాన్నిబట్టి కూరగాయలు మిక్కిలి సొంపుగాను, రుచిగాను వుంటవి. ఈ ప్రాంతంలో వరిసాగు ముఖ్యంగా చెరువులక్రింద. చాలా భాగం మెట్ట. వాతావరణం, వేసవిలోకూడ సుఖప్రదంగానే వుంటుంది. శీతాకాలం క్యాంపులకు మిక్కిలి ఆహ్లాదకరంగా వుంటుంది. మొక్కజొన్న కండెలను (ముక్కలుగా) పప్పుపులుసులో వేసి వండటం ఇక్కడనే చూచాను.

## పిఠాపురం

ఇది పిఠాపురం మహారాజావారి స్వస్థానం. పిఠాపురం జమీాయేగాని, దాని అధిపతి శ్రీ రావు సూర్యారావు బహద్దర్ వారు తమ దానధర్మములచేతను, ప్రజారంజకములైన ఇతర కార్యాలవల్ల ప్రభుత్వాదరణచేతను వ్యక్తిగతముగా మహారాజ బిరుదును పొందగలిగారు. కాకినాడలోని మొదటి తరగతి కళాశాల, దీనస్త్రీ శరణాలయము మొదలైనవి వీరిచే స్థాపింపబడి, పోషింపబడినవి. వీరు బ్రహ్మసమాజికులై, విశ్వకవి రవీంద్రనాథ

ఠాగూర్ గారి అభిమానముగూడా పొందగలిగి, వారి నొకసారి పిఠాపురాని కాహ్వానించి గౌరవించారట. వీరిని నేను ఆదిలో, 1928 సంవత్సరం ఆఖరునగాని, 1929-వ సంవత్సరం ఆరంభములో గాని దర్శించి యుంటిని. వా రప్పుడు ప్రజాపార్టీ పేరుతో, ఒక రాజకీయపార్టీకి నాయకత్వము వహించి యుండినారు. నేను శ్రీ పి. టి. రాజన్ గారిని కలసికొనుటకు మధురకు వెళ్లియున్నా నని పైన చెప్పాను. ఆ సందర్భములో వీరిని నేను మొదట దర్శించుట కవకాశం కలిగింది. ఉయ్యూరు జమీందారుగారి సోదరులు గొల్లప్రోలు రాజాగారు తమ సోదరి భర్తగారైన మహారాజాగారితో, రాజకీయ సంబంధముగా ఎక్కువ దగ్గరగా వుండినారు. శ్రీ గొల్లప్రోలు రాజాగారు పిఠాపురం మహారాజా వారి ఆదేశమువల్లనే శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి సలహానుపొంది, నన్ను మధురకు పంపించి యుండిరి. శ్రీ మహారాజాగారితో ఆ విధంగా పరిచయమైన తర్వాత, ఒక పిఠాపురం క్యాంపులో వారి రాజభవనంలో వారిని దర్శించాను. నేను వెళ్లిన సమయాన, వారు తమ గులాబి తోటలో కూర్చుండి ఉండినారు. వారికి గులాబీ పూలంటే మిక్కిలి ప్రీతి. ఆ విశాలమైన తోటను గురించి నేను ప్రస్తావించి, "ఎన్నిరకముల గులాబీ మొక్కలు వున్న" వని అడిగాను. "700 రకముల గులాబీ మొక్కలున్న"వని చెప్పారు. నే నాశ్చర్యపడగా, "గులాబీలలో 1000 రకముల వరకున్నవి. కాని, కొన్నిటిని నేను సంపాదించ లేకపోయా" నన్నారు. కొన్నిరకాలను పాశ్చాత్యదేశాలనుండి ఎక్కువ ధనవ్యయముతో సంపాదించారట. తర్వాత వారి షష్ట్యబ్దిపూర్తి ఉత్సవాలకు హాజరైనాను.

ఒక కారణంగా వారు నాయందు కించిత్తు కోపాన్ని పొందారని కూడా విన్నాను. వారి దివాను శివరామశాస్త్రిగారు నా మీద కొండాలను చెప్పారట. ఇన్ కమ్‌టాక్సు సంబంధం కాదు. మిత్రుడు శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణగారు కొందరితో కలసి పిఠాపురం సంస్థానంలో కొన్ని కలప తూపులను కౌలుకు తీసుకొని యుండినారని, ఆ సందర్భంగా పేచీరాగా, శ్రీ లక్ష్మీ

నారాయణ, రాజాగారి దివానుతో మాట్లాడి, అనుకూల పరిస్థితులేర్పడేటట్లు చూడండని నన్ను కోరారని, దివానుగారిని కలసికొని మాట్లాడానని పైన చెప్పాను. నా మాటలు వ్యతిరేక భావసూచకములుగా నుండినవని మహారాజాగారికి, ఆయన చెప్పారట. ఈ విషయం తరువాత నేను ఎవరినుండో విన్నాను. అటుపిమ్మట, రాజాగారిని, ముఖాముఖిని కలసికొనలేదు.

ఈ క్యాంపు పన్నుల విషయంలో చెప్పుకోవలసిన విశేషమేమిన్ని లేదు. వాణిజ్య సంస్థలుగాని, పారిశ్రామిక సంస్థలుగాని లేవు.

ఒకటి రెండు విషయాలు జ్ఞప్తియందున్నవి. వంటర్లు అనేవారిక్కడున్నారు. వీరు తెలగకులం వారట. అయితే మేము తెలగవారిలో శ్రేష్ఠులమని చెప్పుకొంటారు. వీరి స్త్రీలు వెలమస్త్రీలవలె ఘోషా పద్ధతిని అవలంబింతురట. పురుషులు కొంత రాజసంగా వుండవచ్చును గాని, మామూలు రైతులవలెనే వుంటారు. కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలో తెలగ కులస్థులను కాపు లంటాము. నెల్లూరు జిల్లాలో రెడ్లను కాపు లంటారు. తెలగకాపుల్లో, రాజమండ్రి మెరకవీధి కాపులు శ్రేష్ఠుల మని చెప్పుకొంటారు. శ్రీకాకుళంజిల్లా, శ్రీకాకుళంలోని తెలగకాపులు తెలగలను పేరుతో వ్యవహరిస్తారు. వీరు కూడా శ్రేష్ఠులమని చెప్పుతారు. దత్తమండలాల్లో వీరు కాపులమనిగాని, తెలగలమనిగాని చెప్పుకొనరు. బలిజల మంటారు. బలిజల్లోకూడ రకరకాల శాఖ లున్నవి. గాజుల బలిజ, శెట్టి బలిజ, తోట బలిజ వగైరా. కాపులనే తెలగలకు, తెలగాలనే తెలగలకు ఇచ్చిపుచ్చుకొనే సంబంధాలున్నవిగాని, శాఖా భేదా లున్న బలిజవారిలో ఒకరినుండి మరొకరికి పెండ్లి పేరంటాలు లేవనుకొందును. వంటర్లు ప్రత్యేకకులంగా వుండినారు. ఆ పేరు నే నిదివరకు వినియుండలేదు.

విజయనగరం, శ్రీకాకుళం ప్రాంతాల్లో, కాపులనే వారు వేరే కులస్థులున్నారు. వారు రాజమండ్రి కాపులకు గాని, శ్రీకాకుళం తెలగాలకు గాని చెందరు. బలిజల్లోనూ చేరరు.

పిఠాపురం, నూజివీడు మొదలైన జమీందార్లు పద్మనాయక వెలమలు. వీరినే రాచవెలమ లంటారు. వీరుగాక, పద్మవెలమ లని, వెలమ లని మద్రాసు, చెంగల్పట్టు ప్రాంతస్థులున్నారు.

శ్రీకాకుళం జిల్లాలో కూడా వెలమల మనేవా రున్నారు. వారు చెంగల్పట్టు వెలమలవంటివా రనుకొంటాను. విజయనగరం, విశాఖపట్టణం ప్రాంతాలలో కొప్పువెలమ లున్నారు. వీరినే తూర్పువెలమ లంటాము. వీరిని తక్కువ కులస్థులనుగా కృష్ణ, గోదావరి ప్రాంతాలవారు తలుస్తారు.

కమ్మవారిలో కూడా భేదాలున్నవి. పెద్దకమ్మ, చిన్నకమ్మ, తూర్పుకమ్మ, దక్షిణాదికమ్మ అని. అయితే, ఈ భేదాలు మొత్తంమీద ప్రాంతీయాలు. ఒకప్పుడు దక్షిణాదిలో, అనగా అరవదేశంలోవుండి, ఇక్కడకు వచ్చి, చల్లపల్లి ప్రాంతంలో స్థిరపడిపోయిన వారిని దక్షిణాది కమ్మవా రంటాము. ఉప్పుటేరు కవతలప్రక్క తణుకు మొదలైన ప్రాంతం వారిని తూర్పు కమ్మవా రంటాము. వాసిరెడ్డి వెంకటాద్రి నాయని వంశస్థులు, తత్ సంబంధీకులు, "మేము పెద్దకమ్మవార"మని చెప్పుకొనేవారు. గుంటూరు జిల్లా వినుకొండ సత్తెనపల్లెవంటి మెట్టతాలూకాల వారిని చిన్నకమ్మ అనటం కద్దు. ఇతరులు మామూలు కమ్మగా ఎంచబడుచుండేవారు. చిన్నకమ్మ అనే వారి స్త్రీలు పొలం పనులు చేస్తూండటం, బజారుకు క్రయ విక్రయాలకు వెళ్లటం ఉండేది. తతిమ్మా స్త్రీలు హెచ్చుతగ్గులుగా, ఘోషా పద్ధతి నవలంబించేవారు. పూర్వ మెట్లున్నా, ఇప్పుడు శాఖాభేదం లేదు. అన్ని ప్రక్కలవారు సంబంధాలు చేసుకొనుచున్నారు. నిజానికి తెలగాలలోవలెగాక, కమ్మవారు శాఖాభేదాలు పెట్టుకోలేదు. ప్రాంతీయభేదా లుండేవి. అవి యిప్పుడు సమసిపోయాయి.

పిఠాపురంలో లింగం జగన్నాథరావుగా రనేవారుండేవారు. వారు బ్రాహ్మణులు. ఇంటిపేరును బట్టి వారియం దభిమానం

కలిగింది. వారేదో ఉద్యోగంచేసి, విరమించుకొన్నారు. వారింటికి వెళ్లగా, తాము రచించిన పుస్తకాలిచ్చారు. వారు పండిత కవులు. లింగం ఇంటిపేరు గలవారు వైశ్యులలోనూ, తెలగాలలో కూడా వున్నారని పైన చెప్పాను. ఈ పేర్లు ఏవిధంగా ఆరంభమైనవో చెప్పటం కష్టం. దుగ్గిరాలవారు బ్రాహ్మణులలో ఉన్నారు. కమ్మవారలలో నున్నారు. విజ్ఞానచంద్రికామండలి నవల పోటీలో బహుమతిని పొందిన దుగ్గిరాల రాఘవచంద్రయ్య గారు నా పినతల్లి భర్త. ఇది తెలియని వారు వారినభినందించుచు బ్రహ్మశ్రీ అని వ్రాశారు.

ఇదివరలో కులాలనుబట్టి, వృత్తు లుండేవి. వృత్తులను బట్టి ఆకారాలుండేవి. ఆకారాలనుబట్టి ఫలానా కులం అని సాధారణంగా గ్రహించటానికి వీలుండేది. ఇప్పుడు మనిషిని చూచి ఫలానా కుల మని అంచనావేయలేము. ఇంటిపేరును బట్టి కులాన్ని తెలుసుకోవటం కష్ట మనిపించుచున్నది. నేను చెందిన కమ్మకులంలోకూడా, నే నిదివర కూహించని క్రొత్త ఇంటిపేర్లున్నవి.

## తుని

ఇది తునిరాజాగారి ఎస్టేటు కేంద్రం. అప్పటికి తుని జమీందారీ సాగుచుండినది. ఈ జమీందారుగారు వత్సవాయి వంశస్థులు. పెద్దాపురంవారు, రామచంద్రపురంవారు కూడా వత్సవాయి ఇంటిపేరుగల క్షత్రియులు. అయితే ఆ జమీందారీలు అప్పటికే తెరమరుగైనవి. కోస్తాప్రాంతంలో పెద్ద క్షత్రియ జమీందారి విజయనగరం పూసపాటివారిది. చిన్నచిన్న మొఖాసాలుండినవేమోగాని, నాకు తెలిసినంతవరకు ఈ ప్రాంతంలో అమలులోవున్న క్షత్రియ జమీలు తుని, విజయనగర జమీలే. మొత్తంమీద క్షత్రియ జమీలకంటే చాలా హెచ్చుసంఖ్యగలవి వెలమ జమీలే రాయలసీమ ప్రాంతంలో సమసిపోయిన కార్వేటి నగరం జమీ చాలా పెద్దదిగా వుండేదట. ఇది క్షత్రియులది. తెలంగాణాలో క్షత్రియ, వెలమ జమీలున్నట్లు నాకు తెలియదు.

కొంతకాలం ఉమ్మడి మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ స్పీకరుగా వుండిన బి. రామకృష్ణరాజుగారు, కార్వేటి జమీందార్ల వంశస్థులట. వారి విషయంలో ఒక అభిలషణీయమైన సంఘటన చెప్పేవారు. ఏ కారణంవల్లనో వారు క్రింద పడిపోయిరట. హడావుడిగా డాక్టరును పిలిపించగా, గుండె పరీక్ష చేస్తే, స్పందన కనపడలేదట. చనిపోయాడేమో అని భయపడ్డారు. అయితే కొంచెం ఉచ్ఛ్వాస, నిశ్వాసాలుండినవట. అనుమానపడి స్టెతో స్కోపును కుడిప్రక్కకు ఆనించగా స్పంద నుండినదట. అప్పుడు తెలిసింది, రామకృష్ణరాజుగారి గుండె మామూలుగా వుండే ఎడమ ప్రక్కనగాక, కుడిప్రక్కన ఉన్నదని. మిత్రులు రాజు గారి హృదయం సరైనదని అర్థంవచ్చేటట్లు, వారి గుండె రైట్ ప్లేసులో వున్నదని చమత్కరించేవారట.

తుని రాజాగారి సంస్థాన మంత పెద్దది కాదు. కాని, వారి వంశం చాలా ఘనమైనదని చెప్పారు. తునిలో క్యాంపు చేయుచున్నప్పుడు, రాజాగారిని చూచుట మర్యాద అని తలంచి, వెళ్లి వారిని దర్శించి కొన్ని నిమిషములుండి వచ్చాను. వారు చాలా మర్యాదస్తులుగా కనపడినారు. వారు సంస్కృతాంధ్ర భాషాభిజ్ఞులు. సంగీతాది లలితకళలం దభిమానులని, ఇటీవల మిత్రుడు కలిదిండి నారాయణరాజుగారు చెప్పగా విన్నాను.

వారి ఎస్టేటు మానేజరు, ఏదో మాటల సందర్భంగా, ఒక చిత్రమైన కథ చెప్పారు. రాజాగారి పూర్వీకులలో ఒకరికి ముగ్గురు, నల్గురు భార్యలుండినారట. వారికి సంతానము కలుగ లేదట. దానికి కారణం రాజాగా రించుమించుగా నపుంసకులట. ఒకనాడొక సిద్ధుడు వారిని దర్శించి, వజ్రము వంటి దాని నొకటిని వారికిచ్చి, ఒక మోతాదు ద్రావకమేదో యిచ్చి ఆ వజ్రాన్ని ఆ ద్రావకంలో వేస్తే, కొన్ని నిమిషాల్లో కరగిపోతుందని, దానిని పుచ్చుకొంటే వెంటనే బలమైన పురుషత్వం ప్రాప్తిస్తుందని చెప్పా రట. సిద్ధుడు చెప్పినట్లుగానే ద్రావకంలో వేసిన వజ్రం కరగి పోయిందిట. దానిని రాజాగారు సేవించగా ఎక్కడలేని పురు షత్వం త్రోసుకువచ్చి, వారు తమ భార్యలను ఒకరి తరువాత

నొకరిని కలసికొన్నారట. భార్యల ఆశ్చర్యానికి అంతులేదు. రాజాగారి సంతృప్తికి మేరలేదు. తత్ఫలితం రాణీలకు గర్భోత్పత్తియై, సంతానం కలిగినారట. అయితే పాపం, రాజాగారి పురుషత్వం ఆ రాత్రితోనే సమసిపోయిందట.

పూర్వకాలంలో సిద్ధులు ఇటువంటి శక్తులు కలిగి వుండినారని ఎంత కఠినమైన వజ్రమునైనా నిమిషాల్లో కరిగించే శక్తిగల ద్రావకాలను తయారు చేసేవారని, నపుంసకత్వాన్ని పోగొట్టి పురుషత్వాన్ని ప్రసాదించేవారని, అట్టి శక్తు లిప్పుడు లేవుగదా అని మేనేజరుగారు వాపోయారు.

పన్నువిధింపు విషయములో చెప్పుకోతగ్గదికా దీ క్యాంపు. సామాన్య వర్తకాదాయం మాత్రమే లెక్కకు వచ్చేది. ఒకటి, అర రైసుమిల్లు లుండి వుండవచ్చును. జ్ఞాపకము లేదు.

తుని చిన్న పట్టణము. పరిసరాలు చెట్లతో పచ్చగా వుండును. వాతావరణం అనుకూలం. క్యాంపు సుఖంగానే వుండేది.

తునికి వెళ్లే రోడ్డు ప్రక్కగా అన్నవరం కొండపైన సుప్రసిద్ధ శ్రీ వీరవెంకటసత్యనారాయణస్వామివారి దేవాలయ మున్నది. నేను క్యాంపుకు మధ్యాహ్నం తిరిగినగాని బయలుదేరను. తిరుగుముఖం ఉదయాన్ని. క్యాంపుకు చీకటిపడకముందే చేరుకోవాలని, ప్రొద్దెక్కకముందే ఇంటికి చేరుకోవాలని ఆదుర్దా. ఇట్టి ప్రయాణ సంరంభములో నే నక్కడ కారాపి స్వామివారి దర్శన మెన్నడు చేసుకోలేక పోతిని. ఈ సందర్భాన ఇంకొకటి జ్ఞప్తికి వస్తున్నది. నేను బెజవాడలో నిండు 3 సంవత్సరా లుండినా 7 మైళ్ల దూరములోవున్న మంగళగిరి నరసింహస్వామివారి దర్శనం చేసుకొనలేక పోయాను. 1952 లో అసిస్టెంటు కమిషనరుగా నేను బెజవాడకు వచ్చినప్పుడు, బాపట్ల క్యాంపుకు వెళ్లి, అచ్చటనుండి తిరిగివస్తూ జ్ఞాపకంరాగా దేవాలయంవద్ద కారాపి, కొండమె ట్లెక్కి దేవాలయాన్ని చేరగా, మధ్యాహ్నమైనందున దేవాలయం తలుపులు మూసివుండినవి. అందువల్ల స్వామివారి దర్శనం కాలేదు. పరిసరాలను చూచి దిగివచ్చాను.

దైవభక్తి కలవాడనైనా కొంతశ్రమ కలుగుతుందనో కాలంలేదనో దేవతా దర్శనం చేయని సంఘటనలు ఇంక రెండున్నవి. నేను అసిస్టెంటు కమిషనరుగా మైసూరుకు కుటుంబంతో వెళ్లినప్పుడు, చాముండేశ్వరి దేవాలయము చూడాలని కొండపైకి వెళ్లాము. బూట్సుతో లోపలికి వెళ్ల కూడదని, అక్కడివారు చెప్పారు. బూ ట్సూడదీసి తిరిగి తొడుగుకొనటానికి బద్ధకించి, దేవి దర్శనము చేసుకొనలేదు. నా భార్యా పిల్లలను లోపలికి పంపి, పూజలొనరింపించాను. 1963 సంవత్సరంలో నేను కేరళరాష్ట్ర రాజధాని తిరువనంత పురమునకు వెళ్లినప్పుడు, రైల్వేస్టేషను విశ్రాంతి గదినుండి నా మామూలు సూటులో బయలుదేరి కాలినడకను అక్కడి ముఖ్య దేవాలయం పద్మనాభస్వామి దేవాలయం సమీపించి, స్వామివారి దర్శనము చేసుకొనుటకు ప్రయత్నించగా గేటు కాపలాదారు, "ధోవతి లేనిదే వెళ్లనివ్వ"నన్నాడు. తిరిగి వచ్చేశాను. తరువాత అక్క డొకటి, రెండురోజు లుండినానుగాని తిరిగి దేవాలయం లోనికి వెళ్లటానికి ప్రయత్నించలేదు.

నమ్మకంచేత కలిగే భక్తివేరు, చిత్తశుద్ధి ఆకాంక్షతో వుండే భక్తివేరు. నిజమైన భక్తియున్నవాడు కష్టాలకైనా ఓర్చి భగవద్దర్శనం చేసుకొంటాడు. అందువల్ల, నా నమ్మకం మేధా సంబంధమైనదే గాని, మనస్సు సంబంధమైనది కాదని తోస్తున్నది.

## ఉప్పాడు

ఈ గ్రామం సముద్రతీరా నున్నది. ఇక్కడ నూలుబట్టలు నేయువారు చాలామందున్నారు. వా రుపయోగించేవి విదేశీయ మగ్గాలే. మిక్కిలి సన్ననూలుతో, నాజూకైన వస్త్రాలను నేస్తారు. నూరుకౌంటుల నూలు నుపయోగించుట సర్వ సామాన్యం. 150 లేక 200 కౌంటులుగల నూలును కూడా ఉపయోగించటం కలదట. ఈ నూలుబట్టలు, చీరెలు, ధోవతులు మొదలైనవి మిక్కిలి నాణ్యమైనవిగా ఎంచబడు చున్నవి. నే నొకటి, రెండు దఫాలు మూడు నాలుగు రోజులు క్యాంపు చేశాను.

కాకినాడ సర్కిల్‌లో కాకినాడ, రామచంద్రపురం తాలూకాలు ముఖ్యమైనవి, సంపన్నమైనవి. వరిధాన్యం ఎక్కువగా పండిస్తారు. కాకినాడ తాలూకాకు చెంది, కాకినాడ పట్టణానికి 9 మైళ్లలో వేళంగి అను పెద్ద గ్రామ మున్నది. ఈ గ్రామంలోని భూస్వాములు సంపన్నులైన కమ్మవారు. వీరికి భూవసతితోబాటు, వడ్డీ వ్యాపారం మిక్కిలి హెచ్చు. నేను కాకినాడకు వెళ్లే ముందు కాటూరు జమీనుకొని, కాటూరు జమీందారుగా వ్యవహరించిన శ్రీ యార్లగడ్డ రంగనాయకులు నాయుడుగారిని కలసికొంటిని. వేళంగి గ్రామము కమ్మటూరు. చాలా మంది ధనవంతులున్నారు, స్త్రీలుకూడా లక్షాధి కారులే అని చెప్పారు. శ్రీ రంగనాయకులు నాయుడుగారు కమ్మవారు. పూర్వం, వెలమ, తెలగ లేక బలిజ, కమ్మవారు అందరూ నాయుళ్లే. వెలమ లిప్పుడు నాయుళ్లన బడరుగాని, పూర్వం వెంకటగిరి సంస్థానాన్ని స్థాపించిన రాచ వెలమ భేతాళుడు భేతాళనాయు డని వ్యవహరింపబడేవాడు. తెలగాలతోబాటు కమ్మవారుకూడా, చాలా చోట్ల నాయుళ్ల మంటున్నారు. నాయుడు అనగా నాయకుడు. అనగా గ్రామపెద్ద లేక పదిమందిని కూడగట్టుకొని పెత్తనం చెలాయించేవాడు. క్రమేపి గ్రామంలో, లేక సంఘంలో పెద్దరికం వహించిన కుటుం బాలు, కుటుంబాలకు చెందిన కులాలు, నాయకులుగా వాడుకలో నాయుళ్లుగా చలామణైనారు. సైన్యాధిపతులుకూడా నాయ కులు లేక నాయుడులు, నాయుళ్లు అయినారు. ముసునూరి కాపయ్య నాయుడు, పెమ్మసాని రామలింగ నాయుడు వగైరా. నాయక్ అనేది నాయుడుకు సమానార్థమే. మధుర నేలిన బలిజ రాజులు నాయక్ అను బిరుదంతో ఉండేవారు, తిరుమల నాయక్ వగైరా. రావు, నాయుడు, నాయక్, రెడ్డి, చౌదరి, పటేలు మొదలైనవి పైన చెప్పినట్లు సమానార్థాలు కలిగి, పెద్దరికాన్ని, నాయకత్వాన్ని సూచించునవి.

వేళంగిని చూడాలని ఒకనాడు భోజనంచేసి, కారులో బయలుదేరాను. అక్కడి కొన్ని భవంతులను పూర్తిగా చూచు నప్పటికి మధ్యాహ్నం దాటింది. ఆ ధనికుల భవంతులు పెద్ద

పెద్ద మేడలు. విచిత్ర మేమనగా, మన మొక మేడలోనికి వెళ్తాము. అంతటితో గృహాము పూర్తికాదు. మధ్య నడవ వుండి ఇంకొక మేడ వస్తుంది. అట్లే ఇంకొక మేడ వుండును. అథమం 2 మేడ లైనను ఒకదాని వెనుక ఇంకొకటి వుండినవి చెప్పాకో తగినన్ని వున్నవి. ఇంతకంటె ఇంకొక విచిత్ర మేమనగా, ఈ మేడలను యజమానులు పూర్తిగా వుపయోగించుకొనరు. యజమాను లలో ఎక్కువమంది ఒక ప్రక్కను ఒక చిన్న ఇంటిలో మాత్రమే కాపురముందురు. ఈ మేడలు మ్యూజియమ్‌లు లేక షోకేసుల వంటివి.

ఈ వూళ్లో కుష్టువ్యాధి జాస్తిగానే వుండేది. ఒక రిద్దరు శ్రీమంతులుకూడా ఈ వ్యాధికి గురియైనట్లు గమనించాను. ఈ దురవస్థ ఇప్పటికి చాలావరకు తగ్గియుండును. కృష్ణా, గుంటూరు జిల్లాలవారు కూడా, ఆ గ్రామస్థులతో సంబంధాలు చేస్తున్నారు. అక్కడ పరిచయమైన వారిలో చుండ్రు చిరంజీవరరావుగారితో ఇప్పటికిని ఉత్తరప్రత్యుత్తరా లున్నవి. వారిక్కడకు రెండు సార్లైనా వచ్చి వెళ్లారు కూడాను.

కాకినాడ తాలూకాలోని గొల్లప్రోలు అనే గ్రామం బట్టల నేతకు, కలంకారి పనికి ప్రసిద్ధిచెందింది. కృష్ణాజిల్లా మచిలీ పట్నంలోవలెనే, ఇక్కడకూడ బట్టలమీద కలంకారి ముద్రిస్తారు. కర్రచెక్కలు, ముద్దలుమీద డిజైన్సు చెక్కి, వానిని రంగులో ముంచి గుడ్డమీద అద్దుతారు. బందరు కలంకారివలె అంత నాజూకుగా వుండదు. కొంత మోటుగా వుండేది. అయినా, రక రకాల రంగులలో, మంచి డిజైన్సుతో వుండేవి. గొల్లప్రోలు గ్రామంలో కలంకారి పనిని కూలీలచేత చేయిస్తూ, పెద్ద వ్యాపారం మాదిరెడ్డి రాఘువయ్యగారు చేయిస్తూండేవారు. వీరు బందరు కలంకారికి పేరుతెచ్చిన ఆదివెలమ కులంవారు.

గొల్లల మామిడాల అను గ్రామంలో రెండు నూలు మిల్లు లుండేవి. ఇప్పుడుకూడా వుండవచ్చును. ఒకటి రామచంద్రా స్పిన్నింగుమిల్సు, రెండు సూర్యారాయ స్పిన్నింగ్ మిల్సు. వీని యజమానులు లేక ముఖ్యభాగస్థులు రెడ్డి కులంవారు. బాహు

సార రెడ్లట. ఈ రెండు మిల్లులో, రామచంద్ర స్పిన్నింగ్ మిల్లు ఎక్కువ నూలును ఉత్పత్తిచేయుచు మంచి లాభం చూపు చుండేది.

కాకినాడ కొంత సంస్కృతి, సంస్కారం గలది. ఒకటి రెండు మంచి దేవాలయాలున్నవి. నిజానికొక ముఖ్య వీధిపేరు దేవాలయాలవీధి (టెంపుల్ స్ట్రీటు). పల్లె కులానికి చెందిన ఒకరు సత్యలింగంనాయకర్, పేరొందినవారు, ధనాఢ్యులై ధర్మ సంస్థ నొకదానిని బీదసాదల విద్య మొదలైనవానికి స్థాపించి కృతార్థులైనారు. సంగీత సంస్థొకటి చాలా సంవత్సరాలనుండి ప్రతి సంవత్సరం వారం పదిరోజులపాటు కచేరీలు చేయించు చుండినది. కాలేజి, ఆస్పత్రి వగైరాలతోబాటు, మంచి కాస్మాపాలిటన్ క్లబ్బున్నది. నేను మొదటినుండి ఆటలలో పాల్గొనే అలవాటు కలవాడనుకాదు. పైగా క్లబ్బులకు సర్వ సామాన్యంగా వెళ్లే పద్ధతిలేదు. చీట్లపేకాటకూడా నా కలవడ లేదు. అవసరమైన న్యూస్‌పేపర్లు, కావలసిన పుస్తకాలు నా యింటివద్దనే వుండేవి. అందువల్ల క్లబ్బు నన్నెప్పుడు ప్రత్యేకించి ఆకర్షించలేదు. కాని అసిస్టెంటు కమిషనరుగారు క్యాంపుకు వచ్చినప్పుడు. వారి నక్కడకు నిత్యం తీసుకొనివెళ్లటం తప్పేది కాదు. వారిలో చిడాగారికి పేకాట మిక్కిలి యిష్టం. అప్పి లేటు అసిస్టెంటు కమిషనరుగా వచ్చిన టి. ఆరుముగం మొదలి యార్‌గారు టెన్నిస్ ఆడేవారు. వారు మంచివారేగాని, తాను సుపీరియర్ ఆఫీసరు ననే ధీమా కలవారు. క్లబ్బులో కూడా, నేను వారిక్రింది ఆఫీసర్నుగా, వారియందు మిక్కిలి ఘనతచూపి, వినయ విధేయతలతో వర్తించాలని వారి అభిప్రాయం. వారు టెన్నిస్ ఆడి, మేము కూర్చున్నచోటికి వచ్చుచున్నప్పుడు, నేను నిల్చొని ఆహ్వానించి, నా కుర్చీ నివ్వాలని వారి కోరి కనుకొందును. నే నట్లు చేయక, ఇంకొక కుర్చీ చూపించినందున, నేను వారికి తగిన గౌరవము చేయలేదని వా రభిప్రాయపడినట్లు నాకు తోచింది.

నా కాకినాడ ఉద్యోగంలో కొందరు ఎక్కువ పరిచయ మైనారు. వారిలో పేరెన్నికగన్న పెద్దలు దివాన్ బహదూర్

కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు. వీ రొకప్పుడు కాకినాడకు మకుటంలేని రాజుగా వుండేవారట. బ్రిటిష్ వారి పరిపాలన కాలంలో కలెక్టరు (జిల్లా) ఒక చిన్న దేవుడు. ఎంత ఘరానా మనిషి అయినా, స్థానిక భారతీయునకు సమాన ప్రతిపత్తి గౌరవ మిచ్చేవాడుకాడు. కాని, కలెక్టరుగారు క్రొత్తగా వచ్చినప్పుడు నాయుడుగారు వెళ్లిచూడగా, తిరిగి మర్యాదకు, నాయుడుగారింటికి వచ్చి వెళ్లేవాడట. 1943 నాటికి నాయుడుగారు వృద్ధ దశకు వచ్చారు. తల నెరసింది. అయినా, దర్జాగా వుండేవారు. వారు మిక్కిలి స్ఫురద్రూపి. ఎత్తైనవారు. మంచి ముఖకవళికలు, వర్చస్సు కలిగి కోటేరువంటి ముక్కుతో, చక్కని మీసకట్టుతో, మిలమిలలాడు శ్వేత దుస్తులను ధరించి అందంగా, హుందాగా వుండేవారు.

వారి కప్పుడున్న ఇతర హోదాలు, పెత్తనాలు, చెలామణులు నాకు తెలిసియుండలేదు. కాని, కాకినాడ శ్రీ సరస్వతీ గానసభ వారు పెట్టిన భిక్షు. దీనిని 1904 లో నాయుడుగారు స్థాపించారు. నా కాలంనాటికి 40 సంవత్సరాలు, జేజేయమానంగా వర్ధిల్లుచూ, ప్రతి సంవత్సరం దసరా, దీపావళి సమయాన, వారం పది రోజులపాటు బ్రహ్మోత్సవం మాదిరి గాన, నృత్య, కచేరీలు జరుపుకొంటుండినది. నేను మొదటి సంవత్సరం (1943) కచేరీలకు వెళ్లినానేమో చెప్పలేను. 1944, 1945 సంవత్సరాలలో జరిగిన సభలకు వెళ్లాను. 1946 మే మొదటి వారంలో నేను సెలవుమీద వెళ్లి, తర్వాత నెల్లూరు సర్కిల్ కు వెళ్లాను కాబట్టి, ఆ సంవత్సరం కచేరి సభలకు వెళ్లలేదు. నా దగ్గరున్న 1945 ప్రోగ్రాం కార్డు ఆ సంవత్సరం సభలు 7-వ అక్టోబరున ప్రారంభించి, 17 అక్టోబరుతో ముగిసినవి. ఈ ప్రాంతంవారే గాక, ఆ సంవత్సరం బొంబాయినుండి శ్రీమతి లలితామంగేష్ గాత్రం, గ్వాలియర్ నుండి జనాబ్ షామహమ్మద్ కమాచ్ గానం, చిదంబరంనుండి శ్రీమతి వేదవల్లి గానం, తంజావూరునుండి శ్రీ లక్ష్మీనారాయణ భాగవతార్ గాత్రం, మద్రాసునుండి శ్రీ కన్నన్ మృదంగం, తంజావూరునుండి కుమారి కమల సినిమా స్టార్ భరతనాట్యం, కుంభకోణంనుండి

కుంభకోణం బ్రదర్సు గాత్రం, మద్రాసునుండి కుమారి కల్యాణి భరతనాట్యం కచేరీలలో పాల్గొన్నారు.

ఈ శ్రీ సరస్వతీ గానసభకు కాకినాడ వాస్తవ్యులేగాక, ఆ జిల్లా పెద్దల, ధనవంతుల ప్రోత్సాహం ముండేది. 1945 సభలలో కిర్లంపూడివారిది, ఔక్కలివారిది, యన్. ఆర్. కే. యల్. హిమ్‌వారిది, బాపూరావ్, రామయ్యగార్లది, పిఠాపురం వారి దని వివరించబడియున్నది. ఆ యా రోజుల ఖర్చులు ఆ యా వారు భరించి యుంటారు. ఏ సంవత్సరమున కా సంవత్సరం దాతలు మారుచుంటారను కొందును.

ఒక సంవత్సరం బేబి కమల (కమలా లక్ష్మన్) నృత్యం చేసింది. అప్పటి కామె 12 సంవత్సరాల వయస్సుమించని పిల్ల. అద్భుతంగా నృత్యం చేసింది. ఆమె నృత్య సందర్భంగా పిఠాపురం మహారాజావారు కచేరీకి వేంచేశారు. చివరవరకుండి నారు. ఒక సంవత్సరం పర్వతనేని వీరయ్య చౌదరిగారి గాత్ర కచేరీ. మిక్కిలి బాగుగా వుండినది. ఆ సంవత్సరం బంగారు పతకం వారికి లభించింది.

నాయుడుగారితో, 'కూచిపూడి వేదాంతం లక్ష్మినారాయణ గారి కుమారుడు శ్రీ జగన్నాథశర్మ రాజమండ్రిలో నృత్యశాల నడుపుచున్నాడు. ఆయనగారి నృత్యం చూచాను. వారి కొక ప్రోగ్రామి స్తే బాగుంటుందని తోస్తున్న' దన్నాను. వారు సమాధానం చెప్పలేదు. ఇంకొకసారి ప్రస్తావించగా, మోటుగా వుంటుందండి అన్నారు. ఇక నేను మాట్లాడలేదు.

శ్రీ నాయుడుగారు న న్నెంతో ఆప్యాయతతో చూచేవారు. వా రొకసారి మా ఇంటికివచ్చి వారి ఆదరణను ప్రస్ఫుటం చేశారు. వారి తమ్ములు భాస్కరరామమూర్తినాయుడు, కేశవ రామమూర్తినాయుడు, మార్తాండరామమూర్తినాయుడు గార్లతో కూడా పరిచయం కలిగింది. కొంతకాలం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాధ్యక్షులుగా వుండిన శ్రీ శీలం గోవిందరాజులునాయుడుగారు శ్రీ భాస్కరరామమూర్తి నాయుడుగారి అల్లుడు, మేనల్లుడు కూడా. ఒకసారి శ్రీ టి.

భాస్కరరావునాయుడు (రిటైర్డ్ ఐ. సి. యస్.)గారు కాకినాడకు వచ్చిన సందర్భములో నాయుడుగా రొసంగిన విందులో పాల్గొన్నాను.

శ్రీ పారుపూడి బాపూరావుగారు శ్రీపాద నరసింహాం గారి మేనల్లుడు, అల్లుడూను. నరసింహాంగారు ఎగుమతుల, దిగు మతుల వ్యాపారం వృద్ధిచేసి, శ్రీపాద నరసింహాం అన్డ్ కంపెనీ పేరు పైకితెచ్చారు. ఈ కంపెనీకి కొన్ని విదేశ ఏజన్సీలుండేవి. ఫ్యాన్సీగుడ్సు అనే రకరకాల వస్తువులను విక్రయించేవారు. విరివైన వ్యాపారం, మంచి రాబడి. శ్రీపాద నరసింహాంగారికి మగసంతానం లేదు. బాపూరావుగారిని దగ్గరకుతీసి, వారి ఆస్తులను అల్లుని కిచ్చి దివంగతులైనారు. శ్రీ బాపూరావు దానిని మంచి స్థాయిలో, హోదాలో నడపినారు. వారు పెద్ద విద్యావంతులు కాకపోయినా, మంచి తెలివితేటలు కలవారు, వ్యాపార దక్షులు. మర్యాదస్తులు. పైగా స్నేహశీలురు నేను కాకినాడనుండి బదిలీ అయి వెళ్లిపోవు చున్నప్పుడు వారింటికి వెళ్లి చెప్పి వచ్చాను.

నేను కాకినాడలో వున్నప్పుడు, పెడసనగల్లులో నివాస గృహం ఏర్పరచుకొనుచున్నాం. నే నా సర్కిల్‌నుండి బదిలీ సమయంలో 1946 మే ఆరంభములో రెండు నెలల సెలవుమీద ఇంటికి వెళ్లబోవుచుండినాను. నాకు టేబుల్ భోజనం అలవాటు. పెడసనగల్లులో తగిన టేబుల్ లేదు. అందువల్ల మా ఇన్ స్పెక్టరు శ్రీ జి. నారాయణరావుకు "ఈ పట్టణం షాపుల్లో మంచి టేబుల్‌ను కొందాం చూడం"డని చెప్పాను. ఆయ నక్కడ విచారించుచుండగా, శ్రీ బాపూరావు, "షాపుల్లో మంచి వున్నట్లు లేదు. మా యింటివద్ద మే ముపయోగించని టేబు ల్సున్నవి. అందులో నొక దానిని తీసుకొని వెళ్లం"డని చెప్పాడట. శ్రీ నారాయణరావు నాతో చెప్పకుండానే, ఇంటికి పట్టుకొని వచ్చాడు. నేను సందిగ్ధంలో పడ్డాను. తిరిగి పంపించటం మర్యాదనిపించ లేదు. అందుకని దానికి ముదరాగా, ఏదైనా ఇవ్వాలని తోచింది. శ్రీ బాపూరావు కళాభిమాని. నా వద్ద

అనంతపూరు జిల్లా పెనుకొండ శ్రీ యన్. వెంకట్రావు లిఖించిన చిత్రపటా లున్నవి. అందులో నొక దానిని వారికి స్తే బాగుండు నని తోచింది. యువక శ్రీకృష్ణుడు ఒక చెట్టుక్రింద వేణుగానం చేస్తుండగా, ఒక రిద్దరు గోపీ యువతులు, మూడు నాలుగు ఆవులు తన్మయులై విశ్రమించు చుండినట్లు చిత్రించిన పెద్దసైజు బొమ్మను వారికి పంపాను. శ్రీ బాపూరావుగా రిచ్చిన భోజన టేబుల్‌ను ఇప్పటికిని ఉపయోగించుచున్నాము.

వారి స్నేహభావం, నేను కాకినాడ నుండి వచ్చివేసిన తర్వాత మా యూరి యువకుని కొకని కుపయోగపడింది. కాకినాడలోని పాలిటెక్నిక్ స్కూలులో వారు శ్రమించి, తమ పలుకుబడి నుపయోగించి అతనికి సీ టిప్పించారు. వారు పూనుకొనక పోతే ఆ యువకునికి సీటు వచ్చేదేకాదు. వా రొకసారి గుడివాడలో ప్రథమ స్థానంలో వున్న కరెడ్ల రామయ్య వకీలు గారితో, కూతురు కనుకొంటూను, ''సంబంధం చేయాలని వున్నది, మీ అభిప్రాయం తెల్పం''డని వ్రాశారు. తగిన సమాధానం పంపాను.

(శ్రీ)పాద రామయ్యగారు కంట్రాక్టులు మొదలైనవి చేస్తూ ప్రాముఖ్యంలోకి వచ్చారు. కలెక్టరు మొదలైన గవర్నమెంటు ఆఫీసర్లతో పరిచయం, కొంత సన్నిహిత్వం సంపాదించారు. రావుసాహెబ్ హోదాను పొందారు. వారు మెతకగా కనపడేవారుగాని, చురుకైన బుర్రే. బాపూరావుగారి వంటి మాటకారికాదుగాని మిక్కిలి మర్యాద, మన్ననలు కలవారు. స్నేహం నెరపటంలో ముందంజవేసే స్వభావం. వారితో స్నేహం మితంగా వుండేది. అయితే చిత్తశుద్ధి లోపించేది కాదు.

ఈశ్వరోద్దేశం మానవుల కర్థంకాదు. పిన్న వయస్సులోనే పై యిద్దరు పరలోకప్రాప్తిచెందారని విని చింతించాను.

దంటు సూర్యారావుగారు బాపూరావు, రామయ్యగార్లతో పాటు స్నేహితులైనారు. అయితే, ఆ ముగ్గురిలో కలసి

కోవటంలోగాని, స్నేహరీత్యా గడపటంగాని వీరితో తక్కువ. మిక్కిలి సన్నని నాటు పుగాకు చుట్టలు కాలుస్తూ నెమ్మదిగా వుండేవారు. ఆలోచనాపరులు. తూచి తూచి మాట్లాడటం వీరి కలవాటు. వీ రన్నదమ్ములు ఆరేడుగురు. కృష్ణమూర్తి అనే వారు బెజవాడలోను, మద్రాసులోను వ్యాపారంచేస్తూండేవారు. ఒకరు భాస్కరరావుగారు, కాకినాడకు కొంతకాలం మునిసిపల్ ఛైర్మన్ గా పనిచేశారు. కొంతకాలం ఆంధ్ర శాసనసభలోనో, మండలిలోనో సభ్యులుగా వుండినారు. నేను 1963 నుండి 1968 వరకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమిలో ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమి ప్రతినిధిగా వుండినప్పుడు, శ్రీ భాస్కరరావుతో పునఃపరిచయమైనది. నేను కాకినాడలో నున్నప్పుడు వా రింకను యువకులు. అన్నల చాటున వుండేవారు. వారి అన్నలలో నొకరు రాజమండ్రిలో పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరుగా వుండేవారు. నేను కాకినాడను విడిచి వెళ్లుచు ధవళేశ్వరంమీదుగా నా కారులో వెళ్లుచున్నప్పుడు, గోదావరిని దాటడానికి ఇన్స్పెక్టరుగారు తోడ్పడినారు. సూర్యారావుగా రిచ్చిన పూలమొక్కలను ఒక పడవలో సామానుతోబాటు, పెడసనగల్లుకు సమీపంలోవున్న నాగులేరు అయినంపూడి రేవుకు తెచ్చుకొన్నాను. బయటికి పెద్దగా కనపడని ఆప్యాయత వారిది.

డాక్టరు ఐ. జోగారావుగారు మా యింటి డాక్టర్. వారు ఆరాధ్యులు. లింగం ఇంటిపేరుగల మాకు, ఆరాధ్యులంటే ఎక్కువ ఇష్టం. కాగా, గుడివాడలోని ఇవటూరి వగైరా ఆరాధ్య కుటుంబీకులు మానాన్నగారికి కొంత సన్నిహితులు అప్పు తీసు కొని వెళ్లటం, మాట మంతికి కలిసికోవటం ఉండేది. అదిగాక, డాక్టరు జోగారావుగారు మిక్కిలి సహృదయులు. ఒళ్లు దాచు కోని డాక్టరు బీద, బిక్కని ఆదరించే స్వభావంకలవారు. స్నేహ శీలురు. మిక్కిలి మర్యాదస్తులు. ఎప్పుడు చిరునవ్వుతో వుండే వారు. పచ్చని, బక్కపల్చని శరీరంతో, సౌజన్యం కొట్టవచ్చి నట్లుండే మూర్తికలవారు. వైద్యవృత్తిలో నిపుణులని పేరు సంపా దించుకొన్నారు. రెండు భాగాలుగా ఒక నర్సింగుహోమ్ జయ ప్రదంగా నడుపుచుండేవారు. నేను ఆఫీసరుగా, కాకినాడనుండి

వెళ్లిపోవుచున్నప్పుడో, 1952 లో బెజవాడలో అప్పీల్సు అసిస్టెంటు కమిషనర్‌గావుండి, జూన్ - జులైలో కాకినాడకు క్యాంపుకు వెళ్లినప్పుడో నాకు తేనీటివిందు చేశారు.

అసిస్టెంటు కమిషనర్‌గా కాకినాడకు వెళ్లేముందు, నా పురుషాంగం చివర పుండు ఏర్పడినదా అన్నట్లు సలపరం, మంట ఏర్పడింది. కాకినాడకు చేరుకోగానే డాక్టరు జోగారావుగారిని కలసికొని చూపించాను. "ఎందుకైనా మంచిది సుంతీ చేస్తా" నన్నారు. "బోలెడు అప్పీల్సు వినాలే, ఎట్లా వీలౌతుం"దన్నాను. "ఏభ్భె, ఎంతోసేపు పట్టదు. ముందు చర్మం మీా కేమాత్రం బాధ, శ్రమ కలుగకుండా 5 నిమిషాల్లో తీసివేస్తాను. ఒక గంటలో మీాపని మీారు చేసుకోవచ్చు"నన్నారు. ఆ ఉదయం వెళ్లగా, మిక్కిలి సులువుగా తీసివేశారు. కట్టుకట్టించుకొని వచ్చి కొంచెం విశ్రమించి, మామూలుగా ఉదయం 10, 10½ గంటలనుండి అప్పీల్సు విచారించాను. క్యాంపు చివరి రోజున కట్టూడదీసారు. అంతటితో సరి.

నా కెంతమాత్రం అనుమానం వున్నా, అసౌకర్యంగా వున్నా వెంటనే డాక్టరుకు చూపి వైద్యం చేయించుకొంటాను. నేను బందరులో హైస్కూలు చదువు చదువుకొనుచున్నప్పుడు, ఏదో కొంటెపని చేసి, వ్యాధి కలిగిందేమో అని అనుమానపడి, అప్పుడు బందరులో మందులషాపు నడుపుకొంటూ, వైద్యం చేస్తుండిన డాక్టరు శేషగిరిరావుగారికి చూపిస్తే, అదేమీా లేదని చెప్పారని, మద్రాసులో 1929 లో ప్రొబేషనర్‌గా వున్నప్పుడు, మూలశంకవ్యాధి కలిగినట్లు అనుమానపడి, ఆఫీసునుండి వస్తూనే ఇంటికి వెళ్లకుండా, దారిలోవున్న డాక్టరు సి. ఆర్. పిళ్లెగారి క్లినిక్‌కు వెళ్లి మొలకను తీసివేయించుకొన్నానని ఈపుస్తకం మొదటిభాగంలో చెప్పియేయున్నాను.

సుబ్బరాజు అనే క్షత్రియ యువకుడు, మా నివాస గృహానికి సమీాపంలోవున్న గాంధీ పార్కుకు, సూపరింటెండెంటుగా వుండేవాడు. ఆయనతో బాగా పరిచయమైంది. మా యింటిముందు ఆవరణను ఆయన సాయంతో పూలమొక్కలతో నింపి వేశాము.

ఇల్లెల్లపాది మిక్కిలి చనువుగా వుండేవారు. తరువాత తన కిదివర కుండిన కాంపౌండరు అనుభవంతో "సూర్యారాయ మెడికల్ స్టోర్సు" అనే పేరున మందుల షాపు పెట్టాడు. తిరిగి ఆయనను 1952 లో క్యాంపులో కలసికొన్నాను. తాను పెడసనగల్లుకు వస్తానని 1946 లోను, 1952 లోను అన్నారు కాని రానేలేదు.

పై వారేగాక నాతో పరిచయం, నాయందు స్నేహభావం ఉండినవారు కొందరుండినారు. మాదిరెడ్డి సీతారామయ్యనాయుడు గారు ప్రముఖ న్యాయవాదులలో నొకరు. వారు కొంత కాలం పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేశారని గుర్తు. వీరితో నాకంత స్నేహం వేర్పడలేదుగాని క్లబ్బుకు వెళ్లినప్పుడు, ఎక్కడైనా ఏపార్టీలోనైనా కలసినప్పుడు చనువుగా మాట్లాడుకొనేవారం.

రోళ్ల సీతారామయ్యనాయుడుగారు కంట్రాక్టు పనులు ఎక్కువగా చేస్తూండేవారు. కాకినాడ సముద్రతీరంలో అడ్డు గోడలు (గ్రాయిన్సు) కట్టించింది వారే.

కాకినాడలోనే మొట్టమొదటిసారి, ప్రఖ్యాత ఆధునిక కవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిని కలసికొన్నాను. వారి బావగారిని, మేనకోడళ్లు శ్రీమతులు వింజమూరి సీత, అనసూయ గార్లను చూచాను. తండ్రి, కూతుళ్లు ఏదో వివాహానికి మాయింటికి రాగా సత్కరించి పంపాను.

కాకినాడలో న్యాయశాస్త్ర ప్రవీణులు, న్యాయవాదులుండినారు. ఉప్పులూరి ఉమామహేశ్వరశాస్త్రి (పేరదని జ్ఞాపకం) గారు సుప్రసిద్ధులు. నే నొకసారి మా స్వంత వారసత్వపు కేసులో వారిని దర్శించి సలహా తీసుకొన్నాను. వారి సోదరుడు గణపతిశాస్త్రిగారు వేద, సంస్కృత పండితులు. మిక్కిలి ప్రతిభావంతు లని వాడుక. వకీళ్లలో రాస్ గార నేవారు పేరుగలవారు. వారి కుమారులు శ్రీ యమ్. వి. శాస్త్రి కూడ లాయరు పట్టా పుచ్చుకొన్నారుగాని, రాజకీయాలలో అభిలాష ఎక్కువ. అప్పటి కింకను తండ్రిచాటు కొడుకువలెనే వుండేవారు. రాస్ గా రొకసారి ఆఫీసుకు వచ్చినప్పుడు ఎదురుగా కూర్చొని

మాట్లాడుచు, చప్పున నా కుడిచేతిని చేతిలోకి తీసుకొని రేఖలను పరీక్షించారు ఒక్క నిమిషం. ఏమి టని అడిగితే, "అబ్బే, ఏమీ లేదు" అంటూ మాట మార్చి, తన పనిని ముగించుకొని, వెళ్లిపోయారు. వారికి సాముద్రికశాస్త్రమందు అభిమాన మనుకొంటాను. నా చేతిలో వా రాశించిన జయగీతలు లేక కాబోలు ఏమీ లేదన్నారు.

కొలదిమంది వకీళ్లు తమ స్వంత ఆదాయం విచారణ్కై స్వయంగా వస్తూంటా రే సర్కిల్లోనైనా. అలా ఇక్కడ వచ్చిన వారిలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి అడ్వొకేట్ జనరల్ గా వుండిన నరసరాజుగారి తండ్రిగారు, తరువాత జిల్లా జడ్జి అయిన శ్రీ వి. కామేశ్వరరావుగారు గుర్తుకువస్తున్నారు. కామేశ్వర రావుగారు జిల్లా మునిసిఫ్ గా నియమింపబడియుండి, అప్పుడు రివర్టయి యుండినారు. తమ న్యాయవాది సంపాదనను చూపించ టానికి వచ్చారు. తరువాతి కాలంలో వారు బందరు సబ్ జడ్జిగా వున్నప్పుడు, నెల్లూరులోను కలసికొన్నాను. మిక్కిలి స్నేహ శీలురు. మంచి హృదయం కలవారు. చలాకీగా హుషారుగా వుండేవారు. మంచి స్ఫురద్రూపి. అందంగా, ఆకర్షణీయంగా వుండే వారు. నెల్లూరులో ననుకొంటాను, విజయవాడ సుప్రసిద్ధ యాస్ట్రో పామిస్టు శ్రీ సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రిగారు వచ్చినప్పుడు వారు ప్రత్యేక శ్రద్ధవహించి, శాస్త్రిగారిచేత ఉపన్యాస మిప్పించి సత్కరించారు.

సుప్రసిద్ధ సినిమా డైరెక్టర్ సి. పుల్లయ్యగారిని మొట్ట మొదట వా రొకసారి ఆఫీసుకు రాగా చూచాను. వారి మేనల్లుడు చిత్తజల్లువారు ఒకటి రెండు సినిమాలను కాకినాడలో జయ ప్రదంగా నడుపుచుండేవారు. మన రాష్ట్ర పశు సంక్షేమ శాఖకు డైరెక్టరుగా కొంతకాలం పనిచేసిన, శ్రీ చిత్తజల్లు కృష్ణారావు గారి కుటుంబంవారే.

నా కాకినాడ సర్కిల్ ఛార్జి, నా కెట్టి ఇబ్బందులు కలగ కుండగనే గడచిపోయింది. ఒక రిద్దరు జవానులలో కొంత పెంకి

తనం కనపడినా, దానిని సులువుగా సంబాళించుకొనేవాడను. గుమాస్తాలు అనుకూలురు. ఆరాధ్యులుగారి తరువాత, ఇన్ స్పెక్టరుగా వచ్చిన శ్రీ డి. సత్యనారాయణరాజు మొదట కొంత దురభిప్రాయపడినా, తరువాత విషయాల నర్థంచేసుకొని సుముఖుడైనాడు. ఆయన తర్వాత శ్రీ జి. నారాయణరావు నాకు మిక్కిలి సన్నిహితుడుగా వుండేవాడు. ఆయన బరంపురంలో నా వద్ద గుమాస్తాగా పనిచేసియుండినందున, చనువుగా వ్యవహరించుట కనుకూలమైనది. ఆయన గ్రాడ్యుయేటు. క్రమేపి ఆఫీసరై విజయనగరం, గుంటూరు మొదలైనచోట్ల పనిచేసి, రిటైరైనారు. నా కక్కడ చేదోడువాదోడుగా వుండినారు. కొంత కలపకూడా సరసమైన ధరకు సమకూర్చిపెట్టినట్లు గుర్తు.

పన్ను విషయంలో కొంత ఉదార స్వభావము కలవాడను. కష్టనష్టాలకు సానుభూతి చూపేవాడను. కాబట్టి నాయందెట్టి విముఖత్వభావం పన్ను ఇచ్చేవారిలో ఉండేదికాదు. కాని ఆడిటర్ హోదా లేకపోయినా, ఇన్ కమ్‌టాక్సు ప్రాక్టీషనర్సు అను పేరుతో, పార్టీల తరఫున హాజరైన వారిలో ఇద్దరు, ముగ్గురకు కొంత కష్టం కలిగి వుంటుంది. ముఖ్యకారణం, వారిని ఆదరించి, కుర్చీలమీద కూర్చోపెట్టలేదని. ఈ ప్రాక్టీషనర్సు తలాతోకా లేకుండా కేసులను తీసుకురావటం, అసంపూర్తిగా సమాచార మందించటం, అడ్డదిడ్డంగా సమాధానాలు చెప్పటం, అనవసరంగా కాలహరణంచేయటం పరిపాటి. ఇట్టివారికి వారి హోదాకు మించిన గౌరవ మిస్తే, పని అసలే సాగదను అభిప్రాయంతో, వారిని సావకాశంగా కూర్చోమనేవాడను కాదు. నేను ప్రాక్టీషనర్సుకు, పార్టీలకు కుర్చీ లివ్వనని, తలగుడ్డలేకుండా లోనికి రానీయనని వగైరాలతో పిటీషను, మాకమిషనర్ గారికి వెళ్లింది. దాని విషయం అడిగిన మా అసిస్టెంటు కమిషనర్ గోపాలస్వామినాయుడుగారి కుచితరీతిని సమాధానం చెప్పినట్లు, తరువాత, కమిషనర్ శ్రీపారిగారు, "చౌదరీ, కాలం మారింది. డ్రస్సు విషయంలో పట్టించుకొనవ"ద్దని సలహా యిచ్చారని పైన చెప్పియేయున్నాను. నేను సమాధానాన్ని నిందారోపణ పిటీషను మీదనే వ్రాశాను. ప్రాక్టీషనర్సుకు పార్టీలకు కుర్చీలివ్వనని, తల

గుడ్డ ధరించాలని పట్టుబడతానని చేసిన ముఖ్య ఆరోపణలను ఒప్పుకొంటూ కారణాలను తెల్పాను. అసిస్టెంటు కమిషనర్ గారు నాయందు అభిమానంచేత కాబోలు, "మీ రిట్లా ఆ పిటీషన్ మీదనే ఒప్పుకొనకపోతే బాగుండే"దన్నారు. "నేను యధార్థం ఒప్పుకొన్నాను. నేను చేసింది తప్పని నే ననుకొనను" అని ధీమాగా చెప్పాను. ప్రాక్టీషనర్సేగాక ఒక రిద్దరు అర్హతగల ఆడిటర్లుండే వారు. వారిలో శ్రీ వెంకట నారాయణ అనేవా రొకరు. వీరు కమ్మ కులస్థుడు. కొంత అభిమానం నటించినా కుంచిత హృదయం, కాపట్యంగల వ్యక్తి. ఈయన కారణంగానే, నా ఇన్‌స్పెక్టరు శ్రీ డి. సత్యనారాయణరాజు మొదట నాయందు వ్యతిరేక భావం కలిగియుండినది

కొంతకాలం తర్వాత సెంట్రల్ బోర్డ్ ఆఫ్ రెవిన్యూ మెంబ రయిన శ్రీ గోవింద నాయరుగారు 1945 డిశంబరులోనో, 1946 జనవరిలోనో కాకినాడకు వచ్చారు. వ్యవసాయభూముల ఆదాయంమీద పన్ను వేయాలని గవర్నమెంటు తలంచి, సంగతి సందర్భాలను తెలుసుకొని సమాచారాన్ని సమకూర్చటానికి వారిని డైరెక్టరుగా నియమించారు. ఆ సందర్భంగా కాకినాడకు వచ్చి మా యింట్లో రెండు రోజు లుండినారు. మావద్ద చాలా సంవత్సరాలుగా వంటవాడుగావుండిన రామన్ నాయర్ ఎందుకో అలిగి వెళ్ళిపోయాడు. బందరునుండి శేషయ్య అనే తెలగ వంట వానిని తెచ్చుకొన్నాం. అత డదివరకు చిన్న హోటల్ నడుపు కొనేవాడట. అలవాటుకు భిన్నమైన పనిని చేయలేక వెళ్ళి పోయాడు. అందువల్ల నా భార్యయే వంటజేసి, శ్రీ నాయరును సంతృప్తి చేయవలసి వచ్చింది.

చివరి సంవత్సరం 1946 ఫిబ్రవరి ఆఖరుకే, నా సర్కిల్ లోని కేసు లన్నిటిని విచారణ పూర్తిచేశాను. చేతి కందని 5, 6 కేసులు మిగిలిపోయి యుండవచ్చును. విచారణ సంవత్సరం మార్చి 31 తో ముగుస్తుంది. బందరు సర్కిల్ లో చాలా కేసులు ఫిబ్రవరి మాసాంతానికి మిగిలి వున్నవి. రెట్టింపు వడిగా పని చేసినా, అక్కడి ఆఫీసరు శ్రీ ఊటుమల్లి దుర్గాప్రసాదరావుగారు

పూర్తిచేయలేరు. అందువల్ల కమిషనర్ కొన్ని కేసులు నాకు అప్పగించి, బందరు వెళ్లి పూర్తి చేయమన్నారు. నేను ఒక్క పరసనల్ (క్యాంపు) క్లార్కును, వంటవానిని తీసుకొని బందరు వెళ్లాను. శ్రీ ప్రసాదరావుగారు నన్నెంతో ఆప్యాయతతో ఆహ్వానించి, తమ యింటిలోనే విడిదిచేయవలసింది, తమతో బాటు భోజనం వగైరా చేయవలసిం దని చెప్పారు. వారికి శ్రమ కలుగుతుంది, నా అలవాట్లకు ఇబ్బందిగా వుంటుం దని వద్దని చెప్పి ఆఫీసులోనే మకాం పెట్టాను. ప్రక్క షెడ్డులో వంట వాడు తనపనిని నిర్వర్తించుకొన్నాడు. అయినా ఒకటి రెండు సార్లు ప్రసాదరావుగారు తనప్రక్క కూర్చోబెట్టుకొని, రాచ మర్యాదలతో భోజనంచేయించారు.

అక్కడ క్యాంపు పదిరోజులు చేసివుంటాను. 80 కేసు లైనా పూర్తిచేసి వుంటాను. సామాన్యమైన కేసులు మాత్రమే నాకు వప్పగించారు. పెద్దకేసులు త్వరగా పూర్తి కావు కదా. కేసులు మొత్తాన్ని తగ్గించడమే ధ్యేయంకాబట్టి, సులువుగా పూర్తిఅయ్యేవే నా కిచ్చారు.

అప్పుడు బందరులో సబ్ జడ్జిగా వున్న బారిష్టరు (పేరు చప్పున గుర్తుకు రావటంలేదు) గారి ఇంటికి ప్రసాదరావుగారు తీసుకొనివెళ్లి పరిచయపరచారు. వా రెంతో మర్యాదచేసి టీ వగైరా ఇచ్చారు. ఆ క్యాంపులో, శ్రీ పిన్నకోట ఉదయ భీమరాజుగా రింటికి వెళ్లి చాలాకాలానికి వారిని కలుసుకొన్నాను. వారు ఇంటర్మీడియట్‌లో, మా లాంగ్వేజిగ్రూపులో వుండే వారని, శ్రీ మొక్కపాటి సూర్యనారాయణశాస్త్రిగారివద్ద సంస్కృత రత్నావళి వగైరా చదువుకొన్నామని ఇదివరలో చెప్పాను. వా రిప్పటికిని బందరులో న్యాయవాదిగా వున్నారు. ఈమధ్య మేము ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొన్నాం.

నేను 1946 మే నెలా రంభములో కాకినాడ విడిచి వెళ్లాను. ఇంకొక సర్కిల్‌కు వెళ్లే ముందు రెండు నెలలు సెలవుపెట్టాను.

క్రొత్త స్టేషను నేదో సెలవు పూర్తిఅయ్యే ముందుగాని తెలియదు. నావద్ద చాలా పుస్తకాలుండినవి. క్రొత్త స్టేషనుకు వెళ్లినప్పుడు అక్కడకు తెప్పించుకొనవచ్చునని ఆ పుస్తకాలను మూడు, నాలుగు పెద్ద దేవదారుచెక్క పెట్టెలలో పెట్టించి, నానుండి ఛార్జి తీసుకొని, ఆ యిటీలోకే స్థానానికి వచ్చిన తురగా రామ చంద్రరావుగారికి చెప్పి. ఒక చిన్న గదిలో పెట్టించాను. నా క్రొత్త స్టేషనుకు తెప్పించుకొంటా నని చెప్పి ఒక గుమాస్తాకు పంపే బాధ్యత వప్పగించాను. నాకు బరంపురంలో 1932 అక్టోబరు ఆఖరులో ఛార్జి అప్పగించిన శ్రీ తురగా రామచంద్రరావు గారే వీరు. అదివరకే తెలిసియున్నవారుకాబట్టి, పుస్తకాలు భద్రంగావుంటవని తలంచాను.

సెలవు అనంతరం, 12-7-1946 తారీఖున నెల్లూరు సర్కిల్ ఛార్జి తీసుకొన్నాను. నెల్లూరుకు వెళ్లే ముందు కాకినాడలో నా ఇన్‌స్పెక్టరుగా పనిచేసిన (శ్రీ) డి. సత్యనారాయణరాజు నెల్లూరులో ఇన్‌స్పెక్టరుగా నుండినాడు. ఆయనకు వ్రాయగా, "ఇల్లు కుదర లేదని, కొంతకాలం ఆఫీసు బిల్డింగులో వుండవ"చ్చని వ్రాశారు. అందువల్ల ఒంటరిగా వంటవానితో వెళ్లి ఆఫీసు మేడలో ఒక ప్రక్క వుండినాను. వంటవాడు క్రింద వంటచేసేవాడు. వెళ్లిన కొద్దిరోజులకు పుస్తకాల పెట్టెలను తెప్పించుకొని, రికార్డు రూములో పెట్టించాను. నాలు గైదు వారాలకు ఇల్లు దొరకగా కుటుంబాన్ని రప్పించుకొన్నాను. పుస్తకాల పెట్టెలను తెరి పించగా, అంగుళ మెత్తుగ చెదలు నిండియున్నవి. పుస్తకములలో చాలాభాగం చెదలు తినివేశాయి. ఆ పుస్తకాలలో కొన్నింటిని నేను విద్యాభ్యాసం ముగించిన తర్వాత, ఇంగ్లండునుండి తిరిగి వచ్చినప్పుడు తెచ్చుకున్నవి. అవి చాలాభాగం నశించిపోయాయి. వానిలో కొన్ని అరుదైన, విలువైన పుస్తకాలు. తర్వాత బొంబాయి టైమ్సు ఆఫ్ ఇండియా వారి సహకారంతో, హోమ్ లైబ్రరీవారు మిక్కిలి చక్కగా ముద్రించి ప్రచురించిన విలువగల పుస్తకాలు నశించిపోయాయి. బెర్నార్డ్‌షా నాటకాల వాల్యూ ములు శిథిలమైనాయి. ఇంత నష్టం కలుగుటకు కారణం పెట్టెలు పెట్టిన గదిలోకి బయట వరండానుండి, లోపలి హాలునుండి

చీపురుతో కడిగి, ఎగజిమ్మిన నీరు వెళ్లుటవల్లనే. రామచంద్ర రావుగారు నియోగిబ్రాహ్మణుడైనా, ఆచారపరుడైన వైదికి వంటివాడు. వారింట్లో అంటు, సొంటు జాస్తి. తలుపు గడప సందులనుండి చీపురుతో ఝాడించి ఎగగొట్టి ఊడ్చినందున, నీరు లోనికి ప్రవేశించియుండును. సహోద్యోగి, బాగా తెలిసినవాడు, రామచంద్రరావుగారు మాత్రం శ్రద్ధ తీసుకొనలేదుకదా, వారి అశ్రద్ధవలన చప్పున దొరకని కొన్ని పుస్తకాలు నాశనమైనవి కదా అని మిక్కిలి బాధపడ్డాను.

నేనప్పుడు కాకినాడలో ఎరిగియున్నవారు చాలామంది యిప్పుడు లేరు. డాక్టర్ జోగారావుగారు కూడా వెళ్లిపోయారు. వెంకట నారాయణ అనే కమ్మ ఇన్‌కమ్ టాక్సు ప్రాక్టీషనరుకూడా గతించినట్లున్నారు. అప్పుడున్న ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీషనర్సు శ్రీ సుందరం, శ్రీ భావరాజు వగైరావారు ప్రాక్టీసు విరమించు కున్నారో, జీవించియున్నారో తెలియదు. చాలా సంవత్సరములు గడచినవికదా. శ్రీయుతులు చిగురుపాటి వీర్రాజు, ఏలేటి నారాయణమూర్తి, చుండ్రు చిరంజీవేశ్వరరావు గార్లను ఈమధ్య కలసికొన్నాను.

1942–'43 ఆర్థిక సంవత్సరంలో కాకినాడ సర్కిల్ పన్ను రాబడి 3 లక్షలకు కొంచెం హెచ్చు. నేను వెళ్లిన మొదటి సంవత్సరం 1943–'44 లో అది తొమ్మిది లక్షల వరకు పెరిగింది. పెరుగుదల నా ప్రయోజకత్వంవల్ల కాదు. నేను క్రిందు మీదు చూడక, కఠినంగా ప్రవర్తించి, తప్పుడు అంచనాల ఆదాయాల మీద పన్ను వేసినందువల్లకాదు. 1942–'43 లెక్క సంవత్స రంలో బట్టల అమ్మకం నుండి, ధాన్యం మిల్లుల నుండి ఆదాయాలు విపరీతంగా పెరిగిపోయినవి. ఇతర సరుకుల ధరలు హెచ్చుగా పెరిగి, నిల్వ సరుకుల నుండి ఎక్కువ లాభాలు వచ్చాయి.

మొత్తంమీద ఏ ఒకిపిడి, రాపిడి లేకుండానే, కొంత సహృద్భావాన్ని పొందకలిగియే కాకినాడ సర్కిల్ విడిచిపెట్టాను. బరంపురం తర్వాత కాకినాడయే నా అభిమాన సర్కిల్. అయినా ఉద్యోగస్థులు దారి ప్రయాణీకులవంటివారు కదా!

సెలవుమీద మే మింటికి వచ్చేటప్పటికే మేము తలపెట్టి యుండిన వంటయిల్లు పూర్తి అయినది. ముందు వరండా పైకప్పు రెల్లుగడ్డితో నేయబడి, నేల గచ్చుచప్టాగా తయారుచేయబడినది. వరండా విశాలమైనది. మేము సెలవుమీద వచ్చినది వేసవికాల మగుటచేత, మే మందరం వరండాలో పడుకొనేవారం. పగలు కూడ అక్కడనే విశ్రమించేవారం. మేము పెడసనగల్లు చేరుకొనిన తర్వాత గృహప్రవేశం తంతు కొద్ది స్థాయిలో జరిపి, నివాసం మొదలుపెట్టినాము. గృహప్రవేశం తంతుకు మా తమ్ములనుకూడా పిలువలేదు. ఊళ్లో బంధువులను, స్నేహితులలో కొద్దిమందిని ఆహ్వానించి పని పూర్తిచేశాము. సెలవు పూర్తిచేసుకొని నెల్లూరు సర్కిల్‌కు బయలుదేరే ముందు, మా వదినె రెండో కుమారుడు సీతారామారావు అతని భార్య సోమమ్మతో మా యింటిలో కాపురం ప్రారంభించాడు. అప్పటికి సీతారామారావు అన్నదమ్ములు విడిపోయి, ఎవరికి వారు ప్రత్యేక నివాసాల నేర్పరచుకొన్నారు. సీతారామారావు అత్త మామలకు నలుగురు కుమార్తెలు తప్ప, కొడుకులు లేరు. పెద్ద కూతురు సీతారామారావు భార్య సోమమ్మ. రెండు, మూడు పిల్లలను బయటిచ్చారు. నాలుగవ పిల్ల వివాహంకాని పిల్ల. సీతారామారావు మామగారి దీ వూరే. అత్తవారికి డాబా వున్నది. ఆ కారణంచేత వేరే ఇల్లు ఏర్పాటు తలపెట్టుకోలేదు. అయితే అత్తవారి డాబా, అప్పటికి అతని నివాసానికి అనుకూలముగా వుండలేదు. అందువలన ఖాళీగావున్న మా యింటిలో ప్రవేశించాడు.

ఈ సెలవు మామూలుగానే జరిగిపోయింది. కొంత విశ్రాంతితోను, కొంత భూములు మరమ్మతు చేయించుకోవటంలోను కాలం గడిచింది. ఈ సెలవు చివరి భాగంలో ఒక సమాచారం తెలిసింది. అంతకు ముందు మా డిపార్టుమెంటులో పునర్వ్యవస్థీకరణ (రి ఆర్గనైజేషన్) అను పేరుతో పెద్ద మార్పు వచ్చింది. ఇదివరకున్న పద్ధతిప్రకారం. ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్లకు ఒకే తరగతి (కాడర్) ఉండింది. ఆఫీసర్లు నెల 1 కి 300 రూపాయలు జీతంతో ప్రారంభించి, కాలప్రమాణం (టైమ్‌స్కేల్) ప్రకారం,

ప్రతి సంవత్సరం జీతం పెరుగుచు, 900 రూపాయల వరకు వెళ్లేవారు. బాత్తిగా దద్దమ్మ కాకపోతే, సమర్థత (ఎఫిషెన్సి) అడ్డు 500 రూపాయలు దాటి వెళ్లేవారు. కొంత సీనియారిటీని బట్టి ఆటంకం లేకుండా, అసిస్టెంటు కమిషనర్ అయ్యేవారు. నిజానికి కమిషనర్‌కు నచ్చితే, శ్రీ జి. వెంకటస్వామినాయుడుగారికి కమిషనర్ శ్రీ సెనెక్ ప్రమోషన్ నిచ్చినట్లు, 900 రూపాయలకు చాలా ముందుగానే అసిస్టెంటు కమిషనరై కూర్చొనేవారు. అదంతా మార్చి, ఆఫీసర్లను మొదటి క్లాసు, రెండో క్లాసుగా విభజించారు. మొదటి క్లాసులో ఎ గ్రేడు, బి గ్రేడు అని రెండు అంతస్తులు ఏర్పరచారు. రెండో క్లాసు ఆఫీసరు మామూలు స్థితి ఆఫీసరు. అతని జీతం తక్కువ. మొదటి క్లాసులోని బి గ్రేడు ఆఫీసరుకు, అసిస్టెంటు కమిషనర్ ప్రమోషన్ రావటానికి కాలం పట్టుతుంది. అతడు ఎ గ్రేడుకు ఎగబ్రాకేవరకు అవకాశం లేదు. ఎ గ్రేడు వారే అసిస్టెంటు కమిషనర్లవుదురు. ఈవిధంగా క్లాసులు, గ్రేడులు పెట్టి కొంతమంది ఆఫీసర్లను మొదటి క్లాసులోకి తీసుకొన్నారు. నేను సెలవులోనుండగా, ఈ క్రొత్తపద్ధతి వివరాలు తెలిసినవిగాని, నన్ను మొదటి క్లాసులో వేయరని నే నెన్నడూ ఊహించి యుండలేదు. కాని, నన్నట్లు చేర్చలేదని తర్వాత తెలిసింది.

ఇది ఆల్ ఇండియా ఏర్పాటు. మద్రాసు విభాగము నుండి మొత్తం 20 మందిని మాత్రమే మొదటి క్లాసులోకి తీసుకొన్నారు. ఆ రోజుల్లో ఎక్సెస్ ప్రాఫిట్సు పన్నుండేది. ఆ పన్నును వసూలుచేయటానికి కొంతమందిని ఎక్సెస్ ప్రాఫిట్సు ఆఫీసర్లుగా నియమించారు. వీ రందరు సమర్థులని తలంచి, వీ రందరికి మొదటి క్లాసిచ్చారు. వీరుగాక ఇన్‌కమ్ టాక్సు అప్పిలేట్ ట్రిబ్యునల్ ముందు డిపార్టుమెంటు తరఫున హాజరయ్యే ఆఫీసర్లుండినారు. సమర్థులైన వారే ఈ పదవుల్లో వున్నారని అంచనా. వీరుగాక, ఇన్‌స్పెక్టింగు అసిస్టెంటు కమిషనర్ల అభిమానాన్ని పొందిన కొంత మంది ఆఫీసర్లను, మొదటి క్లాసులో చేర్చారు. వీ రందరుగాక, మద్రాసు హెడ్ ఆఫీసులో పనిచేయుచు కమిషనర్ దృష్టిలో వుంటూ, వారి అనుగ్రహాన్ని పొందినవారు, ఆ జాబితాలో చేర్చ

బడ్డారు. ఇక నావంటి వారికే, ఆ కొద్ది 20 స్థానాలలో స్థానం లేకుండా పోయింది. నేను ఎక్సెస్ ప్రాఫిట్సు టాక్సు ఆఫీసర్ను కాను. డిపార్టుమెంటు రిప్రజెంటేటివ్ను కాను. మరిన్ని అసిస్టెంటు కమిషనర్ల దృష్టిలో స్వతంత్ర ప్రవృత్తి కలవాడను. వాళ్ల నంతగా గౌరవించ నని వాళ్ల గుర్రు. నిజానికి, అప్పటి అసిస్టెంటు కమిషనర్లకంటె నేను విద్యాధికుడను. ఇది ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సును వారికి కలిగించి వుంటుంది. సంవత్సరాని కొకసారి పని తనిఖీ వుంటుంది. ఎంత చేతకాని అసిస్టెంటు కమిషన రైనా, అదివరకు ఎంతో స్నేహభావంతో మెలగేవాడైనా, తనిఖీకి వచ్చేటప్పటికి బిర్రబిగుసుకొని ఆఫీసరు తన నౌకరైనట్లు వర్తించేవాడు. అహంభావంతో మెలగేవాడు. ఈ దురుసు తనాన్ని, అహంభావాన్ని నేను సహించేవాడను కాను. ఒకటి రెండుసార్లు ఘర్షణపడటం జరిగింది. అందువల్ల వారి ఆంతరంగిక రిపోర్టులలో నన్ను గురించి మెప్పుగా వ్రాసియుండరు. బాగా మెచ్చుకొనందే, మొదటితరగతి ఆఫీసరవటానికి అవకాశ ముండ లేదు. పైగా, మద్రాసుకు దూరంగా ఏ చిన్న పట్టణంలోనో వున్నందువలన వ్యక్తిగతంగా కమిషనర్ గారికి, నా మంచి చెడులు తెలిసియుండవు. నా వ్యక్తిత్వం, దక్షత వా రర్థం చేసికొని యుండరు. పూర్తిగా అసిస్టెంటు కమిషనర్ల ఆంతరంగిక రిపోర్టుల మీదనే ఆధారపడి యుందురు. నా నమ్మకం, నేను మద్రాసులో ఆఫీసరుగావుండి, వారు నన్ను కొంతవరకైనా ఎరిగియుండిన యెడల, చూస్తూ నన్ను మొదటి క్లాసు ఎ గ్రేడులో వేయ కుండా వుండేవారు కాదని.

నేను నెల్లూరు సర్కిల్కు వెళ్లిన 2½ సంవత్సరాలకుగాని, నన్ను మొదటి క్లాసు ఎ గ్రేడులో చేర్చలేదు. తర్వాత 1949 డిశంబరు చివరలోగాని, నాకు అసిస్టెంటు కమిషనరు పదవి లభించ లేదు. ఈలోపు, ఢిల్లీలోని సెంట్రల్ బోర్డుకు అప్పీలు చేసు కొన్నాను. అప్పుడు బోర్డు మెంబరుగా వుండిన శ్రీ కె. గోవింద నాయరుగారు నాకు న్యాయం కలిగించటానికి పూనుకొన్నారు.

ముఖ్యంగా శ్రీ జవ్వాద్ హుస్సేన్ గారు సాయం చేశారు. వారదివరకు అనంతపూరు జిల్లా కలెక్టరుగా వుండినప్పుడు బాగా ఎరిగియుంటినని పైన చెప్పాను. నా దురవస్థ సమయంలో, వారు యూనియన్ పబ్లిక్ సర్వీసు మెంబరుగా వుండినారు. వారు నన్ను స్వయంగా ఎరిగియుండుట చేతను సానుభూతి చూపించారు. అప్పుడు మద్రాసు కార్పొరేషన్ కమిషనర్‌గా వుండిన శ్రీ సి. నరసింహంగారిని శ్రీ జవ్వాద్ హుస్సేను, ఏదో సందర్భంగా కలసికొనుట తటస్థించిందట. అప్పుడు నా పేరును శ్రీ నరసింహం ఎత్తగా, "చౌదరిని నేను బాగా ఎరుగుదు" నన్నారట. వారి చలవ వలననే నాకు చాలా ఆలస్యంగానైనా ప్రమోషన్ వచ్చింది. అయితే శ్రీ కె. గోవింద నాయరుగారు పట్టుబట్టకపోతే వచ్చేదికాదనుకొంటాను. వారిద్దరు నాకు తోడ్పడ్డారు.

## నెల్లూరు సర్కిల్

నేనిక్కడ 1946 జులై 12-వ తారీఖున ఛార్జి తీసుకొన్నాను. అంతవరకు 3 సంవత్సరములనుండి ఆఫీసరుగా నుండిన ఎ. బి. సుందరేశన్ గారు, ఇన్‌స్పెక్టరుకు ఆఫీసు ఛార్జి యిచ్చి సెలవుమీద వెళ్లిపోయారు. సుందరేశన్ గారు మిక్కిలి సమర్థుడు. ఓపికతో, స్తనశల్య పరీక్ష చేయగలవాడు. వాదనాపటిమ కలవాడు. గుమాస్తా పదవినుండి పైకి వచ్చిన అనుభవనీయుడు. అయితే, పట్టు విడుపు లేని వ్యక్తి. దమ్మిడీలు, దమ్మిడీలు పోగుచేయాలనే మనస్తత్వం కలవాడు. అనునయంగా పన్నుదారులను సమాధానపరచి, రాబట్టుకొనే శక్తిగలవాడు కాదు. అందువలన కేసులను ప్రతి సంవత్సరం నిల్వబెట్టేవాడు.

నెల్లూరు సర్కిల్‌లో ముఖ్యాదాయం అభ్రకమునుండి. గూడూరు, రాపూరు తాలూకాలలో పెద్ద అభ్రకం గనులున్నవి. వానినుండి విస్తారమైన మైకాను వెలికి తీస్తారు. షా మైన్ వంటి గనులను మైళ్లదూరం లోతుకు త్రవ్వుకుపోయారు. అభ్రకపు గనుల యజమానులు చాలావరకు గూడూరులో నివసించుచుండేవారు, లేక వారి ఆఫీసు లక్కడుండేవి. పైగా, చాలామంది



నెల్లూరు సర్కిల్ : గ్రంథకర్త కుటుంబం 1946 - 49 — కూర్చున్నవారు : 1. చిరంజీవి మలినేని వీరభద్రరావు, 2. చిరంజీవి సౌభాగ్యవతి వజ్రాంబ, 3. గ్రంథకర్త, 4. శ్రీమతి లింగం అన్నపూర్ణమ్మ (భార్య), 5. చిరంజీవి రాధాకృష్ణ

క్రింద కూర్చున్నవారు : 1. చిరంజీవి సుధాకర్, 2. చిరంజీవి కమలకుమారి



నెల్లూరు సర్కిల్ : గ్రంథకర్త బిడ్డల వివరం 1946 - 49

కూర్చున్నవారు : 1. చిరంజీవి రాధాకృష్ణ, 2. చిరంజీవి కమలకుమారి, 3. చిరంజీవి సుధాకర్, 4. చిరంజీవి మలినేని వీరభద్రరావు

గనులనుండి ముడిసరుకు కొని, దానిని చీల్పించి, కత్తిరించి విదేశాలకు ఎగుమతిచేసే వ్యాపారుల కమ్ముచుండినారు. కొందరు విస్తారంగా కొని విదేశాల కెగుమతి చేసేవారు. వీరు గూడూరు లోనే మకాం. అందువల్ల నూటికి 90 వంతులైనా అభ్రక సంబంధమైన కేసులను గూడూరు క్యాంపులోనే విచారించేవారు. సుందరేశన్ గారి కఠిన దృక్పథానికి భయపడి గనుల యజమానులు, వర్తకులు వారక్కడ క్యాంపు చేయుదురని తెలియగానే తమ కొట్లను, ఆఫీసులను మూసివేసి తాళాలువేసి కనపడకుండా పోయేవారు. నెలలో వారం విడిచి వారం సుందరేశన్ గారు గూడూరులో క్యాంపు చేసేవారు. క్యాంపుకు 6 రోజులు చొప్పున 2 క్యాంపులకు 12 రోజులు. ఈ పండ్రెండురోజులకు ఒక పెద్ద కేసైనా విచారణకు వచ్చేదికాదు. ఏ రెండు మూడు చిన్న మైకా కేసులను, ఇతర వర్తకం, వాణిజ్యానికి సంబంధించిన కేసులను కొన్నింటిని పూర్తి చేసుకొని తిరిగి వెళ్లేవారు. ఈ పరిస్థితులవల్ల పని చాలా కుంటుపడిపోయింది. నేను నెల్లూరుకు ముందు కాకినాడలో వుంటినికదా. అక్కడ నేను కేసుల నన్నింటిని పూర్తిచేసేవాడను. చివరి సంవత్సరంలో, బందరు కేసులను కూడా విచారిస్తిని. ఆ సంవత్సరం కమిషనర్ తన రివ్యూలో నన్నభినందించారు. అది గుర్తుంచుకొని కమిషనర్ గారు, "సుందరేశన్ వల్ల ఇక కాదు. విచారణ పూర్తి చేయుటలో చౌదరి దిట్ట. అతనిని నెల్లూరుకు పంపుదా" మని నన్ను నెల్లూరు సర్కిల్ కు నియమించినారట. ఇది సుందరేశన్ గారే మద్రాసులో చెప్పారు.

నేను ముందు ఒంటరిగా వెళ్లాను. మా ఆఫీసు మేడ ప్రఖ్యాతి గ్రంథ ప్రచురణకర్తలు వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్సు వారిది. నా నివాసానికి కొంతకాలాని కిల్లు దొరికింది. ఒక మారుమూలనున్న చిన్నయిల్లు. అది అత్యధిక ప్రముఖమైన షా అనే అభ్రకపుగని యజమానులు శ్రీ గోగినేని వెంకట సుబ్బయ్య వగైరా వారిది. వారు దానిని కొన్ని సంవత్సరాలనుండి, గొడౌనుగా ఉపయోగించుకొనుచుండేవారట. ఇల్లు దొరకక యిబ్బంది పడుచున్నందున, నేను వారివలెనే కమ్మ

కులస్థుడను, కృష్ణాజిల్లావాడ నగుటచేత వారు సానుభూతితో ఆ యింటిని ఖాళీచేయించి, నాకు స్వల్ప అద్దె కిచ్చారు.

నెల్లూరు పట్టణం ఆకాలంలో చిన్నదైనా, చూచుట కింపుగా లేకుండినా, బజారులు, రోడ్లు సరియైన మరమ్మతు లేక, శుభ్రత లేక దుమ్ము గొట్టుకొని వుండినా, మురికిచోట్లు హెచ్చుగానే వుండినా, చెప్పుకోతగ్గ మంచి భవనాలు లేకుండినా ప్రాచీన కాలమందు సింహపురి అను పేరుతో, మిక్కిలి ప్రఖ్యాతినొంది, ప్రసిద్ధిగన్న రాజులచే పాలింపబడి, కవిబ్రహ్మ తిక్కనకు ఆవాసమై యుండినది. ఇప్పుడు కూడా సంపన్నులైన రెడ్లు, విద్యాధికులుండుటవలన, కొంత పేరుప్రతిష్ఠలు కలిగియున్నది. అభ్రకంగనుల నుండి లక్షలు సంపాదించిన రేబాల లక్ష్మీనరసా రెడ్డి, సుందరరామరెడ్డి వంశస్థులు, పట్టాభిరామ రెడ్డి, లక్ష్మీ నరసారెడ్డి గార్లు, ఆంధ్ర సాహిత్య పోషకులు తిక్కవరపు రామి రెడ్డిగారు, సుజనుడు, న్యాయవాది రేబాల దశరథరామిరెడ్డిగారు, సాహిత్యపరుడు శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు, వైద్య శ్రేష్ఠులు ఏనుగు సుందరరామిరెడ్డిగారు, మొదలైన రెడ్డిప్రముఖులు, శ్రీ మాలకొండయ్య, శ్రీ తూములూరి శివరామయ్య గార్లవంటి ప్రముఖ న్యాయవాదులు, జమీన్ రైతు పత్రికను స్థాపించిన శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడుగారు, వెంకటగిరి రాజాగారి కాలేజి, పెద్ద పుస్తకభాండాగారం, దళితకులాల అభివృద్ధికి కంకణంకట్టుకొనిన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు, శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారివంటి రాజకీయవేత్తలతో కొంతకు గొంత పూర్వ ఆధిక్యతను నిలబెట్టుకొనియుండినది.

నెల్లూరు రెడ్లు వ్యాపారదక్షులు. తమ కే దవసరమో, దేని వల్ల తమకు ప్రయోజనమో, లాభదాయకమో, బాగా గుర్తెరిగినవారు. కార్యచతురులు. ఏ పని నెట్లు నిర్వర్తించు కొనాలో తెలిసినవారు. ఆర్ద్రహృదయం తక్కువ, వ్యాపారదృష్టి ఎక్కువ. సర్వసామాన్యంగా నెల్లూరు జిల్లావారు గడుసువారు. తమ పబ్బం గడుపుకొనుటలో దిట్టలని వాడుక. నెల్లూరు స్త్రీలు నెరజాణలని సామెత. ఈ సామెతను రుజువుపరుస్తున్నట్లు ముతక కథలను చెపుతారు. స్త్రీల సంగతి నాకు తెలియదు. వారు

చమత్కారపరులై యుందురు కాబోలు. సామాన్యార్థమున, అందమైనవాళ్లైకూడా ఉండవచ్చును.

నెల్లూరు పట్టణం మధ్యరకం నగరం. దాని పెద్ద వీధిని ట్రంకురోడ్డంటారు. కారణం మద్రాసుకువెళ్లే ట్రంకురోడ్డు పట్టణంగుండా వెళ్తుంది. ఆ రోడ్డులోనే దుకాణాలు, వ్యాపారం జాస్తి. వచ్చే పోయే జనసమ్మర్దంకూడా జాస్తి. అయినా, నే నక్కడున్నప్పుడు ఆకర్షణీయంగా వుండేది కాదు. ఇతర రోడ్లు, బజార్లు, గజిబిజిగా, అశుభ్రంగా వుండేవని గుర్తు. హోటల్లు, సినిమాలు మధ్యరకంగా వుండేవి. సాయిబాబా మందిర మొకటుండేది. ఒక డాక్టరుగారు, పేరు రాజగోపాలాచారి గారు, నాకు పరిచయమై, శ్రీ సాయిబాబా విషయంచెప్పి, నన్నా మహా నిస్సంగుడు, యోగి, సాధువు, సిద్ధుడు యొక్క భక్తుని చేశారు. అప్పటికి ప్రమోషన్‌రాని నా ఖేదమనస్సు, ఆ ఆప ద్బాంధవుని ఆశ్రయించింది. మానవునకు కష్టదశలో భగ వంతుడు జ్ఞాపకం వస్తాడు. భాగవతుల సాన్నిధ్యం, భగవ ద్రక్షణ అతడు కోరుతాడు. నెల్లూరులో ఆరంభించిన శ్రీ సాయి బాబా భక్తి ఇప్పటికి నన్నావరించి యున్నది. నెల్లూరులో ఉన్నంతకాలం ప్రతి గురువారం వారి ప్రతిమనో, పటమునో పూజించేవాడను. ఇప్పుడా పూజ లేకపోయినా, నా డ్రెస్సింగ్ టేబుల్‌మీద వారి పటమున్నది. వారి ఉధి నిత్యం ధరిస్తూంటాను. 1963 లో షిరిడీకి వెళ్లి వారి సమాధిని దర్శించుకొని వచ్చాను.

కాకినాడకు వలెనే నెల్లూరుకు కూడ, పెద్ద శివారున్నది. దీని పేరు స్టోన్‌హౌస్‌పేట. కాకినాడలోవలెనే టౌన్‌కు, శివారుకు మధ్య కాల్వ, బ్రిడ్జి వున్నదని గుర్తు. స్టోన్‌హౌస్ పేటలో బట్టల, నూలు టోకువ్యాపారం జాస్తి.

నెల్లూరు పట్టణ వర్తకం, వ్యాపారం మధ్య రకం. పరిశ్రమ లుండ లేదు. రెండు మూడు బియ్యం మిల్లు లుండి యుండును.

నెల్లూరు జిల్లా విస్తీర్ణమైనది. కొన్ని ప్రాంతాలు ఏదీ పండని తుప్పల పుట్ట. గూడూరు నుండి సూళ్లూరుపేట వరకు, రైలుమార్గం ఇరుప్రక్కల, వట్టి దుబారా భూమి. అయితే,

జిల్లాలో శ్రేష్ఠమైన మొలకొలుకుధాన్యాన్ని పుష్కలంగా పండించే నెల్లూరు, కోవూరు తాలూకాలుగాక, మిక్కిలి విలువ గల అభ్రకాన్ని అందించే గూడూరు, రాపూరు తాలూకా లున్నవి. సుప్రసిద్ధమైన నూలు బట్టలను తయారుచేసే వెంకటగిరి వున్నది. మిక్కిలి పొడవు సముద్రతీర మున్నది. మంచి చేపలవేట కవకాశమిచ్చే మైపాడువంటి రేవులున్నవి. బ్రహ్మాండమైన కనిగిరి చెరువున్నది. ఉదయగిరి కొండ లున్నవి. శింగరాయకొండవంటి పీరభూము లున్నవి. పశుసంపద ఉన్నది. పశువుల వ్యాపారస్తులున్నారు. ఇంచు మించుగా, అన్ని రకాల ప్రకృతులున్న వీ జిల్లాలో. అయితే నెల్లూరు జిల్లాకు పేరు తెచ్చినవి అభ్రకపుగనులు, మొలకొలుకుల ధాన్యం, వెంకటగిరి చేనేత వస్త్రాలు.

## క్యాంపులు : గూడూరు

క్యాంపుల్లోకెల్ల ముఖ్యమైన క్యాంపిదే. నాకు ముందున్న ఎ. బి. సుందరేశన్ గారు క్యాంపుకు 6 రోజుల చొప్పున, నెలకు రెండు క్యాంపులు వేసేవారు. నే నొక్క క్యాంపే పదిరోజులకు మించకుండా వేసేవాడను. ప్రతి క్యాంపులోను, ఇతర కేసులతో బాటు మైకా కేసులుకూడా చిన్నవి, మధ్యరకపువి కొన్నిటిని పూర్తిచేసేవాడను.

1946 లో గూడూరింకను చిన్నపట్టణ మనటంకంటె పెద్ద వూరుగా వుండేదని చెప్పవచ్చును. ప్రాతవూరు అధ్వాన్నంగా వుండేది. మైకా గనుల యజమానులు, వ్యాపారస్తులు రైలుకట్ట కవతల, విశాలప్రదేశంలో, నివాసానికి కట్టుకొన్న రమ్యమైన మేడ భవంతులు పట్టణ పోలిక నిచ్చేవి. పైగా గూడూరు రైల్వే జంక్షను. హౌరా—మద్రాసు బండ్లు, రేణిగుంట—తిరుపతి వైపుకు వెళ్లే బండ్లు సందడి నిచ్చి, పట్టణ వాసనను కలిగించేవి. గూడూరు తాలూకా హెడ్‌క్వార్టర్సు గనుక రెవిన్యూ, పోలీసు వగైరా ఆఫీసరు లుండేవారు. అప్పటి కింకను కాలేజి లేదు. బహుశా మునిసిఫ్ కోర్టుకూడా లేదనుకొందును.

అభ్రకం వ్యాపారంవల్ల గూడూరుకు పెద్ద పేరువచ్చింది. గూడూరు తాలూకాలో "షా" మైకు వంటి పెద్దగను లున్నవి. దీనికి సరిహద్దు తాలూకా రాపూరు. ఇక్కడ కూడా తెల్లబోడు వంటి పెద్ద గను లున్నవి. రెండు తాలూకాలను, ఒక బ్లాక్ గా తీసుకోవచ్చును. మంచి అభ్రకాన్నిచ్చే పల్లిమిటగని ఏ ఏరియాలోదో చెప్పలేనుగాని, పైనన్నట్లు రెండు తాలూకాలొక ఖండమే. ఏ గని, ఏ తాలూకాలో నున్న దను ప్రశ్నయే వుండేది కాదు. రాపూరు కేసులనుగూడ గూడూరులోనే వినేవాళ్లం. నే నొక్కసారి మాత్రం ఎట్లా వుంటుందో అని 3, 4 రోజులు రాపూరు గ్రామం చిన్న రహదారి బంగళాలో మకాంచేసి, కొలది చిన్న కేసులను విచారించాను. నా ముందు ఆఫీసర్లు రాపూరులో క్యాంపుచేసి యుండరు. అవసరం లేదుకూడా.

గోగినేని వెంకట సుబ్బయ్యనాయుడుగారు, వారి అన్న కుమారుడు శ్రీ వెంకటేశ్వరరావు, 'కృష్ణా మైనింగు కంపెని' అనే పేరుతో పెద్ద గనుల యజమానులు, 'షా' గని, 'పల్లిమిట్ట' గని వారికి చెందినవి. 'షా' గని మిక్కిలి పెద్దది. మూడు మైళ్ల లోతువరకు దానిని త్రవ్వారట. దానినుండి అభ్రకం విరివిగా దొరికేది. పెద్దపెద్ద అచ్చులుకూడా లభించేవి. పల్లిమిట్ట గనినుండి వచ్చే సరుకు మేలైనది. అయితే, సరుకు తక్కువ వచ్చేది. శ్రీ నెల్లూరు వెంకటరెడ్డి, శ్రీ పెళ్లకూరు దశరథరామిరెడ్డి, శ్రీ యమ్. రాఘవరెడ్డి మొదలైనవారు గనులనుండి త్రవ్వించేవారు. వీరందరిలో కృష్ణా మైనింగు కంపెనీయే అధికోత్పత్తిని చేసి, ప్రథమస్థానం ఆక్రమించుకొనియుండింది. వీరు గూడూరుకు దగ్గర 'గోగినేని పురం' అనే పేరుతో, నివాసగృహాలు, ఆఫీసులు నిర్మించుకొని వున్నారు.

మైకా వ్యాపారస్తులలో 'పొన్నలూరు బ్రదర్సు' అను పేరుతో పొన్నలూరు వీరరాఘవరెడ్డి, కోటారెడ్డిగార్లు, 'డి. యస్. రెడ్డి అన్డ్ కంపెని' అను పేరుతో శ్రీ దొడ్ల సుందరరామ రెడ్డి అన్నదమ్ములు, శ్రీ సన్నపురెడ్డి కృష్ణారెడ్డి వంటివారు ప్రముఖులు. వీరు గనులనుండి ముడిసరుకును కొని చీల్పించి,

కత్తిరించి, తయారైన సరుకును కొని కూడా విదేశాలకు పంపేవారు. యూరప్‌కు, జపాను మొదలైన తూర్పు దేశాలకు వ్యాపారరీత్యా వెళ్లి వస్తూండేవారు.

గనులవారు, వ్యాపారస్తులు తమ లాభాలను ఎంత తగ్గించి ఆదాయం పన్నుకు చూపించటానికి సాధ్యమౌతుందో అంత తక్కువగా చూపించేవారు. లాభాలను తగ్గించి చూపటానికి రెండు విధానాలు అవలంబించేవారు. మొదటిది, సర్వత్రా అవలంబించబడింది ఇది. గని ఉత్పత్తిదారు 20 రూపాయలకు అమ్మినట్లు తన లెక్కలలో నమోదు చేసుకొనేవాడు. కొనినట్లు కనపడిన బినామిదారు, ఇంకొక బినామిదారుకు 50 రూపాయల కమ్మినట్లు, అతడు మరొకనికి 70 రూపాయలకు అమ్మినట్లు, ఈ మూడోవారు నాలుగవవానికి 90 రూపాయలకమ్మినట్లు ఈనలుగురు వ్యాపారం చేస్తున్నట్లు లెక్కలు సృష్టించేవారు. మొదటి బినామిదారుకు 30 రూపాయలు, రెండోవారికి 20 రూపాయలు, మూడోవానికి 20 రూపాయలు లాభాలు వచ్చినట్లు కనపడేది. ఈ ముగ్గురు బహుశా ఆదాయంపన్నుకు అర్హులుకానివారో, లేక కొద్దిగా పన్ను ఇచ్చేవారుగానో ఉండేవారు. నిజానికి బినామిదార్లు ఊహాకల్పిత పురుషులు కావచ్చును. ఈ కృత్రిమ వర్తకులద్వారా గని యజమాని, తన అమ్మకం నూటికి 450 లేక 500 శాతం తక్కువ చూపించేవాడు. ఇది ఉదాహరణ మాత్రమే. నిజానికి ఇట్టి బినామి లింకులు ఒకటికంటె ఎక్కువే యుండేవి. ఈ పద్ధతివల్ల లక్షల నికరాదాయం వచ్చిన గనుల యజమానుల లెక్కలు, కొన్ని వేలు మాత్రమే చూపేవి. రెండో పద్ధతి, ఒకటో, రెండో బోగస్ (నిజంకాని) కంపెనీలను పెట్టి, గని యజమాని ఒక కంపెనీకి తక్కువ రేట్ల కమ్మినట్లు, మొదటి కంపెని, ఇంకొక కంపెనీకి కొంత లాభంతో అమ్మినట్లు, ఈ విధంగా ఆదాయాన్ని పల్చబడేటట్లు చూపించటం.. కంపెనీ లనగా, భాగస్థుల వర్గాలు, ఒక్కొక్క భాగస్థుల వర్గంలో ఐదారుగురైనా వుండేవారు. ఆకాలంలో, ఇన్‌కమ్‌టాక్సు వారితో నమోదుచేయించుకొంటే, వర్గంలోని భాగస్థుల వంతులప్రకారం వచ్చిన ఆదాయం మాత్రమే పన్నువేయటానికి అసులుకు వచ్చేది.

ఈ విధానాలను గని నుండి అభ్రకాన్ని త్రవ్వించి అమ్ముకొనేవారు మాత్రమే కాదు, అభ్రకాన్ని కొని విదేశాలకు ఎగుమతిచేసేవారు కూడా దండిగా ఉపయోగించేవారు. వీరు చిల్లర వర్తకులనుండి, పై జెప్పినట్లు కృత్రిమ వర్తకులనుండి హెచ్చు ధరకు కొన్నట్లు చూపేవారు. ఉదాహరణకు, ఏమున్నై ఎ, నలభై రూపాయలకో కొన్నదానిని ఏ డెబ్బై, ఎనభై రూపాయలకో కొన్నట్లు వ్రాసుకొనేవారు. పైగా దొంగ కంపెనీలను పెట్టి, ఆ దొంగ కంపెనీలకు తక్కువ ధరల కమ్మినట్లు తంతు నడపే వారు. అందువల్ల వీరు కూడా తమ లాభాలను చాలావరకు కమ్మీచేసి, ఆదాయం పన్నును చాలావరకు ఎగగొట్టటానికి ప్రయత్నించేవారు. చాలావరకు నెగ్గేవారు.

శ్రీ సుందరేశన్ ఈ విధమైన మోసాలను గ్రహించి, పట్టుకోవాలని ప్రయత్నిస్తూ సతమతమైపోయేవాడు, ఎటూ తెగింపు చేసుకోలేక కేసులను పూర్తిచేయలేకపోయేవాడు. ఒకటి రెండు పెద్దకేసులను కూలంకషంగా విచారణ మొదలుపెట్టి తన యావచ్ఛక్తిని వాటికి ధారబోసినాడు. చివరకు ఆశించినంత పన్ను రాబట్టుకోలేకపోయాడు. కాని, వారి శ్రమ ఈ మోసపువిధానాల వారికి భయభ్రాంతులను కలగజేసింది. వారి ఉరవడి కొంతవరకైనా తగ్గియుండును. నేను ఛార్జి తీసుకొన్న కొలది రోజుల్లో, ఒక అభ్రకపు గని యజమాని ఒక బూటకం కంపెనీని బెట్టి తన గని నుండి వచ్చిన సరుకును, ఆ కల్పిత ఫరంకు తక్కువ రేట్ల కమ్మినట్లు చూపాడు. ఆ ఫరం నిజమైనదా అనే చిక్కుప్రశ్న ఎదురైంది. యజమాని ఒక రెడ్డి యువకుడు. నేను ఆయనను రప్పించి మర్యాదగా, "మీరు చదువుకొన్నవారు, తెలివితేటలు గలవారు. విదేశాలకు కూడా వెళ్లివచ్చారు. మీవంటివారు సహకరించందే నేనే పనినీ చేయలేను. నేనిక్కడకు వచ్చింది మీవంటి యువకులను రప్పించి, ఈ నెల్లూరు సర్కిల్ కేసులను తొణ్ణంగా పూర్తిచేయాలని. భగవంతు డివ్వాలి గాని, కొంత దాచినంత మాత్రాన మీరు ధనవంతు లౌతారా? మీరు రెడ్లు, నేను కమ్మ కులస్థుడను. మన కులాలు భూమిని దున్నుకుంటూ,

ఏ కల్లకపటం లేకుండా బ్రతికినవాళ్లం. మోసం, అన్యాయం చేయటం మన పెద్ద లెరుగరు. ఆ కులమర్యాదను పోగొట్టుకొని మన మెంతవరకు బాగుపడతాం ? నేను కఠినంగా వర్తించే స్వభావం కలవాడనుగాను. పన్నుదారులందు నాకు సానుభూతి. చూచి చూడనట్లు పోయేవాడనుగాని, అది, ఇది కలిపి, ఆదాయాన్ని పెంచి కడుపుమీద కొట్టేవాడను కాను. నిజం చెప్పండి. సరళంగా, సరసంగా పోతాను. కమ్మీ చేశారని పెనాల్టీ వేయను'' అని అనునయపూర్వకంగా చెప్పాను. ఆయన సహజంగా సరసుడు. నా మాటల స్వభావాన్ని గుర్తించి, ''ఆ ఫరం బూటకమే. నేను పెట్టిందే. దానిలో చూపించిన ఆదాయాన్ని నా ఆదాయంలో కలుపుకోవచ్చు''నని వ్రాసి యిచ్చాడు. అదనంగా ఏడువేల రూపాయల పైచిలుకు పన్ను పడింది. కమ్మీ చేశాడని పెనాల్టీగాని, తగాదాగాని లేకుండా ఆయన బయటపడ్డాడు. వారి పేరు పెళ్లకూరు దశరథరామరెడ్డిగారు.

ఇది జరిగిన తర్వాత నాపని సులువైంది. క్రొత్త ఆఫీసరు అనునయంగా పోయేవాడు, కఠినంగా వర్తించడు. సానుభూతి కల వాడు. చూచి చూడనట్లు పోతాడు అని వాడుక పడింది. ఇక గూడూరు క్యాంపులో కొట్లకు, ఆఫీసులకు మూతలు పడలేదు. త్వరగా ముగించుకొని తల కడుక్కొన్నవాని వలె తేలిక పడదాం అనే ఆతురతతో పన్నుదారులు రావటం మొదలు పెట్టారు.

గూడూరు పెద్ద కేసుల్లో పొన్నలూరు వీర రాఘవరెడ్డి, కోటారెడ్డి బ్రదర్సు, దొడ్ల సుందరరామిరెడ్డి బ్రదర్సు, రువ్వారి నారాయణరెడ్డి, సన్నపురెడ్డి కృష్ణారెడ్డి, యమ్. రాఘవరెడ్డి బ్రదర్సు, పెళ్లకూరు దశరథరామరెడ్డి వగైరా లున్నారు. ఇక గోగినేని వెంకట సుబ్బయ్యనాయుడుగారి కృష్ణా మైనింగు కంపెని సంగతి చెప్పనవసరం లేదు. శ్రీ ఏనుగు నరసారెడ్డి వగైరా లున్నారు. కొన్ని పేర్లు నోట్లో ఆడుచున్నవి కాని, చప్పున జ్ఞాపకానికి రావటం లేదు. వీ రందరితో సరసంగానే వర్తించి, చాలావరకు పని పూర్తి చేసేవాడను.

ఏనుగు నరసారెడ్డిగారొకప్పుడు తిక్కవరపు రామిరెడ్డి గారివద్ద పనిచేయుచుండేవారట. తరువాత స్వంత మైకా వ్యాపారము పెట్టుకొని, ధన మార్జించి ప్రముఖులైనారు. వీరు సన్నగా, పొడుగుగా వుండేవారు. పొడుగుపాటి ముక్కు, కోల ముఖం, సన్నని మీసకట్టు, చురుకైన వ్యక్తిత్వం, మేఘ గంభీర ముగా మాట్లాడే ధోరణి కలిగినవారు. మంచి మాటకారి. వీరు, నేను నెల్లూరు చేరిన మొదటి రోజుల్లోనే ఆఫీసులో నన్ను కలసి కొన్నారు. స్వేచ్ఛగా ఒక ఆఫీసరుతోగాక, ఒక సహచరునితో మాట్లాడినట్లు చొరవగా, చనువుగా, అరమరలేకుండా మాట్లాడి నారు. అగౌరవముగా, అలక్ష్యముగా మాట్లాడినారని తలంచ గూడదు. కాని అనుభవములేని, సంస్కారము తక్కువైన ఆఫీసరు వారి సంభాషణ మొదటి దఫా విన్నప్పుడు, అలక్ష్యముగా మాట్లాడుచున్నట్లు ఊహించుకొనుట కవకాశ ముండినది. నేను ఎంత ఎక్కువగా చదువుకొన్నా, పాశ్చాత్యదేశాలలో కొన్ని సంవత్సరాలుండినా నిష్కపటియు, గ్రామీణుడగు రైతు కడుపున పుట్టినవాడనుకాబట్టి, ఎంత స్వేచ్ఛగా మాట్లాడినా, నరసారెడ్డిగారు అచ్చమైన రైతుగానే నిష్కపటముగా, నిర్మొగమాటముగా మాట్లాడుచున్నట్లు గ్రహించినందున, వారి యందు నాకు స్నేహభావమే కలిగింది. ఆ స్నేహభావము చివరివరకు కొనసాగింది. నేను గూడూరు క్యాంపులో ఒకటి, రెండుసార్లు వారింటికి వెళ్లటం, వారి పెద్ద కుమారుడు నరసింహా రెడ్డిగారిని కూడా కలసికొనటం తటస్థించింది. నరసారెడ్డిగారి కుమారులలో ఒకరు పాశ్చాత్యదేశాల్లో విద్య నభ్యసించి, పాశ్చాత్య యువతి నొకామెను వివాహం చేసుకొన్నారు.

పెళ్లకూరు దశరథరామరెడ్డిగారి విషయం పైన వ్రాశాను. వీరు స్నేహశీలురు. తెలివితేటలుగలవారు, వ్యాపారసరళి తెలిసినవారు. ఇంగ్లండుకు 2, 3 సార్లు వెళ్లియుండినారు. కొంత సంపాదించి, గూడూరులో మంచి మేడను నివాసానికి కట్టు కొన్నారు. కాని, వీరికి త్రాగుడు అలవాటుపడింది. మితి లేకుండా త్రాగి అకాలమరణానికి పాలైనారు. వీరి భార్య అనసూయమ్మగారు, బిడ్డలు, ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్లు మా

యింటికి ఒకటి, రెండుసార్లు వచ్చి నా భార్యతో స్నేహం నెరపారు.

పి. వి. రాఘవరెడ్డి, కోటా రెడ్డిగార్లు ప్రతిభావంతులైన రెడ్డి యువకులు. వారి మైకా వ్యాపారం చాలావరకు జపానుతో. ఆ రీత్యా జపానుకు 2, 3 సార్లైనా వెళ్ళియుండినారు. ఇంగ్లండుకుగూడా వెళ్లినట్లు గుర్తు. అన్నదమ్ములిద్దరు వ్యాపారదక్షులే. కాని, ప్రత్యేక వ్యక్తిత్వాన్నిగురించి చెప్పవలసివచ్చినప్పుడు, రాఘవరెడ్డిగారు మిక్కిలి చురుకైన వ్యక్తి. చాకచక్యంకలవారు. స్నేహముచేసుకొనటంలోను, పదిమందితో సరిసమానంగా, నిస్సంశయంగా వ్యవహరించుటలోను ప్రవీణుడు. మాటకారి. కోటారెడ్డిగారు అంత మాటకారి కాదు. నిండు కుండ. వారు కాన్టినెంటల్ ఎక్స్పోర్ట్ కంపెనీద్వారా మిక్కిలి విరివిగా వ్యాపారంచేశారు. ఈ కంపెనీ లెక్కలే సుందరేశన్ గారిని మిక్కిలి కలవరపరచాయి. సుందరేశన్ గారి నిశిత పరీక్షకు తట్టుకోలేక, ఎక్స్పోర్టు కంపెని వ్యాపారాన్ని నిలిపివేశారు. అందరితోపాటు వీరును బినామిదార్ల పేర్ల లెక్కలు పెట్టి తమ ఆదాయములో చాలాభాగం మరుగుపరచారని సుందరేశన్ గారు నమ్మి, పెద్ద మొత్తం పన్నును విధించారు. ఆ కేసు హైకోర్టువరకు వెళ్లింది నాకాలంలో ఆ కేసల్లే మిగిలిపోయింది. నేను దానిని ముట్టుకోవలసిన అవసరం లేకపోయింది.

డి. యస్. రెడ్డి అన్డ్ కంపెని (దొడ్ల సుందరరామరెడ్డి వగైరా) వారు విరివిగా మైకా ఫలకాలను, వలయాలను జపానుకు ఎగుమతిచేయుచుండినారు. సుందరరామరెడ్డిగారి తమ్ముడు, కోదండరామరెడ్డి అనువారు, తరచుగా జపాన్ కు పోవుచు, వచ్చుచుండినారు. కొంతకాలం నివాసముండిరి కూడా. వీరు బుచ్చిరెడ్డిపాలెం గ్రామస్థులు. ప్రఖ్యాత బెజవాడ రామచంద్రారెడ్డిగారి కుటుంబం, దొడ్లవారి కుటుంబం కొన్ని తరలుగా అవిభక్త కుటుంబములుగా వుండేవి. మైకా వ్యాపారి దొడ్ల సుందరరామరెడ్డిగారి తండ్రి సోదరులు, తొమ్మండుగు రట. వారిలో

నొకరు ఇంగ్లండులో విద్య నభ్యసించి, బారిష్టరు పట్టా పొందిన డి. యమ్. కె. రెడ్డిగారు. వీ రింటివద్దనే వుండి వ్యవసాయం చూచు కొనుచుండినారు. వీరి నొకటి రెండు సార్లు కలసికొనుట తటస్థించింది. ఇం కొకరు లక్ష్మి నరసారెడ్డిగారు. ఉద్యోగ విరమణానంతరం కొన్ని సంవత్సరముల క్రితం, గుంటూరు లాం ఫారమ్‌లో జరిగిన పశువుల వేలంకు నేను రెండు సార్లు వెళ్లి యుండినప్పుడు వారిని రెండుసార్లూ కలసికొని మాట్లాడాను. ఎవరినీ దరికి చేరనీయని మిక్కిలి పొగరుబోతు పెద్ద మాళీగేదెను వీరు సాహసించి కొని, ఇతర పశువుల మధ్య కట్టి లారీలో బుచ్చిరెడ్డిపాలెం తీసుకొనిపోయారు. వీరికి సేద్యముతోబాటు పశువులపెంపకం చాలా యిష్టం.

సుందరరామరెడ్డిగారి అన్నదమ్ములలో శ్రీనివాసులురెడ్డి, పురందరరెడ్డి, కోదండరామరెడ్డి గార్లను బాగా ఎరుగుదును. సుందరరామరెడ్డిగారు మిక్కిలి గౌరవముతో, స్నేహభావంతో వ్యవహరించేవారు. వారీ మధ్య అకాలమరణం పొందినారట. మిక్కిలి విచారకరం.

గోగినేనివారు శ్రీ వెంకట సుబ్బయ్యనాయుడుగారు, వారి అన్నకుమారుడు శ్రీ వెంకటేశ్వరరావు ప్రఖ్యాతిగన్న 'పా' మైను, 'పల్లెపట్టు' గనుల యజమానులని పైన చెప్పాను. పా మైను నుండి మిక్కిలి విస్తారముగా మైకా లభించేది. కాని, సరుకు ఒకటో నంబరుది కాదట. పల్లెపట్టు మైన్ నుండి కొంత తక్కువగా మైకా లభ్యమయ్యేదిగాని, అది శ్రేష్ఠమైన మైకా అట. వారు నందిగుంట వంటి ఇతర గనులను కూడా త్రవ్వించారుగాని, వాని వలన లాభం కలుగలేదట. అందువల్ల వానిని విడిచిపెట్టినారు.

గూడూరు తాలూకాలో మైకా గనుల త్రవ్వక మారంభించిన మొదటి వారిలో నొకరు కృష్ణాజిల్లా, మానికొండ గ్రామ వాస్తవ్యులు శ్రీ గోగినేని పిచ్చయ్యగారు. వారికి మొదట్లో నష్టము వచ్చి వారి ఆస్తి ఇంచు మించుగా పోయిందట. తరువాత మైకా లభించి, పోయిన ఆస్తిని తిరిగి సంపాదించినారట. వారి కుమారు

లలో వెంకట సుబ్బయ్యగారు షా మైను మొదలైన గనులను విస్తృతపరచి మిక్కిలి ధనవంతులయ్యారు. వారు కూడా ఒక దఫా నష్టము వచ్చి, ఆస్తిని పోగొట్టుకొన్నవారే. తిరిగి షా మైను పుణ్యమంటూ అధిక లాభాలు సంపాదించి, తమ తండ్రి విడిచిపెట్టి పోయిన మాగాణి భూమి కంటె చాలా హెచ్చు భూమిని సంపాదించి స్వగ్రామములో పెద్ద భవంతులు నిర్మించుకొని మిక్కిలి హెచ్చు స్థాయికి జీవన సరళిని పెంచుకొన్నారు. గూడూరు సమీపంలో మంచి కట్టడాలను నిర్మించుకొని, కర్మాగారముల నేర్పరచుకొని ఒక సినిమా హాలును కట్టించి, ఆ ప్రదేశమునకు 'గోగినేని పురము' అను పేరు పెట్టి, ఒక జమీందారి సంస్థానంవలె భోగలాలసత్వాన్ని పెంపొందించుకొన్నారు. వెంకట సుబ్బయ్యగారు పైకి మెత్తగా, సాధువుగా, భోగలాలసుడుగా కనిపించినా మంచి తెలివి తేటలు, గొప్ప వ్యవహార దక్షత కలిగినవారు. వారన్నదమ్ములు ముగ్గురు. అందులో నొకరికి అభ్రకము గనుల సంబంధము లేదు. ఒకరు సత్యనారాయణ అనువారు చనిపోగా, వారి కుమారుడు వెంకటేశ్వరరావుగారు పిన్నవయస్కులైనందున, వెంకటేశ్వరరావుగారికి సగభాగముండినను, వ్యవహారమంతయు వెంకట సుబ్బయ్యగారే నడపేవారు. వెంకట సుబ్బయ్యగారు, నేను నెల్లూరు నుండి వెళ్లిపోయిన కొన్ని సంవత్సరాలకు బెంగుళూరుకు సమీపానవున్న వైట్ ఫీల్డ్ అనే గ్రామంలో నివసిస్తూ సరిహద్దు చిత్తూరు జిల్లాలో బంగారం కొరకు గనులు త్రవ్వించారు. వైట్ ఫీల్డ్‌లోని నేపాలు మహారాణా కుటుంబానికి చెందిన ఒక పెద్ద బంగళానుకొని, అందులో అన్ని వసతుల నేర్పరచుకొని ఉన్నత స్థాయిలో నివసించుచుండినారు. బంగారు గనులు చాలా నష్టమునకు దారితీసినవి. కాని, వైట్ ఫీల్డ్‌లో కొంత వ్యవసాయ భూమిని సంపాదించి వ్యవసాయం చేస్తూ, ఇంకేదో పరిశ్రమను నడుపుచుండినారు. వారికి మద్యపానవ్యసనం జాస్తిగా వుండేది. మద్యాన్ని అధికంగా సేవించుటవలన కాబోలును, వారు మధ్య వయస్సులోనే చనిపోయారు. వారిని గూడూరు క్యాంపులో కలసికోవటం, స్నేహం నెరపటం, వారి భార్య మా యింటికి రావటం జరిగింది. వారికి బినామి వ్యాపారం చాలా పెద్దగా ఉండేదని

వాడుక. లెక్కలలోగాని, ఇతరత్రాగాని నా కెట్టి సాక్ష్యం దొరకలేదు.

సన్నపురెడ్డి కృష్ణారెడ్డిగారికి గనులు లేవు. మైకాను గనుల యజమానులనుండి కొని, విదేశాలకు ఎగుమతి చేసేవారు. వీరు నెల్లూరువద్ద పెన్నానది కవతల ప్రక్కన వున్న కోవూరు గ్రామ నివాసులు. పిత్రార్జితమైన పంట భూమిని హెచ్చుగా కలిగియుండినవారు. వీరు సరసులు, స్నేహశీలురు. మైకా వ్యాపారములో ఎక్కువగా సంపాదించిన వారిలో వీ రొకరు. వీరు కొంత వ్యక్తిత్వం కలవారైనను, చూపరులు కాదు. వీరి భార్య మిక్కిలి అందగత్తె. ఆమెను చూచి మోహించి, సామాన్య కుటుంబీకుడగు ఆమె తండ్రిగారికి పదివేల రూపాయలు ఎదురిచ్చి ఆమెను చేసుకొన్నారట. ఆవిషయం వారు నాతో 2, 3 సార్లు చెప్పి యుండినారు. వా రింటికి నే నొకసారి వెళ్లుటయు, వారు, వారి సతీమణి మా యింటికి 1,2 సార్లు వచ్చుటయు జరిగింది. వారి ఏకైకపుత్రిక వివాహానికి హాజరయ్యాను. వారి ఏకైక పుత్రు డొక దుస్సంఘటనలో, పిన్నవయస్సులోనే మరణించినాడు. ఆయువకుడు నే నెరిగినప్పు డింకను బాలుడే. శ్రీనివాసులురెడ్డి అను పేరుగల ఆ అబ్బాయి, ఇంగ్లండుకు విద్యాభ్యాసానికి పోయి వుండినాడు. అతని అకాల మరణవార్త నాకు చాలా బాధను కలిగించింది.

## క్యాంపులు : కావలి

ఇది ఒక చిన్నపట్టణం. కావలి తాలూకాకు కేంద్రమగుట చేత, మామూలుగా తాలూకా కేంద్రములో వుండే గవర్నమెంటు ఆఫీసు లుండినవి. నే నొక క్యాంపుకు వెళ్లినప్పుడు పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు పట్టణ వాస్తవ్యులు శ్రీ కలగర సుబ్రహ్మణ్యం చౌదరిగారు డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా వుండినారు. వారు డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా ఎంపికచేయబడుటకు ముందు కృష్ణా జిల్లాలో గుడివాడలో న్యాయవాదిగా వుండేవారు. నా స్వగ్రామ మగు బొమ్ములూరు, గుడివాడకు 2 మైళ్లు మాత్రమే దూరాన వుండుటచేతను, బొమ్ములూరుకు గుడివాడకు రాక

పోకలు విశేషంగా వుండటంచేతను, పైగా నే నింగ్లండునుండి తిరిగివచ్చి లా ప్రాక్టీసు పెట్టాలనుకొనటంచేతను సుబ్రహ్మణ్యాం చౌదరిగారిని నే నదివరకు గుడివాడలో రెండు మూడు సార్లు కలసికొని యుండినాను. అందువలన వారు నన్ను తమ అతిధిగా ఆహ్వానించి, నే నా క్యాంపులో వుండినంతకాలము నాకు మృష్టాన్నము లమర్చినారు. వారేగాక, వారి సతీమణిగారును న న్నెంతో ఆదరణతో మర్యాద చేశారు. వారికి సంతానము లేనందున వారి దగ్గర బంధువులలోని ఒక బాలికను పెంచుకొనుచుండినారు. ఆ అమ్మాయిని ప్రేమ్ జీ అని ముద్దుగా పిలుచుకొనుచుండినారు. సుబ్రహ్మణ్యాంచౌదరిగారు క్రమేపి జిల్లా జడ్జిగా ప్రమోషను పొందారు. ఇప్పుడు తమ ఉద్యోగ విరమణానంతరం, ఏలూరు పట్టణం అశోక్ నగర్ లో స్థిరనివాస మేర్పరచుకొని వున్నారు. వారితో ఇప్పటికిని స్నేహాన్ని నెరపుచున్నాను. ఈమధ్య నే వారిని, వారి సతీమణిని చూచి సంతోషించాను.

రామాయణం, భగవద్గీత మొదలైన ఉద్గ్రంథాలను వచనంలో రచించిన పండితుడు శ్రీ దొడ్ల వెంకట రామరెడ్డి గారిని మొట్టమొదటి దఫా నేను చూచింది కావలి మకాంలోనే అనుకొంటాను. శ్రీ వెంకట్రామరెడ్డిగారు పండితులేగాక మిక్కిలి సరసులు, ధీమంతులు. వారు కొన్ని సంవత్సరాలు వెంకటగిరి సంస్థానం దివానుగా పనిచేసి యుండినారు. వా రొకప్పుడు నెల్లూరు ఆఫీసుకువచ్చిన సందర్భంలో మాటల వరుసన, "భవిష్యత్ పురాణములో మానవ్రతులు, భరతభూమికి ఉత్తర, ఈశాన్య దిశలలో నివసించుచున్నవారు, మనకు శత్రువులై మనదేశము లోనికి చొచ్చుకొని వస్తా"రని చెప్పివున్నదని చెప్పారు భవిష్యత్ పురాణ జోస్యం సఫలమయిందా అన్నట్లు చైనా దేశస్థులు, 1962 లో మన భూభాగమును కొంత ఆక్రమించుకొని వుండినారుకదా! వారు మనయందు శత్రుత్వము వహించి, సాధించుచున్నారుకదా

కావలిప్రాంతం ఎర్రరంగు నేలగల మెట్టభూమి. భూమి సారవంతమైనదే. వాతావరణం పొడిగా వుంటుంది. కూరగాయలు సమృద్ధిగా పండుతవి. వర్తక వ్యాపారాలు సామాన్యం.

పరిశ్రమ లుండేవికావు. క్యాంపు మొత్తంమీద సులువుగా జరిగిపోయేది.

అప్పుడొక హైస్కూలు మాత్రమే వుండేది. కొంతకాలం క్రిందట కాలేజిని స్థాపించి, దానికి 'జవహర్ భారతి' అని పేరుపెట్టి, మిక్కిలి జయప్రదంగా నడుపుచున్నారు. విద్యావేత్త, సుజనుడు, స్నేహశీలి, విద్యాబోధన కొరకే జీవించే మాదిరెడ్డి రామానుజ రావునాయుడుగారు కొన్ని సంవత్సరాలు కాలేజి ప్రిన్సిపాలుగా వుండినారు. వారి తర్వాత నా మిత్రుడు, ఉత్తమ విద్యాధికుడు, చాలా సంవత్సరాలు ఆంధ్ర యూనివర్శిటి రెజిస్ట్రారు పదవిని నిర్వహించినవారు శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు కాలేజి అధ్యక్షులు (ప్రిన్సిపాల్) గా వ్యవహరించారు.

## కందుకూరు

ఇది విస్తీర్ణానికిగాని, జనాభాకుగాని, వర్తక వ్యాపారాలకు గాని చిన్నరకం పట్టణం. కేసులు చిన్నవి, సులువుగా విచారణలు జరిగేవి. ఈ ప్రాంతి మించు మించుగా మెట్టభూమి. ధన వంతులు తక్కువ.

ఒక విషయం నాకు బాగా జ్ఞాపకమున్నది. ఒక ఉదయం నేను క్యాంపు చేసే రహదారి బంగళా వరండాలో కూర్చొని యుండగా, ఒక స్త్రీ నెత్తిన తట్టపెట్టుకొని, బంగళా వెనుక ప్రక్క వంటయింటినుండి నాముందుగా బయటకు వెళ్లుచుండినది. నేనామెను పలకరించి, "ఎందుకు వచ్చా"వని అడిగాను. "ఇక్కడ ఆఫీసర్లు మకాంచేస్తున్నప్పుడు కోడిగ్రుడ్లు, కూరగాయలు ఇచ్చి వెళ్లుతుంటాను. నిన్న మీ జమాను కోడిగ్రుడ్లు కావాలని చెప్పాడు. అందువల్ల తీసుకొని యిచ్చి వెళ్తున్నా"నని చెప్పింది. ఆ స్త్రీ మామూలు గొల్ల స్త్రీగా కనపడింది. "ఏవూరు మీ?"దని నేనడిగాను. "కమ్మపల్లె, రెండు మైళ్లలో వున్న"దని చెప్పింది.

నే ననుమానపడి, "నీది ఏకుల?" మని అడిగాను. "మేము కమ్మ వాళ్లం" అన్నది. నే నాశ్చర్యచకితుడనై, "కమ్మస్త్రీలు ఈవిధ

ముగా, తట్టనెత్తిన పెట్టుకొని, కూరగాయలు మొదలైనవి అమ్ము దురా?" అని అడిగాను. "అవును. ఇప్పుడు ఎదురుగుండా రోడ్డు మీద వెళ్లుచున్నారే. వాళ్లు కూడ కమ్మవాళ్లే " అన్నది.

ఇప్పుడు కూడా, సామాన్య గొల్ల స్త్రీలు తట్ట నెత్తిన పెట్టుకొని, పెరుగు మొదలైనవి అమ్ముకుంటారు. కాని పొలం వెళ్లక, కూలీ నాలీ చేసుకోక బ్రతికే కమ్మకులస్థుల ప్రాంతమైన కృష్ణాజిల్లాలో పుట్టి పెరిగినవాడను కాబట్టి, నేను ఆమె కమ్మ స్త్రీ అని తెలుసుకొని ఆశ్చర్యపడటంలో వింత లేదు. ఈరోజుల్లో బ్రతుకు తెరువుకోసం, కృష్ణాజిల్లాలోని కమ్మ స్త్రీలు కూడా, చెదురు మదురుగా ఊడ్పులు వగైరాకు కూలికి వెళ్లట మున్నది గాని, 1946 లో అట్టిది నే నెరుగను. ఇట్టి అనుభవమే నాకు 1918 లో నేను గుంటూరు కాలేజిలో విద్యార్థిగా వున్నప్పుడు కలిగిందని, గుంటూరు నానుకొనియున్న కొరిటిపాడులో నివసించు చుండిన కమ్మ స్త్రీలు గొల్లలవలె, నెత్తిన తట్ట పెట్టుకొని పెరుగు, మజ్జిగ, నెయ్యి మొదలైనవి అమ్ముచుండేవా రని నే నిదివరలో చెప్పియున్నాను. అట్టి అనుభవం తిరిగి నాకు 30 సంవత్సరాలకు కందుకూరులో కలిగింది.

కృష్ణాజిల్లాలో ఇప్పుడు కూడ కమ్మ స్త్రీలు తట్ట నెత్తిన పెట్టుకొని కూరగాయలుగాని, మజ్జిగ, పెరుగు వగైరాగాని అమ్ముకొనుచుండుట లేదు.

## సింగరాయకొండ

ఇది మిక్కిలి చిన్న ప్రదేశం. ఇక్కడి విశేషం, చిన్న కొండమీద నున్న కొంత ప్రాచీనతగల దేవాలయం. ఇక్కడ చిన్న చిన్న కేసులు విచారణ జరుపుచు 2, 3 రోజులు మాత్రమే, ఒక సంవత్సరమే క్యాంపు చేశాను. ఇది సముద్ర తీరమగు ఉలవపాడుకు దగ్గర. ఉలవపాడులో ఉప్పు తయారు చేస్తారు. సింగరాయకొండ, గుంటూరు జిల్లాలోని, టంగుటూరుకు 17 మైళ్ల దూరము మాత్రమే. అనగా సింగరాయకొండకు కొలదిమైళ్ల దూరములో గుంటూరు సరిహద్దు వస్తుంది. గుంటూరు

వాతావరణం కొంత సింగరాయకొండలో కనిపిస్తుంది. ఉలవపాడు అనగానే, ఆ గ్రామ వాస్తవ్యుడు మైపాడు సముద్రతీరాన స్థిరనివాస మేర్పరచుకొని యుండిన శ్రీ అబ్బాయినాయుడుగారు గుర్తుకు వస్తున్నారు. వారు ఆజన్మాంత బ్రహ్మచారి. వారి శ్రద్ధ, ప్రేమలను చేపలను పట్టటంలో వినియోగించేవారు. వారు ముఖ్యంగా పండుగప్ప చేపలను పట్టేవారు. వారొకొక్కప్పుడు 40 పౌనుల తూకం చేపలను పట్టేవారట. వారి నెక్కడ కలసికొన్నానో గుర్తులేదుగాని, ఒకసారి మైపాడు వారి అతిథిగా వెళ్లినట్లు, వారు తమ పడవలో సముద్రం నీరు, ఒకవాగు నీరు కలసే లోతులేని జల ప్రదేశంలో త్రిప్పినట్లు గుర్తు. పండుగప్పల నీ నీటిలోనే వారు పట్టేవారట. నెల్లూరుకేగాక మద్రాసుకకూడా ఒకటి రెండు చేపలను నాకు పంపారు. ఈ చేపల వేట కొరకు తెల్లవారుకూడా వారిసాయ మర్థించేవారట.

# నాయుడుపేట

ఇది గూడూరుకు 17 మైళ్లు. ఇదికూడ చిన్నపట్టణమే. అయితే ఇక్కడ కలంకారి అద్దకం, బట్టలవ్యాపారం హెచ్చు. మనం కాపులనే బలిజకులస్థులు, కలంకారి బట్టలు తయారు చేయించి, వ్యాపారంచేయువారిలో ప్రముఖులు. ఒక కుటుంబం వారు కలంకారితోబాటు, బట్టలు, నూలువ్యాపారం చేస్తారు. విరివిగా చేస్తుండేవారు. ఒకసారి నేను కారులో సూళ్లూరుపేట క్యాంపుకు వెళ్లుచుండగా, నాయుడుపేట కెదురుగా వున్న ట్రంకు రోడ్డుమీద కొంచెం దూరం వెళ్లినతర్వాత, సిలిండర్లు దెబ్బతిని, కారు ఆగిపోయింది. కారు డ్రైవరును ఊళ్లోకి పంపించగా, ఈ పెద్ద కుటుంబంలోని వారొకరు వచ్చి, భోజనంవేళ అయినందున, నాకు భోజన మిచ్చి ఆదరించారు. తరువాత వేరే కారులోనో, బస్సులోనో, సూళ్లూరుపేట రహదారి బంగళాకు చేరాను. తర్వాత కారును మద్రాసుకు పంపించి, బాగుచేయించాను. కలకత్తా - మద్రాసు ట్రంకురోడ్డుమీదనే, నెల్లూరు దాటిన తర్వాత గూడూరు, నాయుడుపేట, సూళ్లూరుపేట, తడలున్నవి.

నాయుడుపేట మలుపు దాటుటకు, రైల్వేగేటును దాటవలసి యున్నది. రైళ్ల రాకపోకలకు, ఆగేటును బిగించివేస్తారు. దాని వలన, ప్రయాణానికి ఆటంకము కలిగి, కాలయాపన కలుగుచున్నది. ఈ చికాకు ఇప్పటికిని వున్నదనుకొందును.

కలంకారి, బట్టలు, నూలు వ్యాపారం మినహాయించి, పేర్కొనవలసిన వ్యాపారంగాని, ఆదాయంగాని లేదు. రహదారి బంగళా ఊరి బయటనున్నది. కారు చెడిపోయినప్పుడు తప్ప, ఊళ్లోకి పోలేదు. వెళ్లినప్పుడు ఇరుకు సందులు, గొందులని తోచింది.

## సూళ్లూరుపేట

ఇదికూడా చిన్నపట్టణమే. మద్రాసుకు యాభైమైళ్లీ దూరం. ఈ ప్రదేశం చాలాభాగం ఇసుకనేల. సమీపమున కాళింగునది ప్రవహించుచున్నది. బ్రిడ్జి దాటితే, సరుగుడు తోటలు. నది కివతలప్రక్క, ప్రఖ్యాత అమ్మవారి గుడివున్నది. రెండోవైపు మద్రాసు ముఖంగా, ఒక పెద్దవంతెన వున్నది. ఈ రెండువైపులకు పికారు వెళ్లుచుండేవాడను. దీనికి దాపులోనే సముద్రమున్నది. వాతావరణం కొంత చల్లగానే వుండేది. చేపలు పట్టడం తక్కువనుకుంటాను. యమ్. యస్. రాజులుచెట్టి అను వారు పరిచితులైనారు. వారు స్నేహశీలురు. చదువుకొన్నవారు, మర్యాదస్తులు, వారితో కొంతకాలక్షేపం జరిగేది. ఒకటి, రెండు చిన్న రైసుమిల్లులుతప్ప ఇతర పరిశ్రమ లుండేవికావు. కేసులు చిన్నవి.

ఇక్కడి రహదారి బంగళా మిక్కిలి చిన్నది. నేను క్యాంపుకు చేరిన వెంటనే, నా వస్తువులను నేనే స్వయంగా సర్దుకుంటాను. ఆ చిన్న బంగళాలో కిటికీలక్రింది అంచులలో కాగితాలు పరచి, వానిమీద నా దంతధావన, క్షౌరవస్తువులు, మందులు, మాకులు అమర్చుకొనేవాడను. ఒకటి రెండు కుర్చీలు, ఒక్క చిన్న బల్ల, ఒక మేజాబల్ల, మంచం వుండేవి. వస్తువులు పెట్టుటకు వేరే బల వుండేదికాదు.

దీనికి సమీపమున కోటపోలూరున్నది. ఇదొకప్పుడు మిక్కిలి ప్రఖ్యాతిగన్న ప్రదేశం. ఒక సామంతరాజు, ఇది రాజధానిగా ఆ ప్రాంతం పాలించేవాడట. కళావంతులకు, భోగంమేళాలకు, సంగీత నృత్యాలకు ప్రసిద్ధిచెందిందట. ఇక్కడి దేవాలయం ప్రాచీనమైనది, మిక్కిలి సౌందర్యశిల్పములతో కూడినది. ఈ దేవాలయాన్ని సందర్శించి, శిల్పచాతుర్యానికి ముగ్ధుడనయ్యాను. ఒకప్పుడు సౌందర్యమునకు, ఆటపాటలకు పేరొందిన వేశ్యలిప్పుడు లేరు. ఒకటి, రెం డిండ్లవారు సంసారులయ్యారు.

ఈ ప్రాంతాన బాహుశూరుశాఖ రెడ్లున్నారు. ఈ వంశములోని బద్దె నారాయణరెడ్డిగారు రాజకీయ దురంధరుడు. ఆచార్య రంగాగారికి, శ్రీ నెల్లూరు వెంకట్రామనాయుడుగారివలె, వెంకటగిరి జమీందారీ రైతోద్యమంలో సాయపడినారు. వారు కొంతకాలం మద్రాసు శాసనసభలో సభ్యులుగా వుండినారు. కార్యాచరణపరుడు. మితభాషి. శాంతస్వభావం కలవాడు.

## తడ

ఇది సూళ్లూరుపేటకు 7 మైళ్ల దూరంలోను, మద్రాసుకు 43 మైళ్ల దూరంలోనూ, ట్రంకురోడ్డుమీద ఉన్నది. మిక్కిలి చిన్నప్రదేశం. సముద్రతీర ప్రాంతము కాబట్టి, చేపలు పుష్కలముగా దొరుకుతవి. దీనికి 6 మైళ్లదూరములోవున్న ఆరంబాకం నుండి చేపలు అమ్మకానికి వస్తవి. ఇక్కడ దొరుకు వాతి అను చేప మిక్కిలి రుచికరమైనది. వేసవిలో క్యాంపు. అది 2, 3 రోజులు మాత్రమే. కేసులుకొద్ది. అవికూడా అల్పమైనవి. మత్స్యభోజన ప్రియుడనైన నాకు భుక్తి, విశ్రాంతి కల్గేది. రొయ్యలను, కప్పల వెనుక కాళ్లను కర్మాగారములో తయారుచేసి, శీతలపరచి, డబ్బాలలో అమెరికాకు ఎగుమతిచేయు సంస్థ ఒకటి ఈమధ్య ఏర్పడింది.

## ఆత్మకూరు

ఇది నెల్లూరుకు 25 మైళ్ల దూరములో వున్నది. చిన్న పట్టణం. చాలా కొద్దిమంది మాత్రమే చెప్పుకోతగ్గ వర్తకులు.

శ్రీ వెంకటేశ్వర చెట్టి, శ్రీ పెద్దప్ప చెట్టి అనువారిద్దరు చెప్పుకో తగ్గ వర్తకులు. మర్యాదస్తులు. వెంకటేశ్వర చెట్టిగారిని, నా ఉద్యోగ విరమణానంతరముకూడ మద్రాసులో కలసికొన్నాను. సామాన్యమైన కేసులు, భుక్తాయాసాన్ని తీర్చుకొనటానికనువైనవి. చిన్న కేసుల కొరకే ఇట్టి క్యాంపులు.

ఇక్కడున్నప్పుడొకరాత్రి తేలు కుట్టింది. కాని అదంత బాధ కలుగజేయలేదు. నేను 7, 8 సంవత్సరాల బాలుడుగానున్నప్పుడు ఆడుకొనుచుండగా, తేలు కుట్టినదని పైన చెప్పియున్నాను. చిత్తూరు కానవర్ బంగళాలో మండ్రగబ్బలు విస్తారంగా వుండినా కుట్టలేదు కాని, ఉద్యోగ విరమణానంతరం పొలంలో మూడోసారి తేలు కుట్టిన బాధ ననుభవించాను.

ఈ తాలూకాలోని భూస్వాములలో, ఆత్మకూరుకు కొలది మైళ్ల దూరములోవున్న కరడకంపాడు గ్రామంలో ఒక పెద్ద కమ్మ కుటుంబ ముండినది. జి. రామచంద్ర నాయుడుగారు, వారి బావమరదులు, మేనల్లుళ్లు వగైరా జాయింటు కుటుంబంగా వుండేవారు. వారి కుటుంబానికి 600 లేక 700 ఎకరాల భూమి, రెండు లక్షలకు తక్కువకాని వడ్డీవ్యాపారముండినది. ఆ గ్రామం కుగ్రామం. ఇరుకు సందులు, ఇంటి మీద ఇల్లు, దొడ్డి మీద దొడ్డి, అశుభ్రత తాండవమాడుచున్నట్లున్నది. నాయుడుగారిల్లు పెద్దమేడ. మేడంతగా వారుపయోగిస్తున్నట్లు లేదు. ఒక రాత్రి వారి ఆతిధ్యాన్ని స్వీకరించటం జరిగింది. వీరొక వినాయక చవితికి, వారి చెరువులో పట్టిన చేపలను పంపారు. వినాయక చవితినాడు మత్స్యమాంసాదులను వాడరు. బొత్తిగా త్రిప్పివేయుట కిష్టంలేక, ఒకటి రెండు తీసుకొని, తతిమ్మావి పంపివేశాము. తెలిసినవారికొక చేపను పంపి, రెండోదానిని నేను కతికాను. నా భార్య ముట్టుకోలేదు. ఆమె పిల్లలకు పెట్టనివ్వలేదు. వంటవాడు, పాచిమనిషి, కొంత సొమ్ము చేసుకొన్నారు. శ్రీ రామచంద్ర నాయుడు నా వంటి కమ్మవారే. వినాయక చవితినాడెట్లు పంపించారో అడగటానికి తిరిగి వారిని కలసికొనలేదు.

## వెంకటగిరి

ఇది వెంకటగిరి రాజావారి జమీన్ ముఖ్య పట్టణం. మధ్యరకమైనది. ఇక్కడ పేరొందిన పరిశ్రమ, నూలు బట్టల చేనేత. మిక్కిలి సన్నని నూలుతో, అతి సుందరమైన చీరెలను, ఉల్లిపొర వంటి ధోవతులు, పై కండువాలను నేస్తారు. వివిధ రకాల, చిత్ర విచిత్ర రంగుల చీరెలు, విలాసవతులను, భాగ్య స్త్రీలను మురిపిస్తవి. పెద్ద జరీఅంచు ధోవతులు, కండువాలు, పురుషులను సంతసింపచేస్తవి. జరీఅంచులు మగవాళ్ళ సొత్తే కాదు, ఆడవాళ్ళ చీరెల క్రిందంచులు రెండడుగుల వెడల్పుకూడ ఉండవచ్చును. ముదురునుండి, మిక్కిలి లేత వరకు, వివిధ రంగులు, చీరెల నావరించి వుండును. నా భార్య ఆర్డరిచ్చి కొన్ని చీరెలను నేయించుకొని గాని, సంతృప్తి పడలేదు.

పై బట్టల వ్యాపారస్తులుతప్ప, ఇతర పరిశ్రమలు లేనట్లే. చిల్లర దుకాణాలు, మామూలు వ్యాపారాలు మధ్యరకం.

క్యాం పొకటి, రెండుసార్లే అని గుర్తు, రహదారి బంగళా ఊరికి వెలుపల నున్నది. జమీందారుగారిని కలసికోలేదు గాని, వారి తమ్ము లొకసారి రహదారి బంగళాకు వచ్చి పోగా, కోట లోని వారి భవనానికి వెళ్లి దర్శించాను. వారి సాయంతో రాజా గారి తోట. అందులోని శిల్పాలు వగైరా చూచాను. ఈ తోట పట్టణానికి కొంత దూరానవున్నది. దానిలోనికి వెళ్ల టానికి, ఒక ఏరు దాటాలి. మంచి శిలా విగ్రహాలు, శిల్పా లుండినవి. అప్పటికే చాలా అశ్రద్ధ చేయబడ్డవి.

వెంకటగిరి జమీ మిక్కిలి పెద్దది. విజయనగరం రాజా వారి సంస్థానం తర్వాత, వెంకటగిరినే చెప్పేవారు. రాజావారిని, శ్రీ వెలగపూడి రామకృష్ణగా రింటివద్ద, ఒకటి రెండుసార్లు కలసి కొన్నాను. చాలా మర్యాదస్తులు. భేషజం చూపక చనువుతో మాట్లాడేవారు.

## రాపర్ల

దీని విషయం పైన చెప్పియున్నాను. మైకా గూడూరుతోపాటు పేరు పొందినా, ఇది మైకా వర్తకుల నివాసం

కాదు. ఇది ఒక కుగ్రామం. ఒకసారి మాత్రం రెండు మూడు రోజులు మకాంచేశాను. ఒక చిన్నగని యజమాని వచ్చి చూచి వెళ్లారు. మంచి బత్తాయిపాలను కాయించవచ్చుని, ఆ గని యజమాని పంపిన ఒక డజను పండ్లవలన తెలిసింది.

పైన చెప్పినట్లు నెల్లూరు సర్కిల్‌లో పెద్ద ఆదాయాన్నిచ్చ గలది అభ్రకం. ఇదే ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్లకు పెద్ద తలనొప్పిగా వుండేది. ఈ వ్యాపారస్తుల నక్కజిత్తులు, తలల మార్పిళ్లు, మోసాలు (శ్రీ) సుందరేశన్ వంటి దిట్టను నీరుకారేటట్లు చేసినవి. యజమానుల లాభాపేక్షుటుంచి, పన్ను తప్పించుకొనే బుద్ధి అటుంచి, వారి సిబ్బంది దోపిడితనం రంగాన్నింకా చెడగొట్టింది. యజమానులకు దొంగమార్గాలు చూపి, తద్వారా తమ జేబులు నింపుకోటానికి, మానేజర్లనుపేరుతో వీరు దొంగలెక్కలకు కారకులయ్యారు. వీళ్లు జేబులు నింపుకోవటం తెలిసినా, తప్పుడు పద్ధతుల నవలంబించిన యజమానులు, కిక్కురుమనకుండా, చూడ నట్లుండేవారు, వాళ్లెక్కడ కొంపకు ఎసరు పెడ్తారో అని.

మైకాగని లంజవంటిది. ఎప్పుడు అలరిస్తుందో, ఎప్పుడు మోసగిస్తుందో చెప్పలేము. గని యజమాని, ఉన్నట్లుండి లక్షాధికారి కావచ్చును. అకస్మాత్తుగా భిక్షాధికారి కావచ్చును. విదేశాల కెగుమతిచేసే వ్యాపారస్తులింత ఒడుదుడుకులకు గురి కాకున్నా, విదేశమార్కెట్టుల కుట్రలకు లోనౌతుంటారు. సన్న కారు వర్తకులు, ఫలకాలనుండి వేరుచేసిన ముక్కలనుండి రాండ్లు కత్తిరింపులవల్ల బ్రతికేవారు, సుఖజీవనం చేయగలరు. ఏది ఎట్లైనా ఎవరెట్లు కష్టనష్టాలకు లోనైనా ధనవంతులయ్యేది, పై జెప్పిన మానేజర్లవంటి సిబ్బందే. యజమాని దివాళాతీస్తే ఇంకొకరిని చేర్తారు.

కంటిముందు లక్ష్మి తాండవమాడితే, సారాబుద్ధి తలక్రిందు లౌతుంది. స్వర్గం అరచేతిలో కనపడుతుంది. మద్రాసువంటి పెద్ద నగరాల విలాసాలు, భోగాలు కౌగిటిలోకి వస్తవి. పెద్దమ్మార ప్రత్యక్షమైతే, జీవితం మిథ్య అని ఎందుకన్నారు?

సంవత్సరం పది మాసా లయ్యేటప్పటికి పని వత్తిడివల్ల అలసట కలిగింది. 6-5-1948 తారీఖునుండి, రెండు నెలలు సెలవు పెట్టాను.

వేసవికాలం అలసట పోవటానికి శీతలప్రదేశం ఉత్తమం కదా! పైగా అదివర కెన్నడూ ఊటీకిపోలేదు. అందువలన ఊటీకి బయలు దేరాను. ఏర్పరచుకొనియుండిన టాజ్ మహాల్ హోటల్‌లో దిగాను. ఇది భారతీయ పద్ధతి హోటల్. మాంసాహారంకూడా యిస్తారు. ప్రవేశించి, భోజనశాలకు వెళ్లగానే శ్రీ పాకాల ఆదినారాయణరావునాయుడుగారు కనిపించారు. వారు ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగా రివర్టయి సెలవుమీద వున్నారు. వారు, నేను కలసి భాయి భాయి అంటూ కాలం గడిపాము.

ఊటీ శీతలవాతావరణంతోబాటు ఆనందకరమైన ఉద్యానవనాలు, షికారుకు వెళ్లుట కనువైన ప్రదేశాలు కలది. ఉపరితలంకూడ విశాలమైనదే. స్పెన్సర్ కంపెని వారి వివిధ వస్తువుల విక్రయశాల, గయాన్ చంద్ కేవల్‌రాం వారి బట్టల దుకాణం, చెప్పుకోతగ్గ యితర దుకాణా లుండినవి. శవాయ్, సెనల్ మొదలైన మంచి యూరోపియన్ పద్ధతి హోటళ్లుండినవి. స్ట్రాబెరీస్, యాపుల్స్, పేర్స్, బెర్రీలు, ప్లమ్సు, మొదలైన ఫలాలు లభించేవి. చక్కని యువతీ యువకులు, సిరి సంపదలతో తులతూగే ధనికులు, జమీందారులు, రాజులు, మహారాజులు, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసినవారు ఆ రోజులలో కనపడేవారు. మద్రాసు గవర్నరు, ప్రభుత్వ సెక్రటేరియట్ ఉద్యోగస్థులు వేసవికాలం మకాం వేసేవారు. మేము ఉభయులం తింటూ, షికారుకు తిరుగుతూ వారిని, వీరిని చూస్తూ ఆనందించేవాళ్లం.

ఒకటి రెండు విషయాలు బాగా గుర్తున్నవి. ఒక మిక్కిలి చక్కని పంజాబీ యువతి లాగు తొడుక్కొని, ఇద్దరు పురుషులు చెరియొకప్రక్క వెంటరాగా విహారముచేయు చుండినది. పొడుగుగా, లావుగా వుండిన ఆ యువతి పిరుదులు లాగువేసుకొన్నందు వల్ల, ప్రస్ఫుటముగా కనపడుచు ఒక వింత అందాన్ని ఆమెకు తెచ్చిపెట్టినవి.

మే ముండిన టాజ్ మహల్ హోటలుకు అనతిదూరములోని కొంచెం దిగువ ప్రదేశంలో ఇంగ్లీషు క్లబ్బున్నది. ఆ క్లబ్బులో పండిట్ జవహర్ లాల్ నెహ్రూగారి కొక సాయంత్రం సన్మానం జరిగింది. మేము హోటలు ప్రాంగణమునుండీ వారిని చూడ గలిగాము. తర్వాత ఇం కొకసారి వా రెక్కడికో వెళ్లి ఓపెన్ కారులో తిరిగివచ్చుచుండగా, బాటవెంట నేనును, ఆదినారాయణ రావునాయుడుగారును పి కారు వెళ్లుచుండటం తటస్థించింది. వారిని చూచి మేము చేతు లూపగా, నెహ్రూగారు కూడా చేతు లూపుచూ సాగిపోయారు. నెహ్రూగారు యునెస్కో కాన్ఫరెన్సు సందర్భంగా ఊటీకి వచ్చినారు. చూడాలని సమావేశం హాలుకు నేను వెళ్లాను. అది ఉదయం. సమావేశానికి డాక్టరు లోకనాథన్ గారు అధ్యక్షత వహించారు. ఒక రిద్దరు మాట్లాడిన పిమ్మట, నెహ్రూగారు మాట్లాడినారు. వారు ఏ నోట్సు లేకుండా సంభాషించినట్లు మాట్లాడారు. అదే మొదటిసారి వారి ఉపన్యాసం విన్నది.

కొన్నిరోజుల తర్వాత ఆదినారాయణరావునాయుడుగారు, నేను కలసి కఝుకోడ్ అని ఇప్పుడు పిలవబడే కాలికట్‌కు బస్సులో వెళ్లాము. బస్సు కొండలమీద మెలికలు తిరుగుచు వెళ్లుచున్నందున నాకు కొంత వికారం కలిగింది. గూడలూరు, షోరనూరు దాటి వెళ్లాము. కాలికట్‌లో "సీవ్యూ" అనే హోటల్లో బసచేశాము. కాలికట్ సముద్రతీరాన వున్నది. హోటలు నివాసయోగ్యమే. భోజనం మంచిదే. కాని, దాని కనతి దూరములో పట్టణంలోని మురికి మలం, వగైరా సముద్రంలో కలిసేచోటు వుండటంచేత, ఆహోటలుకు ఒక విధమైన దుర్వాసన వచ్చేది.

కాలికట్‌లో ఇరుకు సందులు జాస్తి అనిపించింది. అంత శుచి, శుభ్రంగా కనపడలేదు. అది మధ్యరకం పట్టణం. ఈ పట్ట ణంలో మోప్లా మహమ్మదీయులు జాస్తి. అక్క డున్న రెండు మూడు రోజులలో ఒక ఉదయం, చల్లపల్లిరాజావారి నౌకరిలో

వుండి, అక్కడ కలప వ్యాపారం మొదలైనవానికి మానేజరుగా వ్యవహరించుచుండిన శ్రీ ఈశ్వరప్రగడ జగన్నాథరావు మమ్ములను హోటల్లో కలిసికొని, వారి ఆతిథ్యాన్ని స్వీకరించుడని కోరారు. మా కవకాశము లేక, ఇష్టం లేకకొంత ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించలేదు. ఆదినారాయణరావునాయుడుగారింకొకరి ఆతిథ్యాన్ని స్వీకరించరు. నేను రెండు మూడు సార్లు కోరినా, మాయింటికి రానేలేదు. వారి మనస్తత్వమది.

కాలికట్ నుండి తిరిగి బస్సులోనే ఊటీకి వచ్చాం. గూడలూరు ప్రాంతం పచ్చిక బయళ్లతోను, వృక్ష సంతతులతోను, ఎగుడు దిగుడు కొండలు, లోయలతోను మిక్కిలి మనోహరంగా ఉండినది. ఆ పచ్చిక బయళ్లలో మేస్తుండిన పశువులను చూచినప్పుడు నే నింగ్లండులో బాడ్‌బరీలో చూచిన దృశ్యాలు జ్ఞాపకానికి వచ్చాయి. షోరనూరని వినగానే కత్తులు, కరారులు గుర్తుకువచ్చాయి.

ఊటీలో నా కెక్కువ నచ్చింది ఉద్యానవనం. కొన్ని మెట్లు దిగి లోపలికి వెళ్లాలి. ఒక ప్రక్క మెరకైనా అటుపై కెక్కరు. తోట భూమి సమతలం కాదు. అంత రంతరాలుగా వుంటుంది. పెద్ద చెట్లు కూడా వున్నవి. కాని, అవి సామాన్యంగా అంతరాల అంచులలో వున్నవి. ముసలి, ముతకకు అంత సుఖకరమైన వాహ్యాళి కనుకూలమైనది కాదని తోచింది. మరిన్ని బాగున్నా, ఊటీ వంటి ప్రఖ్యాత పర్వత విలాస ప్రదేశానికి తగి నట్లుండలే దనిపించింది.

మే ముభయులం పరిసర ప్రాంతాలను చూచుచు, అక్కడి ఆదిమనివాసులు తోడాల గృహాలు చూచాం. అవి పెద్ద వలయాకారపు గుడిసెలు. గుడిసెల కున్నట్లే, ద్వారం క్రిందిభాగంలో చిన్న దుంటుంది. ఒకటే ద్వారం.

చలి కొండల ప్రదేశంలో మాంసం బాగుండాలి. కాని, మా హోటల్‌వా రిచ్చింది చాలా మధ్యరకమైనది. ఒకసారి మార్కెట్టుకు వెళ్లి చూచాను. అప్పటికి అయిపోయిన వేమోగాని కూరగాయలు ఎక్కువగా కనిపించలేదు. ఆ

సంవత్సరం తక్కువేమో గాని స్ట్రాబెరీస్, పేర్సు వగైరాలు తక్కువే. కొండ అరటిపండ్లను ఎక్కువగా చూడలేదు.

ఊటీలో జూను మొదటివారం వరకు ఉన్నాం. ఆదినారాయణరావునాయుడుగారు నాకంటె కొన్నిరోజులు ముందు వెళ్లియుండినారు. తిరిగివచ్చేటప్పుడు మే మిద్దరం కలసి వచ్చాం. మద్రాసు సెంట్రల్ స్టేషనులో దిగకముందే వారితో "మా యింటికి రండి, మా పిల్లలను చూద్దురుగాని" అని చెప్పాను. వారు "తర్వాత చూద్దాములే" అన్నారు. "పోనీ, ఒక రోజైనా మాతో గడపండి. మీరు వెళ్లబోయే వై. యమ్. సి. ఎ. లో మీ యిష్టం వచ్చి నన్ని రోజు లుండవచ్చును కదా. ఒక రోజులో మీ కేమి ఇబ్బంది కలుగుతుంది. మాకు సంతోషంగా వుంటుం"దని కోరాను. తిరిగి స్టేషనులో దిగబోయేటప్పుడు, "ఇంటికి వెళ్దాం" రండి అన్నాను. వారు వినిపించుకోనేలేదు. రైలు దిగి ప్లాటుఫారం మీద అడుగుపెట్టగానే సెలవు చెప్పారు. ఈ మొండి ఘటం ఇంతేనని, నాదారిని నేను వెళ్లాను.

శ్రీ ఆదినారాయణరావు నాయుడుగారి హృదయం బంగారం. వారు ఆప్యాయతనుకూడా చూపగలరు. స్నేహం నెరపిన వారియందు మిక్కిలి అభిమానంతో వుంటారు. కాని ఎవరితోనోగాని స్నేహం చేయరు. వారికి కొన్ని పద్ధతులు, అలవాట్లున్నవి. ఆకాశం ఊడిపడినా వాని నతిక్రమించరు. వారు ఉద్యోగం నిర్మొగమాటంగా, న్యాయంగా, నిజాయితీగా చేశారు. ఇన్‌కమ్ టాక్స్ అసిస్టెంటు కమిషనరుగా నాకు ముందే రిటైరై విజయవాడలో హైకోర్టు జడ్జి చేసిన శ్రీ గోవిందరాజాచారిగారి మేడలో ఉంటున్నారు. ఈమధ్యనే నా కొకటి రెండు సార్లు విజయవాడలో తగిలారు. ఇక్కడొక మంచి కళ్ల డాక్టరున్నాడని, ఒకసారి డాక్టరు కృష్ణమూర్తివద్దకు తీసుకొనివెళ్లారు. తీరా చూస్తే డాక్టరు కృష్ణమూర్తి మా బంధువు. 1969 జూన్‌లో నేను కొడైకెనాల్‌నుండో లేక 1970 జూన్‌లో కుర్తాళంనుండో తిరిగివస్తున్నప్పుడు రైలులో కలసి, శ్రీ సుందరేశన్ అంతకు

ముందే చనిపోయిన వార్త తెలిపారు. డిపార్టుమెంటు విషయాలు అవీ, ఇవీ మాట్లాడుకొన్నాం. తరువాత కలసికోలేదు.

ఊటీ నుండి తిరిగివచ్చిన తర్వాత పెడసనగల్లుకు వెళ్లి యుంటాను. ఊటీకి వెళ్లేటప్పుడు భార్యాబిడ్డలు అక్కడకు వెళ్లి యుందురు. మేమంతా కలసి జూలై మొదటి వారంలో తిరిగి నెల్లూరుకు వెళ్లాం. సెలవు అనంతరం, నన్ను తిరిగి నెల్లూరుకే వేశారు. నెల్లూరులోని యిల్లు మాక్రిందనే వున్నది. కాబట్టి, సరాసరి ఇంటిలో ప్రవేశించాము.

అంతకుముందో, నేను సెలవుమీద వెళ్లినప్పుడో జాన్ అనే ఇండియన్ క్రిస్టియన్‌ను ఆఫీసరుగా వేశారు. నెల్లూరు సర్కిల్‌ను రెండుగా విభజించి ఎక్కువ పని, మిక్కిలి శ్రమను కలిగించుచుండిన గూడూరు, రాపూరు వగైరా తాలూకాలను ఒక భాగానికి, తతిమ్మా తాలూకాలను రెండో భాగానికి నిర్ణయించారు. మైకా కేసులు గల గూడూరు భాగానికి నేను ఛార్జి తీసుకొన్నాను. నేను సెలవుమీద వెళ్లేముందు శ్రీ జాన్ ఆ సర్కిల్‌లోనే ఇన్‌స్పెక్టరుగా వుండేవారని గుర్తు. నా సెలవు ఖాళీలో వీరిని ఆఫీసరుగానో, ఆఫీసరు ఇన్‌ఛార్జిగానో నియమించి నట్లున్నది. ఎట్లు జరిగినా, నేను తిరిగివచ్చినప్పుడు శ్రీ జాన్, నేను ఇద్దరు ఆఫీసర్లుండినాము.

శ్రీ జాన్‌కు మతాభిమానం మిక్కిలి హెచ్చు. ఆయన ఆఫీసరుగా ప్రమోషన్ పొంది స్వతంత్రంగా కేసులు విచారించి పన్నులు నిర్ణయిస్తున్నా ఆదివారం నెల్లూరు మిషనరీలతో కలసి బజార్లవెంట మత సంకీర్తనలుచేయటం, ముఖ్యమైన బజారు ట్రంకురోడ్డు మధ్యలో నిలుచుండి ఉపన్యసించడం కొంతమంది కసహ్యమనిపించి నాకు వచ్చి చెప్పారు. నేను నెమ్మదిగా మందలించానుగాని, ఆయన పట్టించుకోలేదు.

మైకా కేసుల తీవ్రత నేను తిరిగి వచ్చేటప్పటికి కొంత తగ్గినా, పూర్తిచేయవలసిన కేసులు చాలా వుండేవి. పని వత్తిడి వల్ల నేను రాత్రయ్యేవరకు పనిచేయవలసివచ్చింది. నిజానికి నెలాఖరులో ఒక్కొక్కప్పుడు రాత్రి 8, 9 గంటలయ్యేది. నేను

భోజనంచేసి ఆఫీసుకు కొంచెం మాలస్యంగానే వెళ్లేవాడను. కొంత కారణం నేను తరుచు ఉదయం 4 గంటలకు లేచి, 8 గంటలవరకు ఏకాఏకిని ఫైల్సు చూచుకొనేవాడను. రెండోది, వంటవాడు సకాలంలో వంటచేసేవాడు కాదు. మా ముఖ్య భోజనం ఉదయ భోజనం. మూడోది భుక్తాయాసం, పేపరు చదువుకొనటం. ఒక అరగంటో, గంటో ఆలస్యంగా వెళ్లినా, ఆఫీసు టేబుల్‌వద్ద కూర్చున్న తర్వాత, నీరుడుపోసుకుంటానికి లేవటం తప్ప, మంచినీళ్లకు కూడా లేచేవాడను కాదు. దప్పి కైనప్పుడు జవాను వెనుకప్రక్క బల్లమీద పెట్టియుండిన కూజాలోనుంచి తెచ్చి యిచ్చేవాడు. మధ్యాహ్న ఉపాహారం ఎప్పుడూ ఎరుగను. కాఫీ, టీ చాలాకాలంక్రిందే మాని వేశాను. రాత్రి ఎన్నిగంటలకు పనినుండి లేచినా, ఈ మధ్య మంచినీళ్లే నా కాధారం.

కష్టపడి పనిచేయుటం, నిజాయితిగా వర్తించటం, కడుపు మీద కొట్టకపోవటంతోబాటు పై అధికారుల వ్యక్తిగతాభి ప్రాయాలు, అనవసర జోక్యాలు, అనుచితాలు, అసహనాలు నేను సహించేవాడనుకాదు. ఒకసారి మా అసిస్టెంటు కమిషనరు గోపాలస్వామినాయుడుగారు, ఏదో కేసు ఫైలును పరిశీలిస్తూ, దానిలోని కొన్ని అంశాలమీద రిపోర్టివ్వమన్నారు. నేను చదివి రిపోర్టు వ్రాసి ఆయనకు పంపాను. నన్ను పిలిచి, ''ఇదేమి రిపోర్టు, ఇట్లా వ్రాయవలసిందికాదు'' అన్నారు. దానిమీద నాకు చిరాకు కలిగి, ''అయ్యా, ఈ రిపోర్టును ఇంతకంటె భిన్నంగా వ్రాయుటానికి వీలులేదు. హైకోర్టు జడ్జి అయినా ఇంతకంటె మెరుగుగా వ్రాయలేడు'' అని గట్టిగా చెప్పాను. అంతటితో ఆయన ఏమీ జవాబు చెప్పలేక, సరే వెళ్లండన్నాడు. శ్రీనాయుడు తానేదో ఒక నిర్ణయానికి వచ్చి, తనచేతులు బలంచేసుకోటానికి, నన్ను తన అభిప్రాయాని కనుకూలంగా రిపోర్టివ్వమని ఉద్దేశ పడ్డాడు.

జూనియర్ ఆఫీసర్లను పెద్దకేసుల్లో పన్ను వేయుటానికి ముందు డ్రాఫ్టు ఆర్డరులను తనకు పంపి, తాను ఆమోదించిన తర్వాతనే ఫైనల్ ఆర్డర్లను పాసుచేయాలని హుకుం జారీ

చేశాడు. ఒక నెల్లూరు క్యాంపులో, "మీరుకూడా పంపం" డని నోటిమాటతో శ్రీనాయుడు చెప్పాడు. "అదేమిటి, నే నింతవరకే కేసులోను డ్రాఫ్టు ఆర్డరు పంపి యెరుగను. ఇప్పుడు సీనియర్ ఆఫీసరునుకూడా" అన్నాను. "అదికాదు. అందరిని పంపమని, మిమ్ములను విడిచిపెట్టితే బాగుండ" దన్నాడు. నేను మాట్లాడకుండా వచ్చివేశాను. కాని ఏ కేసులోనూ పంపలేదు. పంపితే, ఆ కేసు పూర్తి అయ్యేది కాదు శ్రీ నాయుడు లేనిపోని సందేహాలను లేవనెత్తి, పది పుటలు వ్యాఖ్యలు వ్రాసి తెగనిచ్చేవాడు కాదు. నెల్లూరు మైకా కేసులు పెద్దవి. వానిని త్వరగా పరిష్కరిస్తానని, కమిషనరు నన్ను నెల్లూరుకు పంపాడు. శ్రీ నాయుడు సలహా ననుసరిస్తే, ఎక్కడి మైకా కేసులు అక్కడనే వుండేవి.

శ్రీ నాయుడు అధికారదాహం మిక్కిలి హెచ్చుగా కలిగినవాడు. కానరాని దురహంకారి. డ్రాఫ్టు ఆర్డర్ల పేరున ఆఫీసర్ల జుట్టును తన చేతిలో బిగించుకొని తోలుబొమ్మలాడించేవాడు. నాలుగు ముక్కలలో పోవలసినదానిని క్రిందకు, మీదకు త్రిప్పి, వ్రాసిందే వ్రాసి దుంపదెంపేవాడు. ఆయన పరిపాలన ఆఫీసర్లకు ప్రాణసంకటంగా తయారైంది.

ఆఫీసు గుమాస్తాలు, జవాన్లు విసుక్కున్నా, తిట్టుకున్నా నేను లేచేవరకు కాచుకొని వుండేవారు. నాయంత్రం 6 గంటలు దాటిన తర్వాత పనిచేసేవారో, లేదో నేను పట్టించుకొనే వాణ్ణి కాదు. నాకు కావలసింది, దేనికైనా నేను పిలిచినప్పుడు నా కందుబాటులో వుండటం. ఇప్పటివలె, బిక్కుబిక్కుమంటూ ఆఫీసరు ఏదో గిలుకుకొనుచుండగా, ఎవరి దారిని వారు పోవటం, బిల్డింగు వాచ్‌మన్ వచ్చి తలుపులు మూయటం జరిగేది కాదు.

గుమాస్తాలుగాని, జవానులుగాని అవిధేయత చూపటం, ఎదురు చెప్పటం నా హయాంలో జరగలేదు. ఇన్‌స్పెక్టరు మిక్కిలి జాగ్రత్తతో వ్యవహరించేవాడు. శ్రీ డి. సత్యనారాయణ రాజు ప్రమోషన్ మీద వెళ్లిపోయిన తర్వాత ఇద్దరైనా ఇన్‌స్పెక్టర్లు వచ్చారు, పోయారు. ఒకరు కృత్తిగంటి సూర్య

నారాయణరావు, రెండవ వారు, ఎ. సత్యనారాయణ అని గుర్తు. వారు చెప్పినట్లు చేసేవారు. జవానుల్లో ఒక మహమ్మదీయు డుండేవాడు. అతడు తెలివి తేటలు, వినయ విధేయతలు కల వాడు. సాధువుగా కః పించేవాడు. నెల్లూరులో అప్పు డప్పుడు, హిందూ—ముస్లిమ్ మత కలహాలు జరుగుచుండేవి. ఒక కల హంలో చెప్పకుండా, పెట్టకుండా ఈ ముస్లిమ్ జవాను 4, 5 రోజులు ఆఫీసు ఎగగొట్టాడు. కొట్లాటల్లో చురుకుగా పాల్గొ న్నాడట. తర్వాత పిల్లిలాగు పనిలోకి వచ్చి, యథాప్రకారం నడుచుకొన్నాడు. హిందూ జవాన్లు మామూలు డ్యూటి తూ—చ తప్పకుండా చేసుకొన్నారు. ఎవ రెన్ని చెప్పినా మహమ్మ దీయులకు మతపిచ్చి, పట్టుదల, ఉద్రేకం జాస్తి.

శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు చెప్పుకోతగ్గ మర్యా దస్థులు. గొప్ప ఆంధ్ర సారస్వతాభిమాని. కవి బ్రహ్మ తిక్కన జయంతులనేగాక, మొల్ల వంటి వారిని కూడా కలుపుకొని ప్రాచీన కవుల వర్ధంతులను జరుపుచుంటారు. ఈ వర్ధంతుల సందర్భంగా ఆధునిక కవులను పారితోషికములతో సత్కరించు చుంటారు. ఇది ఏటా జరిగే ఉత్సవం. ఇవేగాక, వారి దాతృ త్వానికి గుర్తైన విద్యా సస్థలు వగైరా కొన్నియైనా వున్నవి. వారి అభిమానానికి నోచుకొని వారి అల్లుడు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి రాక సందర్భంగా, వారొసగిన విందులో పాల్గొ న్నాను. ఒకటి రెండు సార్లు వారి రాక సందర్భంగానే అను కుంటాను శ్రీ రామిరెడ్డిగారి గృహానికి వెళ్లటం తటస్థించింది. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని నేను 1928 నుండి ఎరిగి యున్నాను.

క్రైస్తవం పుచ్చుకొన్న చెంగల్పట్టు కమ్మ కుటుంబం వాడు శ్రీ వీరబ్రహ్మం నావద్ద బెజవాడలో ఇన్‌కమ్‌టాక్స్ ఇన్‌స్పెక్టరుగా పనిచేసియుండినాడు. సెలవుమీద ననుకొంటాను, నాకు ముందు నుంచి, నెల్లూరులో వుండినాడు. అతడు నెల్లూరు క్లబ్బులో పేకా టాడుచుండేవాడు. నే నున్నప్పుడు కొన్ని రోజు లాడి నాడని స్ఫుటంగానే గుర్తున్నది. ఆయన చాలా మెలకువతో ఫిల్లి పొంచి వేసినట్లు, ఆచి ఆచి ఆడేవాడు. మొత్తంమీద

గెలుచుకొనేవాడు. శ్రీ సుందరేశన్ పెద్ద ఆటగాడు. చాలా చాకచక్యంగా, సమర్థవంతంగా ఆడేవాడు. నాకు ఆట అంతగా రాదు. కొంతవరకు పాటు గలవాడను. మంచి ముక్కలు వచ్చినప్పుడు ఇతరుల కర్థమయ్యేటట్లు, హావభావములతో వ్యక్తపరచేవాడను. పైగా నెమ్మదిగా గాకుండా కొంత అట్టహాసంతో ఆడేవాడననుకొందును. పైగా, ఆదాయంపన్ను దార్లను కడుపుమీద కొట్టకపోయినా, కొంత కరుకుగా వ్యవహరించేవాడననుకొంటాను. ఏకారణంవల్లనో గాని శ్రీ రామిరెడ్డిగారు "శ్రీ చౌదరి కొంత మోటు, శ్రీ అబ్రహాం సున్నితం" అన్నారట. అయితే, శ్రీ రామిరెడ్డిగారిని పేకాటాడుచుండగాగాని, చివరకు క్లబ్బులో గాని నేను చూచినట్లు గుర్తులేదు.

నిజానికి నేను క్లబ్బుకు నిత్యమే గాకుండా, తరుచుగా కూడా వెళ్లుచుండేవాడను కాను. మూడు మాసాలకో, నాలుగు మాసాలకో వరుసగా మూడు నాలుగు రోజులు వెళ్లి, 30, 40 రూపాయలు పోగొట్టుకొని తిరిగి వెళ్లేవాడను కాదు. శ్రీ సుందరేశన్ కది నిత్యానందం. శ్రీ ఏబ్రహాం కూడా రోజూ ఆడుచుండేవా డనుకొంటాను.

కొంతకాలం ఆంధ్రప్రదేశ్ మంత్రిగా అధికారం చెలాయించిన ఎ. సి. సుబ్బారెడ్డిగారితో, నేను నెల్లూరులో నుండినప్పుడు చనువుగా మెలగేవాడను. ఆయన చాలా పొడగరి. తగిన లావుతో వుండేవారు. పెద్దగా మాట్లాడటం, నిర్మొగమాటంగా, నిర్భీతిగా వ్యవహరించటం న న్నాకర్షించినవి. ఆయనను బిగ్ బ్రదర్ (పెద్దన్న) అంటూ వుండేవాడను. ఆ రోజుల్లో ప్రభుత్వానికి వ్యతిరేకంగా కూలినాలిని రెచ్చగొట్టటం, ఏదో చెరువును హరిజనుల చేతనో, లేక సన్నకారు రైతుల చేతనో ఆక్రమింపచేయటం, అప్పుడు కలెక్టరుగావుండిన శ్రీ జోసెఫ్‌రెడ్డిగారి ఆగ్రహానికి గురికావటం నే నెరుగుదును. ఆయన కొంత దుందుడుకు కనపరచేవారు. నేను నెల్లూరు నుండి వెళ్లిపోవుచున్న సందర్భంలో క్లబ్బువారు తేనీటివిందిచ్చారు. అప్పు డెవరితోనో వాదనలో "కృష్ణా, గుంటూరువాళ్లు దొంగలు,

అదీ, ఇదీ'' అని, ఏమేమో మాట్లాడుచుండినారు. అది నా చెవులలో బడి ''బిగ్ బ్రదర్, నేను కృష్ణాజిల్లా వాడి'' నంటిని. ఆయన వినిపించుకోనే లేదు.

తొందరపాటు, దౌర్జన్యం, తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లు అనటం మొదలైన అసౌజన్యాలున్నా శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారు విశిష్టవ్యక్తి. నమ్మినవారిని గోతిలో దించే స్వభావం కలవాడుకాదు. తాను నమ్మినదానిని ధైర్యంతో చేపట్టటం, సాధించటం ఆయన ప్రత్యేకత. నెల్లూరు పురపాలన అత్యంత సమర్థంగా, కొన్ని ఏండ్లు ఏకధాటిగా నిర్వహించారు. నేను నెల్లూరు విడిచి వెళ్లే ముందు, వా రింటికి వెళ్లి చెప్పి వచ్చాను.

తీవ్ర కమ్యూనిస్టుల నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య అనుజుడు డాక్టర్ రామచంద్రారెడ్డి, మా వీధిలో మా యింటి నించు మించుగా ఆనుకొనియున్న మేడలో వుండేవారు. ఆయన తీవ్ర కమ్యూనిస్టువాది. మధ్యమధ్య మతిభ్రమణం కలుగుచుండేది. అల్లరులు లేవదీస్తూండేవాడు. పోలీసులు ఆయన్ను వెంటాడుచుండేవారు. నిజానికి వేటాడుచుండేవారు. ఒకనాడు మేడను పోలీసులు చుట్టేశారు. డాక్టరుగారి పై అంతస్తు డాబా మీదకు వెళ్లి, వాళ్ల నటూ ఇటూ గిరికీలుపెట్టి అదృశ్యుడైనాడు. వాళ్లు విసిగి, వేసారి వెళ్లిపోయారు. ఇంకొకసారి వాళ్ల రాకను గమనించి, పారిపోయి వచ్చి మాయింట్లో దూరాడు. అప్పుడు కూడా దొరక లేదు.

డాక్టర్ రామచంద్రారెడ్డి మేధావి, వైద్య నిపుణుడు, కరుణార్ద్ర హృదయుడు, నిస్స్వార్థపరుడు, దీనజనుల పాలిటి కల్పవృక్షం. బీదసాదల కుచితంగా వైద్యం చేసేవాడు. చివరకు క్షయ రోగులను తనవద్ద పెట్టుకొని, వాళ్ల కుచిత వైద్యమేగాక తిండి వగైరా అందించేవాడు. అంతటి మంచి హృదయంగల వైద్య నిపుణునకు మతిస్థిమిత ముండి, అతివాద రాజకీయాల్లో మునిగి పోకపోతే అఖలభారతఖ్యాతి వచ్చేది.

బుచ్చిరెడ్డిపాలెం శ్రీ బెజవాడ గోపాలరెడ్డి మేనమామలు మేనకూరువారితోను, బెజవాడ వెంకట కృష్ణారెడ్డిగా రనే వారి

తోను, పైన చెప్పిన డి. యమ్. కె. రెడ్డిగారితోను, పేర్లు గుర్తుకు రాని మరొక ఇద్దరితోను కొంత పరిచయమైంది. కాని అది తాత్కాలికమే అనిపిస్తుంది. నిజానికి ఉద్యోగస్థునికి, అందులో ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటుకు చెందిన ఉద్యోగికి నిజమైన స్నేహితు లుంటారా అని నా సందేహం. చాలామంది వాళ్ల పబ్బం గడుపుకొనటానికి స్నేహం, ఇష్టం అభినయిస్తా రని అనుకోవాలి. నావంటి కపట మెరుగనివాడు, కొంతకు కొంతైనా భ్రమపడ వచ్చును. ఒకవిధంగా వచ్చే పోయే ఆఫీసర్లు రైలుప్రయాణీకుల వంటివారని పైన చెప్పానుకదా.

ఇతర ఆఫీసర్లతో చనువుగా వర్తించే స్వభావంకాదు నాది. కలసికొన్నప్పుడు స్వేచ్ఛగా ప్రవర్తించటం, స్నేహభావం చూపటం, తర్వాత ఆవూసే తలపెట్టకపోవటం నా మనస్తత్వం, అలవాటు. ఏ జిల్లాలోగాని కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, జడ్జి వంటి జిల్లా ఆఫీసర్లతో కావాలసి స్నేహం నెరపలేదు. అందు వల్ల నెల్లూరు జిల్లాలో ఒక్క జిల్లా కలెక్టరు జోసెఫ్‌రెడ్డిగారి నెరిగి యుంటినిగాని తతిమ్మావా రెవరోకూడా నాకు గుర్తు లేదు. అదిన్నీ, రెడ్డి గారప్పు డప్పుడు క్లబ్బుకు వచ్చేవారు కాబట్టి.

శ్రీ జోసెఫ్‌రెడ్డి క్రైస్తవమతం పుచ్చుకొన్న రెడ్డి కుటుంబంవారు. వారిది కాథలిక్కు శాఖ. వీరి స్త్రీలు బొట్టుకూడా పెట్టుకుంటారు. నిజానికి కాథలిక్కులు హిందువులతో వివాహాలు జరుపుకొంటారు. మతంపుచ్చుకొన్న రెడ్లు, తరచు హిందూ రెడ్లతోనే ఇచ్చిపుచ్చుకోవటం జరుగుతుంది. మతం భిన్నమైనా కులం ఒకటే నని అభిప్రాయం కాబోలు. అయితే, పుట్టిన బిడ్డలు క్రైస్తవమతస్థులుగా వుండాలని నియమం ఒకటు న్నది. గుంటూరు జిల్లాలో కొన్ని గ్రామాదుల కమ్మవారు కాథలిక్కుమతం పుచ్చుకొన్నవా రున్నారు. వారుకూడా ఇట్టి ఆచారాన్ని పాటిస్తారు.

ఎందుకు వీరు క్రైస్తవులైనారనే ప్రశ్న నాకు కలిగింది. ఒకప్పుడు వూళ్లో కొట్లాట జరిగిందట. కొందరు మరణించారట.

ఆ రోజుల్లో కలెక్టరు తెల్లవాడు, సర్వాధికారి. తెల్ల ఫాదిరి పలుకుబడి చెలామణిఅయ్యే రోజులు. సర్వసామాన్యంగా ఫాదిరి మాట కలెక్టరు త్రోసివేసేవాడుకాదు. రెండు పత్తాల గ్రామస్థులు ఫాదిరి నాశ్రయించగా, "మీరందరూ క్రైస్తవులైతే, మీ ప్రాణాలు నిలుస్తా" వన్నాడట ఆ ఫాదిరి. ప్రాణరక్షణకోసం వాళ్లంతా క్రైస్తవులైనారట. కులం మాత్రం మారలేదు. కమ్మవారితోనే వివాహ సంబంధాలు.

శ్రీ జోసెఫ్ రెడ్డి కొంతవరకు సరళ స్వభావం కలవారు. చనువుగా మాట్లాడటానికి తావిచ్చేవారు. వారి కుమార్తెను అనంతపూర్ జిల్లా, గుత్తి వాస్తవ్యులోక హిందూమత రెడ్డికిచ్చి, వివాహంచేశారు. ఆ సందర్భంగా వారిచ్చిన తేనీటివిందులో పాల్గొన్నాను.

కొంతమంది ఇతరాఫీసర్లతో కొంత పరిచయ ముండవచ్చునుగాని, ఒక మహమ్మదీ యాఫీసరుతో క్లబ్బులో పేకాడుచు ఆయన తిరస్కారభావానికి ఘర్షణపడ్డాము. ఆయన కూతురు వివాహానికి, మామూలు మర్యాదగా నాకూ ఆహ్వానం పంపినాడు. బహుశా నేను వస్తానని అనుకొని యుండడు. నన్ను చూచి మిక్కిలి సంతోషించి ఎక్కువ మర్యాద చేశాడు.

ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరు కేంద్ర ప్రభుత్వోద్యోగి కాబట్టి, ఆయనకు రాష్ట్రోద్యోగస్థులతో ఉద్యోగరీత్యా సంబంధ ముండదు. జిల్లా అధికారి కలెక్టరును కూడా కలసికోవలసిన అవసర ముండదు. కలెక్టరు అధికారాన్ని ఇన్ కమ్‌టాక్సు ఆఫీసరు పాటించవలసిన పని వుండదు. కాబట్టి ఏ ఆఫీసరే మనుకొన్నా, పట్టించుకోవలసిన బాధ వుండదు.

ఈ సర్కిల్ మైకా కేసుల్లో తరుచు వేదం మహాదేవన్ అనేవారు మద్రాసు నుండి వస్తూండేవారు. ఆయన మిక్కిలి చొరవగల వ్యక్తి. తిమ్మిని బమ్మిని చేయగల సమర్థుడు. అయితే పట్టు విడుపు కలవాడు. కొంతవరకైనా సహకార మిస్తూండేవాడు. మద్రాసులో కంటె, ప్రాంతీయ పట్టణాలలోనే ఆయన కెక్కువ ప్రాక్టీసుండేది. నెల్లూరు వాస్తవ్యుడు వేదం

రామచంద్రరావుగారు పెద్ద మనిషి. ఈయనకూడా శ్రీ మహాదేవన్‌వలె వేదం ఇంటిపేరు కలవాడేగాని. సుప్రసిద్ధ వేదం వెంకట్రాయశాస్త్రిగారి కుటుంబానికి చెందినవాడు కాదు. శ్రీ మహాదేవన్‌కూడా అంతే. ఇద్దరూ పట్టాలను గడించుకొన్న ఆడిటర్లు.

1948 నవంబరులోనో, డిశెంబరులోనో నాకు మొదటి క్లాసుకు ప్రమోషన్ వచ్చినట్లు శ్రీ పి. మాధవరావు మద్రాసు నుండి టెలిగ్రాం పంపించాడు. ఆయనగారికి ప్రమోషన్ అంతకు ముందే వచ్చియుండినది. నాకంటె జూనియర్. నేను కాకినాడలో ఆఫీసరుగా వుండగా వారింకను ఇనస్పెక్టరే. వారి మామ కూర్మా సాంబశివరావుగారు ఇంపీరియల్ బ్యాంకు, కాకినాడ ఆఫీసుకు ఏజంటుగా వుండేవారు. వారు మాధవరావుగారి అక్క భర్త. మరిన్ని వారి కూతురునే శ్రీ మాధవరావు, మేనకోడలు వరసన, వివాహమాడాడు. సాంబశివరావొకసారి మాటల సందర్భంలో. "మావాడికెప్పటికి ఆఫీసరుగా ప్రమోషన్ వస్తుం"దని అడిగారు. ఈ ప్రశ్న అడిగిన కొలది కాలానికే మాధవరావుగారు ఆఫీసరయ్యారు. ఇంకా జూనియర్ ఆఫీసరుగా వుండగానే అసిస్టెంటు కమిషనర్ల దయతో, ముఖ్యంగా గోపాలస్వామినాయుడుగారి కరుణతో మొదటి క్లాసులోకి తీసుకోబడ్డారు.

శ్రీ మాధవరావు స్నేహభావం కలవాడు. ఆయన, ఆయన భార్య నన్నాదరించి, స్నేహభావంతో మెలగేవారు. కాని నాకు ప్రమోషన్ రాని కాలంలో వారింటికి వెళ్లగా, పూర్వం కనపరచుచుండిన గౌరవాదరణ కొంత తగ్గినట్లనిపించి మనస్సు చివుక్కుమన్నది. మానవ స్వభావమని సరిపెట్టుకొన్నాను. శ్రీ మాధవరావు తర్వాత కమిషనరవటమే గాకుండా, న్యూయార్కు ఐక్యరాజ్యసమితి కార్యాలయంలో అధికారిగా కొంతకాలం పని చేశాడు. దీనిని బట్టి అసిస్టెంటు కమిషనర్ల సహాయంతో పైకి మొదటిలో వచ్చినా, స్వయంప్రతిభ కలవాడని అర్థమవుతుంది.

నెల్లూరులో వుండగా జరిగిన సంఘుటనొకటి జ్ఞాపకం వస్తున్నది. ఏదో సందర్భంగా నేనొకరాత్రి భోజనానికి కొంత

మంది ఆఫీసర్లను పిలిచాను. పిలిచిన వారిలో అదివరకు నే నెరిగి యుండి, క్రొత్తగా నెల్లూరుకు వచ్చిన పోలీసు సూపరింటెండెంటు శ్రీ బాలకృష్ణసెట్టి వున్నారు. ప్రాత పరిచితు డింకొక పోలీసు ఆఫీసరు శ్రీ విజయరంగంకూడా వున్నారు. కార్లు మా యింటిముందాపారు. భోజనంచేసి తీరా వెళ్లిపోవటానికి తమ కార్లవద్దకు వెళ్లగా, తాళాలు లేవు. నానా అవస్థపడి ఎలాగో తమ యిండ్లకు చేరుకొన్నారు. నాకు తలకొట్టి నట్లైంది. తాళా లపహరించింది నా క్రొత్త డ్రైవ రని తర్వాత తేలింది.

నా క్రొత్త డ్రైవరు నెల్లూరు వాడే. మహమ్మదీయుడు. పులావుకు కావలసిన మాంసం వగైరా తేవటంలో అతని సాయం వుండింది. అతని పద్ధతులు నచ్చ కనుకొందును, అతనిని భోజనాని కుండమని చెప్పక వెళ్లిపొమ్మన్నాను. ఆ గుర్రుచేత ననుకొంటాను, తాళా లపహరించాడు. మరిన్ని పోలీసులమీద కూడా అతని లైసెన్సు విషయంలో క్రోధ ముండియుండవచ్చును. అంతటితో అతడు నౌకరీకి రావటమే మానేశాడు.

అసిస్టెంటు కమిషనర్లు మకాం వచ్చినప్పుడు ఆఫీసు మేడలో ఉండేవారు. కాని ఒకసారి నా భార్య వగైరా వూరికి వెళ్లియుండినందున, నా యిల్లు ఖాళీగానే వుండింది. "వంటవానిని తీసుకొనిరావలసిన అవసరం లేదు, మా మళయాళి వంటవాడు సమర్థుడు. మీరు మా యింట్లో ఈ దఫా బసచేయం" డని క్యాంపుకు రాబోయే అప్పిలేట్ అసిస్టెంటు కమిషనరుగారికి వ్రాశాను. సరే అని శ్రీ కె. అచ్యుతనాయరు వచ్చి బసచేశాడు. ఆయన సాయంత్రం షికారులో మళయాళీల వివాహ పద్ధతులు, భార్యాభర్తల సంబంధాలు నాకు వ్యక్తీకరించారు. క్యాంపు చేసిన 3, 4 రోజులు స్నేహభావంతో, చనువుగా మెలగారు. శ్రీ అచ్యుతనాయరు, "మీ వంటవాడు రామన్‌నాయరు తెలుగు కూడా మళయాళం మాట్లాడినట్లే మాట్లాడుచున్నా" డని చమత్కరించారు.

ఒక సజ్జనుడైన న్యాయవాది, ఇంకొక అసిస్టెంటు కమిషనరు జె. యస్. ఎ. రాజుగారిని ఒక క్యాంపులో భోజనానికి పిలిచారు.

శ్రీ రాజు తటపటాయిస్తుండగా, "ఆయన చాలా పెద్దమనిషి. పెద్ద వంశంలోనివాడు. మీరు నిరభ్యంతరంగా ఆమోదించవ"చ్చని అన్నాను. సరే, ఆ రాత్రి నేనుకూడా భోజనానికి వెళ్లాను. ఆయన చాలామందిని భోజనానికి పిలిచాడు. అనవసర ఖర్చు పెట్టాడని తోచింది. మరునాడు సాయంత్రం శ్రీ రాజు నాతో, "రాత్రి విందుచేసి నాయన, ఒక అప్పీలులో పార్టీతరఫున హాజరయ్యాడు. సవ్యమైన కేసుకాదు. ఆఫీసరు ఆర్డరును ఖాయపరచాను. ఆయన హాజరవటం నాకాశ్చర్యాన్ని కలిగించిం" దన్నాడు.

శ్రీ గోపాలస్వామినాయుడు, శ్రీ కె. అచ్యుతనాయరు, శ్రీ జె. యస్. ఎ. రాజులను, నేను 'సార్' అనేవాడనుకాదు. "మిస్టర్"రనే సంబోధించేవాడను. వారు తప్పుగా ఎంచుకొనేవారుకాదు. వారు పై ఉద్యోగులైనా నావయస్సు, వరుసవారే. శ్రీ అచ్యుతనాయరు నాతో మైత్రి నెరపేవాడు. ఆయన భార్యను, ఇద్దరు కూతుళ్లను ఎరుగుదును. ఇద్దరు చక్కని వాళ్లు. పెద్దకూతురు రుక్మిణి చెల్లెలు కంటె రంగు తక్కువగాని, చెక్కిన బొమ్మ. మళయాళ యువతి అందం ఇట్లా వుంటుంది కాబోలు ననుకొనే వాడను. ఆమె డాక్టర్ పి. ఆనందకుమార్ మీనన్‌ను పెండ్లాడింది. ఆయన సదరన్ రైల్వే, తర్వాత సౌత్-సెంట్రల్ రైల్వే ఛీఫ్ మెడికల్ ఆఫీసరుగా పనిచేసి కొలదికాలంక్రిందనే రిటైరైనారు. ఈమధ్య ఆయన కుమారుని వివాహం చేస్తూ శుభలేఖ పంపించాడు. రెండో కూతురు రమ పుదుక్కోటరాజాగారి తమ్ముడు శ్రీ రాధాకృష్ణన్‌ను పెండ్లాడింది. ఆమె తెల్లగా వుంటుంది. భరతనాట్యం నేర్చుకొన్నది. శ్రీ రాధాకృష్ణన్‌ను ఒకసారి తిరుచినాపల్లిలో చూచాను. వర్ణాంతర వివాహం.

ఎలా అయితేనేం నెల్లూరు సర్కిల్‌లో 17-4-1949 వరకు పనిచేసి, కొలది రోజులు సెలవుతీసుకొని, క్రొత్తచోట చేరటానికి లభ్యమయ్యే రోజు లుపయోగించుకొని 11-5-1949 తారీఖున మద్రాసు 3-వ సర్కిల్ ఆఫీసరుగా ఛార్జి తీసుకొన్నాను.

# 3-వ సర్కిల్ - మద్రాసు

ఈ సర్కిల్‌లో షావుకారు లేక కిరాణా సరుకులు, ఫ్యాన్సీ సరుకులు, బట్టలు, బంగారు వెండి నగలు, పండ్లు వగైరా వ్యాపా రస్తులు ముఖ్యంగా ఆదాయం పన్ను ఇచ్చేవారు. షావుకారు పేట, దాని పరిసరప్రాంతాలు ఈ సర్కిల్ అధికారములోనివి. బంగారం, వెండి నగలను, వెండి పాత్రలను తయారుచేయించి అమ్మే ప్రముఖులు వుమ్మిడి 'బంగారుచెట్టి, పసుమర్తి కన్నయ్య చెట్టి, నాదమునిచెట్టి మొదలైనవారు పన్ను యిచ్చేవారిలో వుండేవారు. వివిధ రకాల కిరాణా, ఫ్యాన్సీ వస్తువులను విరివిగా అమ్మే గోవిందప్పనాయక్ స్ట్రీట్, బట్టలు, పండ్లు మొదలైనవి అమ్మే బందరుస్ట్రీటు కూడా ఈ సర్కిల్‌లో వుండేవి. ఈ సర్కిల్ చిన్నదికాదు. పన్నుకట్టేవారు జాస్తిగానే వుండేవారు. కాని పెద్ద కంపెనీలుగాని, పరిశ్రమలుగాని వుండేవికావు.

నా సర్కిల్ ఇన్‌స్పెక్టరు వి. యస్. కృష్ణమూర్తి (నిక్ నేమ్ రోజా కృష్ణమూర్తి) పెద్ద బంగారు, వెండి కొట్ల లెక్కలను తనిఖీచేసి, చక్కని దస్తూరితో మిక్కిలి స్పష్టంగా, పరిపూర్తిగా నోట్సు తయారుచేసేవాడు. లెక్కలలో ఘటికుడు. వ్రాయు టలో సమర్థుడు. చాకచక్యంగా నచ్చేటట్లు మాట్లాడేవాడు. ఆత్మగౌరవం పోకుండా, మంచి వినయ విధేయతలతో ప్రవర్తించే వాడు. డిపార్టుమెంటల్ పరీక్షలు ప్యాసుకానందున, చాలా కాలానికిగాని ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగా ప్రమోషన్ రాలేదు. ఆయన బెంగుళూరులో చేరి తర్వాత ఆఫీసరైనాడు. అక్కడే రిటైరై, స్థిరనివాస మేర్పరచుకొన్నాడు. 1966 లో నేను బెంగుళూరు వెళ్లినప్పుడు వారిని కలసికొని, వారింట విందారగించి వచ్చాను. వారి కుమార్తెలలో కడసారి పిల్ల 11, 12 ఏండ్ల బాలిక, అందమైనది. చురుకైనది. నాకు బాగా నచ్చి, "నీ పెళ్లికి తప్పకవస్తా"నని నవ్వుతూ చెప్పాను. తర్వాత ఆమె కంటె పెద్దామె పెండ్లికి, శ్రీ కృష్ణమూర్తి నా కాహ్వానం పంపాడుగాని, ఏదో ఆటంకం వల్ల హాజరుకాలేక పోయాను. రిటైరైన కొంత



మద్రాసు 3-వ సర్కిల్ ఆఫీసు ఉద్యోగుల వీడ్కోలు 1949 — కూర్చున్నవారు మొదటి పంక్తి: 1. శ్రీ వి. కృష్ణమూర్తి, 2. శ్రీ ఎస్. (రోజా) కృష్ణమూర్తి, 3. శ్రీ అజరయ్య, 4. గ్రంథకర్త, 5. శ్రీ రామకృష్ణ, 6. శ్రీ మొదలియారు, 7. శ్రీ నటరాజన్

నిలుచున్నవారు మొదటి పంక్తి: 4. భగీరథన్



మద్రాసు 'ఎ' రేంజి అప్పిలేటు అసిస్టెంటు కమీషనర్ ప్రమోషన్ 1949 — కూర్చున్నవారు: 2. శ్రీ నూర్, 3. గ్రంథకర్త
4. శ్రీ భాగ్యనాథన్, 5. శ్రీ వి. కృష్ణమూర్తి
నిలుచున్నవారు: 1. శ్రీ గోవిందరాజులు, 2. నారాయణ, 4. శ్రీ శ్రీనివాసన్, 6. మళయాళీ జవాను

కాలానికి, కృష్ణమూర్తి బెంగుళూరులోని బ్రహ్మయ్య అన్డ్ కంపెని ఆడిటర్సు బ్రాంచిలో జీతానికి ప్రవేశించాడు. బ్రాంచి అధిపతిగా శ్రీ పర్వతనేని సాంబయ్య వుండేవాడు. ఆయన చనిపోగా, ఆయన కుమారుడు వీరభద్రరావు ఇంక నిద్దరిని భాగస్వాములుగా తీసుకుని పనిని కొనసాగించుచున్నాడు. గత (1972) మే నెలలో నేను విశ్రాంతి కొరకు బెంగుళూరు వెళ్లినప్పుడు, భాగస్థులలో ప్రముఖుడు శ్రీ పి. వెంకట్రావు కుమార్తె వివాహానికి హాజరయ్యాను. కృష్ణమూర్తిఇంటికి వెళ్లి వారి భార్యా బిడ్డలను, వారి కోడలు, వియ్యంకుడు వగైరాలను చూచి వచ్చాను. 1966 లో బాలికగా నుండిన కృష్ణవేణి పెద్దదై పెండ్లీడుకు వచ్చింది. పూర్వ మున్నంతగా నన్నాకర్షించలేదు. పైగా కళ్లజోడు పెట్టుకొని యున్నది.

కేసులు విచారణ, పన్ను విధించటం మామూలుగా ఏ తగాదా లేకుండా జరిగింది. ఒక అనుచిత సంఘటన గుర్తుకు వస్తున్నది. నటరాజన్ అనే వారు హెడ్ క్లార్కుగా వుండినారు. ఆయన నడవడి, నిర్లక్ష్యం నాకు చిరాకు కలిగించి, నేనొక సందర్భంలో ఆయనను గట్టిగా మందలించాను. దానికాయన ఏమేమి చెప్పినాడో ఆయన కిష్టుడైన శ్రీ యస్. వి. రమణయ్య నాతో వాగ్వివాదానికి దిగి, కించపరచే టట్లు మాట్లాడినాడు. ఈ యస్. వి. రమణయ్య కూడ ఇన్కమ్ టాక్సు ఆఫీసరు. ఈయన కేంబ్రిడ్జి యూనివర్సిటీలో లెక్కలలో హెచ్చుస్థాయిలో గెలిచి, ఐ. సి. యస్. పరీక్షలో ఉన్నత స్థాయిని గెలుపొందిన మేధావి. పాలనా దక్షుడుగా ప్రసిద్ధి కెక్కిన శ్రీ శొంఠి రామమూర్తిగారి కుమారుడు. ఈయనగారు తెలివి తేటలు గలిగినవాడే గాని తండ్రి నిలకడ. సమర్థత, చాకచక్యం ఇసుమంతకూడా లేనివాడు. కొలది సంవత్సరములలోనే ఇన్కమ్ టాక్సు ఆఫీసరు పదవికి రాజీనామా యిచ్చి, ఎడిసన్ కంపెని రంగుల డిపార్టుమెంటులో కలకత్తాలో చేరాడు. అక్కడ ఎక్కువకాలం వుండలేదు. ఏవేవో మార్చి, నే నీమధ్య శ్రీ వెలగపూడి రామకృష్ణగారు చనిపోయిన సందర్భములో వారి యింటివద్ద

ఆయనను (శ్రీ రమణయ్యను) కలసికొనగా, అప్పుడు "మద్రాసులో ఏదో పనిచేయు చున్నా"నని చెప్పాడు. ఇన్‌కమ్ టాక్సు డిపార్టు మెంటులో స్థిమితంగా వున్నట్లయితే కమిషనరుకూడా అయ్యే అవకాశ ముండేది. రమణయ్యగారి భార్య బాగుగా చదువు కున్న అందమైన యువతి. ఆమె అద్వితీయ పాత్రికేయులు, బందరులో కృష్ణాపత్రికను పెంపొందించి, సాటిలేని సంపాదకీయా లతో మిక్కిలి శక్తివంతమైనదిగా, ప్రజాభిమానమును చూరగొన్నదిగా రూపొందించి, ఆంధ్ర దేశమునకు గౌరవం తెచ్చిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి కూతురు బిడ్డ.

నేను అసిస్టెంటు కమిషనరుగా నున్నప్పు డొకసారి, తిరుచినాపల్లి వెళ్లుట తటస్థించింది. అప్పు డక్కడ ఆఫీసరుగా వుంటున్న రమణయ్యగారు ఆంధ్ర టైప్‌రైటరు నే విధంగా తయారుచేసిన అనుకూలపడునో, ఆ పద్ధతిని తాను కనిపెట్టానని చెప్పినాడు. కాని అది ఆమోదాన్ని పొంది, వాడుకలోకి రాలేదు.

మా ఆఫీసు బిల్డింగు పూనమల్లి హైరోడ్డులోని "కుశాల్ దాస్ గార్డెన్సు" అనే పెద్ద భవంతి. దీని వెనుకప్రక్క నాను కొని అలగప్ప స్ట్రీటున్నది. ఈ వీధి 7-వ నెంబరు ఇంటిని అద్దెకు తీసుకొని ప్రవేశించాము. ఇది యొక మిద్దె. ఇంటి యజమాని మద్రాసు విశ్వ విద్యాలయంలో కన్నడ ప్రొఫెసరుగా వుండినారు. పేరు మరియప్పగారు. మధ్వబ్రాహ్మణుడు. శ్రీ మరియప్ప విద్యాశ్రేష్ఠుడు. సరసుడు. పెద్ద మనిషి. నేను వెళ్లిన కొలది కాలానికే పైన ఒక అంతస్తుకూడా వేశారు. మేడవేసినా చిన్న యిల్లు యినందున, నాకు అసిస్టెంటు కమిషనరు ప్రమోషన్ వచ్చినప్పుడు గురుస్వామి మొదలియార్ గారి మేడలలో నొక దానిని అద్దెకు తీసుకొన్నాను.

ఒక ఉదయం అప్పటి కమిషనరు శ్రీ ఖన్నా నాకు కబురంపి, "మీకు అసిస్టెంటు కమిషనరుగా ప్రమోషన్ వచ్చింది. మీరు సుందరేశన్ సెలవుమీద వెళ్లిన ఖాళీలో, అప్పీలు్సు వినే

అసిస్టెంటు కమిషనరుగా, 'ఎ' రేంజి ఛార్జి తీసుకోవలసియుంటుం'' దని చెప్పారు. మామూలుగా ప్రమోషను వచ్చినందుకు అభినందించారు.

ఎట్టకేలకు ప్రమోషను వచ్చింది. అప్పిలేట్ 'ఎ' రేంజి ఛార్జిని ది 26-12-1949 న తీసుకొన్నాను. శ్రీ సుందరేశన్ ఆఫీసు ఛార్జి ఎవరికో ఇచ్చి వెళ్లిపోయారు. వారి నుండి సరాసరి ఛార్జి తీసుకోలేదు. అది కొంత మేలే అని వ్యాఖ్య. అప్పుడు అప్పీల్సు వినటానికి, 'ఎ', 'బి' రేంజిలు రెండు వుండేవి. 'ఎ' రేంజి చాలా ముఖ్యమైనది. ఫస్టులైన్ బీచ్, ప్యారి కంపెని కార్నర్, ఆ ప్రాంత మంతా పెద్ద కంపెనీల పుట్ట. ఈ కంపెనీ లన్నీ 'ఎ' రేంజిలోనివి. మిక్కిలి సమర్థులైన శ్రీ యమ్. సుబ్బరాయన్, శ్రీ టి. వి. విశ్వనాథ అయ్యర్, శ్రీ కె శ్రీనివాసన్, శ్రీ స్వామినాథన్ వంటి న్యాయవాదులు, ప్రఖ్యాత ఆడిటర్సు రాస్ అన్డ్ ఫ్రేజర్ తరపున శ్రీ శివరామకృష్ణన్, వెంకట్రామన్ అన్డ్ కంపెనీ తరఫున శ్రీ మహాలింగం బ్రహ్మయ్య అన్డ్ కంపెని వారు, శ్రీ చిదంబరం. శ్రీ సుందరం వంటి ఆడిటర్సు హాజరయ్యే వారు. అప్పిలేట్ వర్కు క్రొత్త దైనా, 20 సంవత్సరాలు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరుగా పనిచేసిన అనుభవమేగాక, న్యాయ శాస్త్రంలో పట్టాలు పొందియుండినందున మూలసూత్రాలను సులభంగా అర్థంచేసుకొనే శక్తి యుండినది. లెక్కలలో నాసి యైనా, వాని నేవిధముగా ఆకళింపుచేసుకోవాలో నా ఆఫీసరు అనుభవం అక్కరకు వచ్చింది. అందువల్ల 'ఎ' రేంజి నాతలకు మించినదని అనుకోలేదు. అయ్యో, చాలా పెద్ద క్లిష్టమైన కేసులే అని దిగులుపడలేదు. వుంగానాగా, ఆ స్థానానికి తగిన పద్ధతిలో జంకు గొంకు లేక విచారణలు ప్రారంభించాను. ఆర్డర్లు ప్యాసు చేశాను.

'ఎ' రేంజి ఛార్జిలో ప్రథమ దఫా, రెండుమాసాల పైచిలుకే వుంటిని. ఆ కొలదికాలంలో కలిగిన అనుభవాలు కొన్ని గుర్తుకు వస్తున్నవి. నా స్థానంలో కూర్చున్న వెంటనే స్టెనోగ్రాఫర్‌కు కబురు పంపాను. ఒక ఎర్రని, బక్కపల్చని,

ఎదిగిన బాలుని వంటి లేత వయస్కుడు గదిలోకి వచ్చాడు. "నీ వెవరి?" వని ప్రశ్నించాను. "స్టెనోగ్రాఫర్" నన్నాడు. నేను ఆశ్చర్యపడి "నీవు స్టెనోగ్రాఫర్ వా! డిక్టేషన్ తీసుకోగలవా" అని అడిగాను. "తీసుకొంటా" నన్నాడు. సరే అని, నా ప్రమోషనుకు అభినందించుచు వ్రాసిన వారికి జవాబులు డిక్టేట్ చేశాను. ఒక అరగంటలో చక్కగా తప్పులేకుండా పది, పండ్రెండు టైపుకొట్టుకు వచ్చాడు. నే నెంతో ముచ్చటపడి, నా ఆశ్చర్య సంతోషాల్ని వెలిబుచ్చాను. నా 20 సంవత్సరాల అనుభవంలో ఆంధ్ర దేశంలో పలుచోట్లను, మద్రాసులోను, ఇంత చురుకైన యువకుని, తప్పులు లేకుండా చెప్పినదానిని చక్కగా టైపుచేసి త్వరలో తెచ్చిన వానిని నే నిదివర కెరిగి యుండలేదు. అతనిపేరు వి. కృష్ణమూర్తి. తర్వాత చెప్పాలో తగినంతకాలం నావద్ద స్టెనోగ్రాఫర్ గా పనిచేసి, నా అభిమానానికి పాత్రుడైనాడు.

అమ్జద్ హుస్సేన్ అనువారు, మద్రాసులోని ఇన్ కమ్ టాక్సు ఆఫీసరులలో నొకరు. వారు పన్నువేసిన కేసు ఒకటి నా వద్దకు అప్పీలుకు రాగా, తన ఆర్డరును సమర్థించుకొనటానికి నా ముందు హాజరైనాడు. సిగరెట్టుకాలుస్తూ వచ్చి కూర్చున్నాడు. అది అమర్యాద సూచకంగాను, క్రమశిక్షణ నుల్లంఘించినదిగాను తోచి నే నాయనతో, "మీరు బయటకువెళ్లి సిగరెట్టు కాల్చటం పూర్తిచేసుకొని రం"డని చెప్పినాను. దానికి కొంత లజ్జపడి సిగరెట్టు తీసివేసినాడు. సకాలములో ప్రమోషను రాక కొంత న్యూనతను పొందియుండినందునను, అంతకు కొన్ని రోజులకు ముందే ప్రమోషనైన వా డగుటచేతను కాబోలు, కొంత సీనియారిటీ పొందియుండి ఆ ఉద్యోగి స్నేహభావముతో అన్నట్లు సరిసమాన ప్రతిపత్తిగల వానివలె ఆ చొరవ తీసుకొన్నాడు. నా మందలింపుతో అట్టి నడవడి ఏ ఆఫీసరు నుండి ఇక జరుగలేదు.

ఒకనాడు ప్యారీ కంపెని అనుబంధ కంపెని రంగులు, వార్నిషులు అమ్మే కంపెని ఉద్యోగి అప్పీలు మీద నా ముందు హాజరైనాడు. శ్రీ కోదండరామయ్యరుగారు మిక్కిలి సమర్థు

డైన ఆఫీసరు. సహేతుకముగా, పటిష్ఠంగా వ్రాయగలవాడు. చక్కగా విపులీకరించగల సమర్థుడు. ఆయన శక్తి సామర్థ్యాలు బాగుగా ఎరిగియున్న ఆ కంపెని ఉద్యోగి శ్వేతజాతి వాడు. మిక్కిలి పొడవుగా, లావుగా, దంభంగా వుండినాడు. ఆయన నా ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పక నేను క్రొత్తగా ప్రమోషనై ఎవాడ నవి కాబోలు, తన ఆర్డరును సమర్థించుకొనుటకు వచ్చిన కోదండరామయ్యగారితో చర్చించటం మొదలు పెట్టినాడు. నేను చిరాకుపడి, "మీరు సమాధానం చెప్పవలసినది నాకు. కేసు విచారణ చేస్తున్నది నేను. ఆఫీసరు కాదు", అని గట్టిగా మందలించాను. అంతటితో ఆ శ్వేతజాతీయుడు మెత్తబడి పోయాడు. ఏ కారణం వల్లనో ఆ కేసు విచారణ ఆ రోజు పూర్తికాలేదు. ఇంకొక నాటికి వాయిదా పడింది. తిరిగి ఆ కంపెని ఉద్యోగి నా యెదుటకు రాలేదు.

నా ఛార్జి 'ఎ' రేంజిలో, పని తెమలక, కొన్ని సంవత్సరాల నుండి పేరుకొనిపోయిన అప్పీళ్లు రెండు వేలు పైచిలు కుండినవి. నా స్వభావం, విచారణలను నానవేయటం కాదు. ఎంత త్వరగా విచారణ పూర్తిచేసి, తీర్పు నిచ్చుట కవకాశ ముందునో అంత త్వరగా పని పూర్తిచేసే పద్ధతి కలవాడను. అందువల్ల, ఇన్ని అప్పీళ్లు మిగిలి పోయినవే అనే దిగులుండలేదు. రోజులు గడచిన కొలది, అనుభవం ఎక్కువై స్వేచ్ఛగా తీర్పు నిచ్చేవాడను. 20 సంవత్సరాలుగా ఆఫీసరుగా వుండినవాడ నగుటచేత, మొదటిలో ఆఫీసర్ల మాటలను ఎక్కువ గమనించేవాడను. కొంచెం మొగ్గు కూడా చూపించేవాడ ననుకొందును. కాని, కొలది రోజులలోనే తమాయించుకొని ఆఫీసర్లకు, డిపార్టుమెంటు వారికి ఖేదం కలిగించినా లక్ష్యపెట్టక, నాకు తోచిన విధంగా తీర్పు చెప్పేవాడను. ఇంగ్లండులో, అందులో ఆక్స్ఫర్డ్‌లో, విద్య నభ్యసించిన వాడను, న్యాయశాస్త్రమును చదివినవాడ నగుటచేత ఒకరు మెచ్చుకొంటారు, ఒకరు నొచ్చుకొంటా రనే భావము చొరనీయక నాకు న్యాయమని తట్టిన విధంగా తీర్పు నిచ్చేవాడను.

పై విధంగా ఉద్యోగం నిర్వహిస్తూండగా తలవని తలంపుగా కమీషనరు ఖన్నాగారు తిరిగి మరొక ఉదయం కబురంపారు. ఎందుకై యుంటుందోయని వారి గదిలోకి వెళ్లగా, "చౌదరీ, మీరు హైదరాబాదుకు వెళ్లవలసి యున్నది. హైదరాబాదు స్టేట్ ఇన్ కమ్ టాక్స్ డిపార్టుమెంటును కేంద్ర గవర్నమెంటు తీసుకోబోతున్నది. దానికి ము మ స్థితిగతులు తెలిసికొని ఆ డిపార్టుమెంటుకు పునర్ వ్యవస్థీకరణ చేయాలి. ఒక సీనియర్ ఆఫీసరును, మిమ్ములను స్పెషల్ డ్యూటీకి వేస్తున్నారు. మీ హోదా స్పెషల్ ఆఫీసరు. మీరు త్వరగా బయలుదేరి వెళ్లా"లన్నారు. ఆ విధంగా ఇండియా గవర్నమెంటు నుండి ఆర్డరు వచ్చింది. నేను 1950 మార్చి 6-వ తారీఖున శ్రీ పి. వి. కురివిలాకు 'ఎ' రేంజి ఛార్జి ఒప్పగించాను.

ఎప్పుడో 1919 లో ఒకసారి పనిమీద సికింద్రాబాదు దగ్గర పికెట్ గ్రామానికి వెళ్లానుగాని. హైదరాబాదు ఎరుగను. అక్కడ తెలిసినవా రెవరూ లేరు. మద్రాసువారు వెళ్లమన్నారుగాని ఏ సహాయం అందించలేదు. అక్కడ ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటున్నదని, కమిషనరు అనే వారున్నాడని, వారికి వ్రాయవచ్చని తోచలేదు. అందువల్ల హైదరాబాదు ప్రభుత్వం ఆర్థిక శక్రటరికి. "నేను ఫలనా తారీఖున వస్తున్నాను. నాకు వసతి ఏర్పాటుచేసి, హైదరాబాద్ స్టేషను కెవరినైన పంపం"డని టెలిగ్రా మిచ్చాను.

13-వ ఉదయం సికిందరాబాదు స్టేషన్ చేరుకోగానే ఇద్దరు వచ్చి నన్ను కలసికొన్నారు. ఒకరు ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటు నుంచి. ఆయన "ఇక్కడ మీరు దిగండి, మీకు మేమేర్పాటుచేసిన బసకు వెళ్దాం" అన్నారు. రెండోవారు ఫైనాన్స్ శక్రటరిగారు పంపగా వచ్చినవారు. వారు "మీ టెలిగ్రాం ప్రకారం మేము బస ఏర్పాటుచేశాం. మీయిష్టం, మీరు నాతో వచ్చినా సరే, లేక వారితో వెళ్లినా సరే" అన్నారు. "నేను టెలిగ్రాం పంపినందువల్ల మీరు వచ్చారు. మీతో వస్తా"నని చెప్పి ఆయనతో వెళ్లాను.

నేను, వంటవాడు, సామానుతో ఆయన ననుకరించాము. ఆయన ప్రఖ్యాత అతిథి గృహం, "లేక్ వ్యూ" కు తీసుకు వెళ్లారు. "లేక్ వ్యూ" గెస్టు హౌస్ ప్రముఖ అతిథులకు బస ఏర్పాటుచేసే భవనం. అది చాల రమ్యమైన ఉద్యానవన ముతో విలసిల్లునది. అంతరాలుగా ఏర్పాటుచేసిన పూల మొక్కలు ఒక వింత శోభను సమకూర్చును. విశాలమైన గదులు. మొదటి రకం మంచాలు, కుర్చీలు, బల్లలు, తివాచీలు, కర్టెన్సు వగైరా దాని ఉన్నతస్థాయిని తెలుపును. మిక్కిలి పెద్ద అంతస్తుగలవారికి గాని ఇందులో బస దొరకదు. అప్పుడు ఫైనాన్సు శక్రటరిగా శ్రీ దామోదరరెడ్డిగా రుండినారు. పొర పాటుచేతనో, అభిమానంచేతనో అక్కడ తాత్కాలిక బస ఏర్పాటుచేశారు. ఒక కారణం, దీనికంటె తక్కువ స్థాయి గల "గ్రీన్ లాండ్సు" అతిథి గృహా న్నంతటిని కమిషనరు హోదాగల స్పెషల్ ఆఫీసరు శ్రీ బి. యమ్. సేన్ గుప్తాగారు కుటుంబంతో ఆక్రమించుకొని యుండటమై యుండును.

నేను "లేక్ వ్యూ" లో బసచేయుచున్న రెండోరోజు నను కొందును, కేంద్ర రహస్య పరిశోధన శాఖాధిపతి శ్రీ మల్లిక్, సుప్రసిద్ధ మద్రాసు క్రిమినల్ లాయర్ శ్రీ యతిరాజ్ గారు వచ్చి యుండిరి. ఆరాత్రి నాగది కెదురుగా, లౌంజ్ వంటి ఖాళీలో సోఫా మీద కూర్చొని వా రిరువురు నవ్వుకుంటూ ప్రొద్దుపోయేవరకు బిగ్గరగా మాట్లాడుకొనుచూ, నా నిద్రకు భంగం కలిగించుచుండి నారు. నేను తలుపు తెరచి బయటికి చూచాను. నే నట్లు చూడటం వారు గమనించి, మరునటి ఉదయం యతిరాజుగారు, "మా మాటలు మి మ్మిబ్బంది పెట్టినవా" అని అడిగారు. ఏదో ఒక పెద్దకేసు సందర్భంలో మల్లిక్ గారితో సహకరించటానికి శ్రీ యతిరాజ్ గారు వచ్చియుండవచ్చును. అందువలన వారు ప్రముఖ అతిథులుగా ఎంచబడ్డారు. నేను వారి సంభాషణ కసమ్మతిచూపానని కాబోలు, కొంచెం సేపటికి ఆ అతిథి గృహోద్యోగి వచ్చి న న్నింకొక గదికి మారండని కోరాడు. నేను నిరాకరించాను. నేను అతిథి గృహంలో

వుండినా, గవర్నమెంటు అతిథిని కాను. అందువల్ల డబ్బిచ్చు కొంటిని.

సరే, నే నక్కడ నాలుగు రోజులుండి, అబీద్ రోడ్డులో వుండిన హోటల్ విక్కాజీకి వెళ్లిపోయాను. నన్ను "లేక్ వ్యూ" లో మొదట కలుసుకొన్నవారు శ్రీ ఎ వెంకటాచార్యులు అనే ఇన్ కమ్ టాక్స్ ఆఫీసరు. తన కారులో వచ్చి, నన్నొకటి రెండు సార్లు బయటకు తీసుకొని వెళ్లినారు. ఆయనే నన్ను నా సామానుతో హోటల్ విక్కాజీకి చేర్చారు. ఈ హోటలులో నా కొక పెద్ద గది ఏర్పాటుచేశారు. అదిగాక, వంటచేయించుకొనుటకు నా గదికి సమీపాన వున్న రేకులపెడ్డు నొకదాని నిచ్చారు. నాగది మేడపైన ఒకమూలగా వుండింది. రేకులపెడ్డు మేడమీదనే. నాగది నానుకొని వేరే మేడమెట్లుండినవి. నా వంటవాడు, ఆఫీసు జవాన్లు రాకపోకల కా మెట్లుపయోగించేవారు. గదికి అద్దె రోజుకు 3 రూపాయలు మాత్రమే. ఏవైనా పానీయాలు మొదలైనవి హోటలునుండి తెప్పించుకొంటే, వానికి ప్రత్యేకంగా ఛార్జి చేశారు. వంటవాడు మద్రాసు నుండి బియ్యం, పప్పులు, నేయి మొదలైనవి తెచ్చుకొనియుండినందున కూరగాయలు, పాలు, మొదలైనవి క్యాంపులలో వలెనే కొని తెచ్చేవాడు. శ్రీ రజ్వీ వంటి ఆఫీసర్లు కూడా, ఆ ప్రత్యేక మెట్లనుండి పైకి వచ్చి, మాట్లాడి పోయేవారు. నేను పెద్దమెట్ల నుండే ముఖద్వారంగుండా ఆఫీసుకు, బయటికి వెళ్లేవాడను.

ఇన్ కమ్ టాక్స్ ఆఫీసులు హోటలు కించు మించు ఎదురుగుండా వుండేవి. హోటల్ ముందు పొడుగు పాటి ఆవరణ దాటి అబీద్ రోడ్డుకు రాగా. ఎదురుగా గల్లీ వున్నది. గల్లీకి చివర నొక పెద్ద బిల్డింగు. నిజాని కది మూడు, నాలుగు బిల్డింగులు కలసిన కూటమి. పూర్వ మెవరో నవాబు, ఆయన జనానా, నివసిస్తూండిన కట్టడాలు. ఒక హాలు వంటి గదిలో శ్రీ బి. యమ్. సేన్ గుప్తాగారి ఆఫీసు. అంతకంటె చిన్నదైన ఇంకొక గదిలో నా ఆఫీసు ఏర్పాటు చేశారు. మా యిద్దరిని స్పెషల్ ఆఫీసర్లన్నా, సేన్ గుప్తా కమిషనరు స్థాయి గలవారు, నాది అసిస్టెంటు కమిషనరు స్థాయియే.

అక్కడకు చేరిన కొలది దినములకే నాతో, "మీరు మొఫిసల్ సర్కిల్సుకు వెళ్లి అక్కడ ఎన్నెన్ని కేసులున్నవో, అందులో ఎన్ని వ్యర్థపు కేసులో, సిబ్బంది ఎక్కువో తక్కువో, ఫర్నిచర్ మొదలైన విషయాలు తెలుసుకొని రిపోర్టు ఇవ్వం"డని సేన్‌గుప్తాగారు నన్ను పంపారు. నేను భోన్‌గిరి, పెదపల్లి, వరంగల్లు, నిజామాబాద్, నాందేడు, లాటూరు, ఔరంగాబాద్ సర్కిల్సుకు వెళ్లి, పరిస్థితులను తెలుసుకొని రిపోర్టుల నందిచ్చాను. కాలం చాల నందున వెళ్లవలసిన గుల్‌బర్గా, రాయచూరు సర్కిల్సుకు వెళ్లలేదు.

మొదట వెళ్లింది భోన్‌గిరి (భువనగిరి) సర్కిల్‌కు. అక్కడ ముర్తాజాలీబేగ్ అనే ఆఫీస రుండినాడు. ఆయన యువకుడు. చాలా నెమ్మది, మర్యాద గలవాడు. మాట మిక్కిలి సున్నితం. ఇన్‌కమ్‌టాక్సు వంటి మొరటు పనికి పనికిరాడేమో ననిపించింది. నే నుండిన దొకరోజు. భోజనం వగైరా ఏర్పాటు చేశాడు. ఆ సర్కిల్‌లో అప్పు డుండినవి నాలుగు వందల కేసులే. అందులో సగమైనా పన్ను రాబడి కేసులుకావు. వెంటనే తొలగించవచ్చును. ఇంత తక్కువ పనికి, ఇద్దరు అసిస్టెంటు ఆఫీసర్లు (ఇన్‌స్పెక్టర్సు) వుండేవారు. గుమాస్తాలు ఎక్కువే. కుర్చీలు, బల్లలు వగైరా జాస్తి. ఆ విధంగా రిపోర్టు పంపాను.

పెదపల్లి కూడా చిన్న సర్కిల్. ఇక్కడ, జనార్దనరెడ్డి అనేవారు ఆఫీసరుగా వుండినారు. ఇక్కడ కూడా ఒక రోజే వుండినాను. ఈ సర్కిల్ వివరాలు పూర్తిగా గుర్తులేవుగాని, భోన్‌గిరివలె మిక్కిలి తక్కువ కేసులు, ఎక్కువ సిబ్బంది, జాస్తి ఫర్నిచరు వగైరా వున్నట్లు లేదు. పని చాలా మందకొడిగా జరుగుచున్న ట్లనుకొన్నాను. కొన్ని మార్పులు సూచిస్తూ రిపోర్టిచ్చాను.

వరంగల్లు సర్కిల్ పెద్దది. ఇక్కడిద్ద రాఫీసర్లుండేవారు. శ్రీ ప్రసాదరావు, శ్రీ యస్. వి. సుబ్బారావు. ప్రసాదరావుగారు కొంత అనుభవం గడించి, చాకచక్యంతో వ్యవహరించేవారు.

స్నేహభావం కలవారు. శ్రీ సుబ్బారావు అప్పటి కింకను అను
భవం తక్కువగా వుండినవాడు. వీ రిద్దరు నన్నాహ్వానించి, తగిన
సహాకార మందజేశారు. ఈ ఇద్ద రాఫీసర్లకు ఒకే ఒక ఇన్‌స్పెక్ట
రుండేవాడు. గుమాస్తాలు వగైరా చాలీచాలనట్లుండినా రని
పించింది. ఆఫీసు బిల్డింగు క్రొత్తదైనను, ఇద్దరాఫీసర్లకు చాల
దనిపించింది. కొన్ని పెద్ద కేసు లుండినవికూడా. ఆ విధంగా
రిపోర్టు శ్రీ గుప్తా కందించాను. ఇంకొకటి, ఆఫీసర్లు సరిగా
తమ విధులను నిర్వహిస్తున్నారా అను సందేహం నాకు కలగక
పోలేదు.

ఆఫీసరు సరిగా పనిచేస్తున్నాడా, పన్ను సరిగా వేస్తు
న్నాడా, అవకతవక లేమైనా జరుగుచున్నవా, అను ప్రశ్న
మద్రాసు కమిషనరు ఛార్జిలోని సర్కిల్సు విషయంలోనూ వుండేది.
అన్ని రాష్ట్రాలలోనూ వుంటుంది. అయితే, నైజాం ప్రభుత్వం
ఇన్‌కమ్ టాక్స్ డిపార్టుమెంటు విషయంలో, ఈ సమస్య మిక్కిలి
ముఖ్యమైనది. అక్కడి పనిచేయు, పనినేర్పు స్థాయి మిక్కిలి
తక్కువగా వుండినది. ఆఫీసర్లలో అధిక సంఖ్యాకులకు పని అంత
బాగా తెలిసియుండలేదు. పైగా, పద్ధతులు కొంత భిన్నంగా
వుండేవి. అందువల్లనే, హైదరాబాద్ రాష్ట్రం లోని ఆదాయం
పన్ను విధానాన్ని, భారత విధానాసితో సమన్వయంచేయుటానికి
కొంత మార్పు అవసరమైంది. 1950 కు ముందు, హైదరాబాద్
స్టేటు కొంత స్వతంత్రసత్తా కలిగి యుండింది. ఈ డిపార్టు
మెంటును కూడా, భారతీయ ప్రభుత్వంతో సంబంధం లేకుండానే
ఆ ప్రభుత్వం వ్యవహరించు చుండింది. అందువల్ల సమన్వయం
( ఇంటిగ్రేట్ ) చేయాలని మమ్ము హైదరాబాద్‌కు పంపటం
జరిగింది.

వరంగల్లు అనగా ఖాజీపేట, హానుమకొండ కోట శిధిలా
లకు ముందున్న జనవాసాలు. ఖాజీపేట నుండి కోట శిధిలాల
వరకు, ఏకబారుని వరంగల్లు. అయితే ఖాజీపేట, హానుమ
కొండ మధ్య, కొన్ని ఖాళీ ప్రదేశాలున్నా మొత్తం రెండూ
కలిసి ఒకే పట్టణంగా ఉంటవి. హానుమకొండకు, అసలు

వరంగల్లుకు మధ్య ఇళ్లులేని కొంత దూర మున్నది. అయినా ఈ మూడిటిని కలిపి, ఏకంగా వరంగల్లు అంటారు. ఖాజీ పేటలో ప్రాత సంప్రదాయ సంబంధమైనది, ఇప్పుడు చూడ వల సినది లేదనుకొందును. హనుమ కొండలో అక్కడి దేవా లయం, వేయి స్తంభాల మండపం, నంది చూడవలసినవే. కాని, నిజం చెప్పాలంటే ఇతరులు చెప్పినంత, నే నూహించినంత, గొప్పగా హనుమకొండ వేయి స్తంభాలుగాని, దేవాలయంగాని లేవు. అసలు వేయి స్తంభాలే లేవు. ఒక స్తంభం ఫలకాలు నాలుగుగాని, అంత కంటె ఎక్కువగాని వుంటే, ఎన్ని ఫలకా లున్నవో, అన్ని స్తంభాల క్రింద లెక్క వేశారట. గుడిపైన గాని, క్రింది కప్పుమీద గాని, ప్రాంగణంలో గాని, చెప్పుకో దగ్గ శిల్పం, ఫ్రెస్కోసు లేవు. గర్భగుడి గాని, దేవతా విగ్రహాలు గాని ఆశ్చర్యాన్ని కొలిపేవి కావు. ఒక్క నంది మాత్రం గొప్పగా చెప్పుకోతగ్గది. దాని చెవులను ఏ మహోన్మాదులో, దురంతరులో, విరగగొట్టివేసినా మిక్కిలి ఠీవితో, పెద్ద సైజులో, ప్రాణ ముట్టిపడేట ట్లుంటుంది. అయితే, సజీవంగా వున్నట్లున్నది అనటానికి, రామప్ప దేవాలయములోని నందికి చాలదు.

వరంగల్లు కోటకు వెళ్లాం. బహిర్ప్రాకారం శిథిల గేటు గుండా, రోడ్డు వెంటనున్న కొన్ని సామాన్య గృహాలను దాటి, కోట శిథిలాలనుచూచి సంతప్త హృదయుడనైనాను. యుద్ధభూమిలో తెగి ప్రోగుపడియున్న శవాల ముక్కలు లాగు, ఒక పెద్దస్థలంలో రకరకాల ఆభరణాలు, శిరస్త్రాణాలు మొదలైనవి చెక్కబడిన విగ్రహాల బాహువులు, తొడలు, మెడలు, శిరస్సులు, కాళ్లు, పాదాల తుండాలను, ముక్క చెక్కలను చూచి, వాని శిల్ప నైపుణ్యానికి ఆశ్చర్యపడ్డాను. ఈ శ్మశానంలో ఉసూరుమంటూ, ఏకాకిగానున్నట్లు, నాలుగువైపుల నిలబెట్టబడియున్న బ్రహ్మాండ మైన సింహద్వారాలను చూచి, వానిమీద చెక్కిన బొమ్మల తోరణాలను గమనించి, ఇంతటి గొప్పశిల్పం ఈవిధంగా నాశనమై యున్నదే అని పరితపించాను.

ఈ ప్రదేశమంతా వరి పండించటానికి అనుకూలమైన ప్రదేశం. కోట కనతిదూరంలోనే, పెద్ద చెరువుండేదట. దాని సంగతేమోగాని, రామప్ప, పాకాల చెరువులు మిక్కిలి పెద్దవి. వేలకొలది ఎకరాలకు నీరు అందించుచున్నవి. వీని నాధారంగా కాకతీయులు వరిని పుష్కలంగా పండించేవారట. కాకతీయ మహా సామ్రాజ్యానికి కేంద్రమైన వరంగల్లుకు భోజన పదార్థాలు, కొల్లలుగా వుండేవట. లేకపోతే ఆ ప్రాంతంలో సామ్రాజ్యస్థాపన కవకాశ మెట్లుండేది?

కాకతీయులు కమ్మవా రనుటకు కొన్ని చారిత్రాత్మకాధారాలున్నవంటారు. కాకతీయ గణపతిదేవుని భార్యలిద్దరు జాయపసేనాని సోదరీలట. జాయపసేనాని కమ్మవంశస్తుడంటారు. అయితే ఆ రోజుల్లో కమ్మ, రెడ్డి, వెలమ, కాపు అనే కులాలు విస్పష్టంగా ఏర్పడియుండక, ఒకే కులంగా వ్యవహరించేవా రనుకొందును. వీరందరిని కలిపి పద్మనాయకులనే వారని అభిప్రాయం. అయితే రెడ్లు పద్మనాయక కులస్తులు కారని, రాష్ట్రకూటు లని చెప్పబడుచుండిన తెగ వారని ఒక వాదన.

ఇంకొక ప్రక్కగా నిజామాబాద్, నాందేడు, లాటూరులకు వెళ్లాను. పైవలెనే, ఇక్కడకూడా, ఆఫీసు పరిస్థితులు, కేసుల స్వభావాలు వగైరా తెలుసుకొని రిపోర్టుల నిచ్చాను. నిజామాబాద్ ప్రాంతం నీటి వసతులతో, వరి సాగుకు పనికివచ్చే భూస్థితి కలది. వరి బాగా పండుతుంది. చెరుకు వేయటానికి అనుకూలం. ఈ జిల్లాలోనే బోధన్ వద్ద పెద్ద పంచదార ఫ్యాక్టరీ వున్నది మా బంధు వొకడు ఆఫ్యాక్టరీలో పనిచేస్తూండినాడు. అక్కడకు వెళ్లి ఆయనను, కుటుంబాన్ని చూచి వచ్చాను. నాందేడు, లాటూరు మెట్ట ప్రాంతాలు. ముఖ్యంగా లాటూరులో ప్రత్తిని పండిస్తారు. ఇక్కడ కొన్ని జిన్నింగు మిల్లుండినవి.

నిజాంబాద్‌లో తగినన్ని పన్నునిచ్చే కేసు లుండినవిగాని, నాందేడ్, లాటూరు సర్కిల్సు చిన్నవి. ఆఫీసు బిల్డింగు నిజాంబాద్‌లో ఫరవాలేదు. తతిమ్మా రెంటిలోనివి చిన్నవి. నే నీప్రాంతానికి వెళ్లునప్పటికి ఏప్రిల్‌లో ఎండలు ముదురుచుండినవి. నిజాం

బాద్‌లో ఎండ తీవ్రత లేదుగాని నాందేడ్, లాటూరులో ఎండ చిర్రెత్తించింది. ఆఫీసు బిల్డింగులు దుమ్ముకొట్టుకొని వుండినట్లు బోసిపోయిన ట్లుండినవి. ఆ రెండు ప్రదేశాలు ఒకేరకమైన పరిస్థితులు గలవి. ఆ రెండు ఆఫీసులను కలిపి ఒకే సర్కిల్ గా రూపొందిస్తే బాగుంటుం దని, సరిపడిన పనిలో ఆఫీసరు ప్రమోషను కాసించి చురుకుగా పనిచేయటాని కాస్కారముంటుందని తోచింది.

నాందేడు, లాటూరు ప్రాంతంలో నేను చిక్కని పొట్టి కర్రెద్దులను చూచాను. ఇవి బలిష్ఠంగా, రాపిడికి తట్టుకొనేవిగా నాకు తోచింది. ఒకటి, రెండు జతలను పెడసనగల్లుకు పంపు దామా అనిపించింది.

నిజామాబాద్‌లో వుండగా నాకు బొడ్డుక్రింద లేచిన కురుపు (సెగగడ్డ) నన్ను బాధపెట్టింది. ఆ సర్కిల్ ఆఫీసరుగా శ్రీ రజ్వీ ఉండినారు. ఆయన నన్నొక ప్రైవేటు మెడికల్ ప్రాక్టీషనర్ వద్దకు తీసుకొని వెళ్లారు. ఆ డాక్టరు కూడా ముస్లిమే. చాలా మర్యాదస్తుడు. చురుకైనవాడు. వెంటనే కురుపు చీల్చి, చీము తీసివేసి కట్టుకట్టినాడు. త్వరలోనే పుండు మానింది.

## ఔరంగాబాద్

ఇది ప్రఖ్యాత నగరం. ఇది హైదరాబాద్‌కు 300 మైళ్ల పైచిలుకు దూరంలో వున్నది. ఇది, మరొకప్రక్క హైదరాబాదుకు 90 మైళ్ల దూరాన వున్న వరంగల్లు, హైదరాబాద్ స్టేటులోని ప్రముఖ మఫిసల్ పట్టణాలు. ఇక్కడి వాతావరణం శీతలం. వేసవిలో సమశీతోష్ణముగాను, శీతాకాలములో మిక్కిలి చలిగాను వుండును. ప్రముఖ మొగలుచక్రవర్తి ఔరంగజేబు పేరు పెట్టబడిన పట్టణం. ఆగ్రా టాజ్‌మహాల్ వలె, ఔరంగజేబు భార్యలలో నొకరి సమాధి ఇక్కడ వెలిసింది. దీనిని దక్షిణ టాజ్‌మహాల్ అంటారు. ఇక్కడి నుండి 60 మైళ్లలో ప్రపంచ ప్రసిద్ధిగన్న అజంతా గుహాలు, 90 మైళ్లలో యోగి సాయిబాబా సిద్ధి పొందిన షిరిఢి, 14 మైళ్లలో ప్రపంచ ప్రసిద్ధిపొందిన ఎల్లోరా గుహాలు, ఎల్లోరా గుహాలకు వెళ్లే త్రోవలో ఫుల్దాబాద్‌లో

ఔరంగజేబు సమాధి వున్నవి. ఇక్కడ టూరిస్టు యూరపి యనుల కనుకూలమైన మంచి హోటలున్నది. నేను ఈ క్యాంపులో షిరిడీకి గాని, అజంతా గుహాలకు గాని వెళ్లలేదు. ఎల్లోరా గుహాలకు వెళ్లాను. వానిలో, కైలాస్ గుహ అద్భుత మైనది. పెద్ద కొండనుండి ఒక భాగాన్ని విడగొట్టి, విడగొట్టిన భాగాన్ని పైనుండి క్రిందకు చెక్కి, ఏక రాయి దేవాలయంగా రూపొందించారు. దేవాలయంపై చెక్కబడిన శిల్పా లన్నీ, శివ సంబంధమైనవి. అందువల్ల దానిని కైలాసమని, ఆ గుహకు కైలాస గుహ అని పేరు వచ్చింది. అది గుహాగా వుండదు. దేవాలయంపైన చుట్టూ బహిరంగంగా వుంటుంది. దేవాలయం రెండు ప్రక్కల వరండాలు, వెనుకప్రక్క కొండ, ముందు ఆవరణ, అందులో కొన్ని శిల్పాలు (పెద్ద ఏనుగు చెక్కడం ఇందులోనే వుందనుకొందును). ముందు పెద్ద దర్వాజా. ఒక వరండాలో మూడు మిక్కిలి సుందరమైన స్త్రీ విగ్రహాలున్నవి. దేవాలయాన్నానుకొని పెద్ద మండపమున్నది. దాని పై కెక్కుటకు మెట్లున్నవి. నిజాని కామండపం, పైఅంతస్తు కలిగి రెండు భాగా లుగా నున్నట్లు గుర్తు.

ఇతర దేవాలయా లున్నవి. చాలావరకు బుద్ధుని సంబంధ మైనవికాని, ఒకటి రెండు మహావీరుని (జైన) సంబంధమైనవని గుర్తు. అన్ని గుహాలు, కొండ గుట్టల్లో తొలచబడ్డవి. ఆ ప్రాంత మంతా మనోహరంగా వుంటుంది. ఈ గుహాలు కొన్ని దూర దూరంగావున్నవి. మొదటి గుహానుండి చివరి గుహావరకు, కొంచె మెచ్చు తగ్గులుతో ఏకబారుగా నుండును.

ఫుల్డాబాదులో ఔరంగజేబు సమాధిని చూచాను. మహా సమ్రాట్టు, అంఘీర్ పాదుషా, ఔరంగజేబ్ ఎంతక్రూరుడో, సామ్రాజ్య కాంక్షాపరుడో, భ్రాతృహంతకుడో, ఎంత మతోన్మా దియో అంత నిరాడంబరజీవి. అమేయ సిరి సంపదలతో నిండిన వాడైనను, తన జీవనోపాధికి, తలకుపెట్టుకొనే చిన్నగుడ్డటోపీలను స్వయంగా కుట్టి అమ్మించేవాడట. ఆకథను నమ్మించుటకో అన్నట్లు, ఫుల్డాబాదులో అతి సామాన్యమైన సమాధిని ఏర్పరచు కొన్నాడు. ఆయనను ఖననం చేసినది బహిరంగస్థలంలో. దానిని

చూపిస్తే నమ్మలేకపోయాను. షాజహాన్ కట్టిన గుర్తుకు, కొంచెం దిబ్బగా ఏర్పరచి నట్లున్నది. పైన కప్పు లేదు. ఇక నే ఆడంబరం లేదు. విశాలమైన ఆవరణకు మాత్రం ప్రహరీ ఏర్పరచబడివున్నది గాని, సమాధిచుటూ సంరక్షణ లేదు. పిట్టగోడ కూడా లేదు. ఆలంఘీర్ పాదుషావారి కోరిక ప్రకారం, ఆయన సమాధి నా విధంగా ఏర్పరచారట.

ఔరంగాబాద్‌లో యిద్దరాఫీసర్లుండినారు. ఒకరు వయస్సు మళ్లినవారు, రెండవ వారు యువకులు. నేను ముందుగా నా ప్రోగ్రాం పంపించి యుండినా, యువకుడైన రెండవ వారు, నే నచ్చుటకు చేరుటకు కొద్దికాలంముందే, సమీప ప్రదేశానికి క్యాంపుకు వెళ్లిపోయాడట. ఊరిలో వుండిన వయసు మళ్లిన ఆఫీసరుకూడా, నన్ను ఆహ్వానించుటకు స్టేషనుకు రాలేదు. తన కారును ఇన్‌స్పెక్టరుతో పంపినాడు. రెండవ ఆఫీసరు క్యాంపుకు వెళ్లి పోయాడని తెలిసి, నేను చిరాకుపడి, వెంటనే తిరిగి రమ్మని టెలిగ్రా మిప్పించాను. కొన్ని గంటలకే తిరిగి వచ్చి కనపడి నాడు. గట్టిగా చివాట్లు పెట్టాను. నేను వచ్చేటప్పు డిలా వెళ్లి పోవటం అవిధేయతని మందలించాను. అతడు సింధీయుడు. మెహతా అనే పేరు గలవాడు. తర్వాత అతడు నా వెంట వుండి ఎల్లోరా గుహలు మొదలైన వానిని చూపించినాడు. పెద్ద ఆఫీసరు నేను బంగళాకు చేరుకొన్న కొంచెం సేపటికి వచ్చి కలసి కొని, తన కుబ్బసం వగైరావల్ల అనారోగ్యముగా వుండినందున, ఉదయం స్టేషనుకు రాలేక పోయినానని క్షమాపణ చెప్పు కొన్నాడు.

అక్కడి ఆఫీసు బిల్డింగు అనుకూలమైనది గానే కనపడింది. ఇద్దరు ఆఫీసర్లకు తగిన పని వుండింది. ఇతర ఆఫీసుల విషయం వలెనే, ఇక్కడ కూడా సంగతి సందర్భాలు తెలిసికొని, రిపో ర్టిచ్చాను.

1950 లోని హైదరాబాదు నాకు క్రొత్తనిపించింది. అప్పటికి, సర్కారు్స, రాయలసీమ నుండి, తెలుగువారు చేరలేదు. 1956 నవంబరుకుగాని, ఆంధ్రప్రదేశ్ అవతరించలేదుకదా! వేష

భాషలు, పద్ధతులు వగైరా నచ్చలేదు. పైగా మొదటినుండి, అప్పటి హైదరాబాద్ కమిషనర్, శ్రీ దిల్‌శుక్‌రాంగారు ముభావంగానో, అయిష్టంగానో వుండినారు. నేను తనమాటను కాదని, "లేక్ వ్యూ" కు వెళ్లటం, వారు స్టేషనుకు పంపియుండిన ఆఫీసరు చాడీలవల్ల పొగరుబోతుతనంగా ఎంచి యుండవచ్చును. సర్కారీయుడు, ఈ ప్రాంతాల్లో ఆఫీసరుగావుండి రిటైరైనతర్వాత, అక్కడ ఆఫీసరుగా చేరిన శ్రీ సింహాద్రాచారిని, హైదరాబాదు ఆఫీసర్లు నిరసించుచుండగా, వారిని నేను గట్టిగా మందలించాను. వారు దిల్‌శుక్‌రాంగారితో కొండెములు చెప్పియుంటారు. సింహాద్రాచారిగారు ఛాందసుడు. అక్కడి పద్ధతులను అర్థం చేసుకోలేదు. జోహుకుం అని సలాములు పెట్టటం చేతకాలేదు. ఇతర ఆఫీసర్లతో తగాదాపడేవాడు. ఆ యాకారణాలవల్ల కమిషనరుగారి అసంతృప్తికి గురైనాడు. ఆయనగారిని సమర్థించి, వెంటవేసుకురావటం, దిల్‌శుక్‌రాంగారికి, నాయందు వ్యతిరేక భావాన్ని కలిగించింది. కమిషనరుగా ఉద్దేశింపబడిన, శ్రీ బి. యమ్. సేన్‌గుప్తాగారు ముభావంగా వుండిపోయారు. నేను వారింటికి వెళ్లి, "మీరు నేను, భారతప్రభుత్వం ఇన్‌కమ్ టాక్సు డిపార్టుమెంటులో పెరిగాం. హైదరాబాద్‌వారికి మనయందు సానుభూతి వుండదు. నేను అసిస్టెంటు కమిషనర్‌గా మీకు పూర్తి మద్దతిస్తాను. నామీద దిల్‌శుక్‌రాంగారికి, శ్రీ సింహాద్రాచారినిబట్టి గుర్రుగా వున్నది. మీరు నాకు సపోర్టివ్వం"డని కోరాను. తాను క్రొత్తవాడగుటచేతనో అక్కడ పాదుకొని వున్న దిల్‌శుక్‌రాం మొదలైనవారి అభిమానాన్ని చూరగొనటానికో, లేక స్వభావంచేతనో శ్రీ గుప్తా నాకు ప్రోత్సాహమివ్వలేదు.

శ్రీ దిల్‌శుక్‌రాంగారు బ్రహ్మక్షత్రియ కులస్థులట. వారి పూర్వులు ఉత్తరభారతంనుండి వలసవచ్చి, హైదరాబాదులో స్థిరపడిపోయారు. కొన్ని తరాలనుండి నైజామ్ నౌకరిలో వుండినారట. వారు కస్టమ్స్ కలెక్టరుగాను, ఇన్‌కమ్‌టాక్సు కమిషనరుగాను ఉండినారు. మనిషి సరసుడే. చిరునవ్వుతో మాట్లాడే స్వభావంకలవాడే. కాని, హైదరాబాదీయుల మనే దురభి



హైదరాబాద్ ఇన్‌కమ్‌టాక్స్ కమిషనర్ శ్రీ దిల్‌శుక్‌రాం వీడ్కోలు - 1950

కుర్చీమీద కూర్చున్నవారు : 3. శ్రీ డి. రామచంద్రరావు, 4. గ్రంథకర్త, 5. శ్రీ బి. ఎం. సేన్‌గుప్త, 6. శ్రీ దిల్‌శుక్‌రాం 7. శ్రీ రామస్వామి అయ్యంగార్, 8. శ్రీ హామీదు మీర్జా



మద్రాసులో ఇన్‌కమ్‌టాక్సు యసోసియేషన్ల ఫెడరేషన్ సమావేశం - 1951-52

కూర్చున్నవారు : 2. శ్రీ గోవిందమీనన్, 4. శ్రీ ఛటర్జీ - ప్రెశిడెంటు, 5. గ్రంథకర్త, 7. శ్రీ ఎన్. హెచ్. నక్వీ, 8. శ్రీ ఎం. ఎస్. అయ్యర్



మద్రాసు ఇన్‌కమ్‌టాక్సు కమిషనరీ గ్రూపు - 1945

కుర్చీమీద కూర్చున్నవారు : 2. శ్రీ అజీముల్లా, 4. శ్రీ చడా, 5. శ్రీ ఎ. ఎన్. నారాయణ అయ్యాగార్ 6. శ్రీ టి. ఆర్ముగం మొదలియారు 7. శ్రీ పి. వి. శ్రీనివాసాచారి, 8. శ్రీ డబ్ల్యు. ఇ. క్లార్కు ( కమిషనరు ) 9. శ్రీమతి క్లార్కు, 10. శ్రీ వరదాచారి 11. శ్రీ పి. డి. స్వామినాథ మొదలియారు, 12. శ్రీ గోవిందనాయర్, 13. శ్రీ హెచ్. గోపాలస్వామినాయుడు, 15. శ్రీ అజరయ్య



విజయవాడ ఆఫీసర్ల క్లబ్బు - 1941

కూర్చున్నవారు : 3. శ్రీ ఆలీబేగ్, 4. శ్రీ జాన్ సన్, ౫. శ్రీ డాక్టరు ఇ. సోమశేఖర్, 7. గ్రంథకర్త,

నిలుచున్నవారు : 4. శ్రీ కనకబాపయ్యా, 7. శ్రీ ఆచార్య

మానం, తన ఉద్యోగులనే అభిమానం, గొప్ప సంప్రదాయం, గొప్ప అధికారం కలవార మని, తమ పద్ధతు లుత్తమమైనవనే దురహంకారం కలవారు. అది కనపడీ, కనపడనట్లు వర్తించే వారు. నేను వచ్చివేసేటప్పుడు వారింటికి వెళ్లి, సెలవు తీసుకొన్నాను. తేనీరది ఇచ్చి ఆదరణతో సాగనంపారు.

శ్రీ దిల్‌శుక్‌రాం గారి కుటుంబం కొన్ని తరాలుగా హైదరాబాద్‌లో స్థిరపడిపోయింది. వారందువల్ల, "నేను హైదరాబాదీయుడను, నైజాం రాష్ట్ర పౌరుడను కాబట్టి అక్కడి ఉద్యోగాలకు గాని, పెంపుదలకు గాని, ప్రాముఖ్యానికి గాని నే నర్హుడను. బయటినుండి వచ్చినవారికీ సౌలభ్యాలు, అవకాశాలుండ కూడ"దనేభావముండుటలో నాశ్చర్యపడుట అనవసరమని అప్పుడు జరిగిన సంఘుట నొకటి తెలుపుచున్నది. కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా, గరికపాడు గ్రామంలో గడ్డిపాటి శ్రీరాములుగారనే కమ్మరైతుండినాడు. ఆయన కుమారుడు సుబ్బారావు సికిందరాబాద్ పికెట్టులో మేనమామలవద్ద వుంటూ చదువుకొన్నాడు. ఇంగ్లండు వెళ్లి యఫ్. ఆర్. సి. యస్. డిగ్రీని పొంది సర్జనైనాడు. సికిందరాబాద్ గాంధి ఆస్పత్రిలో పనిచేస్తూండేవాడు. మాటల సందర్భంలో, "మీ రెందు కిక్కడకు వచ్చా ?" రని, గతిలేక నేనక్కడకు వెళ్లినట్లు భావంతో నన్నడిగారు. నేను చాలా ఆశ్చర్యపడి, నొచ్చుకొన్నాను.

నే నక్కడనుండి తిరిగి మద్రాసు రాష్ట్రానికి పోవాలనే కాంక్ష, అక్కడి అననుకూల వాతావరణమే గాకుండా, 1950 మే నెలారంభంనుండి అఖిల భారత ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటులో భాగంగా హైదరాబాదు డిపార్టుమెంటును కలిపివేసే సందర్భంగా శ్రీ గుప్తాగారిని, శ్రీ దిల్‌శుక్‌రాంగారి స్థానే కమిషనరుగాను, నన్ను అసిస్టెంటు కమిషనరుగాను నిర్ణయించియుండిరి. అయితే, మొదట అనుకొన్నదానికి భిన్నంగా, నన్ను రెండో ఇన్‌స్పెక్టింగు అసిస్టెంటు కమిషనరుగా వేశారు. మేము వెళ్లినప్పటికి శ్రీ హమీద్ మీర్జా ఇన్‌స్పెక్టింగ్ అసి

స్టెంటు కమిషనరుగాను, శ్రీ కె. రామస్వామి అయ్యంగారు అప్పిలేట్ అసిస్టెంటు కమిషనరుగాను వుండినారు. సెలవుమీద వెళ్లిన శ్రీ రామస్వామి అయ్యంగారు తిరిగి పనిలో చేరడని ఎంచబడింది. అందువల్ల హామీద్ మీర్జాగారిని అప్పిలేట్ అసిస్టెంటు కమిషనరుగా నియమించి, నన్ను ఇన్‌స్పెక్టింగు అసిస్టెంటు కమిషనరుగా నిర్ణయిస్తారని తలంచాము. కాని, తీరా రామస్వామి అయ్యంగారు పనిలో చేరతా నన్నాడు. (వీరికి దిల్‌శుక్‌రాం గారి ప్రోత్సాహ ముండినదేమో చెప్పలేను) అందువల్ల ఇన్‌స్పెక్టింగు ఛార్జిని రెండుగా విభజించి, నా కర్థ ఛార్జి మాత్రమే ఇచ్చారు. ముఖ్యభాగాన్ని శ్రీ హామీద్ మీర్జాగారికిచ్చారు. దానికి నే నొప్పుకోలేదు. అందువల్ల, బోర్డు మెంబరుగా వుండిన శ్రీ కె. గోవింద నాయరుగారిని వేధించి, మద్రాసుకు మార్పించుకొన్నాను.

శ్రీ హామీద్ మీర్జాగారు చాలా ఉత్తములు. మిక్కిలి పెద్దమనిషి. సరసులు. మర్యాదస్థులు. వారి తండ్రినాటినుండి జాతీయవాదులు. వారిని తర్వాత ఒకటి రెండు సార్లు కలసికొని సంతోషించాను. హైదరాబాద్‌నుండి వెళ్లేటప్పుడు వా రింటికి వెళ్లి వారివద్ద సెలవు తీసుకొన్నాను.

అక్కడున్న కొలదికాలంలో (13-3-50 నుండి 30-4-50 వరకు) హైదరాబాద్ సమీపానవున్న గార్డెన్సు, నిజాంసాగర్, చార్‌మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం వగైరా చూచాను. రెండు షేర్వానీలు, చుడాగర్ లాగులు కుట్టించుకొన్నాను. ఒక షార్క్‌సిల్కు షేర్వానిని మాత్రం ఒకసారి మద్రాసు జిమ్‌ఖానా క్లబ్బు వేడుకలో ఉపయోగించాను.

అక్కడి ఆఫీసర్లు డి. బి. రామచంద్రరావు, ఎ. వి. (వెంకట) చారి. రజ్వీలతో ఎక్కువపరిచయం కలిగింది. శ్రీ రామచంద్రరావు తెలివితేటలు కలవారు. తరచు విషయాలు తెలుసుకొనటానికి ప్రయత్నించేవారు. శ్రీ వెంకటాచారి శ్రమపడటం కన్నా, చాకచక్యంతో పనులు జరుపుకొనేవారు. శ్రీ రజ్వీ పక్కా హైదరాబాదీయుడు. వినయవిధేయలతో ప్రవర్తిస్తూ, కార్యాన్ని సాధించు



విజయవాడ ఇన్‌కమ్‌టాక్స్ అప్పిలేట్ రేంజి - గ్రూపు ఫొటో - 1952

కూర్చున్నవారు : 2. శ్రీ కె. జగన్నాథరాజు, 3. శ్రీ కె. టి. ఎల్. నరసింహం, 4. శ్రీ ఆర్. కోదండరామన్.
5. గ్రంథకర్త, 6. శ్రీ హమీద్ మీర్జా, 7. శ్రీ కె. సూర్యారావు

కొనేవాడు. ఇంకొకరు పెద్దవంశస్తుడు, బేగ్ అనేవాడుండేవాడు. ఆయన చాలా మర్యాదస్తుడు. నేను హైదరాబాదునుండి వెళ్లిపోవు సందర్భంగా ఆయన ఇంటిలో, నాకొకరాత్రి ఆతిథ్య మిస్తూ కొంతమంది ఆఫీసర్లను పిలిచాడు. అక్కడొకవిషయం, నాకు కొంత క్రొత్త అనుభవాన్ని కలిగించింది. కూజానుండి గ్లాసులో ఇచ్చిన చల్లని మంచినీరును, కొంత త్రాగిన తర్వాత పారబోసి, తిరిగి కూజానుండి నీ రిచ్చారు. ఇటుతిరిగి చూడగా, కొన్ని కూజాలు వరుసగా పెట్టియున్నవి. చల్లదనం తగ్గుతుందని తరచు నీటిని మార్చారు. 'లా' బాగా చదువుకొన్న ఇంకొక ఆఫీసరు, మహమ్మద్ గులామ్ అనేవా రుండేవారు. ఆయన అసిస్టెంటు కమిషనరు శ్రీ హమీద్ మీర్జాకు సహాయపడుతూండేవాడు. ఘౌస్ మొహిద్దీన్, రుస్తుమాలి అనేవారు సర్కారు జిల్లాలవారు. ఇతరు లుండినారు కాని, వారిపేర్లు జ్ఞాపకానికి రావటంలేదు.

రుస్తుమాలీగారు నా యందభిమానంగా వుండేవారు. వారిని తిరిగి ఒకటి రెండు సార్లు కలసికొన్నాను. ఈ ఇద్దరు ఈ ప్రాంతాల వారే. శ్రీ ఘౌస్ మొహిద్దీను బెజవాడలో ఇన్‌స్పెక్టరుగా పని చేశారు. శ్రీ రుస్తుమాలీ గుంటూరులో పనిచేసియుండినారని గుర్తు.

జవాన్లు వట్టి సోమరిపోతులు. చెప్పిన పనిని సకాలంలోగాని, తృప్తిగాగాని చేసే రకంకాదు. పేర్లు జ్ఞాపకంలేవు సరికదా, ఇప్పుడు ముఖాలనైనా గుర్తుపట్టలే ననుకుంటాను.

నేను హైదరాబాదులో వుండింది స్వల్పకాలం. అందులో కొంతభాగం బయటికి వెళ్లటంతో సరిపోయింది. పైగా వాతావరణం క్రొత్త, మనుష్యులు క్రొత్త, పద్ధతులు క్రొత్త. అధికారం తగ్గించబడింది. అసిస్టెంటు కమిషనరుగా ఛార్జి తీసుకొనకముందే అక్కడనుండి బయలుదేరాను. అక్కడి స్పెషల్‌డ్యూటీ ఉద్యోగాన్ని 30-4-1950 తో ముగించుకొని పెట్టె, బేడ సర్దుకొని, మద్రాసుకు తిరిగివెళ్లి నేను ఛార్జి ఒప్పగించియుండిన శ్రీ పి. వి. కురివిలానుండి, 'ఎ' రేంజి అప్పిలేటు అసిస్టెంటు కమిషనరుగా తిరిగి ది 11-5-1950 న ఛార్జి తీసుకొన్నాను.

పూరు (8) వేలూరు (9) ఈరోడ్డు (10) బళ్లారి (11) నెల్లూరు (12) బెంగుళూరు (13) మైసూరు. బెజవాడ రేంజిలోని సర్కిల్సు ఇవి (1) ఏలూరు (2) బందరు ( మచిలీపట్టణం ) (3) కాకినాడ (4) విశాఖపట్టణం (5) విజయనగరం (6) భీమునిపట్నం (7) బాపట్ల

కాంచీపురం క్యాంపు విషయాలంతగా గుర్తులేవు. శ్రీ రత్నసభాపతి ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగా కొంతకాలముండినారని, వారిని అక్కడొక క్యాంపులో కలసికొన్నానని గుర్తుకు వస్తున్నది. ఏ ఆడిటరు లేక వకీలు హాజరైనది సరిగా గుర్తులేదు గాని, శ్రీ కె. వి. నరసింహన్ హాజరైనారేమో అనుకొంటాను. బాగుగా గుర్తున్నది అక్కడి పట్టు చీరెల నేత, వ్యాపారం, దేవాలయాలు. కంచి పట్టు చీరెలు చాలా ప్రసిద్ధికెక్కినవి కదా! క్యాంపునకు వెళ్లిన ఆఫీసరు భార్య ఏ ఒక్క చీరైనా కొనకపోతే ఊరుకుంటుందా? క్యాంపుల్లో కొనటమటుంచి, నా భార్య, ఆమె తరఫు బంధువులు ప్రత్యేకంగా రెండు మూడు సార్లు కంచికి వెళ్లి పట్టు చీరెలను జాస్తిగానే కొన్నారు. స్త్రీలకు కంచి స్వర్గలోకం అవగా, భక్తులకది మోక్షలోకం. ఒక్క ప్రదేశంలో, అక్కడున్నన్ని దేవాలయాలు కాశీలో తప్ప ఇంకొకచోట లేవని నాఅభిప్రాయం. సామాన్య దేవాలయాలు కావు, గొప్ప దేవాలయాలు. అందులో ముఖ్యంగా పేర్కొనవలసినవి—ఏకామ్రనాథ ( ఏకాంబరేశ్వర ) దేవాలయం, శ్రీ వరదరాజస్వామి దేవాలయం. ఇవి మిక్కిలి పెద్ద దేవాలయాలు. దేవాలయమంత పెద్దది కాకపోయినా కంచికి అఖిల భారత ఖ్యాతిని తెచ్చింది, కామాక్షి అమ్మవారు. ఆమె కామకోటి పీఠం. కంచి విష్ణు కంచి, శివ కంచి అని రెండు భాగాలుగా వ్యవహరింపబడుచున్నది. విష్ణు కంచిలో పైజెప్పిన వరదరాజస్వామి దేవాలయమే గాక, వామనావతార దేవాలయం, అష్ట భుజ విష్ణు దేవాలయం వగైరా దేవాలయాలున్నవి. శివ కంచిలో ఏకాంబరేశ్వర దేవాలయం, కామాక్షమ్మ దేవాలయమే గాక సత్యవ్రతేశ్వర దేవాలయం, శివతాండవ దేవాలయం వగైరా ఉన్నవి. పైగా చిత్రగుప్తునిపేరొక దేవాలయం, అగస్త్యమునిపేరొక దేవాలయం ఉన్నవి. కంచిలో మొత్తం

ఇరవైకి మించిన దేవాలయాలున్నవి. అందుకనే కాబోలును దీనిని దక్షిణ కాశి అంటారు.

శ్రీ వరదరాజస్వామి దేవాలయం కొంత ఎత్తులో వున్నది. స్వామివారి తేజోవంతమైన విగ్రహం నిలుచుండిన ఎత్తైన విగ్రహం. కొన్ని ద్వారాలు దాటి వెళ్లాలి వారి దర్శనార్థం. ఈ దేవాలయం కొన్ని ప్రాకారాలు కలదిగా తోచింది. మొదటి ప్రహరీ తర్వాత అనుకొందును మంచి తటాకం, పూల తోటలు ఉన్నవి. అన్నిటికంటె ఎక్కువ ఆకర్షించేది వేయి స్తంభాల మంటపం. దీనిలోని విగ్రహాలు మిక్కిలి నైపుణ్యంగా చెక్కబడినవి. నా కిప్పటికిని బాగుగా గుర్తున్నవి రౌతు లెక్కిన గుర్రాలు. అవి పెద్దవే గాక రౌతు, గుర్రం జీవకళతో ఉట్టిపడుచుంటవి.

ఏకాంబరేశ్వర దేవాలయం రెండు ప్రాకారాలు మాత్రమే కలిగియున్నదని గుర్తు. మొదటి ప్రాకారం ముఖద్వారాన మిక్కిలి ఎత్తైన గోపుర మున్నది. స్వామివారి కెదురుగా పెద్ద నిడుపైన హాలు ( వెస్టిబ్యూల్ ) దాని నిండా విగ్రహాలు వగైరా ఉండినవి. స్వామి ఇసుక లింగ స్వరూపు డట. అందువల్ల అభిషేక ముండదు. గర్భగుడి నానుకొని మామిడిచెట్టు వున్నది. దీనిని భక్తితో పూజింతురు. శివుని శాపంవల్ల భూమికి వచ్చిన పార్వతి, ఈ చెట్టుక్రింద శివునిగూర్చి తపస్సు చేసిందట. ఈ చెట్టుకు 4 కొమ్మలు. ఏ కొమ్మ కా కొమ్మకు ప్రత్యేక రుచి గల పం డ్లుంటవని, ఆకులు భేదంగా వుంటవని అంటారు.

కామాక్షి అమ్మవారి విగ్రహం మిక్కిలి తేజోదీప్తంగా ఉంటుంది. ఈమె కామకోటి పీఠాని కధిదేవత, ఈ పీఠం, శ్రీచక్రం మీద అమ్మవారి కెదురుగా స్థాపించబడింది. అమ్మవారు గాయత్రి మండపాసీనులట. ఆమె పరాశక్తి అని, సరస్వతి, లక్ష్మి, పార్వతి ఆమె కన్ను లని గాధ. కామకోటి పీఠ ప్రస్తుతాధ్యక్షులు శ్రీ చంద్రశేఖర జగద్గురు శంకరాచార్యులవారు మిక్కిలి ప్రఖ్యాతి నొందిన విద్యాధికులు, జ్ఞానమూర్తులు. అప్పీలున్ను మధ్యరకం. సాధారణంగా చిన్నరకం, మధ్యరకాల అప్పీలున్నే

సర్కిల్సు కేంద్రాలలో విచారించేది. గడ్డు కేసులను మామూలుగా హెడ్ క్వార్టర్సులో విచారణ జేస్తారు.

కడలూరు క్యాంపు ప్రతి సంవత్సరం ఉండేది. ఇది సముద్ర తీరప్రాంతం. వాతావరణం బాగా వుంటుంది. సముద్రతీరం, 2½ మైళ్ళ దూరంలో ఉంటుంది ఊరు విడిచిన కొంత దూరం తర్వాత అంతా ఇసుకే. బహుశా చాలాకాలంనాడు సముద్రం ఊరు అంచువరకు ఉండేదనుకుంటాను. ఇప్పుడు మామూలు పడవలు చేపలు వగైరా కొరకు తిరుగుచుంటవి గాని ఇది ఎగుమతి, దిగుమతుల కుపయోగపడే ఓడ రేవు కాదు, ఒకటి రెండు సార్లు తీరానికి వెళ్లియుంటాను. స్నానం చేశానేమో జ్ఞాపకంలేదు.

ఇక్కడ మంచి క్లబ్బున్నది. సభ్యులు మర్యాద మన్ననలు కలవారు. నేనప్పుడప్పుడు వెళ్లుచుండేవాడను. ఒకటి రెండు సార్లు చీట్లపేకాట కూడా ఆడినా ననుకొందును.

ఇక్కడనుండి రెండు సార్లైనా పాండిచేరికి వెళ్లాను. అక్కడ వెంకట సుబ్బారెడ్డి (పేరదనుకొంటాను) గారిని కలసికొని వారి ద్వారా శ్రీ అరవిందయోగిని, మాతాజీని దర్శించాను. క్యూలో నిలబడి శ్రీ అరవిందయోగిని కొన్ని క్షణాలుమాత్రమే చూడ గలిగాను. ఒక్కక్షణం వారి దృష్టి నా ముఖంమీద ప్రసరించిందా అని తోచింది. మాతాజీని సావకాశంగా కొంతసేపు చూడటం తటస్థించింది. ఏదో సందర్భంగా ఆటల పోటీలు, కవాతు చేయటం (పెరేడ్) సందర్భంలో ఆమె పట్టు లాగు, పట్టు కోటు, పట్టు తలపాగతో ఆ ప్రదర్శనానికి అధ్యక్షత వహించి దానిని నడిపారు. పెద్ద జన సందోహంలో నేను ఇరుకుకొనిపోయి, కొంత కష్టంమీద బయటకు వచ్చాను.

అక్కడి సముద్రప్రాంతం ముచ్చటగాను, ప్రశాంతంగా నున్నట్లు తోచింది. ఈ సముద్రతీరము నుండి బ్రిడ్జివలె కట్టిన వారధి (పియర్) కెదురుగా రెండోప్రక్క పెద్ద భవంతులు, ముఖ్యముగా పాశ్చాత్య పద్ధతిలో నడిచే హోటళ్లుండినవి. బజారు లంత చెప్పుకోతగ్గవిగా కనపడలేదు. పెద్ద బజారులో

కొన్ని బట్టలు కొన్నట్లు గుర్తు. భోజనం రెడ్డిగారు ఏర్పాటు చేసి యుందురు.

ఈ కడలూరు క్యాంపుకు వెళ్లినప్పుడే అనుకొందును, ఒక సారి తిరిగి వెళ్లుచు నెల్లికుప్పం పంచదార ఫ్యాక్టరీకి వెళ్లాను. అక్కడప్పుడు ఇన్‌కమ్‌టాక్స్ కమిషనరుగా రిటైరైన శ్రీ దొరస్వామి నాడార్‌గారి అల్లుడు కంప్యూటర్‌ను పనిచేయించే ఆఫీసరుగా ఉండినారు. వారు ఆ ఫ్యాక్టరీ నలుప్రక్కలకు తీసుకొని వెళ్లి చూపించారు.

కడలూరు క్యాంపు నుండే చిదంబరం వెళ్లినట్లు గుర్తు. చిదంబరంలో ప్రఖ్యాత నటరాజ దేవాలయ మున్నది కదా. కోటు, లాగు తీసివేసి, పంచె కట్టుకొని, పై పంచె నడుముకు బిగించి స్వామి దర్శనం చేశాము, స్వామి తాండవ విగ్రహం అత్యుత్తమమైన దని చెప్తారు. వెళ్లింది సాయంత్రం, పూజా సమయం. ఇక్కడ గంధం వంటినిండా పూసుకోవటం, పుష్పాలు ధరించటం మామూ లనుకొందును. తాత్కాలికంగా దర్శనానికి వెళ్లిన నాకు కూడా ఈ ఆచార నిర్వహణ తప్పలేదు. స్వామివారి కివతల ప్రక్కగా, ఒక గోడ భాగం చూపించారు. అక్కడ ఏ విగ్రహం లేదు. గంధం వగైరా కొద్ది స్థలంలో పూసిన ట్లున్నది. ఒక చిన్న పూలమాల కూడా ఉన్నదేమో. ఇ దేమి టని అడుగగా ఇదే చిదంబర రహస్యం అన్నారు. చిదంబర రహస్య మంటే ఇదేనా అనుకొన్నాను.

తిరిగి వెళ్లుచూ, ఒక స్వయంభువు దేవాలయం చూచి నట్లు గుర్తు. అప్పటికే రాత్రి ప్రొద్దుపోయింది.

కడలూరు క్యాంపులో ఒకటి రెండు కేసులు తప్ప చెప్పుకోతగ్గవి లేనట్లు గుర్తు. ఒక రెడ్డియార్ (పేరు భాష్యం రెడ్డియార్) పెద్ద పెద్ద కంట్రాక్టులు చేస్తూ ధనికు డైనాడు. ఆయన యింటికి కూడా వెళ్లివచ్చా ననుకొంటాను.

నావద్ద చిత్తూరులో పరసనల్ క్లార్కుగా పనిచేసియుండిన శ్రీ యమ్. యస్. కృష్ణమాచారి కొంతకాలం ఈ సర్కిల్ ఆఫీసర్‌గా ఉండినాడు. ఈయన ద్వారా అక్క డొకరినుండి నాడీ

గ్రంథంలోని నా సంబంధంగా కనపడినది. వ్రాయించాను. అది అరవంలో నుండినది. శ్రీ కృష్ణమాచారి దాని కింగ్లీషు తర్జుమా వ్రాసి పంపారు. ఆడిటర్ శ్రీ ఎన్. జంబునాథన్, ఆయన తమ్ముడు శ్రీ సీతారామన్ ప్రతి క్యాంపులోను హాజరయ్యేవారు. ఒక క్యాంపులో శ్రీ సుబ్బరామన్ ఇంకొక క్యాంపులో శ్రీ విశ్వనాథ అయ్యర్ వచ్చినట్లు గుర్తు.

సేలం క్యాంపు ప్రముఖమైనది. ఇక్కడ ఐదుగురు ఆఫీసర్లుండేవారు. శ్రీ యస్. వి రామస్వామి, ఎ. యమ్. రామకృష్ణన్, శ్రీ వాంచు బాగుగా గుర్తు. పార్టీల తరఫున హాజరైన వారిలో ముఖ్యులు అడ్వొకేట్ శ్రీ టి. వి. విశ్వనాథ అయ్యర్, ఆడిటర్ శ్రీ వి. వి. సౌందరరాజన్ గార్లు. ఒక క్యాంపులో బ్రహ్మయ్య ఆడిటర్సు తరఫున ఆడిటర్ శ్రీ పి. సాంబయ్య వచ్చాడు. ఆఫీసరు రామస్వామిగారు సరి లేక సమ తూకం (బ్యాలెన్సు) గల వ్యక్తి. పెద్దమనిషి తరహా. తొందరపడే స్వభావం కలవాడు కాదు. శ్రీ రామకృష్ణయ్య చురుకైన బుర్రకల వాడు. ఆకర్షణీయమైన విగ్రహం. ఆహ్లాదాన్ని కలిగించే నడవడి. అయితే, కొంచెం దురుసుతనం లేకపోలేదు. అడ్వకేటు శ్రీ టి. వి. విశ్వనాథ అయ్యర్ గారు మిక్కిలి సమర్థులైన న్యాయవాది. చాలా ఓర్పుతో వివరించే పద్ధతిగలవారు. అయితే కొన్ని మెలికలు వేయగల శక్తి, కొంత గడుసుదనం చూపించే నడవడి వారి స్వభావంలో వుండినవని తోచింది. కేసులు కొన్ని పెద్దవి, క్లిష్టమైనవే విచారణకు వచ్చాయి. ఉదాహరణకు, నమ్మకల్ నివాసి యన్. పెరియన్నపిళ్లై బస్సు వ్యాపారం కేసులు.

సేలం క్యాంపు నుండి ఒక సంవత్సరం పట్టణానికి 12 మైళ్ల దూరంలో వున్న షేర్వాయి కొండలపైకి కారులో వెళ్లాను. మెలికలు తిరిగి పోవలసి వచ్చింది. ఇంగ్లీషు అక్షరం 'యు' మెలికలు ఇంచు మించు క్రిందనుండియే కనిపిస్తవి. కొండలు పెద్దగా ఎత్తైనవి కావు. పైన విశాలంగా, కట్టడాలతో ఉండినది. కొండ ఉపరితలం సమానంగా ఉండదు. కొంచె మెక్కుడు, దిగుడు లుంటవి. కాని అవి చెప్పుకోవలసినంతవి కావు. సేలం

లోని ప్రముఖ వ్యాపారి ఒక శ్రేష్ఠిగారి ( పేరు గుర్తుకు రావటం లేదు ) బంగళాలో విశ్రమించి ఉపాహారం తీసుకొని తిరిగి వచ్చాం. అక్కడ ఏవో మందుల తయారీ ఫ్యాక్టరీ ఉండింది. అక్కడికి వెళ్లి దానిని చూచాం. వారు ఏవో రెండు మూడు మందుల సీసా లిచ్చారు.

సేలం పట్టణం విశేషం కలదే. మేలైన నూలుబట్టల నేత కది ప్రసిద్ధి. సేలం జరీ కండువాలు ప్రఖ్యాతి గలవి. ఇప్పటికిని శుభకార్యాలలో ఆంధ్రలో కూడా హెచ్చుగానే వానిని వాడుచుంటాము. పట్టువస్త్రాల నేత కూడా ఉన్నది. పట్టణం మధ్యరకం. తెలుగువారు చాలామంది దున్నట్లున్నారు.

నాగపట్నం సముద్ర తీరా నున్నది. విదేశ వ్యాపారం చెప్పుకోవలసింది కాదు. కేసులు కూడా మధ్యరకం. ఇక్కడ ఒక పెద్ద మహామ్మదీయ వ్యాపారస్తు డుండినాడు. ఆయన బర్మా మొదలైన చోట్లకు ఎగుమతులు చేయటమో, లేక అక్కడకు వెళ్లే చిన్న ఓడలకు సరుకులు రవాణా చేయటమో, తానుకూడా పెద్ద పడవలు లేక చిన్న ఓడలను నడపటమో చేస్తూండేవాడట. నాకాలానికి ఆయన కుమారు లుండినట్లు, వ్యాపారం తగ్గి పోయి నట్లు గుర్తు. నాగపట్నం విశేషం—ఒక మహామ్మదీయ సిద్ధుని సమాధి, దాని సంబంధమైన దర్గా వగైరా ఉండటం. ఈ సమాధి మిక్కిలి మాహాత్మ్యము కల దని వాడుక. ముస్లిములే గాక హిందువులు కూడా పూజింతురు. ఉర్సు అనే ఉత్సవంలో పాల్గొం టారు. నేనొక క్యాంపులో ఆ పవిత్ర స్థలానికి వెళ్లి అందరితో బాటు భక్తి శ్రద్ధాంజలి ఘటించాను. అప్పు డేదో ఉత్సవం జరుగు చుండినది.

నా బాల్యంలో గుడివాడ డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా ఉద్యోగ నిర్వహణచేస్తూ, మా గ్రామం బొమ్ములూరు ప్రక్కనున్న అంగలూరు మొదలైన కమ్మటూళ్లకు పెద్దల ఆహ్వానంమీద శుభకార్యాలకు వచ్చుచుండిన కమ్మనాయుడు శ్రీ ఉప్పలపాటి శౌరిరాజులుగారి స్వస్థలం నాగపట్నం సమీప గ్రామం. వారి కిద్దరో ముగ్గరో కుమారులు. రెండవ కుమారు డనుకొందును

శ్రీ రంగ రాజస్వామి పాశ్చాత్య దేశాలలో విద్య నభ్యసించారు. నా నాగపట్నం క్యాంపుకు చాలా సంవత్సరాల క్రితమే శ్రీ శౌరిరాజులు నాయుడుగారు పరమపదించారు. వారి పెద్ద కుమారునకు నాగపట్నంలో ఒక మేడ ఉన్నదటగాని వారు స్వగ్రామంలోనే ఉండుచున్నారని విన్నాను. రెండవ వా రెక్కడనో వుండినారట. నా స్టెనోగ్రాఫరు వి. కృష్ణమూర్తిది నాగపట్నమే. నేను 'బి' రేంజిలోకి మారినప్పుడు కృష్ణమూర్తి నా స్టెనో కాదు. కృష్ణమూర్తి వ్రాయటంవల్ల, అతని అన్న వచ్చి నన్ను క్యాంపులో చూచాడు. ఆయన సామాన్య స్కూల్ టీచరు.

తంజావూరు క్యాంపు విశేషాలు - అక్కడి సరస్వతీ మహాల్ గ్రంథాలయం, బృహదీశ్వరర్ దేవాలయం, దర్బారుహాలు. గ్రంథాలయం విస్తృతమైనది. వివిధ అంశాల మీద తాళపత్రం, తోలు, (పార్చిమెంటు) కాగితం మీద చేతితో వ్రాసిన గ్రంథాలనేకమున్నవి. తెలుగులో వ్రాసిన గ్రంథాలు చాలా ఉన్నవట. ఇండియా మొత్తంమీద చెప్పుకో తగ్గ ప్రాచీన మాన్యుస్క్రిప్టు లైబ్రరి. దీనిని మహారాష్ట్రవంశీయుడు మహారాజా శరభోజి మహాశయుడు నూతన అంశా లనేకములను చేర్చి, మిక్కిలి విస్తృత పరచి పోషించి కాపాడినారు. దీనిలోని అమూల్యమైన గ్రంథాలను కొన్నిటిని వెలికిదీసి ప్రభుత్వంవారు ప్రచురించినారు, ప్రచురింపించుచున్నారు. నేనా మహాగ్రంథాలయ సంస్థను దర్శించి కట్టా వరదరాజులు రచించిన ద్విపద రామాయణం మొదలైన పుస్తకాలను కొన్నిటిని కొన్నాను. ఇటీవల అనగా కొన్ని సంవత్సరాలక్రితం నుండి దీని నానుకొని కంచు విగ్రహాలు, బొమ్మలు చెక్కిన ఇత్తడి రాగి మిశ్రమ పళ్లాలు వగైరా ప్రదర్శించు హాలులను ఏర్పాటు చేశారు. అనేక రకాలైన విగ్రహాలు వగైరాలను చూచి ముగ్ధుడనైనాను.

బృహదీశ్వర దేవాలయం గొప్పది, చాలా ప్రఖ్యాతివహించినది. దేవాలయంమీది బొమ్మలు, గర్భగుడికి ముందున్న నడవల (వెస్టిబ్యూల్స్) సరంబీల మీద చిత్రించిన రంగుల బొమ్మలుగాక

దాని విమానం (గర్భగుడిమీది గోపురం) బ్రహ్మాండమైనది. ఈ విమానం మిక్కిలి ఎత్తైనదేగాక, దీని శిఖరం ఒక పెద్ద గుండు రాయి. దీనిని విమానం మీదకు 4 మైళ్ల దూరంనుండి క్రమేణ పైకెక్కు పరవంజా ద్వారా ఎక్కించారట. దీని బరువు 80 టన్నులని చెప్పారు.

మహారాజుల ప్రాసాదాలు మాసిపోయినవి పోగా, మిగిలినవి శిథిలావస్థలో వున్నవి. కాని దర్బారు హాలు కొంతవరకు చెడకుండా కాపాడబడి యున్నది. దాని ఎత్తునుచూచి దిగ్భ్రాంతి చెందాను. అందులోని స్తంభాలు రోమన్ కాలములోవలె ఆకాశాన్నంటునట్లుండినవి. ఒక క్యాంపుకు వెళ్లి తిరిగివచ్చుచు, శింఘికోటను దర్శించాను. ఇది తంజావూరు కనతి దూరంలో నున్నది. దుర్గ రక్షణార్థం, ఏర్పరచబడ్డ వసతులు కట్టుదిట్టంగా తోచాయిగాని, రాణుల, రాజుల నివాసానికి కట్టబడిన మేడలలోని, ముఖ్యంగా రాణుల మేడలోని, గదులు ఇరుకనిపించాయి. మహారాష్ట్ర రాజులలో చివరవారు ఈ దుర్గాన్ని కట్టించారని చెప్పినట్లు జ్ఞాపకం.

చిత్తూరు సర్కిల్ చిన్నదానిక్రిందనే లెక్క. ఇక్కడ కొన్ని బస్సు సర్వీసు కేసులు, కల్లంగళ్ల కేసులు మధ్యరకమువి ఉండినవి. వివాదాని కాస్పదమైన ఆదాయం తక్కువని చెప్పాలి. నేను 1931 – 32 లో ఆఫీసరుగా నుండినప్పుడు బంధువులుగా వ్యవహరించిన పాపుదేశు వెంకటస్వామినాయుడుగారి కుటుంబం (కొడుకులు శ్రీ పి. వెంకట కృష్ణయ్యనాయుడు, శ్రీ యన్. పి. చెంగల్ రాయ నాయుడు, కోడళ్లు శ్రీమతి వినాయకమ్మ, శ్రీమతి సావిత్రమ్మ—వారి సంతానం) నాకు చిరపరిచితులు. కాకినాడలో కొంతకాలం నా ఇన్‌స్పెక్టరుగా పనిచేసి, చిత్తూరులో ఆఫీసరుగా వుండుచుండిన శ్రీ ఎ. వి. ఆరాధ్యులు నాకు తెలిసినవారు. అందువల్ల నాకు ప్రాత-చోటికి వచ్చినట్లనిపించింది. కె. వి. నరసింహన్ అనే ఆడిటరుగారు చాలా కేసుల్లో హాజరైనారు. చిత్తూరు వాతావరణం ఇంచుమించు సమశీతోష్ణంగా వుంటుంది. పరిసరాలు చెట్లు వగైరాలతో రమణీయంగా వుంటవి. మొత్తంమీద చిత్తూరు క్యాంపు ఆహ్లాదకరమైనది.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. శ్రీ వెంకటకృష్ణయ్య నాయుడు కల్లుంగళ్ల అప్పీలు విచారించి, ఇతర కేసులతో పోల్చి, తగినన్ని ఆధారాలతో ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు తేల్చిన ఆదాయాన్ని కొంత తగ్గించారు. నా ఆర్డరులో, ఇదివరకు నేనక్కడ ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా పని చేసింది, నా స్వానుభవం కూడా తగ్గించటానికి కారణంగా చెప్పాను. తర్వాత ఒకనాడు మా కమిషనరు కె. సి. ఖన్నాగారు. "మీ చిత్తూరు కల్లుంగళ్ల అప్పీలు ఆర్డరును అంగీకరించాను. ట్రిబ్యునల్‌కు అప్పీలుచేయటం లే" దన్నారు. నేను కొంత వింత పడ్డా, విని వూరుకొన్నాను. వా రట్లనుటకు కారణం, బహుశా నా వ్యక్తిగతానుభవం మీద కూడా ఆదాయాన్ని తగ్గించానని ఆర్డరులో చెప్పటంవల్ల, మీ స్వానుభవాన్ని గౌరవించానని చెప్పటమేమో అనుకొందును.

అనంతపూరులో ఒక సంవత్సరమే క్యాంపు చేశాను. కారణం తర్వాతి సంవత్సరాలలో ఆ సర్కిల్ నా జ్యూరిస్ డిక్షన్ నుండి తొలగించ బడ్డది. అనంతపూరు జిల్లాలోని తాడిపత్రిలో మూలా నారాయణస్వామిగారి సారాయి తయారుచేసే ఫ్యాక్టరి ఉండింది. దాని ఆదాయంలో కొంత భాగాన్ని కమ్మీ చేస్తున్నట్లు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరుగారి అనుమానం. పైగా నారాయణస్వామిగారికి ప్రింటింగు ప్రెస్ మొదలైన వుండినవి. మరిన్ని మద్రాసులో సినిమాలు తీసే వాహిని స్టూడియో ఉండేది. ఇంకేవేవో, బయట పట్టణాలతో వ్యాపార సంబంధాలు, ఆదాయం దాపుల్లుండినవని పెద్ద అంచనా వేసి ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు రెండు మూడు సంవత్సరాల ఆదాయాన్ని కొన్ని లక్షలుగా నిర్ణయించి 26 లక్షల పన్నును విధించాడు. అనంతపూరు సర్కిల్‌కు నేను 1936-39 సంవత్సరాలలో ఆఫీసరుగా నుండినాను. తాడిపత్రిలో ప్రతి సంవత్సరం క్యాంపు చేస్తుండేవాడను. ఒక క్యాంపులో ఆ ఆబ్కారీ ఫ్యాక్టరీకి వెళ్లిచూచాను. అందువల్ల ఇంత పన్ను విధింపు చాలా హెచ్చనిపించింది. పైగా, అప్పటికి మూలా నారాయణస్వామి వాహిని స్టూడియోను పోగొట్టుకొనటం, ప్రింటింగుప్రెస్ మొదలైనవానిని

మానివేయటం, మద్యనిషేధంవల్ల సారాయి ఫ్యాక్టరి మూలబడటం లేక దుస్థితిలో నుండటం సంభవించినవి. అందువల్ల ఆ ఆఫీసరుతో, "26 లక్షుల పన్నును ఏవిధంగా నారాయణస్వామి కట్టగలడు? అతడు దివాళాస్థితిలో ఉన్నాడుకదా. నావద్దకు అప్పీలుకు వస్తే, కళ్లుమూసుకొని సగంపన్నైనా కొట్టివేస్తా" నన్నాను. దానిని ఆఫీసరు కమిషనరుకు చెప్పియుంటాడు. కొలది కాలంలోనే ఆ సర్కిల్ నా జ్యూరిస్‌డిక్షన్ నుండి తీసివేయబడింది. ఇటువంటి ఇంగితంలేని పన్ను వేయటాలే 'బంగారుగ్రుడ్ల బాతును చంపటం', 'కామధేనువు పొదుగుకోయటం'. చివరకు నారాయణ స్వామి దిగులుతో క్షయవ్యాధికి గురై, అకాలమరణం పొందాడు. ఈ సందర్భంలో నే నొకవిషయం విన్నాను. చనిపోయేముందు నారాయణస్వామికి కోడిమాంసం తినా లనిపించిందట. చేతిలో డబ్బులేక అల్లాడుచుండగా, దయదలచిన స్నేహితు డొకడు 10, 11 రూపాయలు ఇచ్చాడట. రెండు కోడిపెట్టలను తెప్పించుకొని, సుష్టుగా తిని, ప్రాణం విడిచాడట. దీనిలో అతిశయోక్తి ఉన్నా, ఇటువంటి అనుచిత పన్నువిధింపులవల్ల విజయనగరంలో పువ్వాడవారు, కర్నూలులో కొందరు పెద్దవర్తకులు నాశనమై పోయారని వదంతి.

కేసు లేవో కొన్ని విన్నాను. నా ప్రాతజవానులు, గుమస్తాలు ఆదరించారు. నేను జీవనోపాధి కల్పించిన ఇన్‌కమ్‌టాక్స్ ప్రాక్టీషనర్ శ్రీ రంగయ్య కృతజ్ఞతలు తెలిపాడు.

వేలూరు చిన్న ముఖ్యపట్టణములలో నొకటి. ఇదొకప్పుడు మిక్కిలి ప్రసిద్ధికెక్కి, పాలకుల రాజధానిగా నుండినది. చెప్పుకోతగిన కోట, దేవాలయం ఉన్నాయి. పట్టణములో కొన్ని విశాల వీధులుండినట్లు గుర్తు. వర్తకవ్యాపారాలు తక్కువవికావు. కూరగాయలకు ప్రసిద్ధి. ఇంగ్లీషు కూర వస్తువులు, టమాటోల వంటివి పుష్కలంగా దొరుకుతవి. నేల గరపంచు, ఎరుపు మిశ్రమ సంబంధంగా,ఎత్తుగా వుంటుంది. పట్టణప్రాంతంలో తక్కువలోతున బండరాళ్లవంటివి వుంట వనుకొందును. వాతావరణం, చలి కాలంలో చలి, ఎండకాలంలో ఎండ కొంత హెచ్చుగానేవుంటవి.

మొత్తంమీద పట్టణం, ఆ పరిసరప్రాంతాలు ఆకర్షణీయముగా వుంటవని చెప్పవచ్చును.

ఈ మాండలిక పట్టణములో సాంఘిక, సాంస్కృతిక కార్య కలాపాలు చెప్పుకోతగినట్లున్నవి. ఇక్కడి కొందరు పెద్దలు ప్రాత కాలపు సంస్కృతి కలవారు. పిన్నవయస్కులు, ఉత్సాహ పూరితులు. నవీన పద్ధతుల నవలంబించువారుగా కనపడినారు. క్లబ్బులకు, సంఘాలకు కొదువ లేదనుకొందును. నేను ఒకటి రెండు క్యాంపులలోనైనా ఒక పెద్దక్లబ్బుకు వెళ్లాను. వారిని వీరిని కలిసి కోవటం తటస్థించినది. ఇద్దరు, ముగ్గురైనా స్నేహభావంతో మెలగారు. పూర్వ వైభవం కోల్పోయి, సామాన్య స్థితిలోవున్న కోటను, దానిలో అంతర్భాగముగా వుండిన దేవాలయాన్ని చూచాను. దేవాలయము మీది శిల్పాన్ని చూచి సంభ్రమా న్వితుడనైనాను.

కేసుల విషయములో కొన్ని పెద్ద కేసులుకూడా వుండినవి. వీనిలో కొన్ని ముఖ్యమైనవి చర్మ వ్యాపార సంబంధమైనవి. ఒకటి రెండు బస్సుల సంబంధమైన కేసులుకూడా విచారించాను. ఏ కేసులు కూడా నాకు ఎక్కువగా శ్రమ యివ్వలేదు. అక్కడ ఇద్దరు, ముగ్గురు ఆఫీసర్లుండేవారు. ఆఫీసర్లలో సీనియరు శ్రీ పి. కె. పెరుమాళ్, ఖాజా మొహీద్దీన్ అనే యువక ఆఫీస రుండే వాడు. శ్రీ పెరుమాళ్ వివాదగ్రస్థుడు కాదుగాని, శ్రీ ఖాజా మొహీద్దీన్ మొండిపట్టు పట్టే రకం. ఒక కేసులో అమ్మని సరుకు మీద కూడా లాభం కట్టి పన్ను వేశాడు. ఇది అసమంజసమని చెప్పినా పట్టు బట్టి అప్పీలు చేయటానికి సిద్ధమైనాడు. ఒకొక్కప్పుడు అనుభవంలేని ఆఫీసర్లు తాము పట్టిన కుందేలుకు మూడే కాళ్లని వాదిస్తారు. పార్టీల తరపున అడ్వొకేట్లు, ఆడిటర్సే గాక, ఇన్ కమ్‌టాక్స్ ప్రాక్టీషనర్సు కూడా హాజరయ్యేవారు. అందులో ఒకరు వైవశిఖామణి మొదలియార్ అనేవారు ముఖ్యులు. పెద్ద వయస్కులైన వీరు కొంత చొరవ, చనువు తీసుకొనేవారు. నాకు కొంత దగ్గరగా వచ్చారని చెప్పవచ్చును.

ఈరోడ్డులో ఒక్కసారే మకాం చేశాను. ఇక్కడ నాకు గుర్తున్న విశేషం దుప్పట్లు, కర్టెన్లు, తువ్వాళ్లు మొదలైనవి చక్కని రంగులలో మేలుగా తయారుచేసి వానిని ప్రెస్సులో సాఫుచేయటం. కొన్ని దుప్పట్లు, తువ్వాళ్లను కొన్నాను. కొన్ని చిన్న కేసులను మాత్రమే విచారించాను.

బళ్లారి క్యాంపుకుకూడా ఒకసారి వెళ్లి ఏవో కొన్ని కేసులను విచారించినట్లు తోస్తున్నది.

నెల్లూరుకు రెండు సార్లైనా వెళ్లివుంటాను. ఈ సర్కిల్‌లో ఆఫీసరుగా మూడు సంవత్సరాలు గడపివచ్చానుకదా. అందువలన అప్పీలుకు వచ్చినవారిలో కొంతమందైనా నాకు తెలిసియుండినారు. ఏయే కేసులు విచారించానో, అప్పుడక్కడ ఆఫీసర్లు ఎవ్వరో గుర్తులేదు. కాని, ఆడిటర్ వి. మహాదేవన్ చాలా కేసులలో పార్టీతరఫున హాజరయినట్లు గుర్తు.

నేను మద్రాసు 'ఎ' రేంజి అప్పీల్సు అసిస్టెంటు కమీషనరుగా వున్నప్పుడు మైసూరు రాష్ట్రం, నా జ్యూరిస్‌డిక్షన్‌లోకి వచ్చింది. బెంగుళూరు అసిస్టెంటు కమిషనరుగారు రిటైరై పోయారు. అప్పటికి ముప్పై లోపుగా మాత్రమే అప్పీల్సుండినవి. అందువలన వేరే అసిస్టెంట్ కమీషనరును నియమించట మెందుకని ఆయన ఛార్జిని మద్రాసు 'ఎ' రేంజికి జతపర్చారు. బెంగుళూరు క్యాంపుకు మూడుసార్లైనా వెళ్లివుంటాను. కంటోన్‌మెంట్ ఏరియాలోవున్న ఇన్‌ఫెంట్రి రోడ్డులోని యంబాసిడర్ హోటల్‌లో వుండేవాడిని మొదటి సంవత్సరం హెచ్. జి. గోపాలస్వామినాయుడుగారు అక్కడ కమిషనరుగా వుండినారు. వారిని ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా, అసిస్టెంట్ కమిషనరుగా ఇదివరలో ఎరిగియుంటిని. అందువలన మర్యాద పూర్వకంగా నన్నొకమధ్యాహ్న భోజనానికి ఆహ్వానించారు. కేసులవిషయ మెట్లున్నను నేను సిటీ కంటోన్‌మెంట్ తిరిగి చూడటం, అక్కడి ఆహ్లాదకరమైన వాతావరణాన్ని అనుభవించటం, అబ్దుల్ ఖాదర్, పి. సాంబయ్యగార్లవంటి ప్రాత పరిచయులను కలిసికోవటం, కబ్బన్ పార్కు, లాల్‌బాగ్ పార్కులవంటి ప్రదేశాలకు పికార్లు

వెళ్లటం, సిటీ మార్కెట్టు, రసెల్ మార్కెట్టులకు వెళ్లటం ముఖ్యంగా రసెల్ మార్కెట్టులో కట్‌గ్లాసు టంబ్లర్సు వగైరాలను కొనటం, కాలం సంతోషంగా గడిచిపోయింది.

ఒక కేసులో ఒక కన్నడ న్యాయవాది హాజరైనాడు. నేనేదో పనిలోవుండగా తొందరపెట్టసాగినాడు. పిలిచి మృదువుగా మందలించాను. కోపపడి "నేను హాజరుకా"నని వెళ్లిపోయాడు. కొంతసేపటికి తిరిగి రాగా, మర్యాదగా కేసు విచారించి పంపివేశాను. ఇంకొకటి చెప్పదలచాను. నా స్టెనోగ్రాఫరు వి. కృష్ణమూర్తి, "అయ్యా, ఈ దఫాకు ఇంకొకరిని తీసుకొని వెళ్లండి, సమీపించుచున్న డిపార్టుమెంటు పరీక్షకు నేను చదువుకొనాలి" అన్నాడు. "ఏ పరీక్ష"అని అడిగాను. "తెలుగు పరీక్ష" అన్నాడు. "తెలుగు పరీక్ష అయితే నీవు భయపడవలసిన అవసరం లేదు. క్యాంపులో సాయంత్రం నేను నీకు చదువు చెప్పుతాను. పైగా పరీక్ష అధికారిని నేనే. అందువలన నీవు సందేహించవలసిన అవసరం లేదు. వెంట వచ్చేయి" అన్నాను. ఆమాట ప్రకారం 5 గంటల కల్లా అప్పీల్సు వినటమేగాక, ఆర్డర్లు డిక్టేట్ చేయటం పూర్తిచేసేవాడిని. తర్వాత గంట, గంటన్నర చదివించటం, చెప్పి వ్రాయించటం, తెలుగులో సంభాషించటం జరిపి ఆ వారం పదిరోజుల క్యాంపులో తర్ఫీదు యిచ్చాను. తిరిగి మద్రాసుకు వెళ్లిన కొలదిరోజులలో, పరీక్షను నేనే జరిపి అతనినే గాక కొంత మంది గుమస్తాలను, ఇన్‌స్పెక్టర్లను ప్యాసుచేశాను. నే నీమధ్య బందరు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసుకు వెళ్లగా అక్కడి ఇద్దరి ఆఫీసర్లలో ఒకరైన శౌరిరాజన్ అనేవారు నాకు గుర్తుకు తెచ్చి "అయ్యా, మీరు ఆనాడు తెలుగులో ప్యాసుచేసినవారిలో నే నొకడిని" అని చెప్పాడు.

మైసూరు క్యాంపుకు ఒకసారే వెళ్లాను. నాతో భార్య, పిల్లలను తీసుకొని వెళ్లాను. అక్కడ మూడు, నాలుగు రోజులు మాత్రమే వుండినాము. శివారెడ్డి అనే ఆఫీసరు మాకు అన్ని సదుపాయాలు ఏర్పరచాడు. మేము మహారాజావారి ప్రాసాదం,

జగన్మోహన ప్యాలెస్, ఉద్యానవనాలు చూచి మిక్కిలి సంతోషించాము. జగన్మోహన ప్యాలెస్‌లో రవివర్మ చిత్రాలు చాలా వున్నవి. వానిలోని కొన్నిటి ప్రతిబింబాలనైనా నేను అది వరకు చూచియుండలేదు.

శివారెడ్డిగారు కమ్మకులస్థు డట. ఆ ప్రాంతంలో కొందరు కమ్మవా రున్నా రట. క్వాచిత్కంగా మైసూరు సరిహద్దులలోని తెలుగు జిల్లాలవారితో సంబంధాలు చేసుకొంటారట. వీరిని ఆ రాష్ట్రీయులు వక్కలిగార్ల (వ్యవసాయకులు) తో సమానంగా చూస్తారట. నిజానికి వీరు వక్కలిగార్ల మని చెప్పుకుంటారు. నేసీ క్యాంపులో నున్నప్పుడు మన భారత స్వాతంత్ర్య దినమో, రిపబ్లిక్ దినమో వచ్చింది. మైసూరు సర్కిల్‌లో ఇంకొక ఆఫీసరు వున్నట్లు గుర్తు. ఇద్దరు ఆఫీసర్లను, ఆఫీసుస్టాఫ్‌ను సమావేశ పరచి ఆ శుభసందర్భంగా ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాను.

మైసూరు క్యాంపుకు వెళ్లటం ఇదే మొదటిసారి, ఆఖరు సారి కూడా. అయితే, నేను అనంతపురంలో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా వున్నప్పుడు దవనగిరి అనే పట్టణానికి చెందిన జయకీర్తి అనేవారి కుటుంబం హిందూపూరులో కొంత వ్యాపారం నడుపు చుండేది. జయకీర్తిగారి ప్రోత్సాహంవల్ల మైసూరులో దసరా ఉత్సవాలు చూడాలని ఒక సంవత్సరం అక్కడికి వెళ్లి రహదారి బంగళాలో మకాం పెట్టాను. ఉత్సవాలైతే చూశానుగాని ఆ సందర్భంగా మహారాజావారు జరిపే దర్బారుకు హాజరుకాలేక పోయాను. దర్బారుకు హాజరగుటకు మైసూరీయుని వలె పొడుగు పాటి నల్లకోటు, తలమీాద జరీతలబుట్ట, మెడమీాద ముందు, వెనుక వ్రేలాడే జరీ కండువా ధరించాలట. "ఈ దుస్తులు తెచ్చిపెడతాను, మిమ్ములను తీసుకొని వెళ్తాను" అని చెప్పి వెళ్లిన వ్యక్తి ఎంత సేపటికిని రాలేదు. విసిగి నిరుత్సాహముతో మంచం చేరాను. నేను పడుకొనివున్న చాలాసేపటి వరకు ప్రక్కగదిలో ఎవరో ముగ్గురు, నలుగురు కలసి పెద్దగా మాట్లాడటం, వికవికలు, పకపక లతో ఎగిరిపోవటం వినపడింది. వారు దర్బారు నుండి వచ్చివేశారని అనుకొన్నాను. ఉదయం వాచ్‌మన్‌ను విచారించగా, ఆకాలంలో

ప్రఖ్యాత రాజకీయవేత్తగా నుండిన శ్రీ కె. టి. భాష్యం అయ్యంగార్ స్నేహితులతో కలసి వచ్చి మత్తుపానీయాలు పుచ్చుకొని కాలం గడిపారని తెలిసింది. రాజకీయవేత్తలలో చాలామందికి ఇటువంటి దురలవాట్లు, ప్రక్కనున్న వారి కిబ్బందికలుగుతుందేమో యను సంకోచం లేకపోవటం వుంటవి.

పై సర్కిల్‌తో నా 'ఎ', 'బి' రేంజిల ఛార్జీల పని పూర్తి. 'బి' రేంజి చార్జీ పుచ్చుకొనక పూర్వం, బెజవాడ రేంజి అప్పీల్సు అసిస్టెంటు కమిషనరుగా 6-3-1952 నుండి 4-12-1952 వరకు పని చేశానని పైన చెప్పాను. ఆ రేంజి జ్యూరిస్‌డిక్షన్‌లోని సర్కిల్సు, మకాములను గురించి ఇప్పుడు చెప్పుతాను.

ఏలూరు క్యాంపులో కొన్ని క్లిష్టమైన కేసులను ఎదుర్కొనవలసి వచ్చింది. మామూలుగా ఈ కేసులు చిక్కు సమస్యలను తేవలసినవి కావు. కాని, వానిని విచారించిన ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు ఊహాబలసంపన్నుడు. ఆయన తలకు, తోకకు ముడి పెట్టి పన్నుదారులు ఎవ రెవరి పేరనో ఏవేవో దాచినారని ఊహించి, ఆ దాచినవా రన్నవారికి, పన్నుదారులకు ఎక్కడెక్కడివో బంధుత్వాలు కల్పించి, పెద్ద ఆదాయాన్ని నిర్మించి పన్నువేశాడు. ఆ బంధుత్వాలు నిజమైనవి కావని, ఆ దాపుడులు లేవని, ఆదాయం కమ్మిగాచేశా డనటం సరియైనది కాదని అప్పీలుదారుల వాదాన్ని పరిశీలించి ఒక నిర్ణయానికి రావటానికి కష్టమైన పని అయింది. శ్రమించి చిక్కులు విడదీసి న్యాయమైన నిర్ణయానికి వచ్చినప్పుడు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు తేల్చిన ఆదాయాలలో చాలావరకు రద్దు అయిపోయాయి.

నా విచారణ కొంతకాలానికి ముందే ఆ క్లిష్ట పరిస్థితులను సృష్టించిన ఆఫీసరు వెళ్లిపోయాడు. అప్పుడున్న ఆఫీసరు శ్రీ కబీర్‌షా న్యాయబుద్ధికలవాడు. పన్నులు పెంచి, పై ఆఫీసర్ల మెప్పును పొందాలనే స్వభావం కలవాడు కాడు. మర్యాదస్థుడు. నేను విజయవాడ రేంజిలో అధికారాన్ని చెలాయించింది 9 మాసాలు మాత్రమే. అందువల్ల ఒక్క క్యాంపుతోనే ఏలూరు ఆఫీసేగాక, ఆ రేంజిలోని ఇతర ఆఫీసులుకూడా ఉద్యోగరీత్యా,

నేను తిరిగి చూడలేదు. ఒక్క వారం రోజులు క్యాంపుచేసి అడ్వొకేటు శ్రీ జి. నరసింహారావు ఆతిధ్యాన్ని ఒక రాత్రి స్వీకరించి బెజవాడకు తిరిగి వచ్చేశాను.

మామూలుగా క్యాంపుకు వెళ్లిన అసిస్టెంటు కమిషనర్లు ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసు బిల్డింగులోనే బస చేస్తారు. ఆవిధంగానే ఈ సర్కిలు ఆఫీసు బిల్డింగు మేడమీద నా బస. ఏలూరును అంతకు ముందు, తరువాత నేను చూచానుగాని, నేను విచారణకు వెళ్లిన వారం రోజులలో పట్టణములోనికి వెళ్లలేదు. అయినా అది చెప్పుకోవలసిన పట్టణ మేమీ కాదు. నేను వెళ్లియుండినది ఇరవై సంవత్సరాలక్రితం. ఇప్పుడు కొన్ని క్రొత్త కట్టడాలతో, కాలేజితో, జిల్లా కేంద్ర లైబ్రరీతో, కొన్ని సాంస్కృతిక కలాపాలతో నేనూ వున్నానని అనిపించుకొనుచున్నది.

1946 మార్చిలో బందరు (మచిలీపట్నం) సర్కిల్‌లో కొన్ని పన్నువేయు కేసులను విచారించానని పైన వ్రాశాను. పైగా బందరు నాకు సుపరిచితం. మరిన్ని, ఇదివరలో అసిస్టెంట్ కమిషనరుగారి స్టెనోగ్రాఫర్‌గా పనిచేసియుండి నాకు చిరపరిచితులైన శ్రీ వడ్డాది వెంకట సుబ్బరాయుడు ఆఫీసరుగా వుండినాడు. అందువలన వారం రోజుల బందరు క్యాంపు సుముఖముగానే జరిగిపోయింది అప్పీల్సు సామాన్యమైనవి. ఒక పెద్ద అప్పీలు, తటవర్తి వారి సంబంధ మనుకొంటాను, ఎక్సపార్టీ (అప్పటి 23 (4) సెక్షన్ క్రింద) పన్ను విధింపు, కొంచెం దీర్ఘంగా ఆలోచించి కొట్టివేయ వలసివచ్చింది. నేను బందరు నోబుల్ కాలేజిలో చదువుకొన్న రోజులలో విద్యార్థిగా నుండిన శ్రీ సర్వా సూర్యనారాయణగారు ఏదో కేసులో హాజరైనారు. కాని ఆ అప్పీలును పూర్తిచేసినట్లు లేదు.

కాకినాడ సర్కిల్‌లో 1943-46 సంవత్సరాలలో నేను ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరుగా పనిచేసినట్లు పైన చెప్పాను. నే నిక్కడ క్యాంపుకు వెళ్లినప్పుడు శ్రీ భాగవతుల వెంకటరత్నం అనేవారు ఆఫీసరుగా వుండినారు. ఆయన సమర్థుడే గాక కొంత పట్టుదలగల వ్యక్తి. అప్పీల్సు అంతగా నన్ను యిబ్బంది పెట్టలేదు.

నేను ఆఫీసరుగా నున్నప్పుడు పరిచయులైన డాక్టర్ ఐ. జోగా రావు, శ్రీ పాఱుపూడి బాపూరావు, శ్రీ శ్రీపాద రామయ్య, శ్రీ దంటు సూర్యారావు మొదలైనవారిని తిరిగి కలసికొని సంతో షించాను. నే నెరిగియుండిన ప్రాత బిల్డింగులోనే ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసు వుండింది. నేను మేడమీద ఆఫీసరు గదిలో విచారణ జరిపాను.

పైన ఒకచోట చెప్పియుండినట్లు, శ్రీ డాక్టరు జోగారావు చేత చిన్న ఆపరేషన్ చేయించుకోవలసి వచ్చింది. ఆపరేషన్ నా అప్పీల్సు విచారణకు అడ్డం కలుగ జేయలేదు.

విజయనగరం సర్కిలును 1936 ఏప్రియల్‌లో నేను క్రొత్తగా ఆరంభించానని నేను పైన వ్రాశాను. 1952 నాటి కది చాలా అభివృద్ధిచెందింది. నా క్యాంపునాటికి బరం పురములో గుమస్తాగాను, కాకినాడలో ఇన్‌స్పెక్టరుగాను నావద్ద పనిచేసియుండిన శ్రీ జి. నారాయణరావు ఆఫీసరుగా వుండినాడు. 1936 లో నన్ను సత్కరించిన శ్రీ బొడ్డు రంగారావు దొర కాలగర్భంలో కలిసిపోయాడు. మునిసిపల్ ఛైర్మన్‌గా వుండిన శ్రీ పి. వీరభద్రరావుగారుకూడా జీవించియుండినట్లులేదు. శ్రీ బొడ్డు సన్నయ్యదొర విషయం గుర్తులేదు. ఆడిటర్ శ్రీ గుప్తాగారు ఏవైనా అప్పీల్సులో హాజరైనారేమో చెప్పలేను. ఎక్కడికీ కదలక వారంరోజుల క్యాంపులో కొన్ని అప్పీల్సును విని, అక్కడి నుండి విశాఖపట్టణం వెళ్లిపోయాను.

విశాఖపట్నంలో ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా, నా వద్ద కాకి నాడలో ఇన్‌కమ్‌టాక్సు ఇన్‌స్పెక్టరుగా పనిచేసిన శ్రీ డి. సత్య నారాయణరాజు వుండినాడు. ఏవో కొన్ని అప్పీల్సు విచారణ జరిపానుగాని వాటి వివరాలు గుర్తులేదు. నాకు గుర్తున్నది ఒకరాత్రి ఆఫీసరుగారు విందుచేయుటం, ఆ విందుకు నా ఆక్సు ఫర్డ్ సహాధ్యాయి, ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ డాక్టర్ వి. యస్. కృష్ణగారు, యూనివర్సిటీ రిజిస్ట్రారు నా ఆక్సు ఫర్డ్ చదువు రోజులలో నాకు మిక్కిలి సన్నిహిత మిత్రులైన శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు, అక్కడ గవర్నమెంటు

ఆస్పత్రిలో డాక్టరుగా పనిచేయుచుండిన నా తమ్ముని కొడుకు డాక్టర్ లింగం సూర్యనారాయణ పాల్గొన్నారు.

ఆఫీసు బిల్డింగు సముద్రపు టొడ్డున వుండింది. నా బస దాని మేడపైన. సముద్రపు గాలి సంతోషాన్ని కలుగజేసింది. బీచ్ చెప్పుకో తగ్గది కాకపోయినా, మల మూత్ర విసర్జనలతో అశుభ్రముగా వుండినా, సాయంత్రం వేళల షికారు తప్పలేదు.

మరిన్ని విశ్వవిద్యాలయ కాంపస్‌కు వెళ్లి అక్కడి బిల్డింగులు, ఆటస్థలాలు మొదలైన వానిని చూచాను. ప్రసిద్ధిగన్న ప్రేమికుల మూల (లవర్సు కార్నర్)ను కూడా చూచివచ్చాను.

భీమునిపట్నంలో మూడు నాలుగు రోజులు మాత్రం మకాం చేశాను. ఒక రిద్దరు పరిచయమైనారు. వారిలో నొకరు కాకినాడ, శ్రీ దంటు సూర్యారావుగారి సోదరుడు. వారు "సమీపానవున్న ఒక ఫ్యాక్టరి మానేజరు మిమ్ములను చూడా లంటున్నాడు. ఒక సాయంత్రం వెళ్లి వద్దాం" అని అర్థించారు. వారి కా ఫ్యాక్టరితో సంబంధ ముండినది. శ్రీ సూర్యారావుగారి తమ్ముడు గనుక మాట త్రోసివేయలేక వెళ్లాను. ఆ మానేజరు తెల్లజాతీయుడు. కుటుంబంతో వుండినాడు. విశాలమైన తోటలో ఆయనగారి భవంతి. నేను తెల్లవాడ ననే ధీమా మొదట కొంత చూపినా, నా ధోరణిని గ్రహించి మర్యాదగా వర్తించి ఉపాహారం, టీ యిచ్చి సాగనంపాడు.

బాపట్ల క్యాంపు కొంత హాయి నిచ్చేదే. ఇది సముద్రతీరాన వాడ్రేవుకు సమీపంలో వున్నది. ఇక్కడి కేసులు చిన్నవి. అయితే, ఒకటి రెండు బస్సు కేసులు కొంత గడ్డుగానే వుండినవి. ఒక బస్సు యజమాని మూడు నాలుగు చిన్నరకం బస్సులను (ఆ రోజుల్లో బస్సులు పెద్ద జీపుల వంటివి) నడుపుచుండేవాడు. ఈ బస్సుల రూట్లు పోటీలేని వని (మొనాపలి రూట్సు), చాలా ఎక్కువమంది నెక్కించుకొని (ఓవర్‌లోడ్) నడిపేవారని, ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు వానినుండి వచ్చిన రాబడిని మిక్కిలి హెచ్చుగా అంచనా వేశాడు. బస్సుల యజమాని (శ్రీ ఘంటా

కృష్ణమూర్తి అని గుర్తు), "ఎంత పోటీ లేకపోయినా, ఎంత ఎక్కువమందిని ఎక్కించుకొన్నా ఈ చిన్నబస్సులనుండి 3, 4 రెట్లు ఎక్కువ ఆదాయం ఎట్లావస్తుంది? అంత ఎక్కువమందిని ఎక్కించుకుంటే, బస్సులు చెడిపోయి మరమ్మతు ఖర్చు ఎక్కువ కాదా? మరిన్ని పెట్రోలు ఎక్కువ కాలదా?" అని సమాధానం చెప్పుకొన్నాడు. ఆ సమాధానంలో అర్థమున్నదని కొంతకుకొంత తగ్గించాను. ఆఫీసర్లు అంచనావేసేటప్పుడు, వారి మనస్సు ఎక్కువ స్థాయికే ఎగబ్రాకుతుంది.

ఈక్యాంపులో రెండు విశేషాలు: ఈక్యాంపునుండే అనుకొంటాను, నేను వాడ్రేవుకు వెళ్లి, సముద్రతీరాన్ని, అక్కడున్న శ్రీ యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారి గోదాములు వగైరాను చూచాను. శ్రీ రంగనాయకులునాయుడుగారి రెండో కుమారుడు శ్రీ రామనాథబాబుగారి ఆహ్వానంమీద, వారి స్వగ్రామం కారంచేడుకు వెళ్లి, వారి ఆతిథ్య మందుకున్నాను. శ్రీ నాయుడుగారినేగాక, వ్యాధితోనుండిన వారి పెద్దకుమారుడు శ్రీ తిరుపతిరాయుడుగారిని, వారి అల్లుడు సజ్జనుడు, ప్రసిద్ధుడు శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారిని దర్శించాను. రెండోది, నా కెందులకో బీర్జాలు వాచాయి. నాతో వచ్చిన చాకలి జవాను చేత తడిగుడ్డకట్లు కట్టించుకొని ఉపశాంతి చేయించుకొన్నాను. చాకలిజవాన్లు ఉపచారాలు చేయటంలో ఎగ్గు, తప్పు అనుకొనరు.

అక్కడి న్యాయవాది, ఆచార్య రంగాగారి బంధువు శ్రీ గోగినేని రంగనాయకులుగారి వంటి వారితో పరిచయమైనది.

బెజవాడ హెడ్ క్వార్టర్సులో శ్రీ టి. యస్. ఆర్. నరసింహం, శ్రీ కె. జగన్నాథరాజు, శ్రీ జి. శ్రీనివాసరావు మొదలైనవారు ఆఫీసర్లుగావుండినారు. శ్రీ ఆర్. కోదండరామన్ అనేవారు తనిఖీ అసిస్టెంట్ కమిషనరుగా వుండినారు. విచారించిన అప్పీల్సులో పార్టీల తరఫున హాజరైన వకీల్లు, ఆడిటర్సు, ఇన్‌కమ్ టాక్సు ప్రాక్టీషనర్సు గుర్తుకురావటంలేదు. నే నా రోజులలో దినచర్య వ్రాయలేదు. జ్ఞాపకార్థం ఏకాగితపు ముక్కనూ వుంచుకోలేదు. ఇప్పుడిది వ్రాస్తున్నది ఇరవై సంవత్సరాల తర్వాతనని పైన

చెప్పాను. బుర్రలో నాటిన లేక హృదయంలో హత్తుకొనిపోయిన సందర్భ మేదీ వున్నట్లులేదు. నేను తరుచు బెజవాడలో షికారులకు పోయినట్లు లేదు. 1940 - 41 లో శ్రీ హసన్ చిడా, కొందరం కలిసి స్థాపించిన ఆఫీసర్ల క్లబ్బుకు రెండు మూడు సార్లు వెళ్ళియుండవచ్చును. అయితే. కృష్ణానది ప్రవాహంలో పడవ బోల్తాపడి పి. డబ్ల్యు. డి. సూపరింటెండింగ్ ఇంజనీయర్ శ్రీ కృష్ణమూర్తి వగైరాలు చనిపోయిన దుర్ఘటన గుర్తుకువచ్చుచున్నది. వారిని నేను క్లబ్బుకు వెళ్లినప్పుడు కలిసికొనుట తటస్థించినది. నిండుజీవిముతో చురుకుగా, దక్షతతో వ్యవహరించుచుండిన మధ్య వయస్కుడు నేను చివరిసారి కలసికొన్న కొలది రోజులకే కష్టైమై పోవుట విధి చిద్విలాసం.

నేను ఇంచు మించు అకస్మాత్తుగా, మద్రాసు నుండి బెజవాడకు మార్చబడితిని. అందువల్ల వెళ్లిన వెంటనే వసతి గృహం దొరకలేదు. రెండు మూడు వారాలైనా నా ఆఫీసు మేడమీదనే వుండవలసి వచ్చింది. తరువాత శ్రీ పచ్చా పాపయ్యగారి వంటి మిత్రుల సహాయంతో నవయుగ ఫిలిమ్స్ వారి భవనం పైని మేడలో నివాస మేర్పడింది. వంట క్రింద ఒక గదిలో జరుగుచుండింది. క్రింది భాగంలో ఫిలిమ్సు ఆఫీసు మొదలైనవి గాక, వెనుక ప్రక్కను ఆఫీసు మేనేజరు శ్రీ సీతారామయ్యగారు కుటుంబంతో వుండేవారు. నా భార్య, బిడ్డలను మద్రాసులో విడిచి నేను ఒంటరిగా వెళ్లినందున నా కా చిన్నవసతి సరిపోయింది. ఒకసారో, రెండు సార్లో నా తమ్ముళ్లు వచ్చి చూచి పోయారు. నా తండ్రి పెదతల్లి మనుమడు లావు పిచ్చయ్య అప్పుడప్పుడు వచ్చి వెళ్తూండేవాడు. రెండు మూడు సార్లు కృష్ణానది ప్రాంతానికి వెళ్లి యుడవచ్చును, కనకదుర్గమ్మను దర్శించి యుండవచ్చును. ఉండీ లేనట్లుగా ఆ రేంజి 9 మాసములు నిర్వహించి తిరిగి మద్రాసుకు చేరుకొన్నాను.

పైన చెప్పినట్లు మద్రాసు 'బి' రేంజి అప్పిలేట్ అసిస్టెంటు కమిషనరుగా నియమింపబడ్డాను. ఆ రేంజి ఛార్జిని శ్రీ నక్వీ నుండి 11-12-1952 న తీసుకొని 30-6-1953 వరకు దానిని



విజయవాడ అప్పిలేట్ రేంజి - ఇన్‌కమ్‌టాక్సు కమిషనర్‌తో గ్రూపు ఫొటో - 1952

కూర్చున్నవారు : 2. శ్రీ నిడుమోలు శ్రీరామమూర్తి, 3. శ్రీ కె. టి. ఎల్. నరసింహం, 4. శ్రీ ఆర్. కోదండరామన్, 5. శ్రీ కె. ఎస్. అయ్యంగార్ (కమిషనరు) 6. గ్రంథకర్త, 7. శ్రీ కె. జగన్నాథరాజు, 8. శ్రీ కె. సూర్యారావు

నిర్వహించాను. 'ఎ', 'బి' రేంజిలలో నా ఛార్జీలో నుండిన ఇన్ కమ్‌టాక్స్ సర్కిల్సుకు వెళ్లిన మకాముల విషయమై పైన చెప్పియున్నాను. ఈ రెండు ఛార్జీలలోని మద్రాసు సర్కిల్సు విషయం పైన చెప్పలేదు. నిజానికి టూకీగా తప్ప, అక్కడి అప్పీల్సు విషయంగాని, ఆఫీసర్సు విషయంగాని సరిగా చెప్పలేను. కాని, మద్రాసు సర్కిల్సు 1, 2, 3, 4, 5 అప్పీల్సును విచారించి నట్లు గుర్తున్నది. ఈ సర్కిల్సులోని ఆఫీసర్ల పేర్లు కొంతవరకు గుర్తున్నవి. మొదటి సర్కిలులో శ్రీ తురగా రామచంద్రరావు, శ్రీ ఆర్. నరసింహన్, శ్రీ టి. బి. స్వామినాథన్, శ్రీ అమ్‌జద్ హుస్సేన్, శ్రీ ఆర్. కోదండరామ అయ్యర్; రెండవ సర్కిల్‌లో శ్రీ యమ్. యస్. కృష్ణ అయ్యర్, శ్రీ కె. సి. మహాదేవన్; మూడవ సర్కిల్‌లో శ్రీ పి. కామేశ్వరరావు, శ్రీ కె. సామ అయ్యర్, నాలుగవ సర్కిలులో శ్రీ డి. సూజా, శ్రీ కె. రామాచారి, శ్రీ యమ్. జి. రామచంద్రన్, ఐదవ సర్కిల్ (శాలరి సర్కిల్) లో శ్రీ ఇ. వి. విజయరాఘవాచారి, శ్రీ వి. ఎ. అజరయ్య వుండినారని గుర్తు. వీరు గాక శ్రీ కె. సుబ్బారావు, శ్రీ టి. వి. రామకృష్ణ, శ్రీ ఎ. కె. సుబ్రహ్మణ్యాం పిళ్లై, శ్రీ డి. కృష్ణమాచారి, శ్రీ కె. జగన్నాథన్, శ్రీ ఎ. ఆర్. నటరాజన్, శ్రీ కె. రాం, శ్రీ యన్. రామమూర్తి, శ్రీ ఆర్. రామానుజం లను మద్రాసులోను, శ్రీ పాల్‌రాజ్, శ్రీ జ్ఞాన ప్రకాశం, శ్రీ యస్. వెంకటరత్నం, శ్రీ జి. శ్రీనివాసరావు, శ్రీ సి. గణపతి, శ్రీ కునిహిరామ మీనన్, శ్రీ ఆర్. కృష్ణమూర్తి అయ్యర్, శ్రీ తిరు వెంగడం, శ్రీ యస్. యమ్. త్రివేది మొదలైనవారిని కూడా మద్రాసు సర్కిల్సులో కాని, మఫిసల్ సర్కిల్సులోగాని కలసి కొన్నట్లు, లేక వారు అప్పీల్సు విచారణలో హాజరైనట్లు చెప్ప వచ్చును. సీనియరు వకీల్సు శ్రీ యమ్. సుబ్బరాయఅయ్యర్, శ్రీ టి. వి. విశ్వనాథఅయ్యర్, అప్పుడు అంత సీనియర్ కాని శ్రీ కె. శ్రీనివాసన్, శ్రీ యస్. స్వామినాథన్, శ్రీ ఎఱ్ఱ కృష్ణమూర్తి, శ్రీ నల్ల కృష్ణమూర్తి (శ్రీ సుబ్బరాయ అయ్యర్ గారి జూనియర్స్) వకీళ్లు, ఫ్రేజర్ అండ్ రాస్ ఆడిటర్సు తరఫున శ్రీ ఎ. కె. శివ

రామకృష్ణన్; వెంకట్రామన్ అండ్ కంపెని ఆడిటర్సు తరఫున శ్రీ మహాలింగం, శ్రీ యు. యమ్. ఉబైదుల్లా, శ్రీ ఎ. ఎన్. జంబునాథన్, శ్రీ వి. కల్యాణరామన్, శ్రీ పి. రామచంద్రరావు, శ్రీ పంపారావు, శ్రీ వి. రాజారామ్ మొదలైన ఆడిటర్సు అప్పీల్సులో హాజరైనట్లు జ్ఞాపకమున్నది. వీరందరిలోకి పెద్ద అడ్వొకేటు శ్రీ యమ్. సుబ్బరాయ అయ్యర్ గారు. వారు చాలా అనుభవ నీయులేగాక, ప్రజ్ఞావంతులేగాక, మిక్కిలి సరసులు కూడాను. విచారించుచున్న ఆఫీసరు మనస్సుకు యిబ్బంది కలుగనట్లుగా వ్యవహరించే స్వభావం కలవారు, పట్టు విడుపు కలవారు. ఏ సందర్భములో పట్టు పట్టవలెనో, ఏ పరిస్థితులలో సానుకూలముగా వుండవలెనో, ఎక్కడ నచ్చచెప్పవలెనో, ఎక్కడ అసమ్మతిని తెలుపవలెనో తెలిసిన అనుభవజ్ఞుడు. వితండ వాదాలతో కాల హరణం చేసేవారు కాదు. ఎంత తక్కువ కాలం ఉపయోగించుకొనటాని కవకాశమున్నదో తెలిసిన ఇంగితజ్ఞుడు. వారి వాదములను విన్న తరువాత, "ఇంకేమైనా చెప్పదలచుకొంటే, వ్రాసి దాఖలు చేయండి" అని చెప్పేవాడిని. అట్టిది వీరి ఒక్కరి విషయములోనే.

శ్రీ టి. విశ్వనాథఅయ్యరుగారు మిక్కిలి సమర్థులు. గంటల కొలది ఎదురుగా కూర్చుండి ప్రతి చిన్న విషయాన్నికూడా విపులీకరించే ఓపిక గలవారు. కేసును క్షుణ్ణముగా చదువుకొని లా, ఫాక్ట్సు అవగాహన చేసుకొని విడమరిచిచెప్పే శక్తిగలవారు. కొన్ని ముఖ్యమైన కేసులలో వారి సహాయ సంపత్తి ద్వారా వానిని నేను కొంత సులువుగా తీర్మానించటం జరిగింది. వా రిప్పుడు వృద్ధాప్యములో పడినట్లున్నది. న్యాయవాది వృత్తిని విడిచిపెట్టి నట్లున్నది. అయినా భారతీయ విద్యాభవన్ సంస్థ మద్రాసు కేంద్రమునకు వైస్ ప్రెసిడెంటుగాను, ఇతర సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాలలోను పాల్గొనుచున్నట్లు భవన్స్ జర్నల్ నుండి, ఇతరత్రా తెలుసుకొనుచున్నాను. వా రిప్పటికిని తమ గృహములో జరుగు పెండ్లిండ్లకు నాకు ఆహ్వానాలు పంపుచుంటారు.

శ్రీ కె. శ్రీనివాసన్ నాకు మొదట పరిచయ మైనప్పుడు పిన్నవయస్కులే. వారు మిక్కిలి చురుకైన, ఆకర్షణీయమైన

వ్యక్తి. చిరునవ్వుతో చక్కగా నచ్చచెప్పే ప్రవృత్తి కలవారు. స్నేహభావముతో అన్నట్లు, అరమరిక లేనట్లు, నిస్సందేహముగా నన్నట్లు మందహాసంతో మాట్లాడేవారు, ప్రవర్తించేవారు. మా యిద్దరి మధ్య కొంత చనువు, అంతకు మించి కొంత ఆప్యాయత కలిగిందేమో యని అనుకొంటాను, వారీమధ్య హైదరాబాద్‌కు వచ్చినప్పుడు, ఆబీద్ రోడ్డు తాజ్ మహాల్ హోటల్‌లో నేనుండటం తెలుసుకొని వచ్చి చూచి పోయారు. సంవత్సరాలు గడిచినవి కాబట్టి వారి అందమైన స్ఫురద్రూప విగ్రహం కొంత లావెక్కి మోటుపడినట్లు తోచింది. కాని వారి మందహాసం. స్నేహ భావం కించిత్తైనా మారలేదు, మద్రాసు వచ్చినప్పుడు తనను కలసికోవలసిందిగా కోరినారుగాని, తటస్థపడలేదు. నే నుద్యోగ ములో నుండగా వారింట జరిగిన వివాహానికి వెళ్లి భోజనం చేసి వచ్చాను.

ఆడిటర్స్‌లో ఫ్రేజర్ అన్డ్ రాస్ ప్రతినిధి శివరామకృష్ణన్ గారు చెప్పకోతగిన సమర్థత, వ్యక్తిత్వం కలవారు. కేసును తుణ్ణంగా చదువుకొని, చక్కగా విడదీసి చెప్పగల సమర్థులు. ఆయన హాజరవటం నాకు కొంత శ్రమను తగ్గించిన ట్లుండేది. మొదట ఆయన నిష్కర్ష ధోరణిని చూచి దురహంకారి అనుకొన్నాను గాని, తరువాత సహృదయుడని, సరసుడని తేల్చు కొన్నాను. ఆయన సిఫారసు వల్లనే ఫ్రేజర్ అండ్ రాస్ భాగస్థులైన ఆంగ్లేయుల ద్వారా, నేను మద్రాసు జింఖానా క్లబ్బులో సభ్యుడ నైనాను.

వెంకట్రామన్ అండ్ కంపెని తరఫున హాజరగుచుండిన ఆడిటర్స్ శ్రీ మహాలింగంగారు సరసంగా, అనునయంగా నాతో సహకరించేవారు. వారు హాజరవటం నాకు ఆమోదాన్ని కలిగించేది.

ఇతరులలో శ్రీ యస్. స్వామినాధన్, అడ్వొకేటు, శ్రీ ఎ. యన్. జంబునాథన్, ఆడిటర్, శ్రీ పి. యస్. గోపాల కృష్ణన్, ఆడిటర్ వంటి వారు హాజరౌచుండేవారు. మొత్తంమీద వీరందరు అనుకూలంగానే వర్తించేవారు. అయితే, సీనియరు

వకీళ్లైనా, ఆడిటర్లైనా ఏదైనా తలబిరుసుతనాన్ని కనపరచినా లేక కాలహరణం చేయు పద్ధతి నవలంబించినా సహించే వాడను కాను. విషయం అర్థము చేసుకొన్న తర్వాత, పార్టీతరఫున చెప్పదలచుకొన్న విషయాలు చెప్పినతర్వాత, శ్రుతిమించుచున్న దని తోచినప్పుడు "ఇకచాలండి" అని పంపివేసేవాడను. అందు వలన వారు కొంత మెలకువతోనే వర్తించేవారు.

ఆఫీసర్లు కూడా అనునయంగానే మెలగేవారు. ఒకసారి మాత్రం ఒక్క ఆఫీసరు తలబిరుసుగా మాట్లాడటం జరిగింది. దానికి వెంటనే ఆఫీసర్లు నా ఎదుట ఏవిధంగా వర్తించవలసిందీ, ఏవిధంగా తమ ఆర్డరును సమర్థించుకొనవలసిందీ వివరిస్తూ ఒక నోటీసును అందరు ఆఫీసర్లకూ పంపించటమేగాక తనిఖీ అసిస్టెంటు కమీషనర్లకు, కమీషనరుకు పంపాను. ఇట్టి సర్క్యులర్ నోటీసును పంపటమేమిటని కొంతమంది ఆఫీసర్లు తమలో తాము గుసగుసలుపోయారటగాని, కమీషనరు అంగీకరించినందున తిరిగి ఆ ప్రస్తావన రాలేదు.

నా కొన్ని అప్పిలేట్ ఆర్డర్లమీద డిపార్టుమెంటువారు ఇన్‌కమ్‌టాక్స్ అప్పిలేట్ ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసేవారు. కొన్ని డిపార్టుమెంటు అప్పీల్సును ట్రిబ్యునల్ నిలబెట్టినా కొన్నిటిని కొట్టి వేసేది. కొట్టివేసిన ట్రిబ్యునల్ ఆర్డర్లమీద హైకోర్టుకు రెండో అప్పీ లున్నది. వానిలో కొన్ని నా ఆర్డర్లను హైకోర్టు పునరుద్ధ రించేది. నావద్ద ఒక అప్పీలులో, హైకోర్టు రిజిస్ట్రారుగాపనిచేసి అప్పిలేట్ ట్రిబ్యునల్ జ్యుడిషియల్ మెంబరుగా కొంతకాలం పని చేసిన శ్రీ బి. శంకరనారాయణగారు హాజరయ్యారు. వారి వాదనను నే నంగీకరించాను. "ఏదో సందర్భంగా కమీషనరు చౌధురి ( బెంగాలి ) గారిని కలసికొనగా, ఈవిధంగా తీర్పు యిచ్చారేమో" అన్నారు. "అది సరియైన తీర్పు, మీకు అను మానంగా వుంటే ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసిచూడం"డన్నాను. ట్రిబ్యునల్ నా ఆర్డరును అంగీకరించింది. ట్రిబ్యునల్‌కు డిపార్టు మెంటు అప్పీలు చేయకముందు శ్రీ శంకరనారాయణగారు ఏ సందర్భ ములోనో తిరిగి నన్ను ఆఫీసులో కలసికొనగా, వారు సీనియర్

చారిష్టరు, ఎక్కువ జ్యుడిషియల్ అనుభవం వున్నవారు కాబట్టి వారిని అదివరకు ఎరిగియుండినందున, 'ఆర్డ రెట్లున్న'దని అడిగాను. 'అది లాయర్ ఆర్డ'రని అన్నారు. హైకోర్టు విషయంలో ప్రఖ్యాత గాయకి శ్రీమతి యమ్. యస్. సుబ్బలక్ష్మిగారి అప్పీలులో, ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరు వాదనలను త్రోసిపుచ్చి కలిపిన ఆదాయాన్ని చాలావరకు తగ్గించాను. డిపార్టుమెంటు ట్రైబ్యునల్ అప్పీలుకు పోగా ఏవో సాకులు చెప్పి ట్రైబ్యునల్ నా ఆర్డరును తలక్రిందులు చేసింది. కాని ట్రైబ్యునల్ మెంబర్లలో ఒకరైన శ్రీ వి. పి. చౌదరి, "మేము మీతో ఏకీభవించకపోయినా, మీ ఆర్డరు పాండిత్య ప్రకర్షతో (స్కాలర్లి) కూడియుండిన"దన్నారు. పన్ను వేసిన ఆర్డరును ప్యాస్ చేసిన ఆఫీసరు శ్రీ కె. సి. మహాదేవన్, "నేను మన డిపార్టుమెంటు స్టాండింగ్ కౌన్సెల్ శ్రీ రామారావు సాహెబ్ గారితో సంప్రదించి ఆ ఆర్డరును వ్రాశాను. నేను వ్రాసిన ఆర్డరు చాలా బాగుండిందని అనుకొన్నాను. మీరు అంతకంటె ఎక్కువ బాగుగా వ్రాశా"రని శ్లాఘించాడు. హైకోర్టు వారు నా ఆర్డరును పునరుద్ధరించుటయేగాక, ఇంకా కొంత ఆదాయాన్ని తగ్గించారు. వారు జడ్జిమెంటు యివ్వటంలో, నా ఆర్డరులోని ఆపరేటివ్ భాగాన్ని మక్కీకి మక్కీ ఉదహరించారు. ఇది నాకు మిక్కిలి గౌరవ మాపాదించింది. ఈ కేసులో అప్పీలు చేసుకొన్నవారి తరఫున హాజరైనవారు శ్రీ మహాలింగంగారు. వారి ప్రిన్సిపల్సు వెంకట్రామన్ కంపెని వారు మిక్కిలి సంతోషించి, వెంకట్రామన్ సోదరులలో ఒకరింట వివాహ మైనప్పుడు నన్ను ప్రత్యేకించి ఆహ్వానించి మర్యాద జరిపారు. ఇది నేను రిటైరైన కొంత కాలానికి.

శ్రీ కె. సి. ఖన్నా (కమిషనరు) గారిని ఉద్యోగములో నుండగా వారింటివద్ద నేనొకప్పుడు కలసికొంటిని. అంతకుముందే ఆదోనికి చెందిన శ్రీ సంజీవప్ప అండ్ సన్స్ కంపెని వారి అప్పీలును విచారించియున్నాను. ఆ కేసులో, ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు ఆ పన్నుదారు ఒక సంవత్సరం ప్రత్తి కొనుగోళ్లను మార్కెటు

రేట్ల కంటె ఎక్కువ హెచ్చు రేట్లతో కొన్నట్లు చూపాడని ఒక పెద్ద మొత్తాన్ని కలిపాడు. మరు సంవత్సరములో దాఖలు చూపని నగదు జమ లున్నవని తిరిగి ఆ పెద్దమొత్తాన్ని ఆ సంవత్సరం ఆదాయంలో కలిపాడు. ఇది అన్యాయ మని రెండవ సంవత్సరం కలిపిన నగదు జమలను తగ్గించివేశాను. దీనివల్ల పన్నులో లక్ష యాభై వేలు తగ్గిపోయింది. దీనిని ప్రస్తావించి, కమిషనరు గారు "ఇంత పెద్ద మొత్తం పన్నును తగ్గించివేశారు కదా, నాకు చెప్పిచేయవలసింది" అన్నారు. నేను ఆశ్చర్యపడి, "అయ్యా, మీరు పదకొండు సంవత్సరాలు అప్పిలేట్ అసిస్టెంట్ కమిషనరుగా పనిచేసినట్లు చెప్పియున్నారు. ఇట్టి సలహా మీకు నచ్చేదా ? నా విధ్యుక్తధర్మం, ప్రభుత్వం–పన్నుదారుల మధ్య న్యాయంచేయటం. మిమ్ములను సలహా అడిగి మీరు చెప్పినట్లు నేను చేస్తే, పన్నుదారుకు నేను ఎలా న్యాయంచేయగలను?" అని అడిగాను. దానితో ఖన్నాగారు సమాధానం చెప్పలేక ఊరకుండి పోయారు. అయితే "అప్పిలేట్ అసిస్టెంట్ కమిషనరును ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్ల ఆర్డర్లను తథ్యపరచడానికి నియామకం చేస్తాము. పార్టీకి నచ్చకపోతే పైన ట్రైబ్యూనల్ వున్నది. పైగా, హైకోర్టు వున్నదికదా" అని రివెన్యూ సెంట్రల్ బోర్డు ఇన్‌కమ్‌టాక్స్ మెంబరుగా వుండుచుండిన శ్రీ కె. గోవింద నాయరు గారు ఒకప్పుడు నాతో అన్నారు. కాని నేను వారి అభిప్రాయాన్ని అంగీకరించ లేదు, అమలుపరచనూ లేదు.

పై ఉద్యోగస్థులయందు క్రింది ఉద్యోగులు విధేయతయే గాక మర్యాద మన్ననలను చూపటం మామూలు. నేను కమిషనర్లయందు విధేయత మర్యాద చూపినా, నా ఆత్మగౌరవాని కేమాత్రం దెబ్బ తగులుతుం దనుకొన్నా సహించేవాడను కాదు. నేను ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా నున్నప్పుడు కూడా అసిస్టెంటు కమిషనర్లయందుగాని, కమిషనర్లయందుగాని ఇదే ధోరణి. ఒకనాడేదో టీపార్టీ జరిగింది. ( నేను రిటైరౌతున్నప్పుడిచ్చిం దనుకొంటాను ) అప్పటి కమిషనరు బెంగాలి

చౌధురిగారు ఏదో మాటవరుసను నవ్వుతూ "చౌదరిని ఫలానా ఆఫీసరు కప్పజెప్పా"లన్నారు. నా కా మాట ధ్వని నచ్చక వెంటనే అందుకొని, "గట్టిగా అట్టిపని చేసేటంతటి కీచులు మీారు కారని నేననుకొంటా"నన్నాను. దానికి శ్రీ చౌధురి వెలవెలబోయి చచ్చి చావ నట్లుగా నవ్వి ఊరుకొన్నారు. ఇం కొక సందర్భంలో కేంద్ర రివిన్యూ మంత్రి శ్రీ మహావీరత్యాగి మద్రాసుకు వచ్చాడు. అప్పుడు నేను యావద్భారత ఇన్‌కమ్‌టాక్సు గజెటెడ్ సమాఖ్య మద్రాసు బ్రాంచికి ప్రెసిడెంటును. అందువల్ల ఆయన గౌరవార్థం మధ్యాహ్న భోజన విందు ఏర్పాటు చేశాను. విందు సమయంలో నేను శ్రీ మహావీరత్యాగిగారి కెదురుగా కూర్చొన్నాను. కమిషనరు ఖన్నాగారు శ్రీ త్యాగిగారి ప్రక్కన కూర్చొన్నారు. భోజనం జరుగుచుండగా శ్రీ త్యాగి నావంక జూచి, "ఈ విందు ఎవరు ఏర్పాటు జేసినట్లు?" అన్నారు. నేను సగర్వంగా "ఫెడరేషన్ బ్రాంచి తరఫున మేమే" అన్నాను. కమిషనరు ఖన్నాగారు చిన్నబుచ్చుకొని తనకేదో ఇబ్బందివల్ల తాను చేయలేకపోయా నని గొణిగారు.

ఆల్ ఇండియా ఇన్‌కమ్‌టాక్సు గజెటెడ్ ఆఫీసర్ల ఫెడరేషన్‌కు కొన్ని సంవత్సరాలనుండి యఫిలియేటెడ్ (అను బంధ) సంస్థ మద్రాసులో నుండినది. నేను కొంతకాలం మద్రాసు సంస్థకు ప్రెసిడెంటుగా వుండినాను. నాకాలములో అఖిల భారత సమాఖ్యవారు తమ వార్షికోత్సవం మద్రాసులో జరిపారు. ఆ వార్షికోత్సవం జయప్రదంగా జరిగే బాధ్యత సహజంగా నా నెత్తిన పడింది. అయితే, చాలావరకు బాధ్యత శ్రీ శాంతి రామమూర్తిగారి కుమారుడు శ్రీ రమణయ్య, శ్రీ ఫ్రాన్సిస్ స్వామి వంటివారు వహించారు. చివర సమావేశంలో నే నుపన్యసించాను. తర్వాత శ్రీ రత్నసభాపతి వంటి ఆఫీసర్లు, "మీారు చెప్పింది బాగుగా వున్న"దన్నారు.

కొందరు ప్రముఖుల అప్పీల్సు జ్ఞప్తికి వచ్చుచున్నవి. కేంద్ర కాబినెట్ మంత్రిగా రెండు సార్లు ఉద్యోగం నిర్వహించిన శ్రీ టి. టి. కృష్ణమాచారిగారి ఆదాయంలో వారి కొడుకుల ఆదాయాన్ని

కలిపి వారందరు ఒకే జాయింటు కుటుంబంవారని ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు పన్ను విధించాడు. నిజానికి తండ్రి కొడుకుల ఆర్థిక సంబంధం వేరు వేరు. అందువల్ల వారి వాదనను అంగీకరించాను. ఉద్యోగ విరమణానంతరం ఏదో పనిమీద ఒకసారి వారింటికి వెళ్లగా, వారు నన్ను ఆహ్వానించి మర్యాద చేశారు. మాటల సందర్భములో "మీ ఆర్డరు ధోరణి నాకు నచ్చిం"దన్నారు. ఆసందర్భములో అనంతపూర్ జిల్లా పెనుగొండ చిత్రకారుడు శ్రీ సి. యన్ వెంకట్రావుగారు రచించిన "ఆమె మొదటి ప్రయత్నం", "దేవదాసి" డూప్లికేటులను చూచాను. ఆ రెండు బొమ్మలను నేను అనంతపూర్ జిల్లాలో ఆఫీసరుగా నున్నప్పుడు శ్రీ వెంకట్రావు నుండి 1937 – 38 లో కొనియున్నానని పైన చెప్పాను. అందువల్ల అటువంటి బొమ్మలే వారి వద్ద వుండటం చూచి చకితుడనైనాను. శ్రీ వెంకట్రావు ఆ రెండు బొమ్మల కొన్ని డూప్లికేటులను తయారుచేసియున్నాడని పైన చెప్పియున్నాను. తరువాత కృష్ణమాచారిగారి ఒక డ్రాయింగు రూములో చాలా పెద్దదైన రత్నకంబళిని చూచాను. "ఎక్కడిది?"దని అడుగగా "చాలా సంవత్సరాలక్రితం ఏలూరులో నేయించా"నని అన్నారు. "ఒక అమెరికన్ దానిని చూచి అయిదువేల రూపాయ లిస్తానన్నాడు. ఇది అమ్మేదికాదని చెప్పాను" అని అన్నారు. ఇప్పుడైతే ఏ ఇరవై వేలో ఇస్తాననేవాడు.

ఇంకొక కేసు, మద్రాసు జెమిని స్టూడియో అధిపతి వాసన్ గారిది. ఈ కేసులో కూడ వాసన్ గారి తల్లి, బంధువుల ఆదాయాన్ని వారి ఆదాయములో కలిపి పన్ను విధించారు. కలిపిన ఆదాయాన్ని నేను తొలగించాను. దానికి కృతజ్ఞతలు చూపినట్లో అన్నట్లు వారి కుమార్తె వివాహానికి నన్ను ఆహ్వానించి మర్యాద చూపారు. మరిన్ని వారి చిత్రం ఒకదానిని ప్రేక్షక (ప్రథమ) ప్రదర్శనానికి నన్ను ఆహ్వానించారు. ఇది కూడా ఉద్యోగ విరమణానంతరమే అని గుర్తు.

ఇంకొకటి, శ్రీ కె. ఈశ్వరన్ గారిది. వీరు ఎన్‌ఫీల్డు మోటారు సైకిల్సు వగైరా వ్యాపారసంస్థలో భాగస్థులు. వీరి విషయములో కూడ వారి బంధువుల ఆదాయం వీరి ఆదాయంలో కలిపి పన్ను

విధింపబడింది. ఈ కలిపివేయటాన్ని తగ్గించి వేశాను. దీనికి వారు సంతోషించినారేమో అన్నట్లుగా నేను ఒకప్పుడు వారిని బెంగుళూరులో కలసికొనుట తటస్థించినప్పుడు వారు ఒక విధముగా మర్యాద చూపారు.

మద్రాసులో ఒక పెద్ద లుంగీ వ్యాపారస్థులు ఖజార్ మహమ్మద్ అన్డ్ కంపెని అనే వారు లెక్క పుస్తకాలు చూపలేదని ఆఫీసరు, వరుసగా మూడు నాలుగు సంవత్సరాలకు ఎక్స్ పార్టీగా పన్ను విధింపు పూర్తిచేసి పదకొండు లక్షల రూపాయల పన్నును విధించాడు. పుస్తకాలు హాజరుపరచ లేకపోవటానికి తగిన లిఖితపూర్వక సాక్ష్యం చూపినందున ఆ పన్ను విధింపును కొట్టివేశాను. ఆర్డరు ప్యాస్ చేసిన కొలది రోజులకు ఏదో సందర్భముగా తత్సంబంధమైన తనిఖీ అసిస్టెంట్ కమిషనరుగారిని కలిసికొనుట తటస్థించింది. "ఆర్డర్ నుచూసి కమిషనరు గారేమన్నారు?" రని చిరునవ్వుతో అడిగాను. "ఏమంటారు, నీళ్లు కారిపోయారు" అన్నాడు. అప్పటి కమిషనరు శ్రీ కె. సి. ఖన్నా గారు. ఆయన పంజాబీ హిందువుడు. ఏ కారణంచేతనోగాని ఈ కేసులోని పదకొండు లక్షల రూపాయల పన్నును తక్షణమే వసూలు చేయాలని తాపత్రయ పడుచుండినాడు. అందువల్ల పన్ను విధింపును పూర్తిగా కొట్టివేయటంవల్ల, తర్వాత పునర్విచారణ చేసి తిరిగి పన్ను విధించుట కవకాశముండినా, చేతికి చిక్కిన పిట్ట జారిపోయిందే అని చింతను పొందియుండవచ్చును. ఈ కమిషనరు గారే, "చౌదరి ఆర్డర్లను బాగుగా వ్రాస్తాడుగాని, ఫలితాలు మాత్రం నిరుత్సాహకరంగా వుంటివి" అన్నారట.

నేను మామూలుగా క్లబ్బులు మొదలైన సోషల్ కార్యకలాపాల సంస్థలతో ఎక్కువ జోక్యము పెట్టుకొనేవాడను కాను. నేను స్వదేశములోను, విదేశములోను, ఏ విద్యార్థి సంఘాలలోను ఎక్కువ చొరవ తీసుకొనలేదు. ఉద్యోగరీత్యా కూడా అదే పద్ధతి. జిల్లా కేంద్రాలలో, అక్కడి క్లబ్బులకు మిక్కిలి తక్కువగా వెళ్లుచుండేవాడిని. మద్రాసులో నేను అసిస్టెంట్ కమిషనరు అయినప్పుడు కాస్మోపాలిటన్ క్లబ్బులో ది 26-3-1951 తారీఖున

సభ్యుడ నైనాను. మద్రాసు జింఖానా క్లబ్బులో ది 7-4-1951 తారీఖున మెంబరు నైనాను. ఈ రెండింటికి కూడ నేను చాలా అరుదుగా వెళ్లుచుండేవాడను. ఈ రెండు క్లబ్బులలోను ఎప్పుడూ చీట్లపేక ఆడలేదు. వాని లైబ్రరీలలో చదవలేదు. చివరకు న్యూస్ పేపర్లు, మ్యాగజైన్లు కూడా చూచిన పాపాన పోలేదు. ఈ క్లబ్బులలో ఇప్పటికిని మెంబరుగా కొనసాగుచున్నాను. కాని, మద్రాసుకు వెళ్లినప్పుడైనా ఈ క్లబ్బులకు వెళ్లటం వుండదు. ఈ రెండు గాక మద్రాసు ఆంధ్ర మహాసభలో మెంబరు నైనాను. వారి సాంవత్సరిక ఉత్సవాలకు, ఏదైనా ప్రత్యేక సందర్భములోను వెళ్లుచుండేవాడిని గాని, ఆ సంఘ కార్యకలాపాలలో పాల్గొనుట తటస్థించలేదు. నేను ఉద్యోగ విరమణ చేసి పెదసగల్లులో స్థిరనివాస మేర్పరచుకొనిన తర్వాత, ఆ సంఘం సభ్యత్వానికి రాజీనామా యిచ్చాను. మొత్తంమీద నా ఉద్యోగ జీవితం ఆఫీసుకు వెళ్లటం, పనిచేసుకోవటం, ఇంటికి తిరిగి రావటం. క్యాంపులలో కూడా ఎప్పుడో ఒకప్పుడు తప్ప బయటికి షికారుకు వెళ్లేవాడను కాను. అప్పుడప్పుడు సినిమాలకు, నృత్యప్రదర్శనాలకు, సంగీతకచేరీలకు వెళ్లేవాడిని. సంగీతానికి శ్రీమతి యమ్. యస్. సుబ్బలక్ష్మి, నృత్యానికి శ్రీమతి కమలా లక్ష్మణ్ నాకు అభిమాన తారలు. సినిమా విషయంలో నాకు శివాజీగణేశన్ నచ్చుడు. జమిని గణేశన్ ఫర్వాలేదు. తెలుగువారిలో కొన్ని పాత్రలలో శ్రీ యన్. టి. రామారావు అందరికంటె ఎక్కువ నాకు ఇష్టుడు.

అప్పీల్సు అసిస్టెంటు కమిషనరుగా నా ఉద్యోగ నిర్వాహణలో, ఒకప్పుడు కొందరు సినిమా తారల కేసులను, సినిమా పరిశ్రమకు సంబంధించిన వారి కేసులను నేను విచారించవలసి వచ్చింది. లలిత, పద్మిని, భానుమతి, కమలా లక్ష్మణ్, కస్తూరి, ఘంటసాల బలరామయ్య, మీర్జాపూర్ జమీందారుగారు, సి. యస్. ఆర్. ఆంజనేయులు వగైరా లుండినారు. మరిన్ని వాయులీన విద్వాంసుడు శ్రీ చౌడప్ప, కన్నడ సినిమా స్టార్ నాగ......మొదలైన వార్ల అప్పీల్సు వినవలసి వచ్చింది.

మేము అమింజికర్రై సమీపాన నివసించుచుండుటచేత అరుదుగా సముద్ర తీరానికి వెళ్లేవారం. అప్పుడింకా ట్రిప్లికేన్ బీచియే ప్రాముఖ్యముగా వుండేది. మా కప్పుడు రాకపోకలు జరుపుకొనే అంతటి బంధువులు గాని, స్నేహితులు గాని ఏ ముగ్గురో, నలుగురో వుండినారు. శ్రీ సి. నరసింహం, శ్రీ కె. సుబ్బారావు, శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావు, డాక్టర్ సి సత్యనారాయణ, శ్రీ వై. సత్యనారాయణ వంటివారు. వీరిలో కొంత హెచ్చుగా కలసికొనేది శ్రీ సి. నరసింహంగారి కుటుంబాన్ని మాత్రమే. ఉద్యోగరీత్యా నాకు దగ్గరైనవారు ఇంచు మించుగా అరుదు. ఒక్క శ్రీ కె. అచ్యుత నాయరుగారు కొంతవరకు స్నేహితుడుగా వుండినారని చెప్పవచ్చును. మరిన్ని నా స్టెనోగ్రాఫరు శ్రీ వి. కృష్ణమూర్తి నాకు కొంత సన్నిహితుడైనాడు. ఆ సన్నిహిత్వం ఇప్పటికిని కొనసాగుచున్నది. నేను అసిస్టెంట్ కమిషనరునై కొంత హెచ్చు హోదాను పొందినా, నా విదేశ విద్యాభ్యాసం నా వ్యక్తిత్వాన్ని కొంతవరకు పెంచినా, మా కమిషనర్లతో ఎట్టి సాంఘిక సంబంధాలు కలిపించుకొనలేదు. కొంత కారణం నా భార్య నిరక్షరాస్య అగుటవల్లనే అనుకొందును. ఏ కారణము వల్ల నైతేనేమి, నే నెన్నడు ఏ కమిషనరుకు దగ్గరైనవాడను కాదు. ఇతర ఆఫీసర్లతోగాని, కమిషనరుతోగాని మాకు రాక పోకలు వుండేవి కావు.

ఈవిధముగా ఉద్యోగ నిర్వహణ 30-6-1953 నాటికి పూర్తిచేసి, పై జెప్పినట్లు దీర్ఘ సెలవు మీాద వెళ్లి, లాంఛన పూర్వకంగా పెన్షనుకు అర్హుడనైనాను.

ఈ రెండో భాగాన్ని ముగించే ముందు ఒకటి, రెండు ముక్కలు చెప్పవలసియున్నది. మొదటి భాగం చదివినవారు, "మీారు పడిన పొరపాట్లను, చేసిన తప్పులను ఒప్పుకొనియున్నారు, లోనైన చెడుపనులను, నిస్సంకోచంగా బహిర్గతం చేశారు. మరిప్పుడే తప్పులు చేయనట్లు, ఏ అవినీతికి పాల్పడనట్లు ఈ రెండో భాగంలో నటించారేమి ? అసలు చేయలేదా, లేక ఒప్పుకొనటానికి గుండెధైర్యం చాలదా ?" అని బహిరంగంగా ప్రశ్నించకపోయినా, చాటుగా నైనా అనుమాన

పడవచ్చును. నేనూ మానవమాత్రుడనే. అందులోనూ, సర్వ సామాన్యుడనైన మానవుడను పొరపాటు పడటం, తప్పులు చేయటం, మానవ నైజ గుణం. మరిన్ని ముముక్షువుకాని మానవుడు, ఏ స్త్రీ సంబంధమైన అవినీతినో, ఏ ధనాకాంక్షవల్ల కలిగిన అనుచితాన్నో తాత్కాలికంగా నైనా అవలంబించటాని కవకాశ ముంటుంది. (కాంతా కనకా లంటారుకదా.) అయితే, మాంసం తిని, బొమికెలు మెడకుగట్టుకొంటారా?

బాల్యం, యౌవనం, ఒంటరిగా నున్నప్పుడు, సామాజిక పరిస్థితుల ప్రోత్సాహం వల్ల సంభవించిన మొదటి భాగంలోని చర్యలను పొరకులు పోసిలే అని సహించవచ్చును. అయితే, పెద్దవాడు, ఉద్యోగ బాధ్యతగలవాడు అట్టి చర్యలకు లోనైనా డంటే ఏవగించుకోరా? అసలుకంటె ఎక్కువగా, లేనిపోనివి ఊహించుకొని, అభాండాలు వేయరా?

నేనుద్యోగం నిర్వహించిన 25 సంవత్సరాల నడివయస్సులో నేను బొత్తిగా నిష్కల్మషుడనుగా నుంటి నని చెప్పలేను. కాని, ఒకటి గట్టిగా చెప్పగలను. నే నెన్నడునూ, ఒకరిని బాధపెట్టిగాని, ఒకరికి అన్యాయంచేసిగాని, ఒకరికి ద్రోహమొనర్చిగాని ఎరుగను. ఈ ధైర్యమే నా మనోశాంతికి, ఇన్ని సంవత్సరాలు ఏ మనోవ్యథ (గిల్టీకాన్‌షన్సు) లేక సుఖజీవనం చేయటానికి మూలం.

—లింగం వీరభద్రయ్య చౌదరి

**27 - 7 - 1973**